# తెలుగు సంగతులు

బూదరాజు రాధాకృష్ణ




Publications
2003

**telugu sangatulu**
(Essays on Language, literature and reviews)

by
**Budaraju Radhakrishna**



*Cover Design* : **Vivid Design Ventures**
✆ 040-55588819

*Type Setting* : **Mahathi Creations**
✆ 040-2765 1085

*Printed at* : **Akruthi Offset Printers**
Chikkadpally, Hyderabad
✆ 040-2766 4525

*For Copies :*

- **Media House Publications**
1-9-289/4, Behind Post Office
Vidyanagar, Hyderabad
Phone : 040 - 27607307

- **Visaalaandra Book House**
and all other leading book shops

Price : **Rs.75**

# నా మాట

కొంతకాలంగా గ్రంథరూపంలో వెలువడని నా ముద్రితాముద్రిత రచనలను ప్రచురించాలనుకుంటున్నాను. భాషాసాహిత్య విమర్శన పరిశోధన విషయంలో నాకున్న భావాలనూ ఆదర్శాలనూ లోకానికి తెలియజెప్పి లోకదృష్టిలో నా తప్పొప్పులేవో తెలుసుకోవాలనే కోరిక వయసుతోబాటు పెరుగుతుండగా అందుకు ప్రోత్సహించిన మిత్రుడు డాక్టర్ గోవిందరాజు చక్రధర్. నా కోరికా అతడి సహాయ సహకారాలూ ఈ గ్రంథంగా రూపుకట్టాయి.

ఇందులో భాషా సాహిత్య వ్యాసాలతోబాటు నేను రెండున్నర దశాబ్దాలుగా అప్పుడప్పుడు చేసిన గ్రంథసమీక్షలనుంచి నా భావాలను స్పష్టీకరించేవాటిని చేర్చాను. చేసిన సమీక్షల్లో ఇవి పదోవంతు మాత్రమే-సంఖ్యాత్మకంగా. అదనంగా మరి ఇద్దరు నన్ను ప్రశ్నించి నేను రాసి ఇచ్చిన సమాధానాలను పత్రికాముఖంగా ప్రచురించారు. వాటిని కూడా ఈ గ్రంథంలో చేర్చాను. ఆయా విషయాల్లో నా అభిప్రాయాలను విస్పష్టంగా ఇవి ప్రదర్శిస్తాయని నా నమ్మిక.

ఈ గ్రంథాన్ని సాహితీపరులు సమాదరిస్తారని ఆశిస్తున్నాను.

గ్రంథ ప్రచురణకర్తలయిన మీడియాహౌస్ పబ్లికేషన్స్‌వారికీ, డాక్టర్ చక్రధర్ గారికీ నా కృతజ్ఞతలు.

— బూదరాజు రాధాకృష్ణ

హైదరాబాద్
20.8.2003

# మీడియా హౌస్ పబ్లికేషన్స్ పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | మీరు సామాన్యులు కారు | ఆకెళ్ళ రాఘవేంద్ర | 75 |
| 2. | మీ గురించి మీకు తెలుసా ? | డాక్టర్ పి.ఎస్.గోపాలకృష్ణ | 75 |
| 3. | ఫన్‌దేహాలు | హాస్యబ్రహ్మ శంకరనారాయణ | 100 |
| 4. | 'పన్'పరాగ్ | హాస్యబ్రహ్మ శంకరనారాయణ | 50 |
| 5. | శంకరనారాయణ అప్రస్తుత ప్రసంగాలు | హాస్యబ్రహ్మ శంకరనారాయణ | 100 |
| 6. | జయదేవ్ కార్టూన్లు | జయదేవ్ | 100 |
| 7. | నిజాం-బ్రిటీష్ సంబంధాలు | సరోజినీ రేగాని | 150 |
| 8. | జర్నలిస్టులకోసం | డాక్టర్ గోవిందరాజు చక్రధర్ | 70 |
| 9. | అనువదించడం ఎలా? | డాక్టర్ గోవిందరాజు చక్రధర్ | 90 |
| 10. | ప్రచారం పొందడం ఎలా? | డాక్టర్ గోవిందరాజు చక్రధర్ | 70 |
| 11. | వ్యాసప్రభ | డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు | 150 |
| 12. | చింతన | డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు | 50 |
| 13. | చిరస్మరణీయులు | డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు | 50 |
| 14. | అనువాదపాఠాలు | బూదరాజు రాధాకృష్ణ | 60 |
| 15. | విన్నంత కన్నంత | బూదరాజు రాధాకృష్ణ | 100 |
| 16. | మంచిజర్నలిస్టు కావాలంటే | బూదరాజు రాధాకృష్ణ | 75 |
| 17. | సొంతకథ | రాంభట్ల కృష్ణమూర్తి | 80 |
| 18. | మన భాష | డాక్టర్ డి.చంద్రశేఖర రెడ్డి | 100 |
| 19. | సంహిత (సాహిత్యవ్యాసాలు) | డాక్టర్ డి.చంద్రశేఖర రెడ్డి | 100 |
| 20. | బలవంతులు (అనువాదకవితలు) | డాక్టర్ డి.చంద్రశేఖర రెడ్డి | 30 |
| 21. | నివురు | కాకాని చక్రపాణి కథలు | 60 |
| 22. | పతితపావని, త్రిల్లింత | కాకాని చక్రపాణి (ఒక్కోసంపుటి) కథల సంకలనాలు | 50 |
| 23. | ది ఘోస్ట్ (నవల) | కాకాని చక్రపాణి, గోవిందరాజు చక్రధర్ | 60 |
| 24. | గోరంతదీపం (నవల) | కాకాని చక్రపాణి, గోవిందరాజు చక్రధర్ | 30 |
| 25. | Damodaram Sanjivayya and his times | Dr. G. Venkata Rajam | 450 |

ప్రతులకు

**Media House Publications**

1-9-289/4, Behind Post Office, Vidyanagar

Hyderabad - 500 044. ✆ : 2760 7307

# విషయసూచిక

# 1. మన తెలుగులో తెలుగెంత?

మనం తెలుగువాళ్లం. మనం మాట్లాడేది తెలుగు. రాసేది తెలుగు. కదూ! ఇంతకూ మనం మాట్లాడేదాన్ని ఏమంటారు? 'భాష' అంటాం కదూ! ఆమాట తెలుగేనా? ఎవరన్నా దాన్ని 'బాస' అంటే, నోరుతిరక్క (తిరగన్ది నాలికేగాని, పేరుమటుకు 'నోరు'కు వచ్చింది!), చదువురాక అలా పలికారనుకుంటాం. 'భాష' అనేది 'సంస్కృతం' మాట. దాన్ని మార్చి 'బాస' అని 'అచ్చతెలుగు'లో కూడా అంటారు. ఇలా మనం పలికేమాటలనుబట్టి తెలుగు 'సంస్కృతం'లోంచి పుట్టిందన్నారు మన పెద్దలు. అలాగని గట్టిగా నమ్మారు, చెప్పారు, రాశారు! (కొన్నాళ్లకు ఆమాట సరికాదని మరికొందరు చెప్పారు. మనది 'ద్రవిడ భాష'ల్లో ఒకటన్నారు వాళ్లు). మనపెద్దలలా ఎందుకన్నారంటే మనం వాడే మాటల్లో చాలా వరకు 'సంస్కృతం' మాటలేగదా మరి. వాళ్లు గుర్తించందేమంటే మన మింకా ఎన్నో 'భాష'ల మంచి మాటలు ఎరువుతెచ్చుకొని ఎడాపెడా వాడుతుంటామని. మాట లెక్కడినుంచి వచ్చినా వాటిని వాడే తీరుమటుకు తెలుగువాళ్లదే. తెలుగుతీరులో మాట్లాడేటప్పుడు మాటలెవరి వయినా, ఎక్కడివైనా 'భా' ' మటుకు మనదే. ఈ ' మాటలు రాసేటప్పుడు చేతులు కట్టుకుని మరీ రాస్తున్నాను సుమా. గుర్తించండి. ఈ '' గుర్తుల నడుమ ఏమున్నా (ఎత్తిరాసి నప్పుడు తప్ప) అది మనం ఎరువుతెచ్చుకున్నదేగాని మనది కాదన్నమాట. సరే. ఈ గొడవంతా ఏమిటో తెలుసుకుందామా? అంతాకాదు – కొంచెంగానే. మనల్నిగురించి మనం ఏమని చెప్పుకుంటామో అక్కడ మొదలేసి, మేలుకున్నప్పుడు మనం అలవాటుగా వాడే మాటల్ని గుర్తుతెచ్చుకొని, మన తెలుగులోని తెలుగెంతో, దాని పస ఎంతో గుర్తిద్దాం. సరేనా?...

ఇంతకీ ఏమన్నాం? మనమేం మాట్లాడ్తామో తెలుసుకుందామని కదూ. ఎందులో? మన 'భాష'లో. 'భాష' అనేది మనసొంత మాట కాదన్నాం గదా. 'సొంత' మనేది కూడా మనసొంతం కాదనీ, అది 'స్వంతం' అనే 'సంస్కృతపదం' లోంచి పుట్టిందనీ చెప్పేవాళ్లున్నారు! అది అలా ఉంచండి. ఎరువుమాటలు మాట్లాడినా తెలుగుతీరులోనే మాట్లాడ్తున్నాం అన్నాం, లేదా అనుకొన్నాం గదా. ఆ తీరుకు పేరేమిటి? తెలుగు 'వాక్యం'లో నన్నమాట. 'వాక్యం' కూడా మన మాట కాదు. 'అన్నమాట'కు బదులు మన మేమనగలమబ్బా? 'అర్థం' అనవచ్చునేమో. 'అర్థం' అనేది కూడా 'సంస్కృత'మే. కింది ఒత్తుకు పొట్టలో చుక్కవుంటేనే సరిపోతుంది. అది లేకపోతే సగమనే 'అర్ధం' వస్తుంది. పొట్టలో చుక్కవుంటే సొమ్మనే 'అర్థం' కూడా వస్తుంది.

మనల్నే మంటారు? తెలుగు 'జాతి' అంటారు. మరోపేరు కూడా వుంది – ఆంధ్రజాతి అని. మనదేమో తెలుగు 'భాష'. మన తెలుగు 'వాక్యా'ల్లో ఎరువు మాటలు వాడినా 'భాష' మటుకు మనదేనని గుర్తుంచుకోండి. మాటకన్నా 'వాక్యం' మన 'భాష'కు సరైన గుర్తన్నమాట. 'అచ్చ'మైన తెలుగువాడు (అచ్చం – అనేది సంస్కృతంలోని 'అచ్ఛం'లోనుంచి పుట్టిందంటారు!) మేలుకున్నంతసేపూ మరో 'భాష'లోని మాటలే మాట్లాడుతూ కూడా తాను మాట్లాడేది తెలుగేనంటాడు – అనుకొంటాడు. అక్కడే వస్తుంది గొడవంతా. కళ్లుమూసుకున్నంతసేపూ కలల్లో ఏమనుకుంటాడో మనకు వద్దు. మేలుకున్నప్పుడు ఏమంటాడో అది చాలు. ఏం చేస్తాడో చాలు.

మనం వాడే తెలుగులో మరెన్ని 'భాష'ల మాటలు మాట్లాడుతామో – చదువుకున్నవాళ్లకన్నా చదువురాని వాళ్లయితే తక్కువగా ఎరువు తెచ్చుకుంటారుగాని, ఎరువు మటుకు తప్పదు. అందుకు సిగ్గుపడనక్కరలేదు. అందరూ అంతే. మనదే వింతకాదు.

మంచిది. ఆ వివరాలు తెలుసుకుందామా? ఇది 'సంస్కృతం'లోని వివరంకాదు. ఆ 'భాష'లో ఆ మాటకు 'బొక్క/ పొక్క' అని 'అర్థం'. వచ్చే 'వారం' నుంచీ అదేపని చేద్దాం. (కటకటా – 'వారం' 'కూడా' 'సంస్కృతం' వాసరం లోంచి వచ్చిందే) . వచ్చే సంచికనుంచి (సంచిక – కూడా 'సంస్కృత' మనే!) ఏం చేద్దాం? ఏదో చేయాలిగదా!

ఎవరది? తెలుగువాడిలాగుంది. ఏం చేస్తున్నాడు? పడకమీంచి లేస్తున్నాడు కాబోలు. ఎందుకో మరి? తెల్లవారింది కదా. అంటే ఏమిటి? ఎవర్నడిగినా 'నిద్ర' లేచాడంటారేమిటి? 'నిద్ర' తెలుగు: నే – 'సంస్కృత'మేనే. కాకపోతే 'నిదర' అంటారు. పెద్దవాళ్లయితే 'నిదుర' అంటారు. అంతే మార్పు. తెల్లవారిందనటానికి గుర్తేమిటి? పల్లెటూరివాడయితే 'పొద్దు పొడవట' మంటాడు ఇప్పటికీ. అదిన్నీ చదువురాని వాడైతేనే. కొంచెం చదువుకున్నవాడైతే 'సూర్యుడు' కనిపించటం లేదా? అని నిగ్గదీయవచ్చు. 'సూరీడు' అన్నా కూడా 'సంస్కృతం' నుంచి వచ్చి తెలుగువాడిలాగా మసలేవాడేనన్నమాట. పొద్దుపొడిచిం దెక్కడ? అంటే 'తూర్పున' అనవచ్చు ఎవరైనా. తూర్పంటే? 'సూర్యుడు' పొద్దున కనిపించే 'దిక్కు'. ఈ 'దిక్కు'మాలిన 'దిక్కు' కూడా సంస్కృత'మే. 'వలను, వైపు' వంటి మాటలను పూర్తిగా మరిచిపోయామో, గుర్తుకు రావో చెప్పలేం. 'దిక్కు' కాదు – మరో మాట చెప్పమంటే 'దిశ' అంటాం. అదీ 'సంస్కృత'మే మరి. పోనీ నాలుగు 'దిక్కు'లూ చెప్పమంటే చెప్పేవాటిలో 'ఉత్తరం', దక్షిణం' సంస్కృతంలోంచి వచ్చినవే. ఒకప్పుడు ఉత్తరాన్ని 'వద' అనేవాళ్లు. అలవాటు తప్పిపోయింది. దక్షిణాన్ని 'తెన్ను' అనేవాళ్లు. అలవాటు తప్పింది. ఇప్పుడు వడలు తింటాం. ఇంకా 'వదగాలి'లో ఆ మాట నిలిచింది. విడిగా మటుకు కాదు. ఎప్పుడూ 'మటుకు' వాడకపోతే 'మాత్రం' అనకూడదా అనకండి. అదీ సంస్కృతమే. సరే, మొత్తానికి తెలుగువాడు 'సూర్యుడు' తూర్పు 'దిక్కున' పుట్టే టప్పటికి 'నిద్ర' లేచాడని ఒప్పుకుందాం. ఆ పుట్టడాన్ని 'పొడిచా'డని చెప్తే చదువురానివాడో పల్లెటూరివాడో అంటారు. 'ఉదయించా'డని సంస్కృతం మాట వాడ్తే గొప్ప.

నిద్రలేచినప్పటినుంచీ.....

ఇలా 'నిద్ర'లేచిన మనవాడు వెంటనే మొదలు పెట్టిన పని 'మొఖం' కడుక్కోవడం. అదే 'మొహ'మని కూడా అంటాం. 'మోము' అనే వాళ్లెవరైనా ఉన్నారో లేదో తెలీదు. అది సంస్కృతం లోని 'ముఖం' అన్నమాట. పల్లెటూళ్లోనివాడు వేపపుల్లతోనో కానుగ/ గానుగ పుల్లతోనో, లేదా కచ్చిక, బొగ్గులాంటి వాటితోనో పని నెరవేర్చుకుంటే 'పేస్టు' 'బ్రష్షు' అని 'ఇంగ్లీషు' పేర్లతో పిలిచేవాటితో మరికొందరు అదేపనిచేస్తారు. కొందరు 'పేస్టు'కు బదులు పళ్లపొడిని, లేదా 'టూత్‌పౌడరు'ను వాడ్తారు. 'విద్యావంతు'లయితే – అంటే తెలుగులో చదువుకున్నవాళ్లయితే – ఈ పనికి 'దంతధావనం' అనే పేరు చెప్తారు సంస్కృతంలో. ఇంగ్లీషులో చెప్పదలిస్తే 'బ్రష్ చేశా'మంటారు. ఈ పని పూర్తికావాలంటే పుక్కిలించి ఉమ్మితే చాలదు. ఆ ముఖానికి 'సబ్బు' పట్టించాలి. అది 'సాబున్' అనే హిందీ మాటలోంచి వచ్చింది. ఇంగ్లీషు చదివినవాళ్లు 'సోప్'

ఎందుకన్నమాట. ఇంకా గొప్పగా చెప్పాలంటె 'సోప్‌వాటర్' – అనగా సబ్బు నీళ్లతో ముఖం కడుగుతారనాలి. ఆమీదట తమ తమ అలవాట్ల కొద్దీ 'ఫేస్ పౌడర్' రాసేవాళ్లూ, అది చాలదనుకుంటే 'స్నో' రాసేవాళ్లూ లేకపోలేదు. తరవాత తల దువ్వకతప్పదు. మరిచాను. తడిమొహాన్ని 'టవల్'తో ఇంగ్లీషు నేర్చినవాళ్లు తుడిస్తే, ఆ భాష రానివాళ్లు తుండుగుడ్డతోనో 'తువాలు'తోనో అద్దుతారు. 'టవల్' తమ్ముడో చెల్లెలో 'తువాలు'. ఇంగ్లీషు ద్వారానో, నేరుగా ఫ్రెంచి నుంచో మనకు వచ్చినమాట ఆ తువాలు. తల దువ్వటానికి దువ్వెన ఎక్కడుందని 'భార్య'ను కేకేసి అడిగేవాళ్లు కొందరు. ఆమెగారు సంస్కృతంలో భార్య. తెలుగులో ఇల్లాలు. ఇంగ్లీషులో 'వైఫ్'ను ('f' రాయటానికి తెలుగులో వీల్లేక సంస్కృతం నుంచి అరువుతెచ్చుకొన్న 'ఫ'ను రాస్తున్నాను. ఏమీ అనుకోవద్దు!) అడుగుతారు. కొందరయితే 'కూంబు' కావాలంటారు – ఇంగ్లీషు మాటలో. ఆమెను తెలుగులో 'పెండ్లాం', 'పెళ్లాం' అనవచ్చు. 'ఆలు' అని అనవచ్చుగాని తెలుగు వాళ్లకి తిట్లలో 'మాత్రమే' ఆ మాట గుర్తుకు వస్తుంది. ఇది 'అన్యాయ'మే కావచ్చుగాని అది సంస్కృతం మాట. అదే చిక్కు.

పైన చెప్పినపని అయ్యా కాకముందే చద్ది తినేవాళ్లున్నారో లేదో తెలీదు నాకు. ఇప్పుడు పాలుతాగేవాళ్లు పసిబిడ్డలే మరి. తరవాణి కోసం అంగలార్చే వాళ్లున్నారా? చెప్పలేం. కొందరికి 'కాఫీ' కావాలి. మరికొందరికి 'టీ'. 'కాఫీ' అనేది ఇంగ్లీషు మాట అనుకుంటాంగాని అది అరబిక్ మాట. అరబ్బీనుంచి ఇంగ్లీషు వాళ్లు అలవాటు చేసుకొని మనకు నేర్పిన మాట. 'కాఫీ' నచ్చని వాళ్లకి 'టీ' తప్పదు – కోస్తాలో, రాయలసీమలో. తెలంగాణాలో 'చాయ్' కావాలి. రెండూ ఒకటేగాని పేర్లు వేరు. మా చిన్నతనంలో 'తేనీరు' తాగేవాళ్లు! 'తే– టీ–, చాయ్' అనే మూడు మాటలూ చైనావాళ్లవే మొదట్లో. ఉత్తర చైనాలో 'చా' అనేదాన్నే దక్షిణా చైనాలో 'తే' అంటారు. హిందీ వాళ్లనుంచి పేరువిన్న వాళ్లు 'చాయ్'కి అలవాటుపడితే, ఇంగ్లీషువాళ్లనుంచి తెలుసుకున్న వాళ్లు 'టీ'కి లొంగిపోయారన్నమాట. ఇంగ్లీషులోని 't' అనేది తెలుగులోని 'త'కుగాని, 'ట'కుగాని సరిపోతుంది. తెలుగులో కూడా 'త, ట'లకు మారుపాటు కొన్ని మాటల్లో వుంది. 'తేకు – చెట్టు'ను కొందరు 'టేకు చెట్టు' అంటారు. ఈ రెంటినీ మననుంచి నేర్చుకున్న ఇంగ్లీషువాళ్లు 'teak' (టేకు, టీక్) చెట్టంటున్నారు!

పై కాఫీ, టీలను కొందరు 'స్ట్రాంగ్'గానే 'సేవిస్తారు'. అంటే ఇంగ్లీషు మాటకు తగ్గట్లుండే సంస్కృతం మాటతో పుచ్చుకుంటారు. కొందరికి వేడిగా వుండాలవి. వెచ్చపెట్టడానికి 'స్టౌ'ల వాడుక పెరిగింది. మరిచాం. 'డికాషన్'కు పాలు కలిపికదా ఇది 'తయా'రయేది. 'డికాక్షన్' అనే ఇంగ్లీషు మాటనుంచి డికాషన్ పుట్టింది. 'తయా'రనేది హిందీ మాట. మునుపు కంచు, ఇత్తడి 'లోటా'ల్లో తాగేవాళ్లు. 'లోటా' హిందీమాట. అంతకుముందు సంస్కృత 'పాత్ర'ల్లో తాగేవాళ్లు. కొన్నాళ్లు 'పింగాణీ కప్పులు' వాడారు. పింగాణీ ఏ భాషలోదో తేల్చలేంగాని 'కప్పు' ఇంగ్లీషుమాటే. ఇప్పుడు 'స్టీల్‌గ్లాసులు' వచ్చాయి – తెల్లదొరల భాషనుంచి. పట్టుకుంటే చేతులు కాలకుండా 'గాజు గ్లాసులు' వచ్చాయి. 'గ్లాస్' అంటేనే గాజు. మరి గాజుగ్లాసేమిటో? అని అడిగితే 'సేం అదే' అనేవాళ్లున్నారు. 'సేం' ఇంగ్లీషయితే 'అదే' తెలుగు. రెండు మాటలకూ 'అర్థం' ఒకటే. ఇలాంటివి చాలా మాటలు వాడుతుంటాం : 'సిగ్గు బిడియం, పేపర్ కాగితం, స్టూడెంటు విద్యార్థి' లాంటివి.

సిగ్గు మనసొంతం. బిడియం కూడా అలాటిదేగాని దాన్ని కన్నడంలోనుంచి తెచ్చుకున్నామంటారు కొందరు. 'పేపర్' ఇంగ్లీషుమాట. అదే అర్థమిచ్చే కాగితం ఉర్దూలోని 'కాగజ్' నుంచి తెచ్చుకున్నది. 'స్టూడెంట్' తెల్లదొరయితే విద్యార్థి సంస్కృతం వాడు. తెలుగువాడు కావాలంటే 'బడిపిల్లవా'డనాలి. అలాగంటే పసివాడు చిన్నబుచ్చుకోవచ్చు.

ఇంత 'నాగరకత' (ఇది సంస్కృతం మాట – దీన్ని 'నాగరికత' అనటం బాగా అలవాట యింది) లేనివాళ్లు 'పాపం' (ఇది సంస్కృతం) 'చద్దన్నం'తో సరిపెట్టుకుంటారు. 'చద్ది, చలిది' అంటే చల్లగా వుండేదని అర్థం – ఇది తెలుగు. కానీ 'అన్నం' సంస్కృతంలోనుంచే వచ్చింది. దాన్నే కొందరు 'వణ్ణ'మని తెలు గనుకుంటున్నారు. ఇది – చద్దన్నం – ఒంటికి మంచిదని బామ్మలూ అమ్మమ్మలూ చెప్పినా 'ఆరోగ్యానికి' మంచిదని 'వైద్యులు' చెప్తేగాని నమ్మం. ఆరోగ్యం సంస్కృతంమాటే – వైద్యుడిలాగా. తెలుగు ఒళ్లు ('ఒడలు')ను 'శరీర'మని సంస్కృతంలో చెప్తే, 'బడాయి'కి 'బడాయి', 'ఫ్యాషన్'కు 'ఫ్యాషనూ' సరిపోతాయి. బడాయి హిందీ నుంచీ, ఫ్యాషన్ ఇంగ్లీషునుంచీ దిగుమతైన మాటలు. 'బడా' అంటే పెద్ద, 'బడాయి' అంటే 'పెద్దతనం'. ఈ పెద్దతనం తెలుగు మాటేగాని అది 'పెత్తనం'గా మారి నెత్తినెక్కి కూర్చోటమనే అర్థం తెచ్చుకుంది. ఇటీవల 'ప్రతి'వాడికీ 'హెల్త్' అనే ఇంగ్లీషు మాటలో చెప్తేగాని నచ్చటంలేదు. 'ప్రతి' అన్నంతవరకు అది సంస్కృతమే. దాన్నీ తెలుగు 'వాడి'నీ కలేసి వాడుతున్నామన్నమాట.

ఈ 'విధం'గా, ఈ 'రకం'గా చెప్తూ పోతే ఒక 'విషయం' నుంచి మరోదానికి కప్పదాటు వేస్తున్నట్లవుతుంది. విధం, విషయం – ఈ రెండూ సంస్కృతం నుంచీ, 'రకం' ఉర్దూనుంచీ వచ్చిపడ్డాయి. తెలుగులో 'దిక్కు' తోచనంత సంస్కృతం, ఉర్దూ, ఇంగ్లీషు వంటి భాషలు వచ్చి చేరాయి. వాటినో 'క్రమం ప్రకారం' (ఈ రెండూ సంస్కృత పదాలే – 'పదం' కూడా అంతే') వచ్చేసారి నుంచి తెలుసుకుందాం. మొదట ఇంట్లో తరవాత దాని చుట్టుపక్కలో ఎన్నెన్ని భాషల మాటలు వాడుతున్నామో గుర్తిద్దాం.

## ఇంట్లోనుంచి బయటపడేలోగా

తెలుగువాడు కళ్లు తెరిచాడు. తానొక్కడే కాదు. ఇంచుమించు అదే 'సమయం'లో ఆ ఇంటి ఇల్లాలు, ఆమె అత్తగారు, పిల్లలు, మామగారు కళ్లుతెరిచారు, వేగుజుక్కతోబాటే. ఒక్కసారి ఆవలించి, ఒళ్లు విరుచుకుని, రేగిన జుట్టు సవరించుకొని, మెల్లగా లేచి కూచున్నారు – తెలుగులో. అలవాటుకొద్దీ పెద్దాయన అరచేతిలో 'శ్రీ' రాసుకొని కళ్లకద్దుకున్నాడు. శ్రీ – సంస్కృత పదం. నడికారు ఇంటాయన ('వయసు' అంటే సంస్కృత మవుతుంది) అటుగా కదిలి పడకటింట్లోని నిలువుటద్దం ముందు నిటారుగా నిలబడి అద్దంలో నీడచూసుకున్నాడు. తల దువ్వుకున్నాడు. (దువ్వుకున్నది జుట్టునేగాని పేరు తలకు వచ్చింది). ఇల్లాలు బట్టలు సవరించుకొని, నగల చిక్కు విడదీసి, తాళిబొట్టు కళ్లకద్దుకుంది, అత్తగారిలా. 'మంగళసూత్రం' అన్నామో అది సంస్కృతమయి పోతుంది. ఇంటాయన 'లుంగీ' సర్దుకొని బయటి కడుగుపెట్టాడు. లుంగీ అనేది హిందీ మాట. పెద్దాయన మటుకు పంచె విదిలించి కట్టుకున్నాడు. పిల్లలు మగతగా మత్తుగా ఇంకా అటూ ఇటూ పొర్లుతున్నారు. చంటాడు గీపెట్టాడు. 'డబ్బా' పాలకోసమేమో. డబ్బా హిందీ మాట.

మొత్తానికి అద్దంలో పిల్లలుకూడా 'మొహం'చూసుకొని 'నిక్కర్లు' సర్దుకొని బయటికి పరుగెత్తారు. మొహం సంస్కృతంలోని 'ముఖం' నుంచి వచ్చింది. 'మోము' అంటే తెలుగేగాని ఆ మాట వాడే అలవాటు తప్పింది కదా. 'నిక్కర్' ఇంగ్లీషుమాట. 'చొక్కా'లు కూడా తగిలించారంటే ఇంగ్లీషుమీద హిందీ నెక్కించారన్నమాట.

'అసలు' వీళ్లు తెలుగువాళ్లే కదూ? 'అసలు' తెలుగుకాదు. హిందీ నుంచి వచ్చింది. తెలుగు మాట అసలుకు బదులు అని అర్థం! అవునో కాదో తేల్చుకోవటం మంచిదేకదా. మాటలనుబట్టి కళ్లు, ముక్కు, చెవులు, కనుబొమ్మలు, పెదిమలు, చెంపలు, నుదురు, నోరు, మెడ, తల, గుండె, పొట్ట, బొడ్డు, చేతులు, కాళ్లు, వేళ్లు, గోళ్లు, అడుగులు, అరచేతులు, జుట్టు, కొప్పు, మీసం, గడ్డం, దవడలు, కణతలు, చివరికి వెంట్రుకలు కూడా తెలుగు మాటలేగాని ఇల్లాలి 'జడ' సంస్కృతంలోని 'జట' నుంచి వచ్చిన మాట. చిన్నపిల్ల తొడుక్కున్న 'గౌను', చెవికి పెట్టుకున్న 'రింగు'లూ, జుట్టుకు చుట్టిన 'రిబ్బ'నూ ఇంగ్లీషు మాటలే. ఆమెగారు కోకకట్టినా, చీరకట్టినా తెలుగువేగాని, 'లంగా' మటుకు ఉర్దూమాటే. అయినా నిగ్గుతేల్చాలంటే ఒంటిలోపలి 'భాగాల' పేర్లు 'భాగం' లాగానే చాలావరకు సంస్కృతపదాలు. నెత్తురు, గుండె, పేగు, మెదడు, ఊపిరితిత్తులు, కండలు, నరాలు, ఎముకలు, కీళ్లు తెలుగు మాటలేగాని మరీ లోపలికిపోయి 'సిరలు, ధమనులు' మొదలయినవి చూస్తే సంస్కృతపదాలే. కానీ లోపలికి పోవాలంటే 'చర్మం' లోపలికి అనే గదా. 'చర్మం' సంస్కృత పదం. తెలుగుమాటలయిన 'తోలు, తాట' వంటి వాటి 'అర్థాలు' మారిపోయాయి. తోలుతీసిగాని, తాటవలిచిగాని చూట్టం తగదుగాని మరో దారిలేదు. వివరాల జోలికి వద్దుగాని 'మామూలు'గా మనం వాడే మాటలనే గుర్తుచేసుకుందాం (మామూలు – ఉర్దూమాట సుమండీ).

మన 'మనస్సు'లోనో 'బుద్ధి'లోనో 'ఊహ'లో 'ఆలోచన'లో పుట్టాయి. కొందరయితే 'హృదయం'లోనే 'భావాలు' పుట్టాయంటారు. ఏది 'నిజ'మో ఏది కల్లో తెలీదుగాని 'నిజం' నిజంగా సంస్కృతపదం. కొన్నిసార్లు తెలుగుమాటలున్నా సంస్కృతపదాలనో ఉర్దూ మాటలనో ఇంగ్లీషు 'శబ్దా'లనో వాడటంమీద తెలుగువాడికి 'మోజు' ఎక్కువ. శబ్దం సంస్కృతం నుంచీ, మోజు ఉర్దూ నుంచీ దిగుమతైనాయి. మనం 'బుజం'మీద 'ఉత్తరీయం'గాని ఆడవాళ్లయితే పమిటకొంగుగాని వేసుకుంటాం. 'మూపు' అంటే తెలుగు. కానీ దానికి 'బదులు' (ఇది హిందీమాట). సంస్కృతం లోని 'భుజం' నుంచి వచ్చిన బుజాన్ని వాడి మూపును ఆవులకూ ఎద్దులకూ 'మూపురం'గా 'బదిలీ' చేశాం. బదిలీ హిందీమాట. ఆమాట కొస్తే 'శరీరం, దేహం' వంటి సంస్కృతపదాలు వాడినంతగా 'ఒళ్లు' ('పూర్వం' ఒడలు– అనేవాళ్లు. పూర్వం సంస్కృతపదం) అనే మాట వాడం. పూర్వం అనే మాట వాడనివాళ్లు 'గతం'లో అనిగాని 'తొలిరోజుల్లో' అనిగాని అనవచ్చు. గతం సంస్కృతం. 'తొలి' తెలుగుమాటేగాని 'రోజు' ఉర్దూమాట. దానికి బదులు మనంవాడే 'దినం' సంస్కృతపదమే. 'పొద్దు' అనే తెలుగు మాటను కొద్దిమంది వాడుతున్నారింకా. మరో 'భాష'లోని 'పదాన్ని' కలిపి వాడితేనేగాని మనకు 'పసందు'గా ఉండదు. 'పసందు' హిందీపదం. మన 'నాడి'చూసి 'ఆరోగ్యం' గుర్తించి చెప్పే 'వైద్యుడు' – లేదా 'డాక్టరు' మనకు 'రక్తపోటు' ఉందోలేదో చెప్తాడేగాని 'నెత్తురు పోటు' లేదని నమ్మకం చెప్పడు! నాడి, ఆరోగ్యం, వైద్యుడు, రక్తం – ఇవి సంస్కృత పదాలు. డాక్టరేమో ఇంగ్లీషు మాట. ఆరోగ్యం 'విషయం' ప్రస్తుతానికి అలావుంచి మన తెలుగువాళ్ల 'వేషం' ఎలా వుందో చూద్దామా? (విషయం, ప్రస్తుతం – సంస్కృత పదాలని మరిచిపోకండి).

గదిలోంచి బయటకువస్తూ – తెలంగాణాలోనయితే 'అఱ్ఱ'లోంచి – ఇల్లాలు తలలో పెట్టుకున్న వాడిపోయిన పూలచెండును 'కిటికీ'లోంచి బయటకు గిరవాటేసింది. అఱ్ఱ, కిటికీ – ఈ రెండూ ఉర్దూలోంచి వచ్చిన మాటలు. ఆ చెండులో ఏపూలున్నాయో చూస్తే – 'దూరం' నుంచి చూపానలేదు గాని – ఏవుంటాయో 'ఊహించి' చెప్పవచ్చు. దూరం, ఊహ – రెండూ సంస్కృత పదాలే. చెండులో ఉండేవి 'మల్లె, జాజి, మందార, కనకాంబరం, సంపెంగ, బంతి, చేమంతి' పూలతో 'మహా' అయితే 'దవనం, మరువం' కావచ్చు. మల్లె 'మల్లీ' శబ్దం నుంచీ, సంపెంగ 'చంపక' శబ్దం నుంచీ, చేమంతి 'సేవంతీ' శబ్దం నుంచీ సంస్కృతంలోనుంచి'మహా'లాగానే వచ్చినవే గదా? ఇక్కడ ఆగవద్దు. ఇల్లుదాటి పెరట్లోకి రానీయండి!

## మన పెరట్లో ఉన్న తెలుగు

తెలుగు 'కుటుంబం' పెరట్లోకి వచ్చింది – తెల్లవారు'జాము'న. కుటుంబం సంస్కృతం నుంచి నేరుగా వచ్చిన మాటైతే, జాము సంస్కృతంలోని 'యామ' శబ్దం నుంచి మరో భాష (ప్రాకృతం) ద్వారా వచ్చింది. పెరడు చాలా 'విశాల' మయింది. దాదాపు ఓ 'ఎకరం' ఉండవచ్చు. వీటిలో మొదటిది సంస్కృతంనుంచీ రెండోది ఇంగ్లీషు నుంచీ వచ్చాయి. పండ్లచెట్లు, పూలచెట్లు, ఆకుకూరమడులు 'వగైరా' ఎన్నో ఉన్నాయందులో. వగైరా ఉర్దూమాట. కొట్టవచ్చినట్లు కనబడే 'కొబ్బరి' చెట్లున్నాయి. కొందరు వాటిని టెంకాయ, తెంకాయ చెట్లని కూడా పిలుస్తారు. 'తెన్' అంటే దక్షిణం. దక్షిణ 'దేశం'లో పెరిగే కాయచెట్టు కాబట్టి టెంకాయ/ తెంకాయ అంటారని కొందరు చెప్తారు. కొబ్బరి తెలుగు మాటగా వినిపించినా అది మలేషియా నుంచి ఇంగ్లీషు ద్వారా వచ్చిన మాట ('కోప్రా' పేరిట అది ఇంగ్లీషు 'నిఘంటువు'ల్లో కెక్కింది). మామిడి మనదేనంటారు. కాని 'సపోటా, జామ' చెట్లు మనవికావు. మొదటిది మధ్య అమెరికాలోని మెక్సికోనుంచి స్పానిష్ భాషలోకి వచ్చి అక్కడి నుంచి మనకు ఇంగ్లీషు ద్వారా వచ్చింది. జామ న్యాగినీ అనే దక్షిణ అమెరికా దేశం నుంచి వచ్చింది. ఇంటికప్పుకు పాకించిన తీగ లేవో ఉన్నట్లుంది. అవును. 'మాలతి, బోగంమల్లె, సంపెంగ' తీగలవి. మాలతి సంస్కృతం నుంచి నేరుగానూ సంపెంగ కొద్ది మార్పుతోనూ వస్తే బోగంమల్లె టక్కుటిక్కులతో 'తమాషా'గా వచ్చింది. తమాషా ఉర్దూపదం. 'బోగన్‌విల్' అనే ఇంగ్లీషు మాటను మనవాళ్లు మార్చి 'బోగం' (సంస్కృతంలోని 'భోగ' శబ్దం నుంచి పుట్టినమాట అది)తో కలిపి, మల్లెకు (మల్లీ – అనే సంస్కృతంలో నుంచి వచ్చిన మాటకు) ముడి వేసి వాడేశారు. దాన్నే కొందరు 'కాగితం మల్లె, కాగితంపూవు' అని కూడా పిలుస్తున్నారు. 'కాగితం' పర్షియన్‌లోని 'కాగజ్' నుంచి ఉర్దూ 'ద్వారా' వచ్చి చేరింది తెలుగులో. ఇంటి కప్పు మీద దోస, గుమ్మడి, బీర తీగలు అల్లుకున్నాయి. గుమ్మడితో ఓ చిన్నగోడు వుంది. బూడిద గుమ్మడి మటుకు మనదేగాని 'తియ్యగుమ్మడి' పేరుకే మనది. అది 'విదేశాల' నుంచి వచ్చిందట. అటువంటి వాటిని 'విశ్వామిత్ర సృష్టి' అని మన పెద్దలు తినేవాళ్లు కాదు ఒకప్పుడు. తియ్యగుమ్మడినే కొందరు మంచి గుమ్మడి అని మన సొంతగుమ్మడిని బూడిదలో పొర్లించేస్తున్నారు.

'విశ్వామిత్ర సృష్టి' అంటే గుర్తుకు వచ్చింది. ఎప్పటి నుంచో మన నేలలో పండిన వాటిని

తప్ప కొన్ని 'సమయా'ల్లో మన 'పూర్వులు' తినేవాళ్లు కారు. అలాంటివన్నీ ఈ పేరిట తినగూడవని నమ్మేవాళ్లు. ఒక కొండగుర్తేమంటే అటువంటివన్నీ ఎక్కడనుంచో వచ్చినవనీ, మన సొంతం కాదనీ తెలుసుకోవచ్చు. ఈ తెలుగు వాళ్ల పెరట్లోనే కాస్తున్న 'కంది, బెండ, మిరప' ఆ 'బాపతు'వే. బాపతు హిందీ మాట. సమయం, పూర్వులు, విశ్వామిత్ర సృష్టి – సంస్కృతపదాలు. కంది పోర్చుగీసువారి 'ద్వారా' వచ్చిన పంట అంటారు. పేరేమో తెలుగు పేరులాగుంది. బెండ హిందీలోని 'భేండీ' నుంచి వచ్చింది. 'మిరియం' పండేది మన 'దేశం'లో. కానీ దానిలాగా 'కారం'గా, 'ఘాటు'గా ఉంటే కాయ మనది కాదు. దక్షిణ అమెరికా నుంచి వచ్చింది. కారం అనేది సంస్కృతంలోని 'క్షార' శబ్దం నుంచి వచ్చిందని ఓ 'వ్యాకరణం'లో చెప్పారు. ఘాటు సంస్కృతంలోని 'గాఢం' నుంచి పుట్టిందంటారు. మొత్తంమీద 'ఆచారపరు'లైన పూర్వులు 'వాసన' ఎక్కువగా ఉన్న ఉల్లి వంటి వాటితో బాటు ఈ 'విదేశ వస్తువులను' కూడా తినేవాళ్లు కాదు. 'వాసన' కూడా సంస్కృత పదమే. తెలుగుమాట 'కంపు'. ఒకప్పుడు ఆ మాటకు 'సువాసన' అనే 'అర్థం' ఉండేది. ఇప్పుడు అది తలకిందైపోయింది. పోనీండి.

పెరట్లోనే దొడ్డిగడపకు ఎదురుగా 'తులసికోట' కనిపిస్తున్నది. తులసి సంస్కృతం. కోట మటుకు తెలుగుమాట. కొందరు దాన్ని 'రిందానం' (బృందావన శబ్దం నుంచి వచ్చింది) అంటే మరి కొందరు 'పీని' అని ఒరియా మాటతో పిలుస్తుంటారు. 'భూతులసి, రామతులసి' వంటి 'భేదాలు' లేకపోలేదు. భేదం సంస్కృతమైతే, 'తేడా'లని చెప్తే ఉర్దూ, 'రకాలు' అంటే ఉర్దూ ద్వారా మనకు వచ్చిన పర్షియన్ మాటలవుతాయి. తెలుగులో చెప్పాలంటే 'తెగ, దినుసు' వంటి మాటలు వాడాలి. 'వీరశైవు'లయితే ఇంట్లో తులసి మొక్కను పెంచరు. కానీ వాళ్లు తప్పకుండా పెంచేది 'రుద్రజడ'. 'రుద్ర' వరకు అది పూర్తిగా సంస్కృత శబ్దం. జడ అనేది 'జట' అనే సంస్కృత పదాన్నుంచి వచ్చిందే. 'భక్తి ప్రపత్తు'లున్న వాళ్లు తులసినో రుద్రజడనో కాక 'పూజ'కోసం మరికొన్ని చెట్లనో, తీగలనో పెంచుతారు. పూజ మొట్టమొదట మన మాటేనట. దాన్నిసంస్కృతం వాళ్లు కొంచెం మార్చి తమ సొంతం చేసుకున్నారంటారు. అలాంటివి 'నందివర్ధనం, పారిజాతం' మొదలైనవి ఉన్నాయి.

ఇక కూరాకు మడులు కూడా ఉన్నాయా పెరట్లో. తోటకూర, గోంగూర వంటి 'దేశవాళీ' కూరలేగాక 'పాలకూర, కొత్తిమీర, ధనియాలు' వంటి హిందీ పేర్లుగల తెలుగు మొక్కలు కూడా ఉన్నాయి. గోంగూర మనదేనని 'గర్వించినా సంతోషించినా' తప్పులేదు తెలుగువాడికి. ఎందుకంటే 'గర్వం, సంతోషం' సంస్కృతం నుంచి వచ్చినా వాటి చివర చేరిన 'ఇంచు' పూర్తిగా మన సొంతం కాబట్టి! ఆ 'ఇంచు'ను తగిలించి 'వందల', వేల సంస్కృత పదాలనూ హిందీ మాటలను తెలుగు చేయగలం. 'వంద' మన సొంతం కాదు. 'బృంద' అనే సంస్కృత శబ్దంనుంచి వచ్చిందంటారు. మన మాట నూరు. దాంట్లో అది మనదేనని నొక్కి చెప్పటానికన్నట్లు 'పూర్వం' బండిరా ఉండేది. ఇదో కొండ గుర్తు. 'నిఘంటువు'లలోగాని, పాత 'కాలపు పుస్తకాల్లో'గాని ఏమాటనైనా రాస్తూ అరసున్నానుగాని బండిరానుగాని రాసేరంటే అది తెలుగు మాటేనని గుర్తించవచ్చు. ఈ మాట పూర్తిగా 'నిజం' కాదుగాని చాలా వరకు సరిపోతుంది. సరే. పెరడును ఒకసారి చుట్టి వద్దామా? అంటే 'ప్రదక్షిణం' చేద్దామా సంస్కృతంలో? మొహమాట పడకండి.

## ఇంటిచుట్టూ ఉన్న తెలుగు

అవును. ఎడమ నుంచి కుడికిగాని, కుడినుంచి ఎడమకుగాని తిరిగి ఇంటి ముంగిటి వైపు పోదాం. పోయామనే అనుకోండి. ఓ వైపు ఓ రేకుల 'షెడ్డు' ఉంది. షెడ్డు ఇంగ్లీషు మాట. అందులో ఆవులూ, బర్రెలూ ఉన్నాయి. ఆవు పండుగనాడు 'గోమాత' అయిపోతుంది సంస్కృతంలో. ఆ షెడ్డులో ఓ మూల ఉన్నదేమిటబ్బా? 'నాగలి' కాబోలు. మన మాటనే వాడాలంటే 'మడక' అనాలి. నాగలి సంస్కృతంలోని 'లాంగలం'లో నుంచి వచ్చిన మాటని కొందరు చెప్తారుగాని, అది సంస్కృతానికీ సొంతం కాదు. 'ఆర్యులు' గొడ్లకాపరిపని మాని వేసి (తమకన్నా ముందున్న వాళ్ల దగ్గరి నుంచి) 'వ్యవసాయం' నేర్చుకున్నప్పుడు ఈ మాటను కొలేరియన్ 'భాషాకుటుంబం' వారినుంచి ఎరువు తెచ్చుకొని కొంచెం మార్చి మనకు ఎరువిచ్చారు. అంతపాత గొడవ వద్దనుకుందాం 'ప్రస్తుతానికి'. కొత్త 'మనుషు'లనో 'వ్యక్తు'లనో చూసి కావలి 'కుక్క' మొరగటం మొదలెట్టింది. మనుషులూ వ్యక్తులూ సంస్కృతం వాళ్లయినా కుక్క మనది కాకపోవటం ఎబ్బెట్టుగానే ఉంది. అది సంస్కృతంలోని 'కుర్కుర' శబ్దం నుంచి వచ్చిందంటారు. మన మాటేమో 'నాయి'. కానీ దానికి వాడుక చాలా తగ్గిపోయింది.

ఇంటి ముందు 'పందిరి / పందిలి' ఉంది. అందుకు మనం విర్రవీగాలి. ఎందుకని 'ఆశ్చర్య' పడకండి. పందిలి నుంచి పుట్టిన 'పెండాల్' అనే మాట మన భాష నుంచి ఇంగ్లీషు వాళ్లు నేర్చుకున్నది! విస్తుపోకండి. కుక్క అనే మాట మనదికాకపోయినా, అది – అంటే ఆ పెంపుడు 'జంతువు' మనదే. జంతువుకు 'బదులు' గొడ్డంటే ఇప్పుడు నలుగురూ నవ్వుతారేమోనని 'భయం'. బదులు హిందీ మాటైతే భయం సంస్కృతపదం. మరో 'చిత్ర'మో, 'విశేష'మో ఉంది (ఈరెండూ సంస్కృతపదాలే). మన 'దేశం'లోనేకాక 'ప్రపంచం హోల్' మొత్తంలో కుక్కల ముద్దుపేర్లుగాని, వాటికి చెప్పే 'ఆజ్ఞ'లుగాని ఇంగ్లీషులోనే ఎక్కువగా ఉంటున్నాయని రష్యా వాళ్లుకూడా మొత్తుకుంటున్నారు. ప్రపంచం సంస్కృతమయితే 'హోల్' ఇంగ్లీషు. 'సిగ్గూశరం, సిగ్గూ బిడియం' లాగా 'హోల్' అన్నా మొత్తమన్నా ఒకటేగాని, గట్టిగా చెప్పటానికి ఈ రెండు మాటలనూ కలిపి కొట్టడం మన అలవాటు. సిగ్గు తెలుగు వాళ్లది. 'శరం' హిందీ వాళ్లది. బిడియం తెలుగువాళ్లదెంతో అంతే కన్నడిగులదికూడా. మాటల్లోపడి పందిరి సంగతే మరిచాం. పందిరికి 'తోరణా'లున్నాయి– ఇంటి 'దర్వాజా'కు లాగానే. తోరణం సంస్కృతం. దర్వాజా ఏమో ఉర్దూ. పందిర్లోని 'కుర్చీ' హిందీ మాట అయితే 'బెంచీ' ఇంగ్లీషుది.

పందిరి ముందు 'ప్రహరీ'యో 'కాంపౌండ్ వాలో' ఉంది. ప్రహరీ సంస్కృతం. రెండో 'సమాసం' (ఇదీ సంస్కృతపద మనుకోండి) ఇంగ్లీషు. ఇంటి 'సింహద్వారానికి' ఎదురుగా 'గేటు' ఉంది. కొందరు దాన్ని 'పాటక్' అంటారు, తెలంగాణాలో. సింహద్వారం సంస్కృతం. గేటు ఇంగ్లీషు. పాటక్ హిందీ. పందిరికీ గేటుకూ 'మధ్య' రెండు వైపులా బారులు తీర్చినట్లు మెట్టతామరమొక్కలూ వాటి వెనక 'క్రోటన్' మొక్కలూ 'అలంకారం'కోసం నాటారు. క్రోటన్ ఇంగ్లీషు మాటయితే అలంకారం సంస్కృతపదం. రేకుల షెడ్డో వైపుందన్నాంకదా. రెండోవైపు ఓ పెద్ద 'సిమెంటు' తొట్టీ, దాన్ని 'మోటారు'తో కలుపుతూ కొన్ని గొట్టాలూ, అలాగే మోటారును కలుపుతూ రెండు నిలువుల ఎత్తున ఒక నీళ్ల 'టాంకు/ టాకీ' ఉన్నాయి. మోటారు, సిమెంటు,

టాంకు అనేవి ఇంగ్లీషు మాటలు. టాకీ హిందీమాట. ae అనే ఇంగ్లీషు 'ధ్వని'ని రాసేందుకు తెలుగు 'లిపి'లో కుదరదు. టాంక్, టేంక్, ట్యాంకు అని ఏదో 'విధం'గా రాయాల్సిందే. మన 'కర్మ'. మరో దారిలేదు. మరి ధ్వని, కర్మ అనేవి రెండూ సంస్కృతపదాలే. ధ్వనిని చప్పుడనీ, కర్మను పని అనీ తెలుగు చేస్తే అర్థం సరిపోతుందంటారా? మీరే చెప్పాలి. వాటి పక్కనే నీళ్లు కారేదేదో వుంది. అదేమని 'యజమాని' నడిగితే 'కొళాయి' అన్నాడు. ఆయన కొడుకు ఇంగ్లీషు చదువు తున్నాడేమో 'పైప్' అన్నాడు. ఇల్లాలు మా 'ప్రాంతం'లో దాన్ని 'నల్లా' అంటామన్నది. కొళాయి తెలుగు మాట కాదు – ఎక్కడిదో ఏమో! పైప్ సరే. నల్లా ఉర్దూ మాట అని ఒప్పుకుందాం. 'కుళాయి' ఏమిటంటే మా ఊరి 'పండితుడు' దాని 'వ్యుత్పత్తి' 'సరి'గా తెలీదని, అంతటితో ఆగక 'సరి' ప్రాకృతంనుంచి వచ్చిందని మా 'గురువు'గా రన్నారు, ఇదంతా గొడవగా ఉందని గొణిగాడు. పండితుడనే మాటా, ఆయన వాడిన వ్యుత్పత్తి అనే మాటా సంస్కృతపదాలని 'సమఝై'తున్నదని మరెవరో అన్నారు. మరి సమఝ్ అనేది హిందీ నుంచి వచ్చిందట!

కొళాయిని గురించి 'ఆలోచిస్తూ' కొంత 'పరధ్యానం'లో ఉంటే ఇంటి'యజమాని' బుజంతట్టి 'అయ్యా' మా 'ఆవరణ'చూశారు గదా? అని హెచ్చరించాడు. అన్నీ మనమాటలు కావుగదా. ఆయన్నయినా తెలుగు పేరుతో పిలుద్దామనుకుంటే ఓ పెద్ద చిక్కొచ్చింది. ఏమనాలి? 'ఇంటాయన' అంటే మొగుడై కూర్చుంటాడు. 'ఇల్లుగలాయన' అని సరిపెట్టుకున్నాననుకోండి! బుజంకూడా అనకుండా 'సహ' అని సంస్కృతం ఎందుకు వాడానా?అని సంస్కృతంలో 'మథన' పడ్డాను. ఇంటిచుట్టూ తిరగటంలో చాలా 'టయిమ్' ఖర్చయినట్లుంది. టైం ఇంగ్లీషుమాట. ఖర్చు అనే హిందీమాట వాడదలచకపోతే, 'వృథా' అయిందని సంస్కృతపదం వాడ్తుంటామే గాని చాలాసేపు గడిచిందని తెలుగులో చెప్పే అలవాటు తగ్గిపోతున్నది. 'టైము'కు 'బదులు' పొద్దు వాడవచ్చుగాని 'రోజు'ను 'గంట'లుగా, 'నిమిషాలు'గా, 'సెకండ్లు'గా విభజించడం మానుకోలేమనుకుంటా. రోజు పర్షియన్ మాట. గంట సంస్కృతంలోని ఘంటా శబ్దంనుంచి వచ్చింది. నిమిషం, నిమేషం వంటివి రెప్పపాటు కాలాన్ని చెప్పే సంస్కృతపదాలు. సెకను/సెకండు ఇంగ్లీషు మాట. పెద్దవాళ్లు 'పంచాంగం' లో (ఇదీ సంస్కృతపదమే) వాడే 'గడియ, విఘడియ' వంటి మాటలు వాడేవాళ్లు. అవి 'ఘటికా, విఘటికా' అనే సంస్కృతపదాలనుంచి వచ్చినవే. పగలు మనదేగాని 'రాత్రి' సంస్కృతం – 'మధ్యాహ్నం' లాగే, 'సాయంకాలం' లాగే. 'సంజవేళ' అంటాంగాని సంజ సంస్కృతంలోని 'సంధ్యా' శబ్దంనుంచి వచ్చింది. 'వేళ' శుద్ధసంస్కృతం. అవి అలా ఉంచండి. ఈ పొద్దుటిపూట పెరట్లో ముంగిట్లో తిరిగిన తరువాత ఏంచేశాం?

## రోడ్డుమీది తెలుగు

ఆ యింటి 'ఆవరణ'లోంచి బయటికి వచ్చి చూస్తే – అదే ఎదురుగా నిలిచి చూస్తే – కుడివైపు 'గడ్డ' ఉంది, ఎడమవైపో 'భవన'ముంది. మనం నిలుచున్నది 'రోడ్డు'మీద. ఆవరణ, భవనం అనేవి సంస్కృతపదాలు. రోడ్డు సరేసరి ఇంగ్లీషు మాట. 'గడ్డ'ను తెలుగులో చెప్తే 'వాగు, వంక, ఏరు' అనాలి. అదే అర్థంలో వాడుతున్న ఈ మాట కొలేరియన్ / ముండేరియన్ భాషా కుటుంబానికి చెందిన ఏ సవర భాషనుంచో తెలుగులో 'ప్రవేశించింది' ఏనాడో. ప్రవేశం మళ్లీ సంస్కృతమే.

మనం చుట్టివచ్చిన ఇంటి ప్రహరీ గోడకు ఓ 'సైన్‌బోర్డు' వేలాడుతూ ఇంటి 'యజమాని' పేరునూ, ఇంటి 'నెంబరు'నూ, 'వీధి' పేరునూ, ఇంటికి పెట్టిన పేరునూ 'సూచిస్తున్నది'. వీటిలో మొదటి రెండూ సంస్కృతం నుంచి వచ్చాయి. 'బాట, పుంత, దారి, దోవ' వంటి తెలుగు మాటల వాడుక తగ్గి 'కంకర'తో 'తారు'తో వేసిన 'రోడ్డు' అనేది నిలిచిపోతున్నది. కంకర 'చిత్ర'మైన మాట. ఇది ఇంగ్లీషులోకే దూరింది. తారు తెలుగేగాని తెలంగాణాలో 'డాంబరు' అంటే 'త్వర'గా తెలుస్తుంది. చిత్రం, త్వర సంస్కృతపదాలు. డాంబరు హిందీ మాట. నెంబరనే ఇంగ్లీషుమాట అంతగా చదువుకోని వాళ్లని తికమక పెడ్తుంది. ఎన్నికల్లో నెగ్గిన 'ప్రజా ప్రతినిధు'లను వాళ్లు 'నంబ ర్లంటారు. అది 'మెంబర్' అనే మరో ఇంగ్లీషు మాటకు తోబుట్టువు. 'ప్రజ'లూ వారి 'ప్రతినిధులూ' సంస్కృత పదాలే పేరుగా పెట్టుకొన్నారన్నమాట!

ఇక ఆ రోడ్డు మీద 'టైరుబండ్లు, సైకిళ్లు, రిక్షాలు, మోటారుకార్లు, బస్సులు, ఆటోలు' తెగతిరుగుతున్నాయ్ – అటూ ఇటూ. టైరు ఇంగ్లీషే కాని బండి మనది. ఎంత గొప్ప తెలుగు మాటంటే అది ఇంగ్లీషులో చేరి 'బాండీ' అయిపోయింది. ('ae' 'ధ్వని' రాయలేక – వీలు గాక – 'బా' రాసినందుకు ఏమీ అనుకోకండి – 'ప్లీజ్'. (ప్లీజ్ ఇంగ్లీషు నుంచి వచ్చి 'దయ' చేసి అనే సంస్కృతపదం 'స్థానం'లో నిలదొక్కుకుంది). సైకిలనేది 'బైసికిల్' (అంటే రెండు 'చక్రాల' బండి అనే 'అర్థం' గల మాట)కు 'సంక్షిప్త' – అంటే కుదించిన – 'రూపం'). చక్రం, సంక్షిప్తం, రూపం – సంస్కృతపదాలు. రిక్షాలు మరీ గొప్పవి. అవి చచ్చిచెడి జపాన్ నుంచి ఇంగ్లీషులోకి వచ్చి అక్కడి నుంచి మనకు వచ్చిపడ్డాయి. జపనీస్ భాషలో ఆ బండి పూర్తి పేరు 'జిన్ రికిషా' (అంటె 'మనిషి'లాగే బండి). ఈ 'దూర ప్రయాణం'లో 'జిన్' ఎగిరిపోయింది. మనవాళ్లు కొందరు మరీ ముద్దుగా దాన్ని 'రిష్కా' అని కూడా పిలుస్తుంటారు. 'కథ'ల్లో 'పురాణా'ల్లో 'కుబేరుడు' మనిషినే 'వాహనం'గా పెట్టుకున్నాడంటారు గాని, మనలో 'దరిద్రులు' (అంటే పేదలు) కూడా నేటికి వీటి 'పుణ్య'మా అని ఈ 'భోగం అనుభవిస్తున్నారు' (ఈ మాటలన్నీ సంస్కృతంలోవే). 'పెట్రోలు'తో నడిచే 'ఆటోలు', 'ఆటోరిక్షా' అనే 'సంకరసమాసానికి' కుదించిన 'రూపం'. ఈ ముక్కాలి బండిని తెలంగాణాలో 'సైకిల్‌మోట'రని పిలిచేవాళ్లున్నారు. పెట్రోలు, ఆటోలు ఇంగ్లీషు నుంచీ, సంకరం, సమాసం, రూపం అనేవి సంస్కృతం నుంచీ వచ్చాయి. మరి మిగిలిన 'బస్సు' అనే మాట కూడా ఓ కుదించిన మాటే – 'ఆమ్నిబస్' అనే లాటిన్ నుంచి పుట్టిన ఇంగ్లీషు మాటకు!

ఆ 'రోడ్డు' కోపక్కన 'కిళ్లీషాపు / పాన్ దుకాణ'ముంది. కిళ్లీ ఎవరిమాటో ఎలా వచ్చిందో తెలీదు. కానీ షాపు నూటికి నూరుపాళ్లు ఇంగ్లీషు నుంచీ, పాన్, దుకాణం – అనేవి హిందీ నుంచీ వచ్చిన మాటలు. అందులో 'షోడా'లు, 'బీడా'లు దొరుకుతాయి. మొదటిది ఇంగ్లీషు మాటైతే రెండోది హిందీశబ్దం. చుట్టలూ, 'బీడీ'లు, 'సిగరెట్లూ' సరేసరి. చుట్ట మన సొంతం. బీడీ హిందీ మాట. సిగరెట్ తెల్లదొరలది. అయితే వీటిలోనూ 'జర్దా'లోనూ (ఇది హిందీ మాటేలెండి) 'ప్రధానం'గా ఉండేది పుగాకు/ పొగాకు. పొగ, ఆకు మనవేగాని ఆ 'వస్తువు' మనదికాదు. ప్రధానం, వస్తువు ఇంగ్లీషు మాటలు. హిందీవాళ్ల 'తంబాకు' ఇంగ్లీషులోని 'టొబాకో' నుంచి వచ్చి, తెలుగులో పొగాకనే మారుపేరు 'సంపాదించింది' గానీ దాని పుట్టుక దక్షిణ అమెరికాలో. ఆకొట్లోనే 'అగర్‌బత్తీ / సాంబ్రాణి కడ్డీలు'కూడా దొరుకుతాయి. సాంబ్రాణి ఎలా పుట్టిందో వచ్చిందో గాని

తక్కినవి మూడూ ఉర్దూ నుంచే వచ్చాయి. ఆ షాపునే కొందరు హిందీ మాటగా 'బడ్డీ' అంటారు. దానికి 'టాపు'గా 'డోరియా' రేకుంది. టాపు ఇంగ్లీషయితే డోరియా హిందీమాట. ఎండ తగల కుండా దానికి 'కాన్వాసు పరదా' తగిలించే ఏర్పాటున్నాయి.వీటిలో మొదటిది ఇంగ్లీషు మాటయితే రెండోది హిందీపదం. అక్కడ అమ్మే తమలపాకుల చుట్టలను చదువుకున్నవాళ్లు 'తాంబూల'మని సంస్కృత పదంగా వాడ్తారు. అందులో వేసే 'సున్నం' సంస్కృతంలోని 'చూర్ణం' నుంచి వచ్చిందనీ రాలేదనీ పోట్లాటలున్నాయి. మనమా గొడవలోకి దిగొద్దు. కానీ అక్కడ దొరికే 'కలర్ షోడా'లు పిల్లలకు మంచి 'ఆకర్షణ' (అది సంస్కృతపదం). కలరేమో ఇంగ్లీషుమాట. దాని 'అర్థం' రంగు అని మరి రంగు తెలుగేనా? కాదనీ, అవుననీ 'వాదించే' వాళ్లున్నారు. వాదం, వాదన సంస్కృత పదాలు.

రంగుకు 'బదులు వన్నె, చాయ, నీడలాంటి మాటల్లేకపోలేదు. బదులు హిందీ మాటని ఇంతకు ముందనుకున్నాం. వన్నె, చాయ సంస్కృతంలోని 'వర్ణం, ఛాయ'ల నుంచి 'క్రమం'గా వచ్చాయంటారు. అచ్చ తెలుగులో 'తెలుపు, నలుపు, పసుపు, ఎరుపు' అనే నాలిగింటినే చెప్పగలం. మన పసుపు రెండు 'రకాలు' – పసుప్పచ్చ, ఆకుపచ్చ అని. పాల తెలుపు, బొగ్గు నలుపు, పుల్లఎరుపు, చిలకపచ్చ అని పెంచి చెప్పాల్సిందేగాని మరో దారిలేదు అచ్చతెలుగులో. మనం వాడే 'నీలం, ఊదా, గులాబీ, నారింజ, సిమెంటు, చాక్‌లెట్, గోధుమ' లాంటి రంగులన్నీ ఇలా 'వర్ణించి' చెప్పే మాటలేగాని 'మూల/ ప్రాథమిక పదాలు' కావు. నీలం, నారింజ, గోధుమలు సంస్కృతం నుంచీ, గులాబీ ఉర్దూ నుంచీ, సిమెంటు, చాక్‌లెట్లు ఇంగ్లీషు నుంచీ వచ్చాయి. ఆ మాటలలా ఉంచండి. ఆ చుట్టుపక్కల ఏదో హడావిడి (ఇదేం మాటో?) జరుగుతున్నట్లుంది.

## ఇంటి ఎదుటి తెలుగు

ఆ పక్కన చాలా సందడిగా ఉంది. 'నిజమే'. అదో 'ఖాళీ జాగా / స్థలం.' దానిచుట్టూ 'కడీలు' పాతి ముళ్ల తీగలు చుట్టి ఇరుకుదారి 'మాత్రం' వదిలిపెట్టారు. ఆదారిగుండా 'లారీ'ల్లో 'ఇటికలు, సిమెంటు బస్తాలు, ఇనపరాడ్లూ, బంగాళా పెంకులూ రవాణా' అవుతున్నాయి. 'మేస్త్రీలూ కూలీలూ' అటూ ఇటూ 'హుషారు'గా తిరుగుతున్నారు. ఓ వైపునుంచి సున్నంతో 'నక్షాలు' గీస్తున్నారు. మరి కొందరు గునపాలూ 'పికాసులూ' పారలూ పట్టుకొని గాతాలు తవ్వుతున్నారు. కూలీల్లో చాలామంది 'లంబాడీ' లున్నట్లుంది. ఖాళీ అనేది 'నిఖా'ల్సయిన హిందీ మాట, 'జాగా' లాగా (నిఖాల్స్ కూడా అలాంటిదే ననుకోండి). స్థలం సంస్కృతం – మాత్రంలాగా. లారీ ఇంగ్లీషు మాటైతే కడీ హిందీమాట. ఇటిక సంస్కృతంలోని 'ఇష్టిక' నుంచి వచ్చిందంటారు. సిమెంటు, రాడ్ అనేవి ఇంగ్లీషు నుంచి వచ్చినవి. బస్తా, రవాణా, నక్షాలు హిందీ నుంచి వస్తే 'పికాసి' ఇంగ్లీషును బోలెడు మార్చి మనం తెచ్చుకున్నమాట. దాని 'అసలు'పేరు (అసలు ఉర్దూపదం) 'పిక్ ఏక్స్' అనేది. లంబాడీలు సిసలయిన రాజాస్థాన్ వాళ్లు. 'మేస్త్రీ' పోర్చుగీసు భాష నుంచీ, 'కూలీ' ఇంగ్లీషులో చేరిన హిందీ పదం నుంచీ వచ్చాయి. మేస్త్రీ మొదటి 'అవతారం' మేస్త్రో (తెలుగులో నేర్పరి – సంస్కృతంలో 'నిపుణుడు' అని అర్థం. ఆ మాట మొదట లాటిన్‌పద మంటారు). ఇంతకూ గోతులెందుకు తవ్వుతున్నారంటే చదువుకున్న పెద్ద 'మనిషి' కల్పించుకొని

'ఫౌండేషన్' వేయిస్తున్నామని-ఇంగ్లీషు మాటను వాడ్తే, వానా'కాలం' చదువు చదివిన మేస్త్రీయేమో పర్షియన్లో 'పునాది' తవ్వుతున్నామన్నాడు! ఏ ఒక్క తెలుగువాడూ 'పుట్ట' తీస్తున్నా మనలేదని 'దుః ఖం' (సంస్కృతంలో) వచ్చింది. ఏం చేస్తాం?

ఆ దుఃఖమాపుకోటానికి మొరపైకెత్తి 'రుమాలు'తోనో 'హ్యాంకీ/ హ్యాండ్ కర్చీఫ్'తోనో కళ్లద్దు కున్నా. మొదటిది హిందీమాట. తరవాతవి రెండూ ఇంగ్లీషు పదాలు. తలపైకెత్తినప్పుడు ఏపుగా ఎత్తుగా పెరిగిన చెట్ల మీద కావుకావుమంటూ 'కాకులు' కనిపించాయి. చుక్కలు చూసే ఎత్తున 'గద్దల గిరికీలు' కనిపించాయి. చివరికి కాకి కూడా సంస్కృతంలోని 'కాక' శబ్దం నుంచి, గద్ద అదే భాషలోని 'గృధ్ర' శబ్దం నుంచీ వచ్చాయని గుర్తు వచ్చి 'విచారించక' తప్పలేదు. ఈ విచారం 'గమ్మత్తయిన' మాట. గమ్మత్తు హిందీయో కాదో? ఏడ్చుకూ, తరిచి తెలుసుకోడానికీ 'సమానంగా' వాడదగిన 'విచారం' మరో 'విధం'గా చెప్పాలంటే 'వేదాంతం' లాంటిది. తెలుసుకొనే కొద్దీ వచ్చేదీ మిగిలేదీ ఒక్కటే – ఏడ్పేనని ఆ మాట తెలుపుతుంది! సమానం, విధం, వేదాంతం సంస్కృత పదాలని చెప్పనక్కరలేదనుకుంటా. తలదించుతుండగా రోడ్డు పక్కన 'టెలిఫోన్, కరెంటు తీగలూ స్తంభాలూ' కనిపించాయి. టెలిఫోన్ ఇంగ్లీషు మాటని అందరికీ తెలుసు. కరెంటు ఇంగ్లీషు పదమైనా దానికి ఆ భాషలో 'ప్రవాహ'మని అర్థం. ప్రవాహం సంస్కృతపదమైనందుకు చేయగలిగిందేమీలేదు). అది 'ఎలక్ట్రిక్ కరెంటు' లేదా 'విద్యుత్ప్రవాహం' అనేదానికి కుదింపు. మనం 'అర్థం'గా చెప్పుకుంటున్నది సంస్కృత పదాలతో. తీగ తెలుగేగాని స్తంభం సంస్కృతం. మన సొంతం ఇందులో 'ఏమిటి? ఎంత? అనే 'ప్రశ్న' వచ్చి (సంస్కృతంలో) తల తిరిగిపోయింది. కానీ ఆచెట్ల మీద పిచ్చుకలూ, ఉడతలూ కనిపించేసరికి (తెలుగు పిట్టలు కదా అవి) 'ప్రాణం' లేచివచ్చింది! (ప్రాణం సంస్కృతమయినా, ఊపిరి, ఉసురు – అనే తెలుగు మాటలు వాడ్తే నవ్వుతారుగదా మీరు?)

అక్కడే ఓ మూల ఓ కొయ్యముక్కను పాతినట్లుంది. అదేమంటే 'శంఖుస్థాపన' చేశామన్నారు. 'పుస్తకాల్లో'నేమో 'శంకు' వనాలని వుంది. అది గట్టిగా ఉండాలని మనవాళ్లు ఒత్తు పెట్టారేమో తెలీదు! అప్పుడప్పుడు అలా ఒత్తులుపెట్టి 'ఘట్టి'గా చెప్పటం అలవాటే – 'శాఖాహారం' తప్ప మరేమీ తినమన్నట్లు. 'శాఖ' అంటే కొమ్మ. 'శాకం' అంటే కూర. కొమ్మల్నెవరూ తినరుగాని చెప్పటంలో ఒత్తులేకపోతే ఆనదుమరి! ఆ తిండినచ్చని 'మాంసాహారులు' (శుద్ధసంస్కృతంలో) శాకాహారులు తినేది 'గడ్డి' అని వెక్కిరిస్తారు. 'తాము తినేది 'మిల్టరీ భోజన'మని, వీళ్లు తినేది 'బ్రాహ్మణ భోజన'మనీ 'ఘనం'గా చెప్పుకుంటారు. మిల్టరీ అనేది ఇంగ్లీషు మాటని ఎవరికి తెలీదు? తక్కినవన్నీ సంస్కృతపదాలని ఎవరెరగరు? కాకపోతే శాకాహారాన్ని 'సివిల్' భోజనమని (సివిల్ కూడా ఇంగ్లీషు మాటే) మన తమిళ మలయాళ 'సోదరు'ల్లాగా మనం అనమనుకోండి. శంకుస్థాపనచేసే చోటే కొందరు సంస్కృతంలో 'భూమి పూజ'కూడా చేస్తారు. 'మంత్రాలు' చదివిస్తారు. 'మేళతాళాలతో, బాజాభజంత్రీలతో వేడుక చేసుకుంటారు. చివరివి హిందీ మాటలు. అంతకు ముందువి సంస్కృతపదాలు. అన్నట్లు సోదరశబ్దం కూడా సంస్కృతం నుంచి వచ్చిందే.

సరే. ఏదో 'మంగళకార్యం శుభస్కరం'గా జరుగుతున్నందుకూ మరో తెలుగువాడో ఇంటి వాడవుతున్నందుకూ 'సంతోషిద్దాం' – ఇంటివాడంటే 'ఇల్లుగలాయన' అనే అర్థంలో. ఇంకాస్సే

వుండి ఆ 'పునాది తంతు' చూద్దామనిపించినా, ఆ యిల్లు కట్టించే 'వ్యక్తి తాలూకు బంధువులో స్నేహితులో' వచ్చి ఆయనతో 'కులాసాకబుర్లు' మొదలుపెట్టారు కాబట్టి అక్కడుండి మరి కొన్ని వివరాలు 'సేకరించటం భావ్యం' కాదనిపించింది. తంతు సంస్కృతపదం, బంధు శబ్దం లాగా స్నేహితశబ్దంలాగా. చుట్టాలని బంధువుల్ని పిలవ్వచ్చు. కానీ అలాపలికితే 'దర్జా'గా ఉండదు. తాలూకు, కులాసా, కబురు, దర్జా – ఇవన్నీ ఉర్దూ మాటలు. సేకరణ తెలుగు మాటే గాని దాన్ని సంస్కృతపదంలా తీర్చిదిద్దామన్నా మాట. భావ్యం సంస్కృతమే. అక్కడి నుంచి మనకు 'ఆతిథ్య'మిచ్చిన వారింటికిపోయి మరికొన్ని 'విశేషాలు' తెలుసుకుందాం. అలాగని ఒక్కసారి అటూ ఇటూ పైకీ కిందికీ చూసి కాలుకదుపుతుంటే 'టెలిగ్రాఫ్' తీగలమీద బారులు తీర్చి కూర్చున్న 'వానకోయిలలూ', అటుగా ఎగిరిపోతున్న 'రామచిలకా' కనిపించాయి. వానసంగతేమో కాని 'కోయిల' కూడా మనమాటకానందుకు కళ్లు చెమర్చాయి. అది సంస్కృతంలోని 'కోకిలా' శబ్దం నుంచి వచ్చింది. తెలుగు కోయిల అంటే గుడి – కోవెల అన్న మాట. చిలక తెలుగు పిట్టే. దాని 'జాతి'ని చెప్పే 'రామ' శబ్దం జాతి శబ్దలాగానే సంస్కృతపదం. కానీండి. 'పరిసరాలు' చూశాం కాబట్టి 'ఆతిథ్యం స్వీకరించి విశేషాలు' తెలుసుకుందాం – సంస్కృతంలో.

## ఇంటా బయటా తెలుగేనా?

అన్నట్లు 'ఆతిథ్యం' కోసం ఆ ఇంటికి పోయాం కదూ! 'పెద్దమనుషులు' వచ్చారని ఓ' స్వీటూ', ఓ 'హాటూ వడ్డించారు'. 'సేమ్యా, పకోడీ'లన్న మాట. తరవాత 'కాఫీ, టీ'లుగాని, ఎండా'కాలం' కాబట్టి ఓ 'కూల్ డ్రింక్' కానీ పుచ్చుకొంటారా? అన్నారు. ముందు 'స్నానం'చేసి 'దుస్తులు ధరించి' ఈ తిండి పని పూర్తికానిచ్చి అలా 'షికారు'గా ఊళ్లోకిపోయి వద్దామని చెప్పారు. 'భోజనం' వేళకు 'హాజ'రవుతామని ఇల్లాలికి చెప్పారనుకోండి. సేమ్యా, పకోడీ, హాజరులేమో హిందీ మాటలు. స్వీటూ, హాటూ, కూల్‌డ్రింకూ ఇంగ్లీషుమాటలు. తక్కినవి సంస్కృతపదాలు. ఈ పనులన్నీ నెరవేర్చి 'వీధి'లో అడుగు పెట్టేసరికి 'బాల్య స్నేహితు'డయిన ఓ 'వకీలు' కనిపించాడు. వకీలంటే ఉర్దూ. 'న్యాయవాది' అంటే వీధి, 'బాల్యస్నేహితుడు'లాగా సంస్కృతం. 'ప్లీడ'రంటే ఇంగ్లీషు. తెలుగులో ఏమనాలో తేలిచావలేదు. సరే ఆయన నోరు తెరిచీ తెరుస్తుండగానే తన ముందున్న, తాను గెలిచిన 'కేసు'ల సంగతీ, సరిగా డబ్బివ్వని (అదే 'ఫీజు' అన్నాడనుకోండి) 'పార్టీ'ల సంగతి 'ఏకరువు' పెట్టాడు, మనగోల వినిపించుకోకుండానే. ఏకరువు సంస్కృతం. తక్కినవి ఇంగ్లీషు మాటలు.

మాట మార్చి ఆయన 'కుటుంబం యోగక్షేమాలు' కనుక్కొనేసరికి తాతలు దిగివచ్చారు. ఎందుకయినా మంచిదని ఆయన్ను కూడా వెంటబెట్టుకొని ఒక 'టాక్సీ'లో (అది ఇంగ్లీషు) ఊరు చూడటానికి వెళ్ళాం. ఆ ఊళ్లోని 'దేవాలయాలు' చూశాం. 'పూజ'లు, 'అర్చనలు' ఎలా జరుగు తున్నవో, అక్కడి 'శిల్పం' ఎంత బాగుందో, 'మూలవిరాట్టు' పేరేమిటో తెలుసుకొని, 'తీర్థ ప్రసాదాలు' తీసుకున్నాం. అంతా సంస్కృతమయం. ఇక 'మసీదుల, మీనార్ల' సంగతి సరే సరి. అదంతా ఉర్దూ, పర్షియన్, అరబిక్ 'ప్రపంచం'. కాస్సేపు 'మెయిన్ రోడ్డు'కు రెండు వైపులా ఉన్న 'షాపులనూ దుకాణాలనూ' 'పరిశీలించాం'. ప్రపంచం, పరిశీలనలు సంస్కృతపదాలు. మెయిన్

రోడ్డూ షాపూ ఇంగ్లీషు మాటలు. దుకాణం హిందీ మాట. ఓ 'పార్కు'లో కాస్సేపు 'విహరిస్తూ', 'రకరకాల' చెట్లనూ పూలనూ చూస్తూ, 'మధ్యమధ్య' ఏదో చిరుతిండి నములుతూ, 'దూరం' నుంచి వినిపించే 'సంగీతానికి తన్మయులమై' పోతూ, పొద్దున తిన్న 'నాస్తా' 'జీర్ణ'మయ్యేదాకా తిరిగాం. 'డ్రైవరు వెయిటింగ్ చార్జీ వసూలు' చేస్తానంటే సరేనన్నాం. పార్కూ డ్రైవరూ వెయిటింగ్ ఛార్జీలు ఇంగ్లీషు పదాలు. రకం పార్శీమాట. నాస్తా ఉర్దూ పదం. తక్కినవి సంస్కృత పదాలు. ఈ కాకుల్లెక్క చాలించా –

తిరిగిన తిరుగుడూ తీసుకున్న 'విశ్రాంతీ' చాలని తిరుగు 'ముఖం' పట్టాం. 'యజమానురాలు' ఓ పెద్ద విందుకే ఏర్పాటు చేసింది. వడ్డించిన 'పదార్థాలూ', వాడిన 'వస్తువులూ' ఏభాషలోవో 'ఆలోచించటం'తోనే సగం కడుపునిండింది! కొన్ని తెలియక ఏడ్పు వచ్చినంత పనయితే ఇల్లాలు 'పాపం' 'కారం' ఎక్కువైందేమోనని 'గాభరా'పడ్డది. అదేంకాదని 'హామీ' ఇచ్చినా ఆమె నమ్మలేదు. 'అనుమానం'గానే చూసింది. ఎలాగో కడుపు 'మానం' సంగతి మరిచిపోయి 'మామూలు'కన్నా ఎక్కువే పట్టించి లేచేసరికి 'తాంబూలప్పళ్ళెం' సిద్ధంగా ఉంది. 'ఘనం'గా 'సత్కరించా'లనుకున్నారో ఏమో 'జాజికాయ, జాపత్రి, కస్తూరి మాత్రల సీసా, సెంటెడ్ సున్నం వగైరా'లన్నీ 'సమకూర్చారు'. పళ్ళెం తప్ప మనదేమీలేదే అని 'బాధ' పడుతూ కూడా, సున్నం మనదా కాదా అనే 'సందేహం'లో పడ్డా. అది సంస్కృతంలోని 'చూర్ణం' నుంచి వచ్చిందన్న 'గురువు'గారి మాట గుర్తుకు వచ్చి చివరికి మనకు సున్నం కూడా మిగలనందుకు 'దుఃఖం' వచ్చింది. సీసా ఉర్దూ నుంచి, సెంటెడ్ ఇంగ్లీషు నుంచి నేరుగా వస్తే తక్కినవి నేరుగానో దొడ్డిదారినో సంస్కృతంనుంచి వచ్చిపడ్డాయి. పొరపాటు, హామీ, గాభరాలు కూడా ఉర్దూమాటలని మరిచాను. 'క్షమించండి' (సంస్కృతంలో).

తరవాత తీరిగ్గా మాట్లాడుకుందాం నడుం వాల్చండన్నాడు 'యజమాని' – 'మంచం' చూపుతూ. మంచం సంస్కృతంనుంచి వచ్చిందనుకున్నా దోమతెర తెలుగని ఎంత ముచ్చటవేసిందో! 'కనీసం' దోమలయినా తెలుగయినందుకు 'సంతోష'పడి వెంటనే నాలుక కొరుక్కున్నా – కనీసం, సంతోషం రెండూ సంస్కృతపదాలని. మాగన్నుతో కోడికునుకు తీస్తుండగా ఇలా 'ఉచ్చరించిన', విన్న 'ప్రతి' మాటా తెలుగోకాదో తేల్చుకుందామనుకుంటే ఎంత 'శాతం' తెలుగు మనం మాట్లాడుతున్నాం? మనం ఏపాటి తెలుగువాళ్లం? అనే 'ఆత్మవిమర్శ'వల్ల 'లాభ'మేమి టనిపించింది. ఏమీ లేదు. 'సరదా'నో దురదనో తీర్చుకోవటంతప్ప – అనే నమ్మకం కలిగింది. దురద మనది, సరదా ఉర్దూ వాళ్లది. తక్కినవి సంస్కృతం నుంచి దిగుమతి అయినవే. ఏదో 'ఆలోచన' వచ్చి లేచి 'మిత్రు'డిచ్చిన 'నిఘంటువు'ను తిప్పిచూస్తే మనది చాలా కొంచెం, మనం సొంతంచేసుకున్నది చాలా ఎక్కువనిపించింది.

ఇలా లెక్కలు తీయటం మొదలుపెడితే తేలిన మాటలకన్నా తేలనివే చాలా వున్నాయని తెలిసింది. మనకా సరైన 'చరిత్ర' లేదు. 'భూగోళ విజ్ఞానం' లేదు. ఏ మాటను ఏ 'కాలం'లో ఎందువల్ల ఎలా ఎరువు తెచ్చుకున్నామో 'స్పష్టం'గా చెప్పలేం. చివరికి 'అమ్మ, అత్త, తాత' వంటి మాటలు కూడా మనవని కొందరూ కావని కొందరూ కాట్లాడుకుంటున్నారని గుర్తుకు వచ్చింది. ఇలాగే అన్ని 'భాషల విషయంలోనూ'! తెలుసుకొని 'సాధించే' దేమిటనే 'ప్రశ్న' ఉండనే ఉంది. వెంటనే తట్టిన 'సమాధాన'మేమంటే మనదే గొప్ప 'భాష' అనే 'దురహంకారం, దురభిమానం'

తొలగిపోతుందనేది. 'సంఘమరణం' పెళ్ళితో 'సమాన'మన్నట్లు అందరూ మనలాగే ఉన్నప్పుడు మనం గొప్పకాదు. తక్కువా కాదు. అయితే 'భాష' పేరిట 'ప్రజ'లను ఎందుకు రెచ్చగొడు తుంటారని 'ప్రశ్నించు'కున్నాను. తమ 'పబ్బం' గడుపుకోడానికి 'మాత్రమే'నని తోచింది. 'పబ్బం' అనేది సంస్కృతంలోని 'పర్వం' నుంచి వచ్చిందట. తక్కినవి నేరుగానే వచ్చాయట అనుకొని మానుకుందామనుకొని మళ్లీ ఈ గొడవ పెట్టుకోవటమెందుకని సరిపెట్టుకున్నాను. మొత్తంమీద తేలిందేమంటే ఇంటాబయటా మనం మాట్లాడే తెలుగు చాలా తక్కువని! అలాగని చాలా మందిమి గుర్తించమని! పోనిద్దురూ ఆ గొడవ.

## తక్కిన భాషలు ఘనమైనవా?

తెలుగులో తెలుగెంత? అనే ప్రశ్న వేసుకున్నట్లే ఇతర భాషల విషయంలో కూడా ప్రశ్నించి చూడండి. 'నాగరకభాష'లన్నింటి సంగతీ ఒకేవిధంగా వుంటుంది. అచ్చమైన ఇంగ్లీషంటే ఆంగ్లో సాగ్జన్. ఏ ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీష్ డిక్షనరీవంటి పెద్ద నిఘంటువునో తీసుకుని అచ్చం ఇంగ్లీషు మాట లేవో గుర్తిస్తూపోతే నూటికి అయిదారు దొరికితే గొప్ప. తక్కినవన్నీ ల్యాటిన్. గ్రీక్, ఫ్రెంచ్, జర్మన్, స్పానిష్‌వంటి యూరపియన్ భాషలనుంచిగాని, బ్రిటిష్ సామ్రాజ్యం విస్తరించిన 'సూర్యు దస్తమించని' విశాల ప్రపంచంలోని అనేకానేక భాషలనుండిగాని ఎరువుగా వచ్చి చేరినవే. మన భారతీయ భాషలనుంచి చేరినవే 'ఆత్మ, సన్యాసి, వేదాంత'వంటి సాంస్కృతిక పదాలూ, 'బాండీ, అనికట్, కూలీ, హర్తాళ్' వంటి ఇతర పదాలూ వేలసంఖ్యలో ఉన్నాయి. మనకు సంస్కృతం లాగానే వాళ్లకు ల్యాటిన్ గ్రీకుభాషలు సాంస్కృతికాధారం. సంస్కృతంలోకూడా 'నీరం, నిలయం, నారికేళం'వంటి ద్రవిడ భాషా పదాలెన్నో చేరాయి. 'ట, డ, ణ, ళ'లున్న సంస్కృత పదాలు ద్రవిడ భాషా ప్రభావానికి గురైనవని చెప్పవచ్చు. నేడు అనాగరక భాషలనిపించుకొంటున్న కొలేరియన్/ ముండారియన్ భాషల నుంచి (సవర, సంతాలీపంటి బాషలనుంచి) సంస్కృతం ఎరువు తెచ్చుకున్న మాటలెన్నో ఉన్నాయని భాషాశాస్త్రవేత్తలేగాక వేదం వేంకటరాయశాస్త్రిగారి వంటి సంప్రదాయ విద్వాంసులు కూడా గుర్తించారు. చివరకు 'గంగా, గోదావరి' వంటివి కూడా అచ్చం సంస్కృతపదాలు కాదనే వాదముంది.

అనాగరకభాషలు – అంటే సాహిత్యం, లిపిలేని భాషలు – కూడా పరిసర భాషలనుంచి పదాలు అరువుతెచ్చుకొంటాయి. భిన్న భాషల ప్రజలు వర్తక వ్యాపారాది శాంతియుత కారణాల వల్లగాని, దండయాత్రలూ ఆక్రమణలూవంటి హింసాత్మక కారణాలవల్లగాని పరస్పరం ఆదాన ప్రదానాలు చేసుకోవలసి వస్తుంది. యాత్రలు వలసలు ఇందుకు మరింత తోడ్పడతాయి. ఫ్యాషన్ మనకు కొత్తగా ఉండేది. వింతగా వుండి ఆకర్షిస్తుంది. కాబట్టి, వింతగా వుండే 'ఫ్యాషన్' ఎరువు తెచ్చుకోడానికి కారణమవుతుంది. కొత్త భావనలూ సరికొత్త ఆలోచనలూ రకరకాల ఆవిష్కర ణలూ, యంత్రాలూ మన అనుభవంలోకి వస్తూనే అవి పుట్టిన భాషలోని పదాలను మనకు నేర్పు తాయి. కొత్త భాషల్లోని ధ్వనులన్నీ మనం పలికేవీ కావు – పలకగలిగేవీ కావు. అలాంటి సందర్భాల్లో మనకు చిన్నప్పటినుంచీ అలవాటయిన ధ్వనుల్లోకి కొత్త ధ్వనులను మార్చివేస్తాం. 'దరఖాస్తు, బ్యాంకు, ఫ్యాషన్' మొదలైన పదాలను మూలభాషల్లో ఉచ్చరించే పద్ధతికి మనం పలికే

తీరుకూ భేదం వుంటుంది. కొన్ని సమయాల్లో ధ్వనుల్లో వుండే దగ్గరి పోలికలనూ, అర్థాల్లో వుండే సామీప్యాన్నీ ఆధారం చేసుకొని కొత్త పదబంధాలను కూడా సృష్టించుకుంటాం. హిందీలోని 'నమక్ హరామ్'ను తెలుగులో 'నమ్మకహరాం' అనీ, ఇంగ్లీషులోని 'విషస్ సర్కిల్' అనే దాన్ని 'విషవలయ'మనీ అనువదించాం గదా. ఇలాగే అన్ని భాషల్లోనూ.

అరువు తెచ్చుకున్న పదాల అర్థాలు మారుస్తుంటాం. 'అర్థి, రమణ' వంటి మాటలెన్నో తెలుగు కవిత్వంలో మూలంలోలేని అర్థాల్లో కనిపిస్తాయి. మూలభాషలోని శబ్దరూపాలు మార్చివేస్తుంటాం. 'ఆస్పత్రి' వంటి మాటలు అందుకు ఉదాహరణ. కొన్ని సందర్భాల్లో సగం సొంతభాష తక్కిన భాగం అన్యభాష కలిపి మాటలు సృష్టించుకుంటాం. 'అగ్నిమాపకదళం' అనేది ఆబాపతు సమాసం – సంస్కృతంలో 'మాపకం' అంటే 'కొలిచేది'. తెలుగులో 'మాపటం' అంటే 'పోగొట్టడం'. అదీ ఇదీ కలిపికొట్టి ఓ సంకర సమాసం కల్పించి 'నిప్పునార్పేవాళ్లు' అనే అర్థం ఇచ్చుకున్నాం. ఇలా అన్ని భాషల్లోనూ జరుగుతుంది. ఒక్కో భాషలోని పదాలు ఎలా పుట్టాయో, ఏం మార్పులు చెందాయో ఖచ్చితంగా చెప్పటం కష్టసాధ్యం. వ్యుత్పత్తి నిరూపణ సులభకార్యం కాదు. అదో ప్రత్యేక శాస్త్రం. ఆ శాస్త్రాన్ని కూడా పండితులు భేషజంతో గందరగోళంగా మార్చివేశారు. అందుకే ఫ్రెంచ్ మేధావి వాల్టైర్ "వ్యుత్పత్తి శాస్త్రంలో అచ్చులకు ప్రాముఖ్యం లేదు. హల్లులకు ప్రాధాన్యంలేదు" అని వెక్కిరించారు. ప్రజలు శాస్త్రం గొడవలేకుండా తమకు తోచిన తీరున అర్థాలు చెప్తారు. పదచరిత్ర కల్పిస్తారు. వ్యుత్పత్తి నిర్ణయిస్తారు. మాటవరసకు ఇంగ్లీషులోని "NEWS" అనే పదానికి 'కొత్తవి' (కొత్త విషయాలు) అనే అర్థం. కానీ దానిలో నాలుగు దిక్కులపేర్ల మొదటి అక్షరాలున్నాయని గమనించిన వ్యక్తి చిత్రమైన వ్యుత్పత్తి చెప్పగలడు. ఈరకం వివరణను జానపద వ్యుత్పత్తులు (folk etymologies) అంటారు.

భాషలు స్వభావరీత్యా రెండు రకాలు. ఇంగ్లీషు, తెలుగు వంటివి ఏ భాషనుంచయినా ఏ మాటనయినా అవసరాన్నిబట్టి ఎరువు తెచ్చుకొని సొంతం చేసుకుంటాయి. వీటిని ఎరువు తెచ్చుకొనే భాషలనవచ్చు (borrowing languages). అరవం, జర్మన్ భాషలవంటివి ఉన్నమాటలనే సాగదీసి మెలితిప్పి కొత్త సమాసాలు సృష్టించుకొంటాయి. శాస్త్రసాంకేతిక వికాసం పొందిన సంస్కృతం, ల్యాటిన్, గ్రీక్ వంటి పాతకాలపు భాషలూ ఇంగ్లీషు వంటి ఇప్పటి భాషలూ ఇతర భాషలకు పదజాలం సమర్పిస్తుంటాయి. అది ప్రదాతృభాషలు (lending languages). భాషల్లో పదాలు కాక వాక్య నిర్మాణపద్ధతుల్లోని భేదాలే వాటి ప్రత్యేకతను నిల్పుతాయి. మానవ జాతుల్లాగానే భాషలు కూడా చరిత్రగతిలో వికాసపతనాలు పొందుతుంటాయి. వాడుకలో ఉన్న ఏ భాషా వ్యక్తీకరించలేని భావాలుండవు. వ్యక్తీకరించే పద్ధతుల్లో మాత్రమే భేదాలుంటాయి. అందువల్ల స్వభాషకన్నా గొప్పది మరోటి లేదనుకునే దురహంకారం, దురభిమానం ఎంత అశాస్త్రీయాలో, పరాయిభాషలే గొప్పవనో తక్కువ రకానివనో భావించే దుర్భావనకూడా అంతే అసందర్భం. ఒక జాతి శక్తి సామర్థ్యాలూ బలహీనతలూ దాని భాషలో ప్రతిఫలిస్తాయి. ఏ భాషా వ్యవహర్తలకన్నా గొప్పదీ కాదు, తక్కువదీ కాదు. మన సంస్కృతికీ దాని స్థాయికీ మన భాషే ప్రతిబింబం. మానవులంతా ఒక్కటే అన్నట్లు భాషలన్నీ ఒకే స్థాయివని గ్రహించటం ఆరోగ్యకరం.

– 1988 (ఏప్రిల్–జూన్)

# 2. స్వాతంత్ర్య సమరం : కొత్తమాటల పుట్టుక

మొగలాయీల సామ్రాజ్యం విస్తరించినప్పుడు మన ఉపఖండంలోని అత్యధిక భాగం ఒకే గొడుగు కిందికి వచ్చింది. బ్రిటిష్ వారు క్రమంగా అంతకన్నా ఎక్కువగా వ్యాపించిన తరవాత భరతవర్షం / భరతఖండం అనే జంబూద్వీపభాగం భరత/ భారత దేశంగా, ఇండియాగా స్పష్టమైన సరిహద్దులతో ఏర్పడింది. అందాకా అంగవంగ కళింగ కాశ్మీరాదులైన ఛప్పన్నారు 'దేశాలతో' ప్రత్యేక రాజ్యాలుగా ఉండేది. ప్రాచీన సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో భూదేవి/ భూమాత ప్రస్తావన ఉన్నా, ఆమె విష్ణుమూర్తి భార్య, ఆయన అంశలో పుట్టిన నానా రాజులకూ భార్య - ఆయా కాలాల్లో. రాజులను భూభర్తలన్నారు. "జన్మభూమి జనని కాదు, సామాన్య సుమా ఆయమ; వసుమతియగు నామెకొరకు, వల్లభు లెందరు పెనగిరి?" అని అందుకే అబ్బూరి రామకృష్ణరావుగారు ప్రశ్నించారు.

ఆంగ్లేయులు తామాక్రమించిన బెంగాలును 1905లో విభజించారు, రెండు రాష్ట్రాలుగా. బెంగాలు ప్రజలను ఏకీకరించాలనే తపనతో బంకించంద్ర ఛటర్జీ 'ఆనంద మఠ'మనే నవల రాశాడు. మధుసూదన సరస్వతి నాయకత్వంలో సైన్యంలో చేరిన బెంగాలీలూ మరాఠీలూ తిరుగుబాటు చేసిన వైనాన్ని ఆయన కథావస్తువుగా ఎన్నుకొన్నాడు. ఆ నవలలోనే 'వందేమాతరమ్' అనే గేయముంది. బ్రిటిషువారి ద్వారా ఆనాటికే విద్యావంతులైన వారికి 'మదర్ ల్యాండ్, ఫాదర్ ల్యాండ్' అనే భావనలు పట్టుబడ్డాయి. ప్రజోద్యమ ఫలితంగా 1910 నాటికి బెంగాలు రాష్ట్రాలు ఒక్కటైనాయి. అప్పటి నుంచీ 'భరత / భారత మాత' ఈ ఉపఖండ ప్రజల దృష్టిలో తల్లిగా, దేవతగా పరిణమించింది. ఆ భావనే భిన్నభాషల, మతాల, జాతుల పౌరులను సంఘటితపరచి వెయ్యేళ్ల బానిసత్వంనుంచి బయటపడి స్వతంత్ర దేశంగా, రాజ్యంగా అవతరించాలనే మహోద్యమాలకు దారితీసింది. ఆ కోరిక నెరవేరి నేటికి అర్ధశతాబ్దం గడిచింది. దేశ విభజన జరిగింది. స్వాతంత్ర్యం సిద్ధించింది.

స్వాతంత్ర్య సమరం దీర్ఘకాలం నడిచింది. భిన్న దశల్లో జరిగింది. 1806లోనే నేటి తమిళ నాడులోని వెల్లూరులో సైనికులు తిరుగుబాటు చేశారు. అలాంటివి అనేకం జరిగినా పెద్ద సంచలనం రాలేదు. 1857లో సిపాయీలూ తిరగబడ్డారు. చాలా కాలం ఆ సంఘటనను 'సిపాయీల కలహం / పితూరీ' అనే పిలిచారు మన వాళ్లుకూడా. అదే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమని పేరు తెచ్చుకొంది. మీరట్ నుంచి సైనికులు 'ఢిల్లీ చలో' నినాదంతో యుద్ధ భేరులు మోగించారు. ఆ హిందీ వాక్యం తెలుగువారి వాడుకలోనూ నిలిచింది. అప్పటినుంచీ స్వాతంత్ర్య సమరంలోని భిన్నదశల్లో తెలుగు భాషలో అనేక పదాలు చేరాయి. వాటిలో కొన్ని అన్యదేశాలు. మరికొన్ని పాతమాటలకు కొత్త అర్థాన్నిచ్చినవి. కొన్ని విడిమాటలు. కొన్ని సమాసాలు. వాటన్నిటినీ చర్చించటం సాధ్యం కాదుగాని, ముఖ్యమైనవాటిని ప్రస్తావిద్దాం.

1905-19 సంవత్సరాల మధ్యకాలాన్ని స్వదేశీ ఉద్యమ దశగా పరిగణించవచ్చు. ప్రజా సమూహాలు 'వందేమాతరం- మనదే రాజ్య'మని నినదించాయి, 1947 దాకా (ఇప్పుడు

'మందే రాజ్యం'గా మారిందనుకోండి). 1886లో దాదాభాయ్ నౌరోజీ 'జాతీయ కాంగ్రెస్' వేదిక నుంచి 'స్వరాజ్యం' కావాలని కోరారు. కాంగ్రెస్ అనే ఇంగ్లీషు మాట, ప్రత్యేకార్థంలో జాతీయమనే సంస్కృత పదం, స్వరాజ్యమనే సంస్కృత సమాసం వందేమాతరం కన్నా ముందు దశలో వచ్చినవి. వందేమాతర మనే పేరుమోసిన ఉద్యమకాలంలో 'మాతృదేశం, భరతమాత, దొరతనం, వయోజన విద్య' వంటి మాటలు పుట్టాయి. 'పితూరీ, పైసా ఫండ్ (బాల గంగాధర తిలక్ సృష్టి), గుండ్రబల్ల సమావేశం (రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు అనువాదం) వంటి మాటలు వ్యాప్తిలోకి వచ్చాయి. 1906 నాటి కలకత్తా కాంగ్రెసులో "స్వరాజ్యం జన్మహక్కు'ని తీర్మానించి 'జాతీయ విద్య, స్వదేశీ పరిశ్రమల స్థాపన, విదేశీ వస్తు బహిష్కారం' ప్రధానావసరా లన్నాడు బాల గంగాధర తిలక్ భారతీయులకు. మదనమోహన్ మాలవ్యా కాంగ్రెసులోని 'మితవాదులకు', తిలక్ 'అతివాదులకు' నాయకులైనారు.

మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ 1915లో భారతదేశంలో అడుగుపెట్టినా (దక్షిణాఫ్రికా నుంచి), జాతీయ కాంగ్రెసుకు ఆయన సారథ్యం 1919 నుంచే లభించింది. పెత్తయెత్తున 1917 నుంచీ ఆయన నాయకత్వంలో 'సత్యాగ్రహ' విధానం ఉద్యమ కార్యక్రమాల్లో ఒకటయింది. 'నిజమైన పట్టుదల'తో పోరాడాలని ఆయనంటే మనవాళ్లు 'కోపంగా' (ఆగ్రహంతో) అని అర్థం చేసుకున్నారు. ఆయన పుణ్యమా అని 'హరిజనోద్యమం' మొదలయింది. గుజరాతీ కవి నర్సీ మెహతా వాడుక నుంచి హరిజన శబ్దాన్ని స్వీకరించిన గాంధీజీ ఆ పేరుతో పత్రికను ఆరంభించాడు. అప్పటికి మూడు దశాబ్దాలు ముందుగానే తెలుగుకవి మంగిపూడి వేంకట రత్నంగారు తమ 'నిరుద్ధ భారత' కావ్యంలో ఆ సమస్యను చర్చించినా, గాంధీజీ రాకతోనే అది ఉద్యమరూపం ధరించింది. 'సత్యాగ్రహం, ప్రార్థన సమావేశం, పాదయాత్ర, సహాయ నిరాకరణం (అసహాయోద్యమం), గాంధీ టోపీ, మద్యపాన నిషేధం, అస్పృశ్యతా నివారణ, చరఖా, ఖద్దరు, రాష్ట్రభాష, సంగం, గ్రామ స్వరాజ్యం, శాసనోల్లంఘన, సహకారోత్పత్తి సంఘాలు, జాతీయ పాఠశాలలూ, సపంక్తి భోజనం (పలనాటి బ్రహ్మన్న కాలంలో అది 'చాపకూడు'), బేసిక్ విద్య, భూదానం, గ్రామదానం, వనవాసం, వృత్తివిద్య, గ్రంథాలయోద్యమం, గ్రామ పారిశుధ్యం, సత్యాగ్రహాశ్రమం, (ఆమరణ) నిరాహారదీక్ష, సేవాదళం, జిందాబాద్ (వర్ధిల్లాలి), ముర్దాబాద్ (నశించాలి), పతాకావిష్కరణ, పతాక వందనం, సంస్థాన కాంగ్రెసు, మత సామరస్యం, నిర్మాణ కార్యక్రమం, భాషా ప్రయుక్త రాష్ట్రం, అధిష్ఠానవర్గం, పావలా సభ్యత్వం, వారోత్సవాలు, 'వ్యక్తి/ సామూహిక 'సత్యాగ్రహం' వంటి పదాలు కొల్లలుగా పుట్టాయి. ప్రభాత్‌ఫేరీ (కొందరు - భేరీ అనేవారు; దీనికి నగర సంకీర్తన అనేది అనువాదం), తాలింఖానా (తాలీం - అనేది సరైన రూపం; ఇటువంటి ఒకానొక దాన్నుంచి కామినేని ఈశ్వరరావు, దండమూడి మహీధర్ వంటి వారుద్భవించి బరువులెత్తటంలో దేశానికి పేరు తెచ్చారు), రాష్ట్రపతి (కాంగ్రెసు పార్టీ అధ్యక్షుడు; స్వాతంత్ర్యం వచ్చిన తరవాత దేశాధిపతి) వంటి 'హిందూస్థానీ' పదాలు తెలుగులో చేరాయి.

స్వాతంత్ర్య సమరం జరుగుతుండగా రెండు ప్రపంచ యుద్ధాలు వచ్చి ముగిశాయి. వాటి మధ్యకాలంలో ఇంగ్లీషు ద్వారా అనేక రాజకీయ సిద్ధాంతాలు, వాటిని ఆచరణలో పెట్టదలచిన సంఘాలు, వాటి నిర్మాణ పద్ధతులు మొదలైన వాటికి సంబంధించిన పదాలు వాడుకలోకి

వచ్చాయి. 1930 నుంచి 1947 వరకూ ఉన్న కాలాన్ని జాతీయ విప్లవ దశ అనిగాని, ప్రజా చైతన్య దశ అనిగాని చెప్పవచ్చు. ఈకాలంలో 'పంచమాంగదళం, మానసపుత్రులు, జమీందారీ వ్యతిరేకోద్యమం, స్వయం సమృద్ధి' వంటి వేల పదాలు వ్యాప్తిలోకి వచ్చాయి. 'క్విట్ ఇండియా' అనే అనుబంధోద్యమం పుట్టింది. 'గో బ్యాక్ సైమన్' అని ప్రజలు వీధులకెక్కారు. 1941లోనే సోహన్‌సింగ్ ఆజాద్ హింద్ ఫౌజ్‌ను నిర్మించారు. నేతాజీ సుభాస్ చంద్ర బోసు నాయకత్వంలో 30 వేల మంది సుశిక్షితులైన భారతీయ సైనికులు ప్రత్యక్ష యుద్ధం చేశారు, బ్రిటిష్ వారితో. 'జైహింద్' అనే నినాదం దిక్కులు పిక్కటిల్లేట్లు మోగింది. 1946లో బొంబాయి (నేటి ముంబాయ్) కరాచీల్లో నౌకాదళం తిరుగుబాటు చేసింది. దూరప్రయాణాలకు అనువైన పెద్ద విమానాలు లేనికాలంలో, సముద్ర మార్గాలు కూడా మూసుకపోకముందే 1947లో 'బ్రిటిష్‌వారు మనదేశంనుంచి నిష్క్రమించారు - అప్పటికే ప్రపంచయుద్ధంలో చావుతప్పి కన్నులొట్టపోయి దీనస్థితిలో ఉన్నారు కాబట్టి.

సరిగ్గా ఏ దశలో ఏ మాటనెవరు ముందుగా ప్రయోగించారో పరిశోధకులకు వదిలి వేయక తప్పదు. సంగ్రామ కాలంలో పుట్టిన మాటలనేకం నేటికీ వాడుకలో ఉన్నాయి. రిలే నిరాహారదీక్షలుగా, బందులుగా, ధారణలుగా, రాస్తా రోకోలుగా ప్రవర్ధమానమవుతున్నాయి. మనల్ని మనమే వేధించుకొనే మార్గాలుగా విస్తరిస్తున్నాయి. అప్పటి 'జాతీయతాభావం' దేశం మొత్తాన్ని ఒక్కతాటిపై నడిపింది. నేటి జాతీయత (హిందీలో జాతి శబ్దానికి కులమని అర్థం) దేశ విచ్ఛిన్నతకు దారితీస్తున్నది. తిలక్ వీరారాధన పొందాడు. గాంధీజీ దైవమై దేవతారాధన పొందాడు. వారు నడిపిన మహోద్యమాలు భాషలో పదసంపదను పెంచాయి. వివరాలను చర్చించటం సాధ్యంకా దిక్కడ.

- స్వాతంత్ర్య రజతోత్సవ ప్రత్యేక సంచిక, ఈనాడు, 1997.

# 3. ప్రాచీన సాహిత్యభాష

బ్రిటిష్ ప్రభుత్వం హయాంలో ముద్రణ సౌకర్యాలూ దేశభాషల్లో విద్యాబోధనా మొదలు కావటానికి ముందున్న కాలాన్ని ఈ ప్రసంగం నిమిత్తం ప్రాచీనకాలంగా పరిగణించి, అందాకా వెలువడ్డ తెలుగు సాహిత్యాన్ని ప్రాచీనసాహిత్యమని భావిస్తున్నాను. క్రీ.శ. 1520 ప్రాంతం నాటి రాయవాచకం, దరిమిలా వచ్చిన వచన రచనలూ టీకాటిప్పణులూ పాఠ్య గ్రంథాలూ మొదలైన వాటిలోని భాష ప్రాచీన సాహిత్య భాషా లక్షణాలు మారుతున్న సంధియుగం నాటిది. తెలుగులో నన్నయభారతం వెలుగుచూసిన తరువాత పురాణప్రబంధా లయిన చంపూ రచనల్లోని భాషావిశేషానికి ఆధిపత్యం వచ్చింది. దాన్ని గ్రాంథిక భాష అనీ, కావ్య భాష అనీ పేరుపెట్టి వ్యవహరించటం 1910లో వ్యావహారిక భాషోద్యమం తలయెత్తినప్పటినుంచీ వాడుకలోకి వచ్చింది. అంతకుముందు కాలంలో భాషాశబ్దానికి ముందు విశేషణపదాలు చేర్చింది వ్యాకరణ గ్రంథాల్లో పదవర్గీకరణ సందర్భంలోనే. తత్సమభాష, తద్భవభాష, దేశ్యభాష వంటి ప్రసంగాలు భాషాశబ్దరహితంగానే ఎక్కువ వ్యాప్తిలో ఉండేవి – ఆకాలంలోనూ. ప్రస్తుతం ప్రాచీన సాహిత్యభాష అని వ్యవహరిస్తున్నది ప్రాచీనసాహిత్యంలోని– అంటే 19వ శతాబ్ది మధ్య కాలానికి ముందున్న చంపూరచనల్లోని - భాషావిశేషాన్ని. ఆతరవాతి కాలంలోది ఆధునిక సాహిత్యభాష అనటం మంచిది.

శబ్దార్థ సహితమైన సాహిత్యం నిజానికి ఏకరూపంలో ఏనాడూ లేదు. భాష ఏర్పడ్డప్పటినుంచీ మౌఖికసాహిత్యం ఉండేఉంటుంది. ఆర్యులు వేదాలను పరిరక్షించుకొన్నట్లు తెలుగువాళ్ళు తమ మౌఖికసాహిత్యాన్ని తరతరాలుగా భట్టీయమార్గంలో శ్రుతిగా భావించి కాపాడుకోలేదు. అందువల్ల ఆ సాహితీవిశేషం కాలానుగుణ పరిణామక్రమంలో మనకు చాలా కొద్దిగానే దొరికింది. ఇప్పుడు జానపద సాహిత్యమనీ జానపద వాఙ్మయమనీ పిలుస్తున్న ఆసాహిత్యానికి నిన్నమొన్నటిదాకా పండిత సమాజంలో ఎటువంటి గుర్తింపూ లేదు. ఫలితంలో అత్యంత ప్రాచీనమైన మౌఖిక సాహిత్యం గురించి మనకు తెలిసింది ఇంచుమించు శూన్యం. పాశ్చాత్య సంస్కృతి వ్యామోహం అనుక్షణ ప్రవర్ధమానంగా ఉన్న సమకాలంలోనే జానపద సాహిత్య సేకరణపరిశీలనలు మొదలు కావటంవల్ల వాస్తవంలో వచ్చిన సాహిత్యంలోని కోట్యంశమైనా మనకిప్పుడు దొరుకుతుందన్న నమ్మకం లేదు. కాబట్టి ప్రాచీన మౌఖిక సాహిత్య భాషను గురించి ఏమీ చెప్పలేను.

బ్రిటిష్‌వారి హయాంలోనే ప్రాచీన కావ్యాదులను సేకరించి పరిష్కరించి ముద్రించటం మొదలయింది. ఆకాలంలోనే స్థానిక చరిత్రలనూ ప్రాచీన శాసనాలనూ ఎంతో కొంతగా పునస్సంపాదించుకోగలిగాం. మెకంజీ కైఫీయతుల్లో కొండవీటి దండకవిలె వంటి రచనల్లోని భాషకు సవిమర్శక పరిశీలన జరగలేదిప్పటికీ. కానీ శిలాతామ్రశాసనాల భాషను పరిశీలించటం, శాసన పదకోశం నిర్మించటం జరిగింది. అయితే ముద్రిత శాసనాల విషయంలోనే ఇది సాధ్యమయింది. పదకొండో శతాబ్దిదాకా వెలువడ్డ తెలుగుశాసనాల్లో 187 మాత్రమే 1963 నాటికి ప్రచురితమైనాయి. ఆ తరవాత పద్నాలుగో శతాబ్దందాకా ఉన్నవి దాదాపు 2000 తెలుగు శాసనాలు వెలుగుచూశాయి. 15 – 16 శతాబ్దాల నాటివి 300, 17 – 19 శతాబ్దుల

మధ్యకాలానివి మరో 200 ప్రచురితమైనాయి. వేల సంఖ్యలో ఉన్న చిన్నా పెద్దా శాసనాలు ఈనాటికీ అముద్రితంగానే ఉన్నాయి. వాటికోసం గాలించటం కూడా దాదాపు మానివేశారనే చెప్పవచ్చు. గత దశాబ్దం పైకాలంగా పురాతత్వశాఖవారు అనుసాంవత్సరిక నివేదికలను (Annual Reports) ప్రచురించటం మానివేసినందున వాస్తవ పరిస్థితి తెలియదు. మదరాసు నుంచి రెండో ప్రపంచయుద్ధకాలంలో ఉదకమండలానికి వలసపోయిన ప్రభుత్వ ఎపిగ్రఫీ డిపార్టుమెంటు అక్కడి నుంచి మైసూరుకు చేరింది. ఆ శాఖను ఆరంభించినప్పటినుంచీ నేటిదాకా తెలుగువాడెవడూ దానికి అధిపతి కాలేదు. ఆశాఖవారి ఆధీనంలో ఉన్న అముద్రితశాసనాల విషయం పట్టించుకొన్న తెలుగు నేతలూ లేరు. 14 అముద్రిత శాసనాలనుంచి కొన్ని మాటలను మాత్రమే ప్రచురించటానికి అనుమతించి, అందుకు మూల్యం చెల్లించమని నిర్బంధించారు. ఫలితంలో దాదాపు 2700 తెలుగు శాసనాల్లో లభించిన భాష విషయం మాత్రమే మనకు తెలుసు. ఆ శాసనభాషా పరిశీలన ఏకపక్షంగా జరిగింది. సమకాలికమైన తదితర సాహిత్య భాషలతో దాన్ని పోల్చి తారతమ్యాలను కనిపెట్టడం కన్నీటి తుడుపుగానే జరిగింది. ఇద్దరు ముగ్గురు మాత్రమే స్థూలచర్చ చేశారు. సూక్ష్మపరిశీలన జరగనే లేదు. భాషా విషయక పరిశోధనలు చాలా వరకు మూలపడ్డందువల్ల సమీప భవిష్యత్తులో ఈ పాపకృత్యాన్ని తలపెట్టే పరిశోధకులు దొరకటం కూడా దుర్లభం కావచ్చు. ఉన్నంతలో, తెలిసినంతలో శాసన భాషను గురించీ శాసన సాహిత్యాన్ని గురించీ నాలుగు మాటలు చెప్పి తరువాత కావ్యశాస్త్ర సాహిత్య భాష విషయం ప్రస్తావిస్తాను. చరిత్ర రచనకు పనికిరాని ముడిసరుకుగా భావించి చరిత్ర పరిశోధకు లీవిషయం పట్టించుకోవటంలేదు. భాషను గురించి తెలియని వాళ్ళు లేనేలేరు కాబట్టి, తెలుసుకోవలసిన అవసరం ఎవరికీ లేదని సరిపెట్టుకుందాం.

శాసన సాహిత్యం గురించి చర్చించే ముందు దాని స్థూల స్వరూపాన్ని ప్రస్తావించాలి. శాసనాల్లోని అత్యధిక భాగం దానశాసనాలు. వాటిలోనూ ప్రధానాంశం దాత ప్రస్తుతిగా ఉన్న సందర్భాల్లో శాసనభాష సంస్కృతం. ప్రతిగ్రహీతల పేర్లూ ఊర్లూ సరిహద్దుల వివరాలూ తెలుగులో కూడా ఉండటం పరిపాటి. కేవలం తెలుగువాక్యాలతో నడిచిన వాటి సంఖ్య అల్పాల్పం. అవి మళ్లీ రెండు రకాలు– పద్యశాసనాలనీ గద్య శాసనాలనీ. పద్యశాసనాల్లోనూ వచన భాగమున్నవాటి సంఖ్య ఎక్కువ. అదే నన్నయ నాటి నుంచీ తెలుగులో వచ్చిన చంపూ సాహిత్యానికి పూర్వరూపం. తంగిరాల నారాయణశాస్త్రిగారి వంటి విద్వాంసులు కొన్ని మాటలను మార్చీ మరికొన్నిటిని చేర్చీ పద్యశాసనాలుగా పరిగణించారు. అంత సాహసం చేయలేని నాలెక్కప్రకారం నన్నయ భారతానికి ముందున్న పద్యశాసనాలు అయిదు మాత్రం. అయిదోది నా పరిశోధనకాలానికి దొరకలేదు. వాటిలో పండరంగు అద్దంకి శాసనం (భారతి 5.473 – 484) క్రీ.శ. 848 నాటిది. అందులో తరువోజ ఉంది. అతడి కందుకూరు శాసనం (భారతి 5.792) క్రీ.శ. 848–49 నాటిది. అది సీసపద్య శాసనమని కొమర్రాజు వేంకట లక్ష్మణ రావుగారు తేల్చారు. క్రీ.శ. 897 నాటి పండరంగు ధర్మవరం శాసనంలో (భారతి 5.618) సీసపద్యముంది; ఎత్తుగీతి ఆటవెలది. క్రీ.శ. 898– 934 మధ్యకాలం నాటిది యుద్ధమల్లుడి బెజవాడ శాసనం (శాసన పద్యమంజరి 1.2–3). ఇందులో అక్కరలున్నాయి. జినవల్లభుడి

కుర్క్యాల శిలాశాసనం (తెలుగు- సంస్కృతి సంపుటి, విజ్ఞాన సర్వస్వం)లో కందపద్యాలున్నాయి. నన్నయ భారతానికి రమారమి మూడు శతాబ్దాల కిందటే తెలుగులో పద్యసాహిత్య ముందనటానికి ఇవి ఆధారాలు. వీటిలోని భాష భారతభాషకన్నా పెద్దగా విభేదించదు.

నాలుగైదు వచన/ గద్య శాసనాల్లో ఆలంకారిక వచన రచన కనిపిస్తున్నది. క్రీ.శ. 623 - 63 మధ్యకాలంలోని విప్పర్ల శిలాశాసనంలోని (ఎపిగ్రాఫియా ఇండికా 6.585) మొదటి మూడు నాలుగు పంక్తుల్లో సీసపద్యభాగ మున్నట్లనిపిస్తుంది. మధ్య (5-8 పంక్తుల్లో) దీర్ఘ సంస్కృతసమాసా లున్నాయి. క్రీ.శ. 641 నాటి మరో విప్పర్ల శాసనంలో (దక్షిణ హిందూ దేశ శాసనాలు 6.584) 'నాకు బణి సేసిన' వంటి ప్రయోగాలతో సరళాంధ్రవచన రచన కనిపిస్తుంది. క్రీ.శ. 680 నాటి తురుమెళ్ళ శాసనంలో (ఎపిగ్రాఫియా ఇండికా 29.160-164) 'మణిప్రవాళశైలి' తొలిసారిగా కానవస్తుంది. క్రీ.శ. 892-922 మధ్యకాలంలోని కొరవి శాసనం (తెలంగాణా శాసనాలు 1.163-65) పురాణశైలిని, సంవాదాన్ని, సమాసరచనను, పొంటె వంటి ప్రత్యయాలను, 'ఆతని కొల్పించిన, ఆతని చేయంబడిన ధమ్మ్మువులు' వంటి పద ప్రయోగాలను, శిక్షాస్మృతిని ప్రదర్శిస్తుంది. మరో కొరవిశాసనం నా పరిశోధన కాలం తరవాత రెండు దశాబ్దాలకు దొరికింది. అది కూడా ఇదే ధోరణిలో నడిచింది. ఆలంకారిక వచనరచన పద్యరచనకన్నా మూడు శతాబ్దాల ముందునుంచీ లభిస్తున్నది.

దానశాసనాల్లోని భాష సీదా సాదాగా సులభంగా ఆనాటి - లేదా సమకాలిక- వ్యవహార భాషకు సన్నిహితంగా ఉండేదని చెప్పవచ్చు. రాజుల, సేనాపతుల బిరుదావళిని, విజయ యాత్రలను వర్ణించే సందర్భంలో ఆలంకారిక వచనమో పద్యమో మరింత ప్రభావశీలంగా ఉంటుందనే భావన ఉండవచ్చు. క్రీ.శ. 9వ శతాబ్దినుంచి దేశీయచ్ఛందస్సులు పద్యశాసనాల్లో కనిపిస్తున్నా పైన పేర్కొన్న గద్య శాసనాల్లోని కొంత భాగం వృత్తగంధిగానయినా భాసిస్తున్నదని చెప్పాలి. ధర్మవరం శాసనాలలో కొద్దిగా, కొరవి శాసనంలో విస్తృతంగా కనిపిస్తున్న సంవాద ధోరణి, సార్వనామిక క్రియారూప ప్రయోగం భారత రచనకు పూర్వరూపాలని చెప్పవచ్చు. నన్నయభట్టు నందమపూండి శాసనాన్ని పరిశీలించిన గిడుగు వేంకట రామమూర్తిగారు క్రీ.శ. 11వ శతాబ్ది నాటికే కావ్యభాష వ్యవహారభాషకు దూరమైపోయిందని రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో ప్రసంగించారు. అప్పటికి పైన పేర్కొన్న పద్యశాసనాలన్నీగాని, రేనాటి చోళుల శాసనాలుగాని బయల్పడలేదు. ప్రాఙ్నన్నయ యుగాంధ్రశాసనభాషను పరిశీలించినప్పుడు క్రీ.శ. 7వ శతాబ్ది నాటికే సాహిత్యభాష వ్యవహారదూరమయిందనీ, నన్నయ భారత రచనా కాలానికి అది గతానుగతిక ధోరణికి వచ్చిందనీ తెలుస్తుంది.

ఈ ద్వైవిధ్యానికి కారణం ఊహించటం సులభం. రేనాటి చోళుల వంటి సామంతరాజులు, పండురంగు వంటి సేనాపతులు, కదాచిత్తుగా యుద్ధమల్లుడి వంటి రాజులూ తెలుగులో తమ నిర్ణయాలను, సాహసకృత్యాలను, భక్తి వితరణభావాలను చెప్పుకున్నా, తెలుగు అప్పటి రాజభాషకాదు, అధికారభాష కాదు. తొలితరంలోని కొందరు శాసన పరిశోధకులు రాజరాజ నరేంద్రుడు తెలుగును అధికార భాషగా చేశాడని భ్రమించినట్లే, సాహితీ విమర్శకులు కొందరు "తెనుంగు నిలిపి రంధ్రవిషయంబున, జన సత్యాశ్రయుని దొట్టి చాళుక్య నృపుల్" అనే నన్నెచోడ

ప్రసంగాన్ని పూర్తిగా విశ్వసించి వంతపాటపాడేరు. కాలక్రమాన రెడ్డిరాజుల కాలంలో మరికొంత ప్రశస్తికి వచ్చి శ్రీ కృష్ణదేవరాయల కాలానికి తెలుగు మరికొంత ఘనతను సంపాదించిందేగాని రాజభాషగా అధికారభాషగా సంస్కృతమే రాజ్యమేలిందని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నిరూపించారు. బ్రిటిషువారి కాలంలో గూడా కొన్ని ప్రకటనలు తెలుగులో వెలువడ్డా, సి.పి.బ్రౌన్ నూటయాభై సంవత్సరాలక్రితమే కొన్ని తీర్పులను తెలుగులోనే రాసినా, అధికారభాషగా ఇంగ్లీషే ఉన్నదని అందరికీ తెలుసు. బహుజనామోదమో సాధారణ ప్రజలకు తెలియటమో మంచిదని తోచిన సందర్భాల్లో దేశభాషలో - తెలుగులో - కొన్ని అధికారిక ప్రకటనలు వెలువరిచినంత మాత్రాన తెలుగు అధికారభాష కాలేదు, కాబోదు. ఆంధ్రప్రదేశ్ అనే సొంత రాష్ట్రమేర్పడ్డా, పాలకులు అనేక వాగ్దానాలు చేసినా, చేస్తున్నా నేటికీ తెలుగు అధికారభాష కాలేదు. వివరాలను నా భాషాశాస్త్ర వ్యాసాల్లో చూడవచ్చు. అధికారభాష కాదు కాబట్టే అత్యంత ప్రధానమైన రాజశాసనాలు సంస్కృతంలోనే వెలువడ్డాయి. కాకపోతే దానధర్మ విశేషాలు ప్రజలకు తెలియాలనిపించినప్పుడు వ్యక్తి స్థల నామాదులను తెలుగులో కూడా తెలియబరిచారు. తెలుగు ప్రాచీనకాలంలో అధికారభాషాగౌరవం పొందనందువల్ల అలనాటి వ్యవహారభాష మౌఖికభాషగా త్వరితంగా మారిపోయింది. లిపిలేఖన పద్ధతులు వ్యాప్తిలోకి వచ్చిన తరువాత వాటిమీద కూడా సంస్కృత ప్రభావం బాగా పడింది. వర్ణమాల దగ్గరినుంచి లేఖన సంప్రదాయాల వరకు ఆ ప్రభావం విస్తరించి, తెలుగు జాతి వాడుకలో ఉన్న ఱవర్ణ ఱకారాలు క్రమంగా వ్యవహారదూరమైనాయి. తెలుగులో స్వతస్సిద్ధంగా ఏర్పడ్డ ఆనునాసిక్యానికీ, దంత్య/ దంతమూలీయ చజలకు, ఎ (ae) ధ్వనికీ లిపి సంకేతాలనయినా ఏర్పరుచుకోలేదు. అయితే మరోవైపు పద్యసాహిత్యం మొదలయింది తొమ్మిదో శతాబ్దం నాటికే. అది 11వ శతాబ్దంలో మహాకావ్యనిర్మాణానికి ఉపయోగపడింది. తెలుగుకు సాహితీ భాషా గౌరవం దక్కింది గాని, అధికార భాషాస్థాయి ఈనాటికీ రాలేదు. ఈ పరిస్థితివల్ల తెలుగుభాష సంస్కృతీకరణవైపు మొగ్గుచూపి, దేశీయతకు క్రమంగా దూరమవుతూ ద్విభాషా దుస్థితికి (diglossic situation) దిగజారింది (వివరాలను నా Occasional Papers లో చూడవచ్చు).

గద్య పద్య శాసనాల్లోని భాషను తులనాత్మకంగా పరిశీలించినప్పుడు కొన్ని విశేషాలు తెలుస్తాయి. సమకాలిక వ్యవహారానికి సన్నిహితంగా ఉన్న గద్య శాసనభాషలో కనిపించే కొన్ని మార్పులు, అదే కాలానికి చెందిన పద్య శాసన భాషలో కొన్ని శతాబ్దాల తరవాతగాని ప్రతిఫలించలేదు. వాటిలో అత్యంత ప్రధానమైనవాటిని మొదట చూద్దాం. శకటరేఫకూ సాధురేఫకూ మధ్యగల ఉచ్చారణ భేదం క్రీ.శ.7వ శతాబ్దినాటికే తొలిగిపోయిందని విలోమ లేఖనాల ద్వారా (inverse spellings) గ్రహించగలం. ఆ రెంటికీ విభిన్న లిపి సంకేతాలున్నా, ఒకదాని స్థానంలో మరొకటి కనిపించిందంటే నాటి లేఖకులకు ఉచ్చారణలో భేదం లేదనిపించి ఉండాలి. ఉదా.

i) క్రీ.శ.395-410 మధ్యకాలంనాటి పెదవేగి శాసనంలో (భారతి 1. 110-23: పంక్తులు 10-11, 13-14, 15ల్లో క్రమంగా) అఱుతొఱె, చెఱ్ఱుఱువ, కమ్మురాజ్ఞెఱువ (తొఱె తరవాతి కాలంలోని దొరువు / త్రోవలకు మూలరూపం; చెఱువు, చెరువు అనే రెండు రూపాలూ ఒకే శాసనంలో కనిపించటం ఉచ్చారణ ఒకటేననటానికి నిదర్శన.

ii) ఇరుకుటూరు (ఎపిగ్రాఫియా ఇండికా 31.74-60:39-40) - క్రీ.శ.669 నాటి శాసన ప్రయోగం. కావ్యభాషలో ఇఱుకు అనే రూపముంటుంది.

iii) చిట్టేరు (JAHRS 5.51-56:19) - క్రీ.శ.763 నాటి ప్రయోగం. ఏఱు అనేది కావ్యభాషారూపం.

iv) పదమఱలూఱి (ద.హిం.శా. 10.37.2) క్రీ.శ. 8వ శతాబ్ది. ఊరు కావ్యభాషా రూపం.

v) నూఱ (ద.హిం.శా. 10.605:1,2,8) ఇది క్రీ.శ. 8వ శతాబ్దినాటిది. కావ్యభాషారూపం నూఱు.

దాదాపు పదమూడు వందల సంవత్సరాల క్రితమే ప్రత్యేక వర్ణత్వం కోల్పోయిన శకట రేఫను నేటికీ కొందరు కావ్యభాషలో వాడుతుండటం విచిత్రం. శకటరేఫ నిర్ణయం తేలక సంప్రదాయ పండితులూ భాషాశాస్త్రజ్ఞులూ ఘర్షణ పడటం అందరికీ తెలుసు. ఉచ్చారణ భేదం స్మృతిపథంనుంచి జారిపోయిన తరవాత బహుకాలానికి ఈ అవ్యవస్థ లేఖనంలో కనిపించిందని గుర్తించాలి.

ప్రాచీన శాసనాల్లో ప్రత్యేక లిపిగా కనిపించే 'ఴ' కారం క్రీ.శ.11-14 శతాబ్దాల మధ్యకాలంలో కూడా రాతలో నిలిచింది (తెలుగు భాషా చరిత్ర 4.3, పేజీ 105). పదమధ్య ఴ కారం క్రీ.శ. 7వ శతాబ్దినాటికే డ కారంగా మారింది. ఉదా. కుడుచు (ద.హిం.శా. 6.584.10). ఇది క్రీ.శ. 641 నాటి ప్రయోగం (తెలుగుభాషా చరిత్ర 3.16, పేజీ 60). దాదాపు 700 సంవత్సరాలు అది లేఖనంలో నిలిచింది గద్య శాసనాల్లో. అయినా 11వ శతాబ్దినాటి నన్నయ భాషలో అది లేదు. ఈ మార్పు నన్నయ చేసిన కావ్యభాషా సంస్కార ఫలిత మనిగాని, భాషాపరిణామక్రమఫలిత మనిగాని చెప్పవచ్చు.

తామ్రశిలాశాసనాల్లోగాని, తాళపత్రగ్రంథాల్లోగాని, గోల్కొండ పీచుకాగితాలమీదగాని, ఎన్నడూ ఎవరికీ కనిపించని అరసున్న (ఁ) ను నేటికీ కావ్యభాషలో రాస్తున్నవా రున్నారు. 'సగము జాబిల్లివలె వ్రాయ సగముసున్న' అని చెప్పిన అప్పకవి ఏ సగమో చెప్పలేదు. అర్ధానుస్వారం పూర్వాచ్చును అనునాసికంగా ఉచ్చరించటాన్ని సూచిస్తుందని కేతన మాటలను బట్టి ఊహించవచ్చు (ఆంధ్రభాషాభూషణము, పద్యాలు 30,56,57). అంతకుమించిగాని, అందుకు విరుద్ధంగాగాని లిఖిత నిదర్శనాలు లేవు. లేఖనంలో మొదట బిందువు మాత్రంగా (.) ఉండి, తరువాత సున్నగా మారిన సంకేతం పూర్ణబిందువుకూ ఖండబిందువుకూ ఏకలిపి సంకేతంగా ఉండేదని శాసనలేఖన పరిశీలన నిరూపిస్తుంది. కొన్ని సందర్భాల్లో అనుస్వారానికి బదులు పరసవర్ణాదేశమే లేఖనంలో కనిపించినా, ఛందస్సునుబట్టి అరసున్న (అనునాసిక్యం) ఉందని నిరూపించవచ్చు. ఉదా.

"ప్రభుం బణ్డరంగుం బఞ్చిన... పణ్డెణ్డుంగొని... వేంగి నాణ్టిం" (భారతి 5.473 - 84.4-6) అనే భాగం క్రీస్తుశకం 848 నాటిది. ఛందోభంగం లేకుండాలంటే దీన్ని "ప్రభుఁ బండరంగుఁ బఞ్చిన.. వేఁగినాఁటి" అనే అక్షర క్రమంలో రాయాలి. ఆ శాసనంలో కనిపించే "గవ్వఁబ్.. కొట్టంబుల్" (పంక్తులు 3,6) అనే చోట్ల "గర్వమ్...కొట్టముల్" అని పఠించక పోతే ఛందోభంగం. బిందుపూర్వక బకారాన్ని మకారానికి బదులుగా రాయటం క్రీ.శ. 7వ శతాబ్దినుంచీ

ఆచారమయిందని గుర్తించాలి. సంప్రదాయ వ్యాకరణాలు దీర్ఘంమీద అర్ధానుస్వారం లేదంటున్నా ఒక పద్య శాసనంలో 'కూంతు సరియ పోల్పం గాంత లెంద్దు' (రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక 25-29.11:1065) అనే ప్రయోగాన్నీ, 'వీండె ఖలుండు దక్షుండను వీతిండి పాఋం డు' వంటి నన్నెచోడ ప్రయోగాన్నీ అనుసంధించి పరిశీలిస్తే, ఒకప్పుడు మాండలికంగానయినా అనునాసికోచ్చారణ ఉండేదని తెలుస్తుంది (తెలుగు భాషా చరిత్ర, పేజీలు 63, 104 మొ.). అంతకుముందు వర్గ పంచమాక్షరాల స్థానంలో పూర్ణ బిందువును రాసేవాళ్ళు. ఆ సంప్రదాయం క్రీ.శ.1400 నాటికి అంతరించింది (అదే పేజీ 104). అచ్చుతోబాటు అరసున్నా అనే లిపివచ్చింది. ఇవన్నీ గమనిస్తే సఖండ నిర్బిందుకాలను గురించిన సంప్రదాయ వ్యాకరణ చర్చలూ, నిఘంటువుల నిర్ణయాలూ (ఉదా. ఏగు-శబ్దరత్నాకరం ప్రకారం నిర్బిందుకం; శాసనాధారాలనుబట్టి సబిందుకం - సూర్యరాయాంధ్ర నిఘంటువు శాసనాధారాలను గుర్తించింది) నిష్కారణ ప్రయాస లనిపిస్తాయి.

క్రీస్తుశకం 7వ శతాబ్దినుంచి పదాదియవకారాలు లేఖనంలో (ద్రుతాంతాల తరవాతకూడా) కనిపిస్తాయి శాసనభాషలో. ఉదా.

యడాగమం : పఞ్చమియు యాదిత్యవారంబు (JA HC 3.16-21.9-11). ఇది క్రీ.శ. 641 నాటి ప్రయోగం.

వడాగమం : పోటున - వకొట్టి (ద.హిం.శా. 10.614.5-6). ఇది 8వ శతాబ్ది ప్రయోగం.

ప్రథమాంతం మీద యడాగమం: సంవత్సరమ్బుళ్ -యేనగు (ఎపిగ్రాఫియా ఇండికా 27.234-36.6-7). ఇది క్రీ.శ. 625-50 మధ్యకాలానిది. నన్నయ సమకాలంలోనూ ఇలాంటి లేఖన సంప్రదాయముందనీ, ఆయనగూడా అలాగే రాస్తే ముద్రణలో పరిష్కర్తలు బాలవ్యాకరణానుసారం మార్చారనీ వాదోపవాదాలు జరిగాయి.

సంధికి సంబంధించి ఒకటిరెండు సంగతులు చూద్దాం. గసడవాదేశం శివకవుల రచనల్లో కూడా నిత్యంగా కనిపించినా, సంప్రదాయ వ్యాకర్తలు గుర్తించలేదు. క్రీ.శ.8-11 శతాబ్దాల మధ్య శాసనభాషలో ఈ ఆదేశం నిత్యం; అంతకుముందు వైకల్పికం. దీనికి విశేషవ్యాప్తి ఉండేది. ఉదా.

తత్సమాల్లో : కలయంత - గాలంబు (ద.హిం.శా. 6.585.21 : 633-63)

ద్రుతాంతాలమీద : నాలును - వుట్టు (నెల్లూరు శాసనాలు 1.291-92.2-3 : 7వ శతాబ్ది)

విశేషణాలమీద : ఇరు - వుట్టి (ద.హిం.శా. 6.585.9 : 633-63)

క్త్వార్థకాలమీద : పొంది-గాని (తె.శా. 1.163-65.6 : 892-922)

సంవృతాక్షరాల్లో : నిడు-గట్ట (ఎపి.ఇం.18.313-16.15 : 696-709)

ద్రుతసంధి క్రీ.శ. 6-9 శతాబ్దుల మధ్యకాలంలో వైకల్పికంగా, తరువాత బహుళంగా పర్యవసించినా, పదకొండో శతాబ్దిలోకూడా నిత్యసంధి కాలేదు శాసనభాషలో. కావ్యభాషలో మాత్రం అది నిత్యమనే చెప్పాలి. ఉదా.

దీని-గాచిన వారు (నె.జి.శా. 3.1151-10 : 650). ద్వితీయాంతాలమీది సంధి కిది నిదర్శన.

సంధి జరగని నిదర్శన : పాఱకు - కుణ్డికాళ్ళుళ (ఎపి.ఇం. 27.225-28.11-12 : 575-600). పులొంబున - చెఱువు (ద.హిం.శా.6.584.6-7, 641)

వ్యస్త సమస్త శబ్దాల విషయంలో కొన్ని ముఖ్యాంశాలను ప్రస్తావిద్దాం.

బహువచనంలో ము ప్రత్యయలోపమూ తత్పూర్వ స్వరానికి దీర్ఘతా నన్నయ భాషలో కనిపించదుగాని ఆయనకు సమకాలంలోని శాసనభాషలో ప్రయోగాలున్నాయి. ఉదా.

భోగానకు (ద.హిం.శా. 10.644.77-78 : 1060)

కుంచాలు (ద.హిం.శా. 10.60.1 : 1091)

క్రియారూపాల్లో తచ్ఛబ్ద వకారలోపం క్రీ.శ.12వ శతాబ్ది శాసనాల్లో కనిపిస్తుంది. ఒక మార్పు లిపిబద్ధం కావటానికీ లేఖనంలో కనిపించటానికీ చాలా ముందే మౌఖిక వ్యవహారంలో ఉండి ఉంటుందన్న భావన ప్రకారం నన్నయనాటికే ఆ పరిణామం జరిగి ఉండాలి. కానీ కావ్యభాషలో ఆయన ఆరూపాలను వాడలేదు. ఉదా.

ప్రచ్చినారు (ద.హిం.శా. 10.702.16, 1153)

నడపంగలాణ్డు (ద.హిం.శా. 4.1099.6 : 1166)

యుద్ధమల్లుడి బెజవాడ శాసనంలో కనిపించే 'నెగి', 'అర్థిన్' వంటి అవ్యయాలు సాధారణ శాసనభాషలో మరెక్కడా కనిపించవు. ఆ పద్యశాసన ధోరణి తరవాతి కాలంలోని కావ్యభాషకు మార్గదర్శకమై ఉంటుంది.

పద్యశాసనాల్లోనూ కావ్యభాషలోనూ వైరి సమాసాల ప్రయోగం అత్యంత విరళమే. కాని గద్యశాసనాల్లో వాటి కల్పన క్రీ.శ.7వ శతాబ్దినుంచీ విస్తృతం. ఉదా.

పోర్ముఖరామ (ద.హిం.శా. 10.599.1-2, 625-50)

ఘనరాచమణి (నె.జి.శా. 3.1152-55.29-30 : 7వ శతాబ్ది)

మనవత్తిఱకమ్ (భారతి 3.83-94.45 : 1060)

జయమాడ (ద.హిం.శా. 6.109.29 : 1096)

లోహదండు (ద.హిం.శా. 4.1161.2 : 1082)

అమృతపడి (నె.జి.శా. 1073.17 : 1088)

నన్నయభట్టు కఱకంఠుడు వంటి ప్రయోగాలను ఎంత కదాచిత్తుగా చేసినా, సమకాల భాషాప్రభావంనుంచి పూర్తిగా బయటపడలేకపోయాడనటానికి ఆమాటలే నిదర్శనం.

కొరవి శాసనంలో కనిపిస్తున్న 'సుఖంబు మనువారు, ఆతని కొఱ్పించిన చెరువులు, సుఖమ్బుణ్డి; పదకొండో శతాబ్దిలోని 'తమప్రతిష్ఠసేసిన' (ద.హిం.శా. 10.644. 66 : 1060) మొదలైన విశేష ప్రయోగాలకు క్రీ.శ. 7వ శతాబ్దినాటి 'విడిచిన బసిఁణ్డి నూఱు గద్యాణంబులు' ( JA HC 3.16-21.14-16 : 678) వంటివి పూర్వప్రయోగాలు. ఇలాటివే నన్నయనాటి నుంచీ కావ్యభాషలో కనిపిస్తున్నాయి. తననాటికే భాషలో స్థిరపడ్డ పదప్రయోగాలనే నన్నయ స్వీకరించాడనటానికి ఇవి నిదర్శనలు.

క్రీ.శ. 11వ శతాబ్దాంతం వరకూ లభించిన తెలుగు శాసనాలను పరీక్షిస్తే, భాషలో ఎరువు మాటల పాలు కాలక్రమాన పెరుగుతూ వచ్చిందని తెలుస్తుంది. సంస్కృత ప్రాకృత సమాలూ

భవాలూ ఎరువు మాటలకిందనే లెక్క. కేవలం దేశ్యపదాలు కానివన్నీ ఎరువుమాటలే (borrowed words). క్రీ.శ. 6-10 శతాబ్దుల మధ్య శాసనభాషలో 20-25 శాతం ఎరువు మాటలు కనిపించగా, క్రీ.శ.10, 11 శతాబ్దుల్లో అది 50శాతం దాటింది. ద్రావిడ భాషల్లో మలయాళం 85శాతందాకా, తెలుగు కన్నడాలు 60 శాతందాకా సంస్కృతంనుంచే పదజాలాన్ని దిగుమతి చేసుకున్నాయి. తెలుగు సాహిత్య భాషగా అభివృద్ధి చెందే కొద్దీ, 14వ శతాబ్దిదాకా ప్రధానంగా సంస్కృతంనుంచి ధారాళంగా ఎరువుతెచ్చుకోక తప్పింది కాదు. పదాలను 15వ శతాబ్దినుంచి దాదాపు 200 పెర్షో అరబిక్ పదాలు శాసన భాషలో ప్రవేశిస్తే, కావ్యభాషలో 900 దాకా చేరాయి (తెలుగు భాషా చరిత్ర, పేజీ 330). పోర్చుగీసు భాషనుంచి 16వ శతాబ్దిలో ఆదానం మొదలయింది (అదే, పేజీ 341). క్రీ.శ.1802 నుంచి శాసనభాషలో ఇంగ్లీషు మాటల ప్రవేశం మొదలయి (అదే, పేజీ 185) ఇప్పటికి మరింత వేగం పుంజుకున్నది. సంప్రదాయ వ్యాకరణాలు అన్యదేశ్యాల గురించి పట్టించుకున్నది తక్కువ – సూత్రీకరించింది శుద్ధశూన్యం. అన్యదేశ్యాలను వాడకపోతే 'వ్యవహారహాని' తప్పదన్న అప్పకవి, వాటి రూపనిష్పాదనాదుల జోలికే పోలేదు. ఆ వ్యాకరణాలు చేసిన తత్సమ తద్భవ విభజన ప్రాతిపదికలనేగాని ప్రత్యయాలను లెక్కలోకి తీసుకోలేదు. ప్రాకృతసమ, ప్రాకృతభవాల రూప నిష్పాదన కన్నీటి తుడుపుగా చేశాయి. అసలీ విభజన ప్రణాళికను కూడా ప్రాకృత వ్యాకరణాలనుంచే ఎరువుతెచ్చుకున్నా రంటాడు తూమాటి దొణప్ప (అదే, పేజీ 307). ఆయన లెక్క ప్రకారం తద్భవాల్లో అయిదింట నాలుగు పాళ్ళు ప్రాకృతాలనుంచీ, మిగిలినవి సంస్కృతం నుంచీ ఎరువు తెచ్చుకొన్న మాటలే (అదే, పేజీ 308). కావ్యభాషలో అన్యదేశ్య శబ్దం 'త్రాసు'ను మొదటిసారిగా ప్రయోగించినవాడు తిక్కన. అన్యదేశ్యాలను ధారాళంగా ప్రయోగించిన సుప్రసిద్ధ కవి శ్రీనాథుడు. ఆ కవి తన కృతిపతి బెండపూడి అన్నయమంత్రికి అరబీభాష, తురుష్క (టర్కీ) భాష, పార్సీ భాష వచ్చునని పేర్కొన్నాడు. ముస్లిం దండయాత్రలకన్నా ముందే వారితో ఏర్పడ్డ వాణిజ్య సంబంధాలవల్ల ఆయాభాషాపదాలను తెలుగులో చేర్చుకోవటం మొదలయింది.

ఈనాటికీ తెలుగులో సంస్కృతీకరణం విపరీతంగా ఉందనీ, ఆంగ్ల పదాల చేరిక, సాంకేతిక పదరూపంలో అంతు తెలీనంతగా జరుగుతున్నదనీ, ఇందువల్ల తెలుగు 'పరిశుద్ధత' భ్రష్టుపట్టిపోతున్నదనీ, 'సంకర' సమాసాలు భాషాసౌందర్యాన్ని చెరుస్తున్నాయనీ ఆక్రోశించే వాళ్ళు చాలామంది ఉన్నారు. వారు గమనించని వాస్తవా లనేకం. ఈ క్షణంవరకూ తెలుగువాడు తెలుగులో రాసిన మౌలికశాస్త్రగ్రంథం ఒక్కటీ లేదు. మన కవిత్వం మహత్తరమే కావచ్చు గాని దేశీయపదాలు – కవికీ, కవిత్వానికీ, సాహిత్యానికీ సమానార్థకాలయినవి లేవు (తెలంగాణాలో సాహిత్యశబ్దానికి 'స్వయంపాకం' అనే అర్థం విశేషంగా వచ్చింది). సాంస్కృతికాదానం (Cultural borrowing) అతివ్యాప్తంగా ఎరువుమాటల చేరికకు దారితీసింది. సాంప్రదాయిక శాస్త్రాలనుకొనే ఛందోవ్యాకరణాలంకార శాస్త్రాల్లో, జ్యోతిరాయుర్వేదాల్లో మనం ప్రమాణగ్రంథాలనుకునేవన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి. ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని పురాణప్రబంధాద్యనేక ప్రక్రియల్లోని పాత్రలూ ఇతివృత్తాలూ చాలావరకు భారత భాగవత రామాయణాదులనుంచే వచ్చిపడ్డవి. ఆ గ్రంథాల్లో వర్ణితమైన సమాజ లక్షణాలు ఇంచుమించుగా ఆర్యనాగరకతకు

చెందినవేగాని, వాటిలో తెలుగుదనం ఉన్నదనలేం. ఉన్న ఒకటి రెండు సందర్భాల్లో నేటి తెలుగు చలనచిత్రాల్లో ఉన్నంత దేశీయతా లేశమే.ఆధునిక సమాజావసరాలకు అవసరమైన పరిభాషను అచ్చతెలుగులో అరవల్లాగా సృష్టించుకోవటం తెలుగు స్వభావానికి విరుద్ధం. మన భాషాభిమానం రాజకీయ ప్రయోజన సాధనకు మించి మరిదేనికీ విస్తరించలేదు. కాబట్టి మన భాషాభివృద్ధీ, సాహిత్యాభివృద్ధీ అనుకరణలమీద, ఆదానం మీద ఆధారపడ్డవేగాని, స్వతంత్రాలు కావు, మౌలికాలు కావు, ప్రాథమికాలు కావు.

ఏమాట ఏ అన్యభాషనుంచి ఎరువుగా వచ్చి ఎలా రూపంలో అర్థంలో మార్పులు పొందిందో నిరూపించే వ్యాకరణ నిఘంటువులు తెలుగులో రాలేదు. వెలువడ్డవి అసమగ్రాలు. మన పండితుల వాదనలకు మూలాలు అన్యభాషల్లోని సిద్ధాంతాలు. ఈ పరిస్థితిలో సామాన్య రచయితలకూ పండితులకూ అన్యదేశ్యమేదో దేశీయపదమేదో తెలియటం దుస్తరం. పఠనపాఠనాల్లో ఆ విషయాలకున్న ప్రాముఖ్యం అజాగళస్తనప్రాయం. కాబట్టి మిశ్రసమాసాలు / వైరి సమాసాల కల్పనను సంకరసమాసస్పష్టిగా పరిగణించి ఆక్షేపించడం సమర్థనీయం కాదు. కన్నడిగులూ తెలుగువారూ తప్ప ఈ మిశ్రణం నేరమనో పాపమనో ఎవరూ భావించటం లేదు. ఎరువులు పంటకులాగా ఎరువుమాటలు భాషకు మేలు చేకూర్చి పుష్టి కల్పిస్తాయి. ఇంగ్లీషు అలాగే అభివృద్ధమయింది - ప్రపంచభాషగా. ఈ సందర్భంలో కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు వంటి వీరగ్రాంథిక భాషావాది 1922లో రాసిన 'తెలుఁగు భాషాతత్త్వము' లోని అభిప్రాయాలను సంప్రదాయవాదులు చిత్తగించడం మంచిది. విభక్తి ప్రత్యయ లోపాదులుగాని పదాంత కార్యాలు గాని లేని సమాసాలను వైరి సమాసాలుగా పరిగణించి వెలివేయవద్దని ఆయన సూచించాడు. క్రీ.శ.7వ శతాబ్దినుంచీ తెలుగులో మిశ్రమ సమాసాలున్నాయి. గద్యశాసనాల్లో వాటి సంఖ్య అపారం. నేటికీ వ్యవహారంలో అదే స్థితి. ఇది కొనసాగుతున్న సంప్రదాయమని గుర్తించాలి.

సంస్కృత ప్రభావాన్ని ప్రతిఘటించదలచిన శివకవుల ప్రయత్నాలూ, అచ్చ తెలుగు వాదంతో పెర్షోఅరబిక్ పదాల చేరికను అనుమతించి, సంస్కృత సమాసాలను నిషేధించిన 'యయాతి చరిత్ర' వంటి రచనల ఆత్మవంచనా విఫలమైనాయని సాహితీ చరిత్ర చెప్తుంది (ఈ వాద వివరాలను నా 'సాహిత్యవ్యాసాల్లో' చూడవచ్చు). సంస్కృత ప్రభావం చాలా ప్రాచీన కాలంలోనే తెలుగు వాక్యనిర్మాణం మీద కూడా ప్రసరించింది. గద్యశాసనాల్లో అత్యంత విరళంగా ఉన్న కర్మణి ప్రయోగం కావ్యభాషలో చాలా ఎక్కువ. నేటికీ కొందరు విశ్వవిద్యాలయాచార్యులు "నన్నయగారి చేత వ్రాయబడ్డ మహాభారతం" వంటి ప్రయోగాలే పాండితీస్ఫూర్తికి నికషోపలాలని భావించటం కద్దు. 'నన్నయభారతం' అంటే అది తెలుగు వాక్యం కాదనే భయముందేమో వారికి. క్రీ.శ.11వ శతాబ్ది చివరిదాకా తెలుగులో వెలువడి లభించిన 269 శాసనాల్లో రెండే రెండు ఉదాహరణలు కర్మణిప్రయోగానికి నిదర్శనలు. ఉదా.

ఆతని చేయమ్బడిన ధమ్ముఀవులు (తె.శా.1.163-65.55-56 : 892-922)

వైదుమ్బులచేతం బట్టం కట్టబడి యేలి (ద.హిం.శా. 10.640.4-5 : 9/10 శతాబ్దులు)

ఏదో విశేష పరిస్థితినో కార్యాన్నో తెలియబరిచేటప్పుడు ఈ ధోరణి ఘనంగా ఉంటుందని భావించారేమో. వాగ్ వ్యవహారంలో నేటికీ కర్మణి ప్రయోగం విరళాతివిరళమని గుర్తించాలి.

ఇటీవల ఒకరిద్దరు భాషావేత్తలు ఇటువంటి ప్రయోగం తెలుగుభాషకు సహజమనీ వాంఛనీయ మనీ వాదిస్తున్నమాట నిజం. భాషను పండితులు మాత్రమే శాసించరు - శాసించలేరు. ఇది మంచిదనుకుంటే పదిమందికీ నచ్చచెప్పట మొక్కటే మార్గం.

క్రీ.శ. 9-10 శతాబ్దులనాటివి రెండు, పదకొండో శతాబ్దివి మరిరెండూ యత్తదర్థక ప్రయోగాలు శాసనభాషలో దొరుకుతున్నాయి. రాజకీయ వ్యాసాదుల్లో, హిందీ/ఉర్దూ ప్రభావ మున్నవారి రచనల్లో ఇవి కావ్యభాషలోలాగా అవిరళంగా ఉన్నాయి. ఇది కూడా సంస్కృత ప్రభావంవల్ల తెలుగు వాక్యనిర్మాణంలో ప్రవేశించినదే. ఉదా.

నీకేమివలయు దాని వేఁడికొమ్ము (తె.శా.1.163-65. 30-32 : 892-922)

ఎవ్వాణ్డేని రక్షిఞ్చు వానిద ధమ్ముఌవు ( JAHRS 1.81 - 85.7 : 10వ శతాబ్ది)

ఈ వృత్తి నెవ్వణ్డేని అపహరిఞ్చిన వాని పితృపితామహులు 60వేలేండ్లు నయకనరకానం పడుదురు (ద.హిం.శా. 10.4.12-14 : 1008)

వేగినాణ్టి కెవ్వరు రాజులైరి వారుం (ద.హిం.శా. 6.102.34-38 : 1006)

చివరి రెండు దృష్టాంతాలూ కావ్యభాషకు సమకాలికమైనవని గుర్తించాలి.

తెలుగు వాక్యనిర్మాణంలో కర్తృ-కర్మ-క్రియా పదాలు ఆ వరసలో రావటం, విశేషణ పదాలు విశేష్యాలకు ముందుండటం సహజం. ఆక్రమం మారటం విలక్షణత. కావ్యరచనలో విలక్షణ ప్రయోగా లెక్కువ. అయినా శాసనభాషలో వాటికి బీజాలూ మార్గదర్శకాలూ నన్నయకు చాలా ముందుకాలంనుంచీ కనిపిస్తాయి. గద్యపద్య శాసనాలనుంచి ఆయా విలక్షణ ప్రయోగాలకు ఆధారాలను ప్రదర్శిస్తాను.

i) కర్త లేనివి : దానపోతుల ముచ్చియకు... ఇచ్చిరి..నేల (ద.హిం.శా. 10.599.29-31: 625-50)

ii) కర్మ లేనివి : కఞ్చుగార్లు కొట్టిరి (ఎపి.ఇం. 30.69-71.8 : 699- 700)

iii) వాక్యాంతంలో కర్త : ప్రసాదచేసిరి తొల్పకామి రట్టగుళ్ళు (ఎపి.ఇం.27.236-38&12-15 : 700-725); దీవియ వెట్టెం బద్మావతియును (ఎపి.ఇం. 14.314-18.21:1075-76) అనేది పద్యశాసన ప్రయోగం.

iv) వాక్యాంతంలో కర్మ : గణ్డర ముత్రాజు.. పొడిచి పడియెఱ్ఱొజ్జులాకు (ద.హిం.శా. 10.640.3-6 : 9వ / 10వ శతాబ్ది); శ్రీయుద్ధమల్లు ణ్డెత్తించె గుడియు మఠంబునుం గాత్తిఌకేయునకు (శాప.మం.1.2-3.27-29 :898-934) అనేది పద్యశాసన ప్రయోగం.

v) కర్త-కర్మ-క్రియ : శ్రీసతికి దత్తి హంగుణవుళ దేవణ యిచె (ఎఆర్ 182/1932,34, భాగం.2, ఎల్.సి.41.8 : 7వ శతాబ్ది)

vi) కర్తృపద పునరుక్తి : పెటనివారు... అటిసినవారు పాపంబు గొణ్డు వెటనివారు (ద.హిం.శా. 10.633.2-5 : 8వ శతాబ్ది)

vii) విశేష్యం - విశేషణం : నిల్పె విద్దమయ్య విప్రకవచమ్ము (నె.జి.శా. 1.237.4 : 633);

శ్రీయుద్ధమల్లు ణ్ణెత్తించె నమితతేజుండు (శా.ప.మం. 1.2-3. 43-44 : 898-934) అనేది పద్యశాసన ప్రయోగం.

viii) పరోక్షకర్మ - ప్రత్యక్షకర్మ : గణ్డదేవరకు నముడునకు దారపోచి యిచ్చినాణ్డు (ఎఆర్ 77/1956-57.13.15 : 1096)

ix) క్రియ-అవ్యయం:సితమణిబన్ధ మిచ్చె సన్మణియుతముగన్ (రా.ప.సం. 25-29. 6:1065)

ఇటువంటి నిదర్శనాలవల్ల సాహిత్యభాషలోని విలక్షణ ప్రయోగాలకు పూర్వ రూపాలు శాసనభాషలో కావ్యభాషకన్నా ఎంతోముందుకాలంలోనే ఉన్నాయని గుర్తించగలం. వీటిపాళ్ళు పద్యశాసనాల్లో, అంతకన్నా ఎక్కువగా కావ్యరచనల్లో ఎక్కువగా ఉండడంవల్ల వ్యవహారభాషకూ కావ్యభాషకూ దూరం రానురాను పెరిగింది. ఈ ద్విభాషిత క్రీ.శ.7వ శతాబ్దినుంచే ఆరంభమయింది. పద్యకవితేగాని వచనరచనలను సమాజం గౌరవించి చేపట్టనందువల్లా, కేతన తరవాతి వ్యాకర్తలకు పాండిత్య ప్రకర్షమీద ఉన్న వ్యామోహం సృజనాత్మక రచనలమీద లేనందువల్లా, ఛందోవ్యాకరణాలంకారాలు లక్ష్యాలకన్నా లక్షణాలకే ప్రాముఖ్యమిచ్చి అనుశాసించే ప్రయత్నాలు చేసినందువల్లా, అంతకుమించి సాహితీసృష్టి అత్యల్ప సంఖ్యాకులయిన అగ్రవర్ణాలవారికే చాలావరకు పరిమితమయినందువల్లా, ఈ దురవస్థ 20వ శతాబ్దిదాకా తిరుగులేనిదిగా రాజ్యమేలింది. దేశీయతా ముద్రకోసం పాకులాడిన పాల్కుర్కి సోమనాథాది శివకవుల రచనల్లోని భాష వారు ప్రతిపాదించిన సిద్ధాంతాలకు విరుద్ధంకావటం, కావ్యేతి వృత్తాల్లో తెలుగువాతావరణం లేకపోవటం ఇందుకు తోడ్పడ్డాయి. విద్యార్జన పరిమిత లక్ష్యంతో పరిమిత సంఖ్యాకుల ప్రసిద్ధి సంపాదనకు ఉపయోగపడినందున మాండలిక భేదాదులు గద్యశాసనాల్లో తప్ప బాగా ప్రతిఫలించలేదు. సమాజ పరిస్థితులు సాహిత్యంలో ఎప్పుడో ఎక్కడో తప్ప ప్రస్తావనకైనా రాలేదు. స్థూలంగా ఇది ప్రాచీన సాహిత్య లక్షణం.

సాహిత్యభాషను గురించి చేసే చర్చ అసమగ్రంగా ఉంటుందని చెప్పకతప్పదు. మొత్తం ప్రాచీనాంధ్రసాహిత్యంతో పోలిస్తే మనకు దొరికిన, ప్రచురితమైన శాసనాల సంఖ్య అత్యల్పం (కేవలం 2700 శాసనాలు). వాటి విస్తృతి చాలా తక్కువ; వైవిధ్యం అత్యల్పం. బహుశా ఆ కారణం చేతనే శాసనభాషను గంభీరంగా పరిశోధించటం సాధ్యమయిందన్నా తప్పులేదు. కావ్యభాష విషయంలో ఈపాటి పరిశోధన కూడా భాషాదృష్టితో జరగలేదు. నన్నయ తిక్కనల భారతరచనల్లోని పదప్రయోగాల పరిశీలన కేవలం దేశ్యశబ్దాలకూ తత్సమ క్రియారూపాలకూ పరిమితం.అంటే అయిదోవంతు భాషను పట్టికాబద్ధం చేయటానికి మాత్రమే పదప్రయోగ సూచిక లుపయోగపడ్డాయి. ఎఱ్ఱాప్రెగడ శ్రీనాథ పోతనాదుల పదప్రయోగాల పరిశీలన అత్యంత క్లుప్తంగా జరిగింది. పురాణ ప్రబంధఫక్కికి చెందిన గ్రంథాలుగాని ద్విపద వాఙ్మయంగాని అందుకు నోచుకోలేదు. పదప్రయోగ సూచికల్లోని ప్రయోగాలమీద ఆధారపడి శాస్త్రీయంగా చేసిన అర్థనిర్ణయాలు అల్పాల్పం. ఆయా మహారచయితల గ్రంథాలకు వర్ణనాత్మక వ్యాకరణాలు రాలేదు-ఒకటి రెండు తప్ప. శాసనభాషకులాగా చారిత్రక వ్యాకరణాలు వెలువడలేదు. కాబట్టి అభిరుచి ప్రధానంగా స్థూల పరిశీలన మూలకమైన ప్రసంగాలు మాత్రమే సాధ్యం. అంటే చర్చ అవశ్యం అసమగ్రమే.

నన్నయకు సమకాలంలోనే పావులూరి మల్లన గణితం వచ్చింది. ఆ తరవాత వచ్చిన శాస్త్రసాహిత్యం చాలా తక్కువ. ఆ గ్రంథాల్లోని విషయాలమీద చూపిన శ్రద్ధను వాటిలోని భాషావిశేషాలమీద, ముఖ్యంగా సాంకేతికపదాలమీద పరిశోధకులు చూపినట్లులేదు. దాక్షిణాత్య వాఙ్మయాల ప్రత్యేకత సృజనాత్మక సాహిత్యంకన్నా కొంతముందో సమకాలంలోనో శాస్త్రసాహిత్యం వెలువడడం. ఆ ప్రత్యేకతను తెలుగుసాహిత్యం ఏ మేరకు నిలుపుకోగలిగిం దన్నది ప్రశ్న. శాస్త్ర సాహిత్య విశేషాలు అచుంబితంగా ఉన్నంతకాలం ప్రాచీన సాహిత్యభాషను గురించిన మన పరిజ్ఞానం అసంపూర్ణంగా ఉండక తప్పదు.

గతానుగతిక వర్ణనలతో కవిసమయాలతో ఉక్కిరిబిక్కిరి అయిన ప్రాచీన సాహిత్యంలో వైవిధ్యం తక్కువ. ఆమేరకు సృజనాత్మకత దెబ్బతిన్నది. భిన్న పరిస్థితులను, మానవ సంబంధాలను, ఆచారవ్యవహారాలను ప్రాచీన సాహితీపరులు పరిశీలించి విస్తరించి వర్ణించి ఉన్నట్లయితే, అందుకు కావలసిన పదసంపద మాండలిక వైవిధ్యంతోసహా మనకు లభించి ఉండేది. అది ఎంతో కొంత లభించే జానపద వాఙ్మయం పండితుల హ్రస్వదృష్టివల్ల చాలావరకు సహజమరణం పొందింది. తెలుగురాష్ట్రం వచ్చినప్పటినుంచీ శ్రద్ధాసక్తులతో ఆవాఙ్మయాన్ని సేకరించి భద్రపరచి పరీక్షించి ఉంటే భాషావిషయకంగా కూడా పరిస్థితి ఎంతో బాగుపడేది. మనమందుకు నోచుకోలేదు.

కాబట్టి యీనా పరిశీలన అసమగ్రం, అసంపూర్ణం, అత్యంత పరిమితం.

ఈ విషయంలో భవిష్యత్తులో జరగవలసిన ప్రయత్నాలను నాకు తోచినంతలో, తెలిసినంతలో కింద పేర్కొంటున్నాను.

1. అప్రచురిత/అముద్రిత శాసనాల నన్నింటినీ సేకరించి భద్రపరచి ప్రచురించాలి.
2. జానపదవాఙ్మయాన్ని రాష్ట్రం నాలుగు మూలలనుంచేగాక, తెలుగు మాట్లాడే ప్రజలున్న ఇతర రాష్ట్రాలనుంచి కూడా సేకరించి భద్రపరచి ప్రచురించాలి.

   శాసనాల్లో అవి ఏ కాలానికి చెందినవో స్పష్టంగా నిర్దిష్టం కాకపోయినా లిపినిబట్టి, శాసనస్థ విశేషాలనుబట్టి ఉజ్జాయింపుగానయినా కాలనిర్ణయం చేయవచ్చు. జానపద వాఙ్మయంలోని విషయాలమీద ఆధారపడి సమాజలక్షణాలను గుర్తించవచ్చు.
3. కనీసం తెలుగు పంచకావ్యాలకూ భారత భాగవత రామాయణాలకూ పదప్రయోగ సూచికలను సిద్ధం చేయించి, వాటిలో ప్రయుక్తమైన అన్ని మాటలనూ ప్రయోగ సహితంగా ప్రదర్శించాలి. తరవాతవాటిమీద ఆధారపడి పదపదార్థనిర్ణయం చేయాలి. శతాబ్దానికి రెండుమూడు మహా రచనలకు – ప్రక్రియా వైవిధ్య మున్నవాటికి – ఈ విధంగా పదప్రయోగ సూచికలు సిద్ధమయితే, కావ్య/సాహిత్య భాషకు చారిత్రక వ్యాకరణ రచన సాధ్యమవుతుంది. ఒక్కో మహారచనకు వర్ణనాత్మక వ్యాకరణాలు సిద్ధమయితే, సమకాలిక శాసనభాషాలక్షణాలతో వాటిని తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు. ప్రస్తుతమున్న శాసనపదకోశాలను పరిష్కరించవచ్చు. కొత్తసమాచారంతో పరివర్ధితం చేయవచ్చు. ఆక్స్‌ఫర్డ్ నిఘంటు మార్గంలో చారిత్రక వర్ణనాత్మక విశేషాలతో తెలుగుభాషకొక మహానిఘంటువును నిర్మించవచ్చు. తమిళభాషకేగాక కన్నడ మళయాళ భాషలకు కూడా అనేక సంపుటాల్లో ప్రయోగ వ్యుత్పత్తి

సహితమైన మహానిఘంటువులు వచ్చాయిగాని, తెలుగు భాషకు రాలేదు. అందుకు మనం నిజంగా సిగ్గుపడి రోషపడి పోటీపడితే సుదూర భవిష్యత్తులోనయినా మనదో మహాసాహిత్య భాష అని లోకం గుర్తిస్తుంది.

4. తెలుగులో వెలువడ్డ శాస్త్రసాహిత్య మంతటినీ సేకరించి, సృజనాత్మక సాహిత్యాని కిచ్చినంత గౌరవం దానికీ కల్పించి, పదప్రయోగ సూచికలనూ, వర్ణనాత్మక చారిత్రక వ్యాకర ణాలనూ సిద్ధం చేయాలి.

ఇరవయ్యో శతాబ్దంనుంచి – నిజానికి బ్రిటిష్‌యుగంనుంచి – వెలువడ్డ సాహిత్యవిస్తృతితో పోలిస్తే ప్రాచీన సాహిత్యం చాలా చిన్నది. ప్రక్రియాపరంగా, విషయవైవిధ్యపరంగా క్లుప్తమైన సాహిత్యాన్నే సరిగా పరిశీలించలేని జాతి అనుక్షణప్రవర్ధమానంగా ఉన్న ఆధునిక సాహిత్యానికి ఏమి చేయగలదో ఊహించలేను.

పైన సూచించిన కార్యక్రమాలు సామాన్యమైనవికావు. ఒకరిద్దరు చేయగలవీ కావు. అనేకానేక వ్యక్తులూ, సంస్థలూ సమన్వితమార్గంలో ఉద్యమస్ఫూర్తితో ఆరంభించి కొనసాగించి నిర్వహించ వలసినవి. మన గ్రంథాలయాల ప్రస్తుత దుస్థితిని గమనిస్తే, ఆలసించే కొద్దీ ఈ క్షణాన లభించే సామగ్రి మరుక్షణానికి హారతికర్పూరంలాగా హరించిపోయే ప్రమాదముందని గుర్తించాలి.

– విజయవాడ సిద్ధార్థ కళాశాల రజతోత్సవ సందర్భంలో

# 4. శాసన పరిశోధకులుగా ప్రభాకరశాస్త్రిగారు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిశోధనరంగంలో ప్రవేశించిన నాటి పరిస్థితులను ఇప్పటి పరిస్థితుల్తో పోలిస్తే వారు చేసిన పరిశ్రమ దిగ్భ్రాంతి కలిగిస్తుంది. ఇప్పటిలాగా అప్పట్లో పరిశోధకులకు ధన వస్తు సహాయం లభించేది కాదు. పరిశోధనలకు డిగ్రీల రూపంలో, బిరుదుల రూపంలో, పదవుల రూపంలో గుర్తింపు లేదు సరికదా, పరిశోధకులను పలకరించే వారే అరుదు. అందులోనూ శాసన పరిశోధకుల పరిస్థితి ప్రమాదకరంగా కూడా ఉండేది. మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి 'నా నెల్లూరి మండల యాత్ర'లో శాసన శిలలను దేవతా మూర్తులుగానో, అక్షరబ్రహ్మగానో భావించి పూజించే ప్రజలు వాటిని పరిశోధకులు అపవిత్రం చేస్తున్నారని శంకించి పెట్టిన బాధలను తెలుసుకోవచ్చు. ప్రతికూల వాతావరణంలో పనిచేసే పరిశోధకుడికి తన పనిమీద ఎంతో అభిరుచి, అభినివేశం అవసరమయ్యేది. తనకున్నా లేక పోయినా, డబ్బు ఖర్చుపెట్టకపోతే పనికి అవకాశమే లభించేది కాదు. అటువంటి పరిస్థితుల్లో, నేటికి దాదాపు 75 సంవత్సరాల క్రితం పరిశోధన ఆరంభించి కృతకృత్యులైన ప్రభాకరశాస్త్రిగారు ప్రాతస్మరణీయులు.

'పరిశోధన' అనే పదానికి ఇప్పుడున్న అర్థం ప్రాచీనంకాదు. బ్రౌన్ నిఘంటువులోనే ఇప్పటి అర్థం కోశస్థమై మొదటిసారి కనిపిస్తున్నది. ఈ పరిశోధన అనేది వీరేశలింగంగారి కాలంలో జన్మించి, ప్రభాకరశాస్త్రిగారి కాలానికి తప్పటడుగులు వేస్తుండేది. నాటి పరిశోధన ప్రతిఫల నిరపేక్షం - కేవలం సత్యాన్వేషణ ప్రయత్నమే. వేటూరి వారి పరిశోధనలు శాసనరంగానికే పరిమితం కాదు - మల్లంపల్లి వారి అభిరుచి మార్గంలాగా. తాళపత్ర గ్రంథాల లిపి స్వరూపపరిచయంతో మొదలై, పాఠపరిష్కరణ, కాలనిర్ణయాదుల్తో పెనవేసుకొని, ప్రాచీనాంధ్ర సారస్వతానికీ, సంస్కృతి చరిత్రకూ అంకితమైన ఆయన పరిశోధనల బహుముఖత్వంలో శాసన పరిశోధన ఒక అంశమో అంగమో మాత్రం. లిపి స్వరూప చరిత్ర, శాసన కాల నిర్ణయం, పాఠ ప్రచురణ, అర్థ వివరణలతో ఆయన తృప్తిపడలేదు. అలనాటి సంఘ చరిత్రనూ, సాహిత్య చరిత్రనూ, సంస్కృతి లక్షణాలనూ వివేచించటంలో ఆయన దృష్టి స్ఫోటవాదుల అభిప్రాయంలాగా సమగ్ర స్వరూపం తెలుసుకోడానికి విస్తరించేది. ఖండనమండనాదులూ, సిద్ధాంత బద్ధత అనేవి ప్రాసంగికాలే గాని ప్రధానాలు కావు. ఆయనకు సమకాలంలోనే సారస్వత రంగంలో - ప్రధానంగా విశ్వవిద్యాలయాల్లో - వచ్చిన భాషా సాహిత్య విభేదాలు ఆయన్ను స్పృశించనైనా లేదు. ఆరెంటికీ అన్యోన్య సంబంధంలేదని ఆయన భావించినట్లు లేదు. అందుకే పరిశోధనలు ఆయన సంపూర్ణ వ్యక్తిత్వానికి ప్రతీకలేగాని వేరుకావు.

శాసన పరిశోధన రంగంలో ఆయన శ్రమైక ఫలితంగా క్రీస్తుపూర్వం 2వశతాబ్దికీ క్రీస్తుశకం రెండో శతాబ్దికీ మధ్యగల కాలానికి చెందిన అమరావతీ ఫలక శాసనంలోని 'నాగబు' శబ్దం లభించింది. తేనెతుట్టెలాంటి ల్యూడర్ పట్టికల్లో వెతికి వెతికి శాస్త్రిగారు వెలికితీసిన మాణిక్యమది. ప్రథమైకవచన ప్రత్యయ పూర్వరూపమైన 'బు'ను ఆయన శిలాక్షరంగా ప్రదర్శించారు. ఇది వారి తొలి పరిశోధన కాదు గాని, తెలుగుభాష తొలిరూపాన్ని నిరూపించిన పరిశోధనే. సత్తాసై

ద్వారా, సంస్కృత ప్రాకృతశాసనాల్లోని వ్యక్తి నామ, గ్రామ నామాల ద్వారా అందాకా గుర్తిస్తున్న ప్రాచీనాంధ్ర భాషా స్వరూపానికి ఈ ఫలకం ద్వారా మరో విస్పష్టలిఖితాధారం లభించింది. వారు ప్రచురించిన మరో ముఖ్యశాసనం మంగి దొగరాజు నాటి (దివితాలూకా) లక్ష్మీపుర శాసనం. అది క్రీస్తుశకం 675 ప్రాంతాలది. అందులోని 'ముట్టు' శబ్దార్థచర్చ ద్వారా అప్పటి ఒకానొక ప్రభుత్వోద్యోగాన్ని చెప్పే సాంకేతిక పదం అచ్చతెలుగుమాటగా దొరికింది. క్రీ.శ. 740 ప్రాంతాలకు చెందిన కపిలేశ్వరపుర శాసనాన్ని ఆయన మొదటిసారిగా శ్రీవేంకటేశ్వర ప్రాచ్య లిఖిత గ్రంథభాండాగారం వారి పత్రికలో ప్రచురించారు. అందులోని 'దత్తి' శబ్ద విచారం మేలైనది.

ప్రభాకరశాస్త్రిగారు పునఃపునః ప్రచురించిన అహద - నకర తామ్రశాసనం వివాదాస్పద మయింది. జె.ఎఫ్.ఫ్లీట్ నుంచి నిడుదవోలు వేంకటరావుగారి దాకా పదిమంది ఈ శాసన భాషను పరిశీలించారు. దానికాలం రమారమి క్రీ.శ. 847. దాని మీది చర్చలు కూడా చిత్ర విచిత్రంగా జరిగాయి. తొలుత ప్రచురించిన ఫ్లీట్ అది నమ్మదగిందేనా అని సంశయించారు. ("I do not feel quite sure that this is a genuine grant. It also seems to have been left unfinished." IA. 12.85). కుందూరి ఈశ్వరదత్తుగారూ, కె. సూర్యనారాయణ గారూ దాంట్లోని భాషా విశేషాలను గురించి కవిత్వమే చెప్పారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు దాన్ని రెండుసార్లు చర్చించారు (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 22.185-196; ఆంధ్రపరిశోధక మండలి పంచమ వార్షికోత్సవ సంచిక, చిత్రాడ, 1923). ప్రధానచర్చ వేటూరివారికీ (భారతి 5.96-110; 5.520-29) మల్లంపల్లి వారికీ (రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పేజీలు 71-72; భారతి 5.286-301) మధ్య నడిచాయి.

అహద నకర శాసనంలో ప్రచురితపాఠాల మధ్య 88 చోట్ల పాఠభేదాలున్నాయి. అయితే వాటిని మూడు రకాలుగా విభజించవచ్చు. 1). ఇతరులు హ్రస్వాచ్చులను పఠించినచోట్ల వేటూరి వారు సందర్భాన్ని బట్టి (బర్గెస్, నటేశశాస్త్రులలాగా) దీర్ఘాచ్చులను పఠించారు. 2). ఇతరులు 'న్ఠ, ణ్డ'లుగా చదివిన చోట్ల వేటూరి వారు 'న్డ'గా పఠించారు. 3). ఇతరులు 'ధ, డ, ణ, ట'లను చూపినచోట్ల బర్గెస్, నటేశశాస్త్రులు క్రమంగా 'ధ, ద, ం'లను చూశారు. ఇతరులు 'ఱ'కార ముందనుకొన్నచోట్ల వేటూరివారు టకార ముందన్నారు. అక్షరాల మధ్యగల పోలికల, సాన్నిహిత్యాల మాట అటుంచి, వేటూరి వారి పఠనంలోని ఔచిత్యమే మనకు ప్రస్తుత చర్చనీయాంశం.

శాసన లేఖనంలో 'న్ఠ' కన్పించినా, ఉచ్చారణలో దాని విలువ 'న్డ' మాత్రమేనని చెప్పవచ్చు. తరవాతి కాలంలో జరిగిన పరిశోధనలు 'న్ఠ' అనే ధ్వని సమూహం క్రీస్తు శకం 7వ శతాబ్ది నాటికే 'ణ్డ'గా మారిందని రుజువు చేశాయి. ఉదాహరణకు 'తాన్ఠికొన్ఠ' (క్రీస్తుశకం 5వ శతాబ్ది నాటి గోరంట్ల శాసనంలోని 7వ పంక్తిలో - IA 9.102-103) అనే స్థలనామం 'తాణ్డికొణ్డ'గా (క్రీ.శ. 945 నాటి తాడికొండ శాసనం - భారతి 15.97-115) పరిణమించింది. 9వ శతాబ్ది నాటి శాసనంలో వేటూరివారు 'తాన్డికొన్డ' అని చదవటం చారిత్రక భాషా శాస్త్రరీత్యా సమర్థనీయం. 8వ శతాబ్ది నాటికే లభించిన ఎన్నో విలోమలేఖనాల దృష్ట్యా ఈధ్వని పరిణామం

శాసనకాలానికి పూర్తయిందని చెప్పవచ్చు. 'ణ్డ'కు బదులు వేటూరివారు 'న్డ' అని పఠించటం ధ్వనిశాస్త్రరీత్యా సమంజసతరం. మూర్ధన్యాలకు ముందున్న దంత్యధ్వనులు మూర్ధన్యాలుగానే వినిపిస్తుంటాయని ధ్వని ప్రయోగశాలల్లో నిరూపితమయింది. ఉచ్చారణ ప్రధానమనీ, లేఖనం అప్రధానమనీ గుర్తించినప్పుడు శాస్త్రిగారి ఈ లేఖన విధానం ప్రశంసనీయం. దాదాపు అర్ధశతాబ్ది ముందుగా ఈ విషయం గుర్తించిన వారి ప్రతిభను మెచ్చుకోక తప్పదు. లేఖన మర్యాదలో హ్రస్వదీర్ఘ భేదాలను 13వ శతాబ్ది దాకా ఏశాసనంలోనూ నియతంగా పాటించలేదు. అర్థం ప్రకారం హ్రస్వదీర్ఘ భేదాలు గుర్తించటం ఫ్లీట్ వంటి పాశ్చాత్య పండితులకు సాధ్యం కాక పోవచ్చుగాని, ఊహల మీద ఆధారపడి వాటిని భిన్నంగా చదవటం తెలుగు పండితుల విషయంలో సమర్థనీయంకాదు. అలాగే 'వయ్యెడి' శబ్దంలో పదాది వకార ముందని మొదట వాదించినవారు శాస్త్రిగారే. శాసన భాషలోని ఇతరాధారాలవల్ల 5వ శతాబ్దంనుంచీ పదాది యవలు క్వాచిత్కంగా ఉండేవనీ, 9వ శతాబ్ది నాటికి వాటి సంఖ్య పెరిగిందనీ తరవాతివాళ్లు నిరూపించారు.

అనుస్వార విషయంలో ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనలు ప్రశస్తమైనవి. ఆయన అభిప్రాయాల్లో కొన్ని ఈనాటికీ తిరుగులేనివి. మిగిలినవాటి విషయంలో అలాకాకపోవటానికి ఆయనమీది సంప్రదాయ విద్యావిధాన ప్రభావమే ప్రధానకారణ మనిపిస్తుంది. మొదట అర్ధానుస్వార విషయం పరిశీలిద్దాం. అంతకు ముందుకాలంలోని సవర్ణ ధ్వనులే అర్ధానుస్వారంగా పరిణమించాయన్న ఆ వాదం పరమసత్యం. అర్ధానుస్వారం పూర్వాచ్చుకు అనునాసిక్యమేనన్న ఆయన అభిప్రాయంకూడా అంతే సత్యం. కేతన కూడా ఇలాగే భావించాడని తెలుగుపండితులు గుర్తించకపోవటం దురదృష్టం. అయితే ఆయన యుద్ధమల్లుల బెజవాడ శిలాశాసనాన్ని పరిశీలిస్తూ, అందులో 'తరువోజ' ఉందని మొదటిసారిగా గుర్తిస్తూ, కర్ణాట సంప్రదాయంలోని 'శిథిలద్విత్వ/ శిథిలానునాసిక్య' భావనను తెలుగులో మొదటిసారిగా ప్రవేశపెట్టారు. ఛందశ్శాస్త్ర దృష్ట్యా అటువంటి భావన సమర్థనీయమేగాని, ఆ సమర్థన కేవలం సంప్రదాయ దృష్టిలోనే సాధ్యం. భాషాశాస్త్రరీత్యా అది అంత పొసగదనటానికి సైద్ధాంతిక కారణాలున్నాయి. లేఖన మర్యాదలూ ఉచ్చారణ పద్ధతులూ ఒకటే కావు. ఉచ్చరించిన ధ్వనులన్నిటినీ రాయటం, రాసినట్లే ఉచ్చరిస్తా మనుకోవటం శాస్త్రీయం కాదు. ధ్వనులూ లిపులూ కాలక్రమాన సహజంగానే మారిపోతుంటాయి, దేని దారిన అదిగా. అంతమాత్రాన ఒకటి మారగానే రెండోది మారి తీరుతుందనేది వాస్తవంకాదు. ధ్వనులు మారగానే లిపి లేఖన సంప్రదాయాలు మారవు కాబట్టే ఈకాలంలో కూడా ప్రాచీనలేఖన సంప్రదాయాలు ఇంకా నిలిచిఉన్నాయి. 'ద్విత్వ' మంటే రెండు ఏకరూప హల్లులు అవ్యవహితంగా ఉచ్చరితం కావటం. లేఖనంలో ద్విత్వాన్ని సూచించేం దుకు శాసన భాషలో ఒకటికి మించిన పద్ధతులున్నాయి. పూర్ణబిందువు తరవాతి పరుష సరళాలనూ, వలపలగిలక తరవాతి హల్లులనూ ద్విత్వంగా రాసేవారు. 'గొరగల్గాక' అన్నచోట 'గొరగగాక' అని చదవకపోతే ఛందోభంగ మనే వేటూరివారి వాదం సరయిందే. కానీ, లకారాన్ని తేల్చిపలికినా ఊదిపలికినా లకారగకార సంయోగాలు ద్విత్వంకావు. కిటెల్ కన్నడంలో ఇటువంటి పరిస్థితిని 'fleeting double consonant' అనగా వేటూరి వారు ద్విత్వమని ఆపద్ధతిలో

ప్రసంగించారు. మరొకటి లిపిస్వరూపం మీద ఆధారపడి ధ్వని స్వరూపాన్ని వివరించే సంప్రదాయ పద్ధతి ఉంది. చిన్నయసూరి సంశ్లేషస్వత్వాలని ద్రుతాన్ని వివరించింది లిపిమీద ఆధారపడేగాని ధ్వనిమీద ఆధారపడి కాదు. ఈ విషయంలో శాస్త్రిగారు సంప్రదాయ ధోరణినే పాటించారు.

అయితే మహత్తుల ప్రథమైకవచన ప్రత్యయం విషయంలో వేటూరి వారు చెప్పిన ఒక్క వ్యాకరణ సూత్రమూ అద్భుతం. ఆరకమైన సంప్రదాయ పాండిత్యంగలవాళ్లు ఆ కాలంలో ఆసూత్రం చెప్పటమే ఆశ్చర్యకరం. డుజ్వర్ణకం ఎరువుమాటలకు చేరుతుందనీ, అది చేరేటప్పుడు ప్రాతిపదిక చివరి అత్తు ఉత్తుగా మారుతుందనీ మొదట కనిపెట్టిం దాయనే. తరవాతి సాంప్రదాయిక శాసన పరిశోధకులుగానీ శబ్ద చరిత్ర విద్యార్థులుగానీ ఆవిషయం గ్రహించలేదు సరికదా వివరించనైనా లేదు. అద్భుత మనడానికి కారణముంది. ఈనాటి భాషాశాస్త్రజ్ఞుల్లాగానే అర్ధశతాబ్దం క్రితం ఆయన తెలుక్కు సంబంధించినంతవరకూ సంస్కృత ప్రాకృతాలను కూడా అన్యదేశ్యాలుగా పరిగణించా రన్నమాట! అంతేకాదు. కయిరదు, కత్తళదు వంటి దేశ్యశబ్దాలకు డుజ్ పరమైనప్పుడు తత్పూర్వస్వరం మారటంలేదని కూడా ఆయన గమనించారు. చిన్నయసూరి అలాగే చెప్పినా ఆతడి దృష్టిలో రామాది తత్సమ శబ్దాలు అన్యదేశ్యాలు కావని గుర్తించాలి. భాషలో దేశ్యాన్యదేశ్య శబ్దాల రూపనిర్మాణ పద్ధతిలోని ఈ సూక్ష్మభేదం గుర్తించినందుకు ఆశ్చర్యపడక తప్పదు.

వేటూరివారు లిపిస్వరూప విషయంలో గమనించిన ఒక విషయం చాలా గొప్పది. 'న్ఱ' అనే సంయుక్తాక్షరం ఎక్కడ ఎప్పుడు ప్రయుక్తమయినా అది ముమ్మూర్తులా బండిరా లాగా ఉండే ఱకార రూపంలో లేదని ఆయన గమనించారు. నకారంతో సంయుక్తంగా ఉన్నప్పుడు శకటరేఫ స్థానంలో ఉందనుకుంటున్న ఆ చిహ్నం ఎప్పుడూ 'ఏ' రూపంలోనే ఉండేది. ఇతరత్రా అది '⊕' రూపంలో ఉండేది. అంటే కేవలం లిపిలోని సూక్ష్మభేదం ప్రకారమే గమనించినా, ధ్వనివిశేషంగా 'ఏ 'కున్న విలువ కన్నా, 'అఱ్ఱు, తూఱ్ఱు, ఆఱు' వంటి మాటల్లో 'కనిపించే' '⊕' కున్న విలువ భిన్నమయిందని గుర్తించగలం. శకటరేఫకు రెండురకాల లిపిరూపాలయినా ఉండాలి; లేదా రెండురకాల ఉచ్చారణలైనా ఉండాలని ఈ రూపభేదమే సూచిస్తున్నది. శాస్త్రిగారు 'ఏ' గా కనిపిస్తున్నది ఒకవేళ స్పర్శధ్వని విశేషమేమో అని సంశయించారు! అది అపూర్వం. అందుకనే ఆయన అది 'ణ్ఱ / న్డ'గా పరిణమించి వుంటుందని ఊహించారు. కోరాడ రామకృష్ణయ్యగారు 'వాండ్రు / వాణ్ఱు' వంటి శబ్దాల్లోని డకారం 'సహాయక ధ్వని' (help-sound) గా వచ్చిందని భ్రాంతి పడ్డారు. 'సహాయకధ్వని' అనే భావనే విడ్డూరమయింది. అది మరెవరికీ కలగలేదు. శాస్త్రిగారి వాదం సమంజసమనడానికి నిదర్శనంగా శాసనాల్లో నృపశబ్దాన్ని "ంద్రిప/న్ఱిప" అనే రూపాల్తో రాయటం, 'తాన్ఱి' శబ్దం 'తాణ్డి'గా, * తన్ఱిశబ్దం 'తండ్రి'గా పరిణమించటం మొదలయిన వాటిని ప్రదర్శించవచ్చు.

బహువచన రూపనిర్ణయంలో ప్రభాకరశాస్త్రిగారు సంప్రదాయమార్గం విడిచిపెట్టి, తమనాటి భాషాతత్వ శాస్త్ర వాదాలనే ప్రమాణంగా తీసుకున్నారు. ప్రథమా బహువచన ప్రత్యయం –'రు' నుంచి ప్రథమైక వచన ప్రత్యయం 'ణ్డు' ఏర్పడిందని గంటి జోగి సోమయాజులుగారిలాగానే తాము కూడా విశ్వసించారు. వారిద్దరూ 'వాండ్రు' నుంచి 'వాండు' అనే ఏకవచనరూప

ముద్భవించిందన్నారు. 'వాన్ఱు' అనేది బహువచన రూపమని భ్రమించారు. శాసన భాషను వారు సరిగా పరిశోధించలేదని ఈనాడెవరైనా అంటే అంతకన్నా అన్యాయం మరొకటి వుండదు. అప్పటికి దొరికిన ప్రాఙ్నన్నయశాసనాల సంఖ్యే అత్యల్పం. అందువల్ల శాసనవాక్యాలను పరిక్షుణ్ణంగా పరిశీలించే అవకాశమే లేదు వారికి. శాసన భాషలో 'వాన్ఱు' ప్రయుక్తమైన ఏ వొక్క వాక్యంలోనూ క్రియాపదం బహువచనంలో లేదు. కర్తా క్రియల మధ్య ఈ అన్వయం (Concord) తెలుగులో తప్పనిసరి కాబట్టి, 'వాన్ఱు' బహువచన రూపం కాదనే చెప్పాలి. మరోటి కేవలం సిద్ధాంత సంబంధి. అదేమంటే ప్రపంచ భాషలు దేనిలోనూ ఏకవచన రూపం మొదట లేక, బహు వచన రూపాలే ఉండి, వాటి నుంచే ఏకవచనరూపా లేర్పడ్డాయనటానికి నిదర్శనలు లేవు. ఈ ఒక్క శబ్ద విషయంలోనే ఇలా జరిగిందనటానికి బలీయమైన ఉపపత్తుల్లేవు. ఏకంలేని బహుత్వాన్ని ఏతత్వశాస్త్రమూ ప్రతిపాదించినట్లు లేదు.

మూడో కారణం మరొకటుంది. ఆనాటికి అంతగా ఆచరణలోలేని చారిత్రక - తులనాత్మక విధానం (historical - comparative method) అది. భాషారూప వైవిధ్యంలోనుంచి అంతఃపునర్నిర్మాణపద్ధతి ద్వారా (internal reconstruction method) పూర్వ రూపాలను పునరుద్ధరించటం సాధ్యం. అప్పటికి పునర్నిర్మాణ పద్ధతి (reconstruction method) వ్యాప్తిలో ఉందికానీ అంతర్నిర్మాణవిధానం వాడుకలోకి రాలేదు - తెలుగుదేశంలో. అందుబాటులోలేని శాస్త్రీయవిధానా లనుసరించలేదని ఎవర్నీ తప్పుబట్టటం భావ్యంకాదు. ఈ రెండు విధానాలద్వారా ప్రాచీనమైన 'న్ఱ' అనే సంయుక్త ధ్వని తెలుగులో మూడురకాలుగా పరిణమించిందని చెప్పవచ్చు. 1) న్ఱ > ణ్డ / న్డ : * కొన్ఱ > కొండ; 2) న్ఱ > న్ద : * పన్ఱి > పంది; 3) న్ఱ > ణ్డ్ర / ంద్ర : * తన్ఱి > తండ్రి. తండ్రి శబ్ద పరిణామాన్నీ వాన్ఱు శబ్ద స్వరూపాన్నీ బేరీజు వేసివుంటే ఈ రెంటిలోనూ ఉన్న 'ణ్డ్ర' ధ్వని ఏకవచన బోధకమేనని తేలేది. అయితే అందుబాటులోలేని సమాచారం, అలవాటులోలేని పద్ధతులూ నిందనీయాలుగాని వాటిని పాటించని వ్యక్తులు కారు. ఎన్ని సందర్భాల్లో పూర్వ పరిశీలకుల ప్రతిభాపాటవాలు బహిర్గతమైనాయో ప్రస్తావించటం కనీస మర్యాద. వారి పరిశీలనలో లోపం లేదు; పరిశ్రమలో నిర్లక్ష్యంలేదు.

ప్రభాకరశాస్త్రిగారు కొన్ని శాసనశబ్దాల విషయంలో చేసిన పరిశోధన దొడ్డది. 'కమ్మ కోమటి, వడ్డవారం, రెడ్డి, విగువ్వాణ, పెర్గడ, మావిండి / మొదలైన శబ్దాల విషయంలో వారి పరిశోధన ప్రశంసనీయం (చూ. శాసన విశేషములు, 1924). "11, 12, 13 శతాబ్దాలలోఁ గూడ నీయర్థానుస్వార పరిజ్ఞానము అస్పష్టముగానే" ఉందని ఆయన అప్పుడే గుర్తించారు. కూఁతుశబ్దం శకటరేఫాంతంగానే ఉందని ఆయన నిరూపించారు. "కన్నడ శాసనములందుఁ గూడఁ 'బెర్గడ' అన్నరూపము గానవచ్చుచున్నది. పెర్గడ నుండియే ప్రెగ్గడ పుట్టియుండును. పెర్గడ కింకను బ్రకృతి యేదో!" అన్నారేగాని తొందరపడి ఏదో ఒక నిర్ణయానికి రాలేదు - తాము చెప్పిందే నేటికీ సరయిన వ్యాఖ్య అయినా. ఈ నిబ్బరం పరిశోధకులు నేర్చుకోవలసిన శుభలక్షణం.

శాసన ప్రచురణలు, పాఠనిర్ణయం, చరిత్ర నిరూపణవంటివి ప్రధానమయినా ఆయన సాంస్కృతిక విషయాలను మరిచిపోలేదు. శ్రీనాథుడి తాతగారి కల్పట్టణం కోసం ఆయన వెతుకునే ఉన్నారు. మాచల్దేవినీ మరిచిపోలేదు! కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు వెతికి వెతికించి వేసారిన ఆవూరు నెల్లూరి దగ్గరి కృష్ణపట్టణమని చిలుకూరి వీరభద్రరావుగారు వాదించారు. ఒంగోలు దగ్గరి కొత్తపట్నమని కందుకూరి వీరేశలింగంగారు విశ్వసించారు. ప్రభాకరశాస్త్రిగారు బందరు దగ్గరున్న కాలీపట్నం / కలుపట్టన మన్నారు. ఈ చివరిమాటే సరయిందని కొమర్రాజు వారు సమర్థించారు. బాపట్ల తాలుకాలో దొరికిన రందుబల్లి తామ్రశాసనం (క్రీ.శ. 764-99; CP No. 2/1914-15 - transcript)లో 'కల్పట్టనబు' 27వ పంక్తిలో కనిపిస్తుంది. అది ఏనాడో సముద్రగర్భంలో కలిసిపోయి ఉండాలి. ఇది 1913లోనే దొరికినా, దాన్ని ప్రచురించదలచిన పెద్దలిద్దరు – హుల్ష్, కృష్ణశాస్త్రులు – ప్రచురణకు సిద్ధం కాగానే కన్ను మూశారు. కాబట్టి దానిజోలికి పోవద్దనీ, మొత్తం శాసనాన్ని ప్రచురించవద్దనీ హెచ్.కె. నరసింహస్వామిగారు నిషేధించారు. ('ప్రాచీనాంధ్రశాసనా'ల్లో 200వ పేజీల్లో చూడవచ్చు). శాసన పరిశోధకుల పాట్లివి. పరిస్థితి ఇప్పుడే ఇలా వుంటే శాస్త్రిగారి కాలంలో ఎలా ఉండేదో ఊహించాల్సిందే.

మొత్తంమీద ఎన్నో అపూర్వ విశేషాలు చెప్పిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శాసన పరిశోధకులకు ఆరాధనీయులు. నాకున్న సంకుచిత పరిధిలో ఇంతకన్నా ఇప్పుడేమీ చెప్పలేనందుకు క్షమార్హుణ్ని. నాకీ అవకాశం కల్పించిన వారికి ధన్యవాదాలు.

– వేటూరి ప్రభాకరశాస్త్రి శతజయంతి విద్వద్గోష్ఠిలో సమర్పించిన వ్యాసం : 9.2.1988

# 1. విషాదనాటకమా? విషాదాంత నాటకమా?

నేడు విషాద నాటక మనబడుతున్న దానికి ఆంగ్ల భాషలో 'Tragedy' అని పేరు. ఆంధ్రీకరణంలో సంకుచితత్వం ఏర్పడి అది "విషాదాంత నాటక"మని అనువదింపబడ్డది. పాశ్చాత్యులాపదానికిచ్చిన నిర్వచనాన్ని పరిశీలించి, అటు పిమ్మట సరియైన ఆంధ్రానువాదాన్ని సంతరించటం భావ్యమని నా ఊహ. "అర్థత శ్శబ్దత శ్చాపి మనా క్యావ్యార్థ సూచనమ్-" అని కదా పండిత ప్రవచనము?

'Tragedy' అనే పదాన్ని మొదట నిర్వచించినవాడు 'Aristotle అనే పాశ్చాత్య వేదాంతి (384-322 B-C):-' "Tragedy is an imitation of an action that is serious, complete, and of certain magnitude... in the form of an action, not of narrative; through pity and fear affecting the proper purgation of emotions" (cf : Poetics). పరిపూర్ణము, తీవ్రమూ, పరిమితము, ఐన నటనను – కరుణభయాలు స్ఖాలిత్యం లేని భావోద్వేగాన్ని కల్పించేటట్లుగా – నటనలోనే అనుకరించటం 'tragedy' అని ఆనిర్వచనము. శబ్ద నిరుక్తాన్ని పరిశీలిస్తే (tragedy - tragos, a he-goat; ode, song) "గొఱ్ఱె పాట" అనే అర్థం ద్యోతకమౌతుంది. Dionysos అనే గ్రీకు దేవుడు గొఱ్ఱె చర్మం ధరించేవాడని, వాని నారాధించేవాళ్ళు పాడే విచారపూర్వక గీతం, 'tragedy' అని పిలవబడుతున్నదనీ, పండితాభిప్రాయము. (cf: The Origin of Tragedy and Akhyana, by A.B. keith). అనగా మొత్తంమీద విచారస్ఫోరక గీతమే నేటి 'tragedy' అని భావము. లండోవికో కాస్టెల్ వెట్రో (1570 A.D.) అనే పాశ్చాత్య విద్వాంసుడు అరిస్టాటిల్ నిర్వచనాన్ని వ్యాఖ్యానిస్తూ ఈరకం రూపకం కరుణ భయాదిరసాలను ప్రతిపాదిస్తూ సుఖాంతంగా గాని, దుఃఖాంతంగాగాని వుండవచ్చు నన్నాడు (cf: Ency. Brit; on "Drama"). ఈ అభిప్రాయాన్ని లక్షణాన్ని సమర్థించటానికి కొన్ని నిదర్శనాలు ఇస్తాను.

సోఫోకిల్స్, యూరిపిడస్, యాశ్చిలస్ అను కవిత్రయాన్ని "Attic tragedy" నిర్మాతలనుగా పాశ్చాత్య లోకం సంభావిస్తున్నది. వారిలో Sophocles శతాధిక గ్రంథ నిర్మాత. వాని 'Electra' అనే రూపకాన్ని పండితులందరూ 'tragedy' అనే భావిస్తున్నారు. కాని సుఖాంతంగానే అది వున్నది. అట్లే Aeschylus వ్రాసిన 'Prometheus vinctus' అనే రూపకం కూడా సుఖాంతమే అయినా కరుణరసాంగీభావంచేత 'tragedy' అని పిలవబడుతున్నది. వీటినిబట్టి చూస్తే 'tragedy' అనేది కేవల విషాదాంతమే కానక్కరలేదని ద్యోతకమౌతున్నది. అరిస్టాటిల్ నిర్వచనంలోని భయశబ్దానికి వీరరౌద్ర బీభత్స భయాన కాదులు తుల్యం కాగలవని నా నమ్మిక. Shakespeare వ్రాసిన 'Julius Ceaesar'లో వీరరౌద్రాలూ, "Macbeth" లో బీభత్స భయానకాలు విశిష్టంగా కనిపించటంచేత నా అభిప్రాయం నిజం కావచ్చు. కాబట్టి 'tragedy' అనే పదానికి "విషాద నాటకము" – అనటమే సరియైన ఆంధ్రీకరణమనీ, దానిలో పైచెప్పిన అయిదు రసాలూ వైశిష్ట్యాన్ని పొందవచ్చుననీ భావిస్తున్నాను.

విషాద నాటకాలు, పాశ్చాత్యుల నిర్వచనకు సరిపడ్డవి, భారతీయ సాహిత్యంలో ఉన్నవా,

లేవా, అనేది తరువాతి ప్రశ్న, Dr. Hoestel అనే పండితుడూ, Von Schroeder అనే విద్వాంసుడూ, గ్రీకు దేశంతో భారత దేశానికున్న సంబంధ బాంధవ్యాలను పురస్కరించుకొని క్రీస్తు పూర్వం అయిదో శతాబ్దంలో గ్రీకు దేశంలో ఉన్న విషాదనాటక ప్రభావం భారతదేశానికి కూడా ప్రసరించిందని భావిస్తున్నారు. బహుశః భాసకృతమైన ఊరు భంగాన్ని చూసి వారిట్లా భావించి వుండవచ్చును. భానునికి, గ్రీకు విషాదనాటక నిర్మాతలకు, మధ్యగల కాల వ్యత్యయ సామీప్యాన్నిబట్టి వారీమార్గాన్ని తొక్కగలిగారు. ఆ విషయానికివస్తే – ఋగ్వేదంలోని యమీ యముల సంవాదం, ఆపాలవృషగౌతముల చర్చ మొదలైనవి విషాదనాటక మూల ప్రకృతులని వాదింపవచ్చు. యమియమునితో వివాహాన్ని అపేక్షించగా యముడు ధర్మవిరుద్ధమని తిరస్కరించటము, పురూరవుడు అననుకూలగా ఉన్న ఊర్వశిని, "హయే జాయే మనసాతిష్ఠ ఘోరా వచాంసి మిశ్రా కృణవాహై ను" అని పిలిచి, బోధించి, విఫలుడు కావటమూ, విషాద నాటకాద్యరూపాలని పెక్కురు భావించకపోలేదు. ("..... these contributed as much to the origin of drama as to the origin of epic."- Dr. Winternitz in his "Ostasitische Zeishift." Refer to Das Gupta's work, "Indian stage" Vol 1: for element of Indian drama). ఐతరేయ బ్రాహ్మణంలోని శునశ్శేఫ వృత్తాంతమూ, దాని విషాద పరిణామమూ అట్టిదే. ఈలాటి వాటిని చూచియే భారతీయ నాటక మూలములు వేదములందే గలవని పండితు లూహించుచున్నారు. ("Indian Drama is but a growth of the dialogues, and Vedic hymns represent the begenings of a dramatic art" - Dr. Hertel).

అయితే ఒకటి మాత్రం మరవరానిది : ఒకే విషయాన్ని పరిశీలించటంలో ప్రాక్ప్రతీచీ పండితులకు భిన్నదృక్పథా లున్నవి. పతంజలి మహాభాష్యంలో నిరూపించిన కంసవధా బలి వధలనే నాటకాలలోని కృష్ణవిష్ణునుయాయులైన రక్తముఖులను భారతీయ విద్వాంసులు నాయకులనుగా భావించి ఆనాటకాలను సుఖాంత నాటకాలనుగా తలపోస్తుంటే, పాశ్చాత్య పండితులు కంసబల్యనుయాయుల కానాయకత్వాన్ని ఆరోపించి కాలముఖనాశం కారణంగా అవి విషాదనాటకా లవుతున్నవని భావిస్తున్నారు. (cf, Keith in his" Origin of Tragedy and Akhyana)". అదేవిధంగా భాసకృతోరుభంగంలో తెరమీద కైనా రాని భీముడే నాయకుడని మన ఆలంకారికులు ఊహించారు. పాశ్చాత్యులు రంగస్థలంలోనే వేదికమీద హతుడైన దుర్యోధనుని నాయకునిగా భావించి దాన్ని విషాద నాటకంగా అనుమానిస్తున్నారు (cf: Winternitz's O.Z He believed in the element of tragedy but disbelieved Bhasa's authorship). పాశ్చాత్య దృక్పథంలో, దుర్యోధనుడు "హంత! కృతం మే హృదయానుజ్ఞాతం.... అయ మాగచ్ఛామి" అని రంగవేదిపై మరణించిన తరువాత, యవనికాప తరణం జరిగిన తర్వాత, (cf: Bhasanatakachakram ed: by Divadhar for Poona Oriental publications) భరతవాక్యార్థం రచింపబడిన వసంతతిలకా వృత్తంలోని రెండు పాదాలను "యా మ్యేష సజ్జధనాని తపోవనాని, పుత్రప్రణాశవిఫలం హి ధి గస్తు. రాజ్యమ్" అని ధృతరాష్ట్రుడు – "యాతో ద్య సౌప్తికవధోద్యత బాణపాణిః" అని ఒక పాదాన్ని అశ్వత్థామ

ఉపయోగించుకొన్న తరువాత, బలదేవుడు తొందరపడి "గాం పాతు నో నరపతిః శమితారి పక్షః" అని భరతవాక్యం చెప్పటమనేది – భారతీయాలంకారికులను భాసు దవహేళనం చేసినట్లే.

కాబట్టి భారతీయాలంకారికు లొప్పకపోయినా, ఉత్తరరామచరిత్ర, నాగానందము, ఊరు భంగము మొదలైనవి పాశ్చాత్య దృక్పథంలో, వారి నిర్వచనానికి బద్ధపడిన విషాదనాటకాలే అవుతున్నవి. అయితే యీ విషాదనాటకరచనకు గ్రీసు దేశ ప్రభావమే హేతువుకాదు. లోకవృత్తానుకరణమే కారణము. "సప్తద్వీపానుకరణం హి నాట్య మి త్యభిధీయతే" అని "లోకవృత్తానుకరణం మే లోకేஉస్మిన్ నాటకం మతమ్" అనిన భరతాచార్యుల కామాటలనుటలో ఏభావమున్నదో అదియే యిందుకు హేతువు. ఆనందజనకత్వమే భారతీయాలంకారికుల దృష్టిలో రూపకనిర్మాణపరమావధి కావున, విషాద మందును ఆనందముండుటచేత, విషాదనాటక రచనాన్ని మనం కాదనరాదని నా ఆశయము.

కరుణాది రసాలు కూడా ఆనందజనకములే అని చెప్పటానికి పాశ్చాత్య పండితులు వెనుదీయలేదు. ఆధికారిక రచనలు చేసిన భారతీయాలంకారికులలోనూ, కొంద రీభావాన్ని ఆమోదించి ప్రవచించినవారు లేకపోలేదు. అందుకొక నిదర్శనాన్ని చూపుతాను.

అభినవగుప్తపాదులు కరుణప్రతీత్యవసరంలో ప్రేక్షకునికి హృదయ విశ్రాంతి కలుగుతుందనీ, ఈ అంతరాయ శూన్య విశ్రాంతి మనస్స్థితికి సంబంధించినదనీ, ఇట్టి విశ్రాంతియే సుఖమనీ, ఏతద్విశ్రాంతి చాంచల్యమే దుఃఖమనీ అంటున్నారు. (తథాహి – ఏకఘనశోక సంవిచ్చర్వణేஉపి లోకేஉస్తి లోకస్య హృదయవిశ్రాంతి రంతరాయశూన్యవిశ్రాంతి శరీరత్వాత్ (సుఖస్య) అవిశ్రాంతి రూపతైవ చ దుఃఖం; తత ఏవ కాపిలైః దుఃఖస్య చాంచల్యమేవ ప్రాణత్వేనోక్తం రజోవృత్తినాం వదద్భిః ఇత్యానంద రూపతా సర్వరసానామ్. కిం తూపరంజక విషయవశాత్ తేషా మపి కటుకతా స్పర్శోస్తి వీరస్యేవ (?) సాహిక్లేశ సహిష్ణుతాదిప్రాణ ఏవ (see Abhinava bharati, Vol. 1; p283-cf. Some Aspects of Literary Criticism in Sankrit by Dr. A Sankaran). ఈవాదం, మనశ్చాంచల్యమే దుఃఖ ప్రతీతి అని, మనస్సు ఊహారంజక వశత్వాన్ని పొంది అంతరాయశూన్య విశ్రాంతిని అనుభవిస్తున్న ప్రేక్షకునకు దుఃఖంకూడా సుఖదాయకమే అనే సాంఖ్య సిద్ధాంతాన్ని అనుగమిస్తున్నది. రసాస్వాదనంలో అద్వైతభావాన్ని పొందే ప్రేక్షకునికి విమర్శనదృష్టి వుండదుకదా!

అందుచేత విషాదనాటకంకూడా ఆనందదాయకం కావచ్చుననీ, కరుణరస ప్రతీతి దుఃఖదాయకం కానేరదనీ, భగ్నావరణచిద్విశిష్టమైన నిరావరణచైతన్యాన్ని పొందే రసానందానుభవ సందర్భంలో దుఃఖానికి తావులేదనీ, ఆస్వాదనీయం కాకపోతే భరతాదులు కరుణ కొక రసస్థానాన్ని ఇచ్చి వుండేవారు కారనీ, ఆస్వాదిత రసవిషయంలో అనుమానవిమర్శనలకు తావులేదని నేను భావిస్తున్నాను.

– సుభాషిణి (మాసపత్రిక), అక్టోబరు 1951.

# 2. విషాద నాటకము - లక్షణాలు

గత వ్యాసంలో "Tragedy" అనే శబ్దాన్ని 'విషాద నాటకము' అనే అనువదించాలని నా అభిప్రాయాన్ని వ్యక్తీకరించాను. అది కరుణ భయ భయానక వీర రౌద్రరసాలలో కనీసం ఏ ఒక్కదాన్నైనా ప్రతిపాదించాలని ఆశించాను. అది కేవలం సుఖాంతమే కానక్కరలేదనడానికి ఒకటి రెండుదాహృతులనే యిచ్చాను. ఈసారి అందుకు మరిన్ని నిదర్శనలు సంతరిస్తూ దాని లక్షణాలను విస్పష్టంగా నిర్వచింపదలుచుకొన్నాను. అరిస్టాటిల్ చేయగలిగింది తనకు పూర్వం వున్న విషాదనాటకాలను పరిశీలించి, వానిలోని విభిన్న లక్షణాలను సంఘటితపరచి, లక్షణ సమన్వయం చేయటం మాత్రమే. కాని ఆతడు లక్ష్యాల నన్నిటినీ గ్రహించి లక్షణాలు చెప్పాడా, కేవలం ఆత్మమార్గంలోనే సంచరించాడా అనే విషయాన్ని చర్చిస్తూ, స్థూలంగా విషాదనాటక స్వరూపాన్ని చిత్రించకపోతే నా వాదం నాకే సమర్థనీయంగా కనిపించదు.

అరిస్టాటిల్ విషాదనాటక స్వరూపాన్ని చిత్రించేటప్పుడు తన్మూల ప్రకృతియైన గాథను (Plot) మూడుగా విభజించాడు. అందులో మొదటిదానికి అవస్థావిపర్యాసమనీ (Reversal of Fortune), రెండవదానికి విషయజ్ఞాపనమనీ (Recognition), మూడవదానికి విషాదగతి (Tragic Incident) అనీ పేర్లు పెట్టాడు. ఇవన్నీ గుణాన్నిబట్టి వర్ణింపబడ్డ భాగాలే. (Cf: Aristotle, Poetics, xi, 1452, a and b : "A Reversal of Fortune is, as we have said, a change by which a train of action produces the opposite of the effects intended; ... A Recognition, as the name indicates, is a change from ignorance to knowledge, producing love or hate between the persons destined by the poet for good or bad fortune: ... The Tragic Incident is a destructive or painful action such as death on stage, bodily torments, wounds and the like"). ఇందులోని ఒక్కొక్క భాగాన్ని తీసుకొని, వ్యష్టిగా ఒక్కొక్క లక్షణాన్ని విమర్శించటం మంచిది. అవస్థావిపర్యాస మన్నప్పుడు సుఖ దుఃఖాలను చక్రనేమిక్రమంలో నిరూపించటం భావ్యం కాకపోదు. అంటే విషాదనాటకం సుఖాద్యము దుఃఖాంతము కానక్కర లేదని తెలుస్తుంది. అదేవిధంగా విషయ జ్ఞాపనంలో కూడా సుఖాంతం కావచ్చుననే సూచన కనిపిస్తుంది. అయితే విషాదగతి నిర్వచనంలో మరణంకానీ, దైహిక బాధలుకానీ, గాయాలు కానీ, అలాంటిదే మరేదైనాకాని, వుండవలెననే నియమం కనిపిస్తున్నది. మొదటి రెండు విషయాల్లోనూ, ఇతరత్రాను, అరిస్టాటిల్ వ్రాసిన పదాలనుబట్టి, లక్ష్యపద్ధతిని బట్టి, సుఖాంత విషాదనాటకా లున్నవనే తోస్తున్నది. ఇకముందు నేను వ్రాసే కారణాలవల్ల విషాదగతి నిర్వచనంలో మరణశబ్దానికి బదులు దైహిక మానసిక నిపాతాలని, భౌతిక బాధలనటానికి బదులు భౌతికాధ్యాత్మిక విపరిణామాలని, అర్థం కల్పించుకోవలసి వుంటుంది.

అట్టి మార్పును చేయటానికి గల హేతువేదో ప్రస్తుతం నిరూపిస్తున్నాను. "Attic Tragedy" నిర్మాతలు అరిస్టాటిల్‌కంటె పూర్వులు కాబట్టి, గ్రీకు దేశ విషాద నాటకాలలో అధికభాగం వాళ్లు వ్రాసినవే కాబట్టి, విషాద నాటక స్వరూప నిర్మాతలు వాళ్ళే కాబట్టి, లక్ష్యాలనుబట్టి

లక్షణాలను మార్చుకోవలసి వుంటుంది. ఆలంకారికులెంత అధికారిక రచనలు చేసినా లక్ష్యశుద్ధిని ధిక్కరించడానికి వారికి అధికారంలేదు. యాశ్చలస్ వ్రాసిన 'Oresteia', యూరిపెడిస్ వ్రాసిన 'Iphigneia in Tauris', సోఫోకిల్స్ వ్రాసిన "Electra, Philoctetes, Oedipus at Colonus" మొదలైన విషాదనాటకాలన్నీ సుఖాంతాలే. ఈలాటివి అనేకమున్నాయ్, గ్రీకు సాహిత్యంలో. ఒకచోట విషాదనాటకము సుఖాంతము, దుఃఖాంతము కావచ్చునని ఒప్పుకొన్న అరిస్టాటిల్ – తనకు నచ్చినవనే కుంటిసాకుతో, తానెంతటివాడైనా దుఃఖాంత విషాదనాటకాలే రమ్యతరాలనటం వితండవాదం. ఒకరి అభిరుచులకూ లక్ష్యలక్షణ నిర్ధారణకు సంబంధమే లేదు. అది అపచారమే; అసంగత ప్రసంగమే.

ఇది చిన్న పొరపాటే కావచ్చు; అతడు మాత్రం పెద్దవాడే. అందుచేతనే జగతీప్రతీతిలో అతగాడి మాటలకు విలువ ఏర్పడింది; అతణ్ణి గుడ్డిగా అనుసరించటంవల్లనే 'Tragedy' అనే పదానికి "విషాదాంతనాటకమ"నే దురర్థం కల్గింది. అందుకనే పాశ్చాత్య పండితు లనేకులు ఈ దుర్భావాన్ని నిశితంగా ఖండించారు. (Cf: Prof. C.M. Bowra, in 'Sophoclean Tragedy', p. 261: "Aristotle recognises a kind of tragedy in which the change of fortune is from bad to good... In his concentration on plays which end unhappily he neglected a large part of Greek Tragedy... Yet despite their happy endings these plays are cast into so serious a spirit and deal with issues of such gravity..."; Also Gilbert Norwood in "Greek Tragedy": "But the difficulty arises from a mischievous idea that the culmination of every tragedy is hero's death; Ibid: "We are only prevented from seeing this at first by the modern supposition that a culmination of a tragedy is the death of a leading person, not a spiritual crisis".)

ఇంకా చెప్పాలంటే సోఫోకిల్స్ వ్రాసిన 'Ajax'లో కథానాయకుడు చనిపోయిన తర్వాత సుమారు 600 వాక్యాలు జరిగినమీదగాని నాటకం పరిసమాప్తము కాదు. 'Electra' మనోజ్ఞోషః కిరణాలతో మొదలుపెట్టి కథానాయికా పరిస్థితులు శుభాంతం కావటంతో సంపూర్తి పొందు తుంది. 'Oedipus at Colonus' లో నిరాశా నిస్పృహుడైన అసమర్థ నాయకుడు మహానుభావు డౌతాడు. యూరిపిడస్ వ్రాసిన "Iphigeneia in Tauris" లో అరిస్టాటిల్ స్వయంగా చెప్పినట్లుగానే, అధికారి తన కష్టాల నన్నిటినీ అధిగమిస్తాడు. అతనిదే ఐన 'Hercules Furens'లో ఆధ్యాత్మిక శోభనమే అంతంలో ప్రతిపాదింపబడింది. వీటన్నిటికంటె యూరిపిడస్ వ్రాసిన 'Alcestis' మహా విచిత్రమైనది. ఇందులో భర్తృప్రాణ రక్షణార్థము Alcestis స్వీయప్రాణాలను బదులిస్తుంది. కాని ఆమెకు పునఃప్రాణ ప్రతిష్ఠ జరగటంతో కథ సుఖాంత మౌతుంది. Admetus గృహంలో చిరునవ్వు వెన్నెలలు వెల్లివిరియటంతోను, Chorus భగవచ్చిత్రాలను కీర్తించటంతోను, నాటకాంతము సుఖాంతమై పోయింది. దీన్ని సుఖాంత నాటకమని కొందరు, నీతి ప్రతిపాదక నాటకమని, అధిక్షేపక రూపకమని (Satyric drama) కొందరు భ్రమించారు. కాని అదేమీ కాదు. అనేక విషయాల్లో శ్రీహర్షుని నాగానందానికీ, దీనికీ పోలికలున్నయ్. కథా ప్రధానపురుషులు మళ్లీ జీవించేటట్లైతే వారు నాటకంలో మరణించినట్లు

వ్రాయవచ్చునని మన ఆలంకారికులే అంగీకరించారు. (చూ. భావప్రకాశము : "అధికారి వధస్యాఽపి క్వచిత్ స్యా త్కల్పనం మతమ్, పునఃప్రత్యుజ్జీవిష్యతే యది").

అంటే భారతీయాలంకారికుల అభిప్రాయదార్ఢ్యం సన్నగిల్లిం దన్నమాట. నవీనులందరూ పురాతనులలో కొందరూ, దీన్ని విషాద నాటకమని అంగీకరించారు. (Cf: G. Norwood in Gr. Tr., pp. 187-8: .... "none the less the work belongs to the sphere of tragedy... Admetus' despairing address to his wife; ... the cold aspect of his widowed house; the magnificient and lovely odes, above all the song... - these are thoroughly suited to a tragedy"). ఈలాంటి మాటలవల్ల మరణమే కాక ఆధ్యాత్మిక భ్రష్టత్వము (Spritual crisis) కూడా విషాదనాటక పరమలక్షణ మనవచ్చు. అధర్మపరాభూతికూడా అట్టిదే.

ఈలాటి లక్ష్యశుద్ధినిబట్టి, ఈ దృక్పండితాభి ప్రాయాన్నిబట్టి విషాదనాటకాలు సుఖాంతాలు కావచ్చుననే నిశ్చితాభిప్రాయానికి వచ్చాను. అసలు లక్షణాన్నిబట్టి విషాదనాటకం రెండు రకాలని చాలామంది భావించారు. మొదటి రకం వధ ప్రధానములు (Tragedies of action). రెండవజాతి బాధా ప్రధానమ్ములు (Tragedies of suffering). బాధాశబ్దానికి దైహిక మానసిక వికల్పాలలో ఏదైనా అర్థం కావచ్చునని నా ఊహ. (cf: T.B.L. Webster's 'Sophocles', p. 102). "ఇష్టవధ దర్శనాద్వా విప్రియవచనస్య సంశ్రవాద్వాఽపి, ఏభి ర్భావ విశేషైః కరుణరసో నామ సంభవతి –" అన్న భరతాచార్యాభిప్రాయాన్ని పురస్కరించుకొని, వధను పరిహరించినా కరుణప్రతీతి తగ్గదని చెప్పవచ్చును. "రౌద్రాత్తు కరుణో రసః, వీరాచ్చై వాద్భుతోత్పత్తి ర్బీభత్సాచ్చ భయానకః" అన్న ఆచార్యాభిప్రాయాన్నిబట్టి ముందుగా నేను విన్నవించిన ఐదురసాలకు గల సాన్నిహిత్యాన్నిబట్టి, అవి విషాదనాటకాంగీభూతాలు కావచ్చు.

ఇక నేను చర్చించాలిసింది ఒకే ఒక విషయం. నాగానందాదులను నాటికలనీ, ఊరు భంగాదులను ఉపరూపకాలనీ మన ఆలంకారికు లంటున్నారు. అందుచేత విషాదనాటకాలని వీటిని వ్యవహరించరా దనవచ్చు. నావాదా న్నీవిధంగా సమర్థించుకుంటాను. గ్రీకు సాహిత్యంలో గుణాన్నిబట్టి, పరిమాణాన్నిబట్టి విషాదనాటకాలు మూడు రకాలుగా విభజింపబడ్డవి. (1. Chorus of the Ancient Greeks; 2. Attic Tragedies which are mainly dialogues and triologues of short duration ; and 3. Lengthy tragedies like Hamlet, King Lear, etc.,). Aly అనే పాశ్చాత్య విద్వాంసుడు 'Chorus' అంటే 'Tragedy' అనే పురావ్యవహారమున్నదని వాకొంటున్నాడు. (cf: Phil. Suppt. xxi. 3, p.93). అందుచేత పరిమాణాన్ని బట్టికాక, గుణలక్షణాలను పురస్కరించుకొని వ్యవహరించటం పండిత మార్గమని నేను భావిస్తున్నాను. మరొక్క మాట చెప్పవలసి ఉన్నది. విషాద నాటకాలు రాజవ్యవహారప్రదర్శకాలని అరిస్టాటిల్ అన్నాడు. కొందరు పండితులు కూడా అలాగే భ్రమించారు. కాని "Attic Tragedies" నూటికి ఎనభైపాళ్ళు గృహవ్యవహారాదులను చిత్రించినవే. కావున లక్ష్యాలనుబట్టి విషాదనాటకములో రాజవ్యవహార గృహవ్యవహార సంఘవ్యవహారాదులను చిత్రించవచ్చునని ఒక సవరణ ప్రతిపాదిస్తున్నాను.

విషాదనాటకాలు లేనంతమాత్రాన సాహిత్యానికి లోటులేకపోవచ్చు. అందు చిత్రించదగిన వాటిని నవలలో వ్రాస్తామనవచ్చు. మన కావ్యాలను పాశ్చాత్య దృష్టిలో ఎందుకు విమర్శించాలి అనవచ్చును. కానీ పాశ్చాత్య మహాకవులతో మనకవులనూ, వారి అభిప్రాయాలతో మన అభిమతాలను సమన్వయించి విస్తరించటం నాగరకతాలక్షణము. ఏక ప్రపంచ వ్యవస్థ కోరేవారు సర్వలక్షణ సమన్వయంచేసి, వ్యష్టిగతవైవిధ్యాలను సమష్టి సాధారణ్యాలనుగా సమీక్షించి, సాహితీ స్వభావ మానవస్వభావాలను అవగాహనం చేసుకోవాలి. దీనివల్ల ఏజాతికీ అగౌరవంలేదు. లోటులేదన్నమాట నేనొక్కడినే అనలేదు; అరిస్టాటిల్‌కు చదువుచెప్పిన 'Plato' అన్నాడు. "The genius of comedy is the same with that of tragedy". అంతమాత్రాన సత్యాన్వేషణం ఆపకూడదని నా ఆశంసము.

ఇంతవఱకూ నాకులభించిన విషాదనాటక లక్షణాలను వ్యక్తీకరించాను. లక్షణాలనుబట్టి లక్ష్యాలను అందరూ పరిశీలించుకోవచ్చును. అవసరం వస్తే, అవకాశం వుంటే ఆ బరువుకూడా నేనే మోస్తాను. ఆ చదువు కూడా నేనే చెప్తాను. స్థూలంగా లక్షణాలను చెప్పదలచాను కాబట్టి పృథగ్ వ్యాపారాన్ని ప్రస్తుతం చెప్పబోను. అంత అవకాశం రావాలిగాని వెనుకాడబోను.

– సుభాషిణి (మాసపత్రిక), నవంబరు 1951

# 3. స్వాతంత్ర్య సమరంలో తెలుగువారి జాతీయకవితలు

స్వాతంత్ర్య సమర స్వర్ణోత్సవాల సమయంలో సమరకాలంలో వెలువడ్డ తెలుగు సాహిత్యాన్ని స్మరిద్దాం. 1857లో ప్రథమ సమరం జరిగింది. ఆ తరవాత కాలక్రమాన మహోద్యమాలు వచ్చాయి. వాటన్నిటినీ పేర్కొనటం అసాధ్యం. ప్రధానమైనవి వందేమాతరం, సహాయ నిరాకరణ, క్విట్ ఇండియా ఉద్యమాలు. వాటిని పురస్కరించుకొనీ ఉద్యమ నాయకులనూ దేశమాతనూ ప్రస్తుతిస్తూనూ వందల సంఖ్యలో కవులు వేల లక్షల పద్యాలనూ పాటలనూ రాశారు తెలుగులో. వాటిలో ప్రజలను ఉద్రూతలూగించి కార్యోన్ముఖులను చేసినవి కొన్ని; జాతీయతాభావం నెలకొల్పినవి అన్నీ. విశ్వనాథ సత్యనారాయణగారి మాటల్లో "పద్యములు వ్రాసిన వారిలో సగానికి సగముగా నొడ్డున కూర్చున్నవారు. గేయములు వ్రాసినవారిలో నూటికి 90 మంది నిప్పులో నురికినవారు. నిప్పుల యొడ్డున కూర్చున్న వారు... ప్రధానమైనవారు శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారని చెప్పవలయును." అది నిష్పాక్షిక భాషణ మనవచ్చు.

సమర సమయంలో గాంధీజీని అవతారపురుషుడని భావించి ఆయన మీద స్తోత్రాలు, దండకాలు, వ్రతకల్పాలు, సంధ్యావందనాలు కూడా వెలువడ్డాయి. 'గాంధీకవి' అని పేరు మోసిన తుమ్మల సీతారామమూర్తిగారి చేతి మీదుగా దాదాపు పదిహేను వేల పద్యాలు విద్యావంతులను మాత్రమే ప్రబోధిస్తే, గేయాలు ప్రజాసామాన్యాన్ని ప్రభావితం చేసి ఉద్యమింపజేశాయి. నవలలు, నాటకాలు, వ్యాసాలు వగైరా భిన్న సాహితీ ప్రక్రియల్లో దేశభక్తి ప్రచారం జరిగింది. వాటన్నిటినీ ప్రస్తావించలేం. జనసందోహాన్ని కదిలించిన పద్యగేయాలను ప్రస్తావిద్దాం. ఈ మొత్తం సాహిత్యంలో గరిమెళ్ళవారు మకుటంలేని మహారాజులు. ఆయన రచించిన ఇతర సాహిత్యం అల్పాల్పం.

ప్రథమ సంగ్రామ సమయంలో తెలుగు కవుల రచనలేమో తెలియదు. 'వందేమాతరం' ఉద్యమం మొదలయ్యీ కాకముందే ఒక అజ్ఞాతాంధ్రకవి 1905 నాటి 'కృష్ణాపత్రిక'లో రాసిన ప్రబోధ గీతమొకటి దొరుకుతున్నది. భారతమాత తన బిడ్డలను ప్రబోధిస్తూ "హిందువులారా! ఎన్నాళ్లీగతి, మందమతులరై మాటికి చెడెదరు? ఇకనైనను మీరెల్లరు నొకట్టై, ప్రకటింపుడు నాపై ప్రేమమ్మును" అన్నదని కవి భావించాడు. లాలా లజపతిరాయిని మాండలే జైలుకు పంపినప్పుడు 1907లో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రాసిన పద్యాలు తొలితరం దేశభక్తి రచన. "భరతఖండంబు చక్కని పాడియావు, హిందువులు లేగదూడలై యేడ్చుచుండ, తెల్లవారను గడుసరి గొల్లవారు, పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" అని బాధపడ్డాడు. 1908లోనే విద్యార్థులు దేశమాతను ప్రార్థిస్తూ రహస్యంగా పాడుకున్న గీత మని ఉప్పల లక్ష్మణరావుగారు తమ 'బతుకుబాట'లో పేర్కొన్నది "వందనం ఖఖండ భరతవర్ష జననీ! వందనం, సుందరామల మందపవనానంద దాయినీ! తుందిలశరదిందుకళా బృంద శోభినీ! జననీ! వందనం" అనేది. అది బంకించంద్ ఛటర్జీ రాసిన 'వందేమాతరం' గీతంలా నడిచిందని తెలుస్తూనే ఉంది.

ఛటర్జీ రచనే మన మొదటి 'జాతీయ గీతం'. (రవీంద్రనాథ్ ఠాకుర్ రచన 'జనగణ మన ...' అనేది బ్రిటిష్ యువరాజును 'భారత భాగ్యవిధాతా!' అని సంబోధించి రాసిందనేది ప్రస్తుతం సుప్రీంకోర్టులో నడుస్తున్న వివాదం).

'దేశమును ప్రేమించుమన్నా' అన్న గురజాడ అప్పారావుగారి గేయం 1910 నాటి 'ఆంధ్ర భారతి' పత్రికలో వచ్చింది. ఆయన ప్రకృతిరూపంలో కాక ప్రజారూపంలో దేశాన్ని ఆరాధించారు. స్పష్టంగా భారతదేశమని పేర్కొననూ లేదు. రచనాకాలంలో గాక, తరవాత ఇరవయ్యేళ్లకు అది ప్రబోధగీతంగా తెలుగువారి నుద్బోధించింది. అదే సంచికలో ఒక అజ్ఞాత కవి రాసిన 'మాలవాండ్ర పాట'లో 'అందారు పుట్టీరి హిందమ్మతల్లీకి, అందారు ఒక్కటై ఉండాలి సక్కంగ' అనే ప్రబోధం నివసిస్తుంది. 'ఏదేశమేగినా ఎందుకాలిడిన, పొగడరా నీతల్లి భూమి భారతి'ని అనే రాయప్రోలు సుబ్బారావుగారి ప్రబోధ గీతం (అపశ్రుతితో సహా) 1914లో వెలువడింది, నేటికీ మంచి ప్రచారంలో ఉంది. 'వందన మిదె గైకొనుమీ భారత జననీ! భారత జననీ! మాపాలిటి రాణీ!, ముప్పది కోట్ల జనమునకు మూలమాతవు, మూలమాతవు – మాపాలినేతవు'... అనే గరిమెళ్ల వారి గేయం ప్రజాస్పందన సాధించింది. 'మేలుకొనుమీ భరతపుత్రుడ!, మేలు కొనుమీ సచ్చరిత్రుడ! మేలుకొనవయ్యా!' అనే మంగిపూడి వారి రచన ప్రజాదరణ పొందింది. ఈ కోవకు చెందిన గీతాల్లో "నమో! హిందుమాతా! సుజాతా!, నమో జగన్మాతా! అమోఘదివ్య మహిమసమేతా! అఖండవర భరత ఖండ మాతా!" సుప్రసిద్ధమేగాని రచయిత ఎవరో తెలియదు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి జాతీయగీతం జనాన్ని ఉద్రూత లూగించింది. అది "జయ జయ జయ ప్రియభారత, జనయిత్రీ! దివ్యధాత్రి!, జయ జయ జయ శత సహస్ర, నరనారీ హృదయ నేత్రి!" అనేది.

మహాత్మాగాంధీ నాయకత్వంలో సత్యాగ్రహ సమరం తీవ్రమై, సహాయ నిరాకరణం ప్రబలమైన రోజుల్లో తెలుగు సాహిత్యం తన వంతు పాత్ర నిర్వహించింది. 1914 నుంచీ ఆంధ్రరాష్ట్రోద్యమం బలపడుతుండగా తెలుగుకవులు జాతీయ భావం కన్నా ప్రత్యేక రాష్ట్ర సాధనమే ప్రధానమన్నట్లు వ్యవహరించారు. అయినా అదే సమయంలో తెలుగు దేశమంతటా మారుమోగిన జాతీయగీతాలు అనేకమున్నాయి. గరిమెళ్లవారి "మాకొద్దీ తెల్లదొరతనం' ఆ సాహిత్యానికి మకుటాయమానం. వ్యక్తి సత్యాగ్రహానికి జనాన్ని రెచ్చగొట్టి ప్రోత్సహించింది త్రిపురనేని రామస్వామి చౌదరి గేయం : 'వీరగంధము తెచ్చినాము, వీరులెవరో చెప్పుడీ, పూసిపోదుము మెడను వైతుము, పూలదండలు భక్తితో' అనేది. ఎవరు రాశారో స్పష్టంగా తెలియని అపూర్వగీతం 'నిరంకుశంబును నీ వెదురుకొని నిర్భయముగ నెదిరించండీ, కవోష్ణ రుధిర జ్వాలలతో ఈ స్వతంత్ర సమరం నెరపండీ, ఎంత కాలమిటు సహించియున్నా, దోపిడి మూకకు దయరాదన్నా!' అనేది. 'దండాలండోయ్! మేముండలేమండోయి! బాబు, ఈ సైతాను ప్రభుత నింక సాగనీమండోయిబాబు' అనే గరిమెళ్లవారి రచన, 'ఉప్పుకొనండయ్యా!, ఉప్పుచట్టమును ధిక్కరించితే, తప్పక మనకు స్వరాజ్యము వచ్చును" అనే మంగిపూడి పురుషోత్తమశర్మ గేయం, జానపద బాణీలో "నీకూ నీవారు లేరు, నాకూ నా వారు లేరు, పదరా స్వరాజ్యం తెద్దాం, చల్ భారత వీరా, కదనారంగము చొత్తామూ' అనే నెల్లూరు వెంకటరామనాయుడు పాట వంటివి ఆ కాలంలో ప్రసిద్ధాలు. 'ఏమి రాటమె ఏమి రాటమె, కామధేనువు కరణి మనకిది' అనే అజ్ఞాత కవి గీతం పేరుమోసింది.

గాంధీజీని అవతారపురుషుడని కవులు అభివర్ణించారు. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి పద్యం "తతి గాంధీయుగ మేగు దెంచె నిక నేతద్భారతీయస్వరాజ్యరథం బాతని సారథిత్వమున వేసాగించు దంచున్ జగద్గురు దేగెన్ దివి లోకమాన్య డవె యుద్ఘోషించె తూర్యధ్వనుల్, ఉరు తద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్" అనేది సభారంభంలో చదవని వారుండేవారు కాదు. 'జగద్రక్షకుడు గాంధిమహాత్ముడు, జనులందరు మీరెరుగండీ, జగతిని ధర్మము స్థాపన సేయగ, జన్మించిన హరి అతడండీ' అనే మంగిపూడి వెంకటశర్మగారి గేయం, 'కొల్లాయి గట్టితే నేమి, మాగాంధి కోమటై పుట్టితేనేమి?" అనే బసవరాజు అప్పారావు గీతం, 'శ్రీగాంధి నామం మరువాం మరువాం, సిద్ధము జైలుకు వెరువాం వెరువాం' అనే దామరాజు పుండరీకాక్షుడి పాట వీరారాధనకు దారితీశాయి. ఎన్.జి. రంగా గారు సంకలనం చేసిన 'రైతుభజనావళి' పాటలు నగర సంకీర్తనల్లో భాగాలయినాయి. 'గాంధీ దేవ! నమస్తుభ్యం ప్రసీద మమ మంగళమ్, శాంతిదూత! నమస్తుభ్యం, గాంధి దేవ నమోనమః' వంటి సంస్కృత రచనలను కూడా తెలుగు కవులు వెలువరించారు. జాతీయతావాదంలోకి అంతర్వాహినిగా అనేక రాజకీయ సిద్ధాంతాలు ప్రవేశించిన తరవాత, రెండో ప్రపంచ యుద్ధ కాలం నుంచీ తెలుగు కవుల బాణీ మారింది. వేగం, ఆవేశం హెచ్చాయి. అవి క్రమంగా 'క్విట్ ఇండియా' ఉద్యమంతోబాటు తీవ్రతరమైనాయి. కవాతు పాటలకు నేతాజీ అజాద్ హింద్‌ఫౌజ్ పాడిన 'కదం కదం బఢాకె జా, ఖుషీ కా గీత్ గాకె జా!' ఆదర్శమయింది. భారత జాతీయ కాంగ్రెసు అహింసా శాంతి సిద్ధాంతాలకన్నా, సమరంలోకి దూకిన యువతరం గొంతు తిరుగుబాటు ధోరణి పెంచింది. నౌకాదళం తిరుగు బాటు వంటివి కవులను ఉద్రేకపరిచాయి. ఆ సమయంలో వచ్చిన ప్రబోధ గీతాలు మరింత వేగంతో జనంలోకి చొచ్చుకపోయాయి. 'కారుమబ్బు చీల్చవోయ్! క్రాంతిరేఖ చూపవోయ్! మాతృదేశ ముక్తికై మరణమైన సరియెనోయ్!' అన్న నార్ల చిరంజీవి గేయం, 'భారతీయ వీరులం, భరతమాత బిడ్డలం, జాతికొరకు సేవజేయ, జన్మమెత్తి కదలినాం' అనే కూరపాటి వెంకటరాజు గీతం, 'స్వతంత్ర యుద్ధం స్వతంత్రయుద్ధం, స్వతంత్రయుద్ధం సాగింది' అనే వట్టికొండ రంగయ్యపాట, 'కదనభూమి కేగుదాం, కత్తిదూసి దూకుదాం, ఫాసిజాన్ని రూపుమాపి, ప్రజలశక్తి చాటుదాం' అనే ముక్కామల నాగభూషణం గీతం, 'భరత సుతులు లెండు వేగ, బవరమునకు తరలిరండు' అని మద్దూరి అన్నపూర్ణయ్య, రామచంద్రుని వెంకటప్పలు రాసిన ప్రబోధ గేయం, 'ఓడయెక్కి నీలండన్ పోరా, నేడే పోపోరా!' అనే సుంకర సత్యనారాయణ గేయం వంటివి తీవ్రవాద ప్రబోధానికి మచ్చుతునకలు.

బ్రిటిష్ వాళ్లు అనేక విధాల బలహీనపడి దేశం వదలి పారిపోదలచుకుంటున్న సమయంలో తెలుగుగడ్డమీద నిజాం నవాబు నిరంకుశత్వం పెరగటం కవులను ఉద్రేకపరిచింది. తెలంగాణాలో సాయుధ సంఘర్షణ మొదలయింది. అనేక వీర గీతికలు వెలువడ్డాయి తెలుగులో. 'నైజాము సర్కరోడా! నాజీల మించినోడా! యమబాధ పెడ్తివి కొడుకో, నైజాము సర్కరోడా!... గోలకొండా ఖిల్లా కిందా నీ గోరి కడ్తం కొడుకో' అన్న యాదగిరి రచన ఆనాటి ఉద్యమకారులను ఉత్తేజపరిచింది. 'ఖబడ్దార్! ఖబడ్దార్! నైజాంపాదుషాహే!' అని మొదలు పెట్టి 'ఒకవీరుడు మరణిస్తే, వేలకొలది ప్రభవింతురు! ఒక నెత్తుటి బొట్టులోనే, ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు'నని

ఆవంత్స సోమసుందర్ హెచ్చరించాడు. 'ఈ భూమి నీదిరా, ఈ నిజాం ఎవడురా, ఈ జులు మీ జబర్‌దస్తి, నెగుర దన్నివేయరా!' అని సుద్దాల హనుమంతు ప్రబోధించాడు. దశాబ్దాలపాటు కొనసాగిన స్వాతంత్ర్య సమరం 1947 ఆగస్టు 14 అర్ధరాత్రి ముగిసింది. ఆ తరవాత కూడా కొంతకాలం అజాద్ హింద్ ఫౌజ్ వీరులను విచారించటం కొనసాగింది.

– ఈనాడు, స్వాతంత్ర్య స్వర్ణోత్సవ ప్రత్యేకసంచిక, 1997

# 4. తెలుగు సాహిత్యంలో జాతీయత, ఉపజాతీయత, అంతర్జాతీయత

ఇండియా అని వ్యవహృతమవుతున్న భారతదేశంలో భిన్న భాషలు, మతాలు, ఆచార వ్యవహారాలు పాటించే విభిన్న వర్గాల ప్రజలున్నారు. వారందరి సమాహారం నివసించే భౌగోళిక ప్రదేశం ఒక ఉపఖండంగాకాక ఏకైక స్వతంత్రదేశమనే భావం భావన ఇటీవలిది. వలసరాజ్యంగా మార్చి సర్వాధికారాలూ చెలాయించిన ఆంగ్లేయులు పరిపాలన సౌలభ్యం కోసం నియంత్రించి బలవంతంగా ఏకత్వమో ఏకదేశమనే భావమో కల్పించారు. అంతకుముందు ఇదే భూభాగంలో ఛప్పన్నారు రాజ్యాలుండేవి. వాటినే దేశాలనీ పిలిచారు. అని అన్యోన్యంగాకాక పరస్పర శత్రుత్వాలతో సంఘర్షిస్తుండేవి. ఇప్పుడు మనం భారతదేశమనీ ఇండియా అనీ రెండు ప్రత్యేక రాజ్యాలుగా చీలిపోయిన అవిభక్త భారతదేశమనీ రకరకాలుగా పిలిచే ఈ భూభాగం మొత్తాన్ని మొగలాయీలు తమ సామ్రాజ్యం ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు కూడా పాలించలేదు. జన్మస్థలం / జన్మభూమి అనేది అత్యంత పవిత్రమనీ స్వర్గంకన్నా గొప్పదనీ భావించటం అత్యంత ప్రాచీనకాలం నుంచీ వ్యవహారంలో ఉంది. కానీ 'మాతృభూమి / మాతృదేశం' అనే భావన ఇంగ్లీషు సాహిత్యం నుంచి ఎరువుగా వచ్చింది మాత్రమే – Mother landకు అనువాదంగా. (Father landకు అనువాదంగా 'పితృభూమి' అనే మాట పుట్టలేదు – దురర్థభయం వల్లగాని, అటువంటి భావన ఆంగ్లేయులకు లేకపోవటం వల్లగాని).

ప్రథమస్వాతంత్ర్య సమరం నిజానికి మతదృష్టితో (స్వదేశీ) సంస్థానాధిపతుల ప్రోత్సాహంతో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా వచ్చిన తిరుగుబాటు. 1885లో భారతజాతీయ కాంగ్రెసు సంస్థ ఉద్భవించినప్పుడు అది భారతీయ సంస్థానాధిపతుల ప్రత్యక్ష పాలనలో లేని బ్రిటిష్ పాలితులకే చాలా వరకు ప్రాతినిధ్యం వహించింది. 1904–05లో బెంగాల్ రాష్ట్రాన్ని బ్రిటిష్ పాలకులు విభజించినప్పుడు స్వదేశీయులను విదేశీయులు అర్థంపర్థంలేని కారణాలతో చీలుస్తున్నారన్న భయసందేహాలు పుట్టి బ్రిటిష్‌వారి మీద ద్వేషాన్ని కలిగించి ఉద్యమరూపంలో బయటపడ్డాయి. బిపిన్ చంద్రపాల్ వంటి నాయకులు రాజకీయంగా మత సామాజిక కారణాలతో బెంగాలీలను ఒకే పతాకకిందకు తెచ్చి ఏకం చేయటానికి చాలా ప్రయత్నించారు. అప్పటి తిరుగుబాటుకు సైద్ధాంతికాధారం కల్పించింది బంకించంద్ర ముఖర్జీ నవల 'ఆనందమఠ్'. ఆ నవల్లోని ఒక పాట – వందేమాతరమ్ – మరింత స్పష్టంగా చెప్పాలంటే అందులోని సంస్కృతభాగం – సమాన సాంస్కృతిక లక్షణాలున్న ఒక భూఖండం మాతృదేశమనీ అవి పరమపవిత్రమనీ ప్రబోధించింది. అందులోని సందేశం ఇప్పుడు భారతదేశమని వ్యవహరిస్తున్న భూభాగం నలుమూలలకూ వ్యాపించింది. దేశంలోని సమస్త భాషలవారూ ఈ భావనను స్వాయత్తం చేసుకున్నారు. నిరక్షరాస్యులైన సామాన్య ప్రజల మనస్సుల్లో కూడా 'భారతమాత' అనే భావన పాదుకొనిపోయింది. విభక్త బెంగాల్ రాష్ట్రాన్ని పునరేకీకరించిన తరువాతకూడా ఈ భావం పెరిగి వందేమాతరం అనే మహోద్యమంగా పరిణమించింది. అందులో క్రైస్తవపాలకులు హైందవమతాన్ని అగౌరవిస్తున్నా రనేది అంతర్గత నిగూఢ భావన అన్నా తప్పులేదు.

కలకత్తాలో 1906లో జరిగిన అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభలో బాల గంగాధర తిలక్ స్వాతంత్ర్యం భారతీయుల జన్మహక్కని గర్జించాడు. దేశవ్యాప్తంగా జాతీయ విద్యావిధానం, దేశవాళీ పరిశ్రమల అభివృద్ధి కార్యక్రమం జరిగితీరాలన్నాడు. విదేశీవస్తువులను బహిష్కరించ మన్నాడు. స్వరాజ్యం కావాలని నినదించినందుకు 1907లో లాలా లజపతిరాయ్‌ని బంధించి మాండలేజైల్లో నిర్బంధించింది బ్రిటిష్ ప్రభుత్వం. ప్రథమ స్వాతంత్ర్య సమరం గురించిగాని, దేశంలోని భిన్న ప్రాంతాల్లో పుట్టి అంతవేగంగానూ చల్లారిపోయిన ఇతర విప్లవధోరణులను గురించిగాని తెలుగు కవులు సానుభూతి చూపి రచనలు చేసిన దాఖలాలు దొరకలేదు. కానీ 1890లోనే – మహాత్మాగాంధీ హరిజనోద్యమం కన్నా రెండు దశాబ్దాలపైకాలం ముందుగానే – మంగిపూడి వేంకటశర్మ తన "నిరుద్ధభారతం"లో అస్పృశ్యుల దురవస్థలగురించి విచారిస్తూ వర్ణించాడు. భారతీయ సమాజం ఐకమత్యం సాధించి మానవతా దృష్టితో వ్యవహరించాలని ప్రబోధించిన మహాకావ్యమది. తెలుగుసాహిత్యంలో 'మాతృభూమి' అనే భావన 1905లోనే మొలకెత్తిం దనటానికి కృష్ణాపత్రికలో ఒక అజ్ఞాతకవి ప్రచురించిన ప్రబోధగీతం సాక్ష్యమిస్తుంది. అందులో భరతమాత తన పిల్లలందరూ కనీసం ఇప్పుడైనా ఏకముఖంగా తమ తల్లిని ప్రేమించా లనే ఉద్బోధ ఉంది: "హిందువులారా! ఎన్నా ళ్ళీగతి, మందమతులరై మాటికి చెడెదరు? ఇకనైనను మీరెల్లరు నొకటై, ప్రకటింపుడు నాపై ప్రేమమ్మును." లాలా లజపతిరాయి నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ రాజమహేంద్రవరంలో జరిగిన ఒక బహిరంగసభలో చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు ఆశువుగా కొన్ని పద్యాలు చెప్పారు:

"భరతఖండమ్ము చక్కని పాడియావు, హిందువులు లేగదూడలై యేడ్చుచుండ, తెల్లవారను గడుసరి గొల్లవారు, పితుకుచున్నారు మూతులు బిగియగట్టి. దుడుకుదనమున దీరదీ గడుసు దనము, కాన తాపులు పోటులు కార్యమనక, లేగ లన్నిటి నేకమౌ లా గొనర్చి, నేర్పుతో తల్లి యెగజేప నేరవలయు... వందే మాతర మను నీ, వందారు జనాళి కిపుడు వాత్సల్యముతో, దం దేశమాత అమితా నందం బొనగూర్చుగాత నానార్థదయై"

(వందేమాతరగీతం ఆనందమఠంలోది. మధుసూదన సరస్వతి నాయకత్వంలో బెంగాలీమరాఠీ సేనల తిరుగుబాటు కథ అది). ఈ చిలకమర్తి వారే 1906–09 మధ్యకాలంలో 'రాజస్థాన్ కథావళి' పేరిట రసపుత్రవీరుల పౌరుషగాథలను అనువదించి ప్రచురించారు. అక్షరాస్యుల్లో జాతీయభావాలు పాదుకొల్పటాని కవి చాలా తోడ్పడ్డాయి. (కళాశాల) వసతి గృహాల్లో విద్యార్థులు బంకించంద్ వందేమాతర గీతాన్ని పోలిన ఒకానొక ప్రార్థనాగీతం పాడుకోవటం 1908 ప్రాంతాల్లో విన్నానని తమ 'బతుకు బాట' అనే గ్రంథంలో ఉప్పల లక్ష్మణరావుగారు పేర్కొన్నారు. అది ఇలా ఉండేది : వందన బఖండ భరతవర్షజననీ!, జననీ వందనం, సుందరామల మందపవనానంద దాయినీ! తుందిల లసదిందుకళాబృంద శోభినీ! జననీ!

ప్రజాహృదయాల్లో జాతీయభావాలను పాదుకొల్పటమే ప్రధానాశయంగా కాశీనాథుని నాగేశ్వరరావుగారు 1907లో బొంబాయిలో తెలుగు వారపత్రికగా ఆంధ్రపత్రికను స్థాపించి 1908 నుంచి దాన్ని దినపత్రికగా మదరాసునుంచి నిర్వహించారు.

ఆంధ్రభారతి అనే పత్రికలో 1910లో రెండుగీతాలు ప్రచురితమైనాయి. వాటి భావాలు రెండురకాలేగాని అవి పరస్పర విరుద్ధాలు కాకపోగా సహకారు లనిపిస్తాయి. రచనాకాలం నుంచి నేటిదాకా అఖండ ప్రచారగౌరవాలు పొందిన గురజాడ వేంకట అప్పారావుగారి దేశభక్తి గీతం వాటిలో ఒకటి. అది దేశభక్తిని ప్రబోధిస్తున్నా దేశమనేది ఏదో ఒక భౌగోళిక భాగమాత్రం కాదనీ అది ప్రజాసమూహమనీ పేర్కొన్నది. "దేశమును ప్రేమించుమన్నా .... దేశాభిమానం నాకు కద్దని, వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్, పూని యేదైనాను ఒక మేల్, కూర్చి జనులకు చూపవోయ్... దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అని ఆయన ఉద్బోధిం చాడు. స్వదేశీయ వాణిజ్యాభివృద్ధి సాధించమనీ పరిశ్రమలు నెలకొల్పమనీ ప్రబోధించాడు. చిత్రమేమంటే ఆయన ఫలానా దేశం గురించి చెప్పినట్లు నిరూపించలేం. అది ఏదేశానికయినా పనికివచ్చే ప్రబోధం – అంతర్జాతీయం. అదే సంచికలో ఒక అజ్ఞాతకవి రాసిన మాలవాంద్రపాట కూడా ఉంది. "అందారు పుట్టీరి హిందమ్మతల్లీకి, అందారు ఒక్కటై ఉందారి సక్కంగ, కష్టమ్ము లొచ్చీన నిష్ఠూర మొచ్చీన, ఇష్టమ్ముగా నుండి కట్టూగ ఉందాము" అనే ఆ గీతం కులవ్యవస్థాది భేదాలను పాటించకుండా కలిసి ఉందామని హిందువులకు బోధించింది. గురజాడ గీతం మేధావంతుల నుద్దేశించింది; రెండోది కేవలం హృదయతలస్పర్శి. స్వదేశాన్ని మాతృభూమిగా తల్లిగా భావించి ప్రస్తుతించటం తెలుగు సాహిత్యంలో 1910నాటికే స్థిరపడ్డదని చెప్పవచ్చు.

విప్లవ భావాలతో గదర్‌పార్టీ 1914లో పుట్టింది. "ఏదేశమేగినా ఎందుకాలిడినా, పొగడరా నీతల్లి భూమి భారతిని" అనే రాయప్రోలు సుబ్బారావుగారి ప్రబోధగీతం ఆయేడే వెలుగు చూసింది. జనరంజక మయింది. విజయవంతమయింది. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి దేశ చరిత్ర సంగ్రహము ప్రాచీన కాలం నుంచి మొదలుపెట్టి భారతదేశ చరిత్రను వివరించింది. ఆయేడే వేంకటపార్వతీశ్వరకవుల ప్రమదావన మనే చారిత్రక నవల వెలువడి మన జాతిగతవైభవాన్నీ పూర్వకాలపు యోధుల వీరకృత్యాలనూ ప్రస్తుతించింది. తెలుగుజాతి పురాతన ఘనతనూ భారతీయ సంస్కృతినీ స్మరించింది. (నిజానికి భారతీయ మనేకన్నా హైందవ మనటం సరయినమాట). మహాత్మాగాంధీ తొలిసారిగా దక్షిణాఫ్రికానుంచి స్వదేశానికి వచ్చిన 1915లోనే భోగరాజు నారాయణమూర్తిగారి ఆంధ్రరాష్ట్ర మనే నవల ప్రజలంతా కలిసికట్టుగా తిరగబడి మన దేశం నుంచి విదేశీసేవలను పారదోలాలని ఉద్బోధించింది. సత్యాగ్రహోద్యమం ఆరంభంకావటానికి ఒక సంవత్సరం ముందుగా 'చెల్లెలా!' అనే సంబోధనతో రాట్నమహిమ అనే ప్రబోధగేయం వెలసింది. "ఏమిరాటమె ఏమి రాటమె, కామధేనువుకరణి మనకిది, భూమిమీదను పూర్వ మెంతటి, పొలుపుమీరెనొ చెల్లెలా!..... ఎంతకాలమె ఇట్టి దాస్యము, ఎంతకాలమె ఇట్టి దుర్దశ, చింతదీరును ప్రాతరాటము, బయటపెట్టవె చెల్లెలా! కాలమిప్పుడు కలసివచ్చునె, బాలభారతభానుమూర్తియె, కలియుగంబున గాంధిమూర్తీ, కల్లగాదిది చెల్లెలా!" అనే పాటలో గాంధీని యుగపురుషుడని భావించి చరఖావాడకంద్వారా పూర్వవైభవాన్ని పునస్సంపాదించగలమని బానిసత్వం నుంచి బయటపడగలమని వివరించింది. గీతరచయిత అయిన అజ్ఞాతకవి గాంధీ కల్కి అవతారం కాబట్టి మనకు స్వాతంత్ర్యం సంపాదించగలడని ధైర్యం చెప్పాడు. 1917లో రాసిన ఆంధ్రపౌరుషము, 1919లో రాసిన ఆంధ్రప్రశస్తి అనే

విశ్వనాథ సత్యనారాయణగారి ప్రబోధాత్మక రచనలు ప్రజామోదం సాధించాయి. ఈ సందర్భంలో 1913లో బాపట్లలో జరిగిన ప్రథమాంధ్రమహాసభ ప్రత్యేకాంధ్రరాష్ట్రం కావాలని తీర్మానించిన తరవాత చిన్నా పెద్దా కవులందరూ బ్రిటిష్ ప్రభుత్వాన్నీ, విభజించి పాలించమనే దాని సిద్ధాంతాన్నీ తీవ్రంగా వ్యతిరేకించటం మొదలుపెట్టారు. ఫలితం భారతజాతీయతకు అంతర్వాహినిగా ఉపజాతీయ భావాలు ప్రభవించటం. భారతమాతకు తోడుగా ఆమె పుత్రికయిన ఆంధ్రమాత వెలసిందన్న మాట!

1919 నాటి రౌలత్ చట్టమూ జలియన్‌వాలాబాగ్‌లో జరిగిన సామూహిక హత్యా సాధారణ ప్రజల్లోకూడా బ్రిటిష్‌వారిమీద తీవ్ర విద్వేషం పుట్టించాయి. అదే సమయంలో స్వరాజ్య నిధి సేకరణ ప్రయత్నాలూ హరిజనోద్యమమూ బలపడి 1920 నాటి సహాయ నిరాకరణోద్యమానికి దారితీశాయి. అమృతసర్‌లో జరిగిన దారుణమారణకాండను నిరసిస్తూ అబ్బూరి రామకృష్ణారావు గారు రాసిన జలియన్‌వాలాబాగ్ బుర్రకథ జనాన్ని జాగృతం చేస్తున్నదని ప్రభుత్వం నిషేధించింది. ఆ సమయంలో అఖిలభారత జాతీయ కాంగ్రెసుకు ప్రధానకార్యదర్శిగా ఉన్న ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి నాయకత్వంలో చీరాల పేరాల పౌరులు పన్నులు కట్టడానికి నిరాకరించి వనవాసానికి పోయారు. అప్పుడే గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకా రైతులు ఉన్నవ లక్ష్మీనారాయణగారి నాయకత్వంలో పన్నులు చెల్లించక సహాయనిరాకరణ చేశారు. ఈ రెండు సంఘటనలూ జాతీయోద్యమశక్తిని బ్రిటిష్ పార్లమెంటుకు తెలియజేశాయి. ఆ ఉన్నవవారే 1922లో కారాగృహంలో ఉండి 'మాలపల్లి / సంగ విజయం' అనే గొప్పనవల రచించాడు. ప్రభుత్వం దాన్ని రెండుసార్లు నిషేధించింది! తుమ్మల సీతారామమూర్తి చౌదరి ఆంధ్రప్రాంతంలో గాంధీజీ పర్యటననూ అప్పటి రాజకీయ సంఘటనలనూ విపులంగా వర్ణించాడు. నెల్లూరి వేంకట్రామానాయుడి ప్రాణాలు అర్పింతాం, దువ్వూరి రామిరెడ్డి రాట్నపుపాట, స్వాతంత్ర్యరథం, వద్దాది సీతారామాంజనేయుని దండాలు దండాలు భరతమాతా, పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రి గీతాలు 1920లోనే వెలువడి ప్రజల నుద్దీపింపజేశాయి. మహాదేశభక్తుడూ గొప్ప గాయకుడూ అయిన గరిమెళ్ళ సత్యనారాయణ వందనమిదె గైకొనుమీ అనేపాటతో రంగప్రవేశం చేసి వెనుదిరిగి చూడలేదు. గర్భదరిద్రంలో అనారోగ్యంతో బాధపడుతూ కూడా ఆయన చివరిశ్వాస వదిలేదాకా ఆంధ్రప్రాంతంలోని గ్రామగ్రామానికీ పోయి దేశభక్తిగీతాలు పాడి జాతీయోద్యమాన్ని ప్రజ్వలింపజేశాడు. 1921 నాటికి గాంధీజీని దేవుడుగా భావించటం మొదలయింది. శ్రీ మహాత్మాగాంధీ భజనకీర్తనలు పల్లెపల్లెలో మారుమోగాయి. ఉన్నవ తన నవలలో సహాయ నిరాకరణోద్యమం ద్వారా స్వరాజ్యం సిద్ధించకపోతే సోవియట్ రష్యాలో లాగా ప్రజలు సాయుధులై పోరాడుతారని బ్రిటిష్ ప్రభుత్వాన్ని హెచ్చరించాడు).

1928లో సైమన్ కమిషన్ భారతదేశానికి వచ్చిందికానీ స్వాతంత్ర్యం విషయంలో మాత్రం మొండిచేయి చూపింది. ఆనాటికి కాంగ్రెసు సోషలిస్టులయిన మద్దూరి అన్నపూర్ణయ్య, రామచంద్రుని వెంకటప్ప బ్రిటిష్‌వాళ్ళతో ప్రత్యక్షయుద్ధానికి సిద్ధం కమ్మని ప్రజలనుద్బోధించారు: "భరత సుతులు! లెండువేగ, బవరమునకు తరలిరండు, పరతంత్ర మహాపిశాచి, పారదరిమి యశముగొండు, వీరభజన మని యెటింగి, వెసగోరుండు స్వరాజ్యము, పౌరుషమున జచ్చిరేని,

బడయగలరు స్వారాజ్యము..." అనేది వారి ప్రబోధం. అప్పటిదాకా శాంతియుతంగా ఉన్న ధోరణి మారిపోయింది. కవులు ముక్తకంఠంతో యుద్ధనినాదా లారంభించారు. అంతవరకూ అధినివేశప్రతిపత్తినయినా ప్రసాదించమని కోరిన జాతీయ కాంగ్రెసుపార్టీ 1929లో పూర్ణస్వరాజ్యం కావాలని మొండికెత్తింది. 1930 నాటి దండి సత్యాగ్రహం బ్రిటిష్ ప్రభుత్వానికి విరుద్ధంగా వ్యక్తి సత్యాగ్రహం చేయమని ప్రోత్సహించింది. అదేసమయంలో త్రిపురనేని రామస్వామి చౌదరి రాసిన "వీరగంధం తెచ్చినాము, వీరులెవరో తెల్పుడీ, పూసిపోదుము మెడను వైతుము, పూలదండలు భక్తితో" అనే వీరగేయం వేలాది జనాన్ని ఉద్రేకపరిచి జైళ్ళు నింపింది. 1934-35ల్లో ఆంధ్రప్రాంతంలో జమీన్‌దారీ వ్యతిరేకోద్యమం తీవ్రస్థాయికి చేరింది. ఆనాటికి భారత కమ్యూనిష్టుపార్టీ అవతరించింది. బ్రిటిష్‌వాళ్ళను మనదేశం నుంచి వెళ్ళగొట్టే విషయంలో, వారి తొత్తులని ప్రజలు నమ్మిన భూస్వాములను వ్యతిరేకించటంలో విధానాలు వేరయినా లక్షణమొక్కటిగా ఉండి ఎందరో రచయితలను ప్రోత్సహించింది. ఒకవైపు ఆచార్య ఎన్.జి. రంగా సేకరించి ప్రచురించిన రైతు భజనావళి గాంధేయసిద్ధాంతాలను ప్రచారం చేస్తుంటే, మరో వైపు శ్రీరంగం శ్రీనివాసరావు ప్రచండ కవితాధోరణి కార్మిక కర్షక ప్రజల దృష్టిని అంతర్జాతీయవాదంవైపు మరలిస్తూ కమ్యూనిష్టు సిద్ధాంతాలను పాటించమని ప్రోత్సహించింది. మారేమండ రామారావు సంపాదకత్వంలో వెలువడ్డ కాకతీయ సంచికా, దుర్భాక రాజశేఖర శతావధాని రచించిన రాణాప్రతాపసింహ చరిత్ర అనే కావ్యమూ ప్రాచీన భారతీయవైభవాన్ని వర్ణిస్తూ వివరిస్తూ గతచరిత్రనుంచి గుణపాఠాలు నేర్చుకొమ్మని ప్రజానీకాన్ని రెచ్చగొట్టాయి. ఈ ధోరణులు భిన్నమయినా చరమ లక్ష్యంలో విభేదాలు లేనివే.

శ్రీశ్రీ ఆగమనంతో తృతీయదశకంలో సాహిత్యంలో తీవ్రధోరణులు మొదలయినాయి. కేవల జాతీయవాదంతో సరిపెట్టుకోని అంతర్జాతీయవాదం శ్రీశ్రీ కవితనుంచే పుట్టింది. ఆయన అభిమానులు కొద్దిమందేగాని తుమ్మల వెంకటరామయ్య "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా, అదురు బెదురూ లేక అడ్డేదియును లేక... సామ్రాజ్య వాదంబు సమసిపోవంగ, ధనికవాదం బెల్ల దగ్ధమై పోవ...." అనే గీతం ప్రజాభిమానం సంపాదించింది. కమ్యూనిజాన్ని సమర్థిస్తూ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించింది. సామాన్య ప్రజాసమస్యలమీద అంతర్జాతీయ సంఘటనల ప్రభావం పడటం మొదలయింది. 1939లో ద్వితీయ ప్రపంచయుద్ధం మొదలయింది. 1941లో సోహన్‌సింగ్ జోష్ ఆజాద్ హింద్ ఫౌజును స్థాపించాడు. సుభాష్‌చంద్రబోస్ జాతీయ నాయకుడై స్వాతంత్ర్యసాధనకోసం రక్తతర్పణం విడవటానికి సిద్ధపడ్డాడు. 1942లో స్టాఫర్డ్ క్రిప్స్ రాయబారానికి వచ్చి విఫలుడై విరిగిపోయాడు. 'విజయమో వీరమరణమో' అనే నినాదంతో క్విట్ ఇండియా ఉద్యమం దేశవ్యాప్తంగా ఆరంభమయింది. జాతీయ నాయకులు జైళ్లపాలయి నారు. ప్రజలు సంక్షుభితు లైనారు. ఆసమయంలో సుంకరవాసిరెడ్డి రచించిన "ఓడయెక్కి నీలండన్ పట్నం, నేడే పోపోరా! పాటిలేదు నీ వాగ్దానాలకు, మూటగట్ట వేరా?... నీయీ నీచపు కావలి కుక్కల, నీతో తీసుకపోపోరా!" అనే పాట, "కారుమబ్బు చీల్చవోయ్, క్రాంతిరేఖ చూపవోయ్, మాతృదేశ ముక్తికై మరణమైన సరియెనోయ్!..... మనదు లక్ష్యమల్లదే, విజయగీతి పాడవోయ్! వీరధర్మ మల్లదే, వెనకచూడ కదుగువేయ్!...." అనే నార్ల చిరంజీవి గేయం,

"స్వతంత్రయుద్ధం స్వతంత్రయుద్ధం, స్వతంత్రయుద్ధం సాగింది, అనాహారముగ అహోరాత్రముల, బాధలు పడుతూ పరులకు దాస్యము, చేసీ చేసీ చివరికి కృశించిన, బానిసజాతుల బంధము లూడ్చే, స్వతంత్రయుద్ధం...." అనే వట్టికొండ రంగయ్య గీతం, ఆయనే రాసిన "స్వదేశరక్షణ సాధనకొరకై, శత్రువు నెదరించుమురా!, ఫాసిజ శక్తికి భారతవర్షం, బలివేదికగా నగురా!" వంటివి కవాతుపాటల్లా జనాన్ని ఆకట్టుకొన్నాయి. జాతీయభావాలతోబాటు అంతర్జాతీయ దృక్పథాన్ని కూడా ప్రచారం చేశాయి. వేదాంతకవి 1940లో రాసిన 'తెలుగుతల్లి' నాటకం జనాభిమానం సంపాదించిందని ప్రభుత్వం దాన్ని ప్రదర్శించరాదని నిషేధించిందిగాని రహస్య ప్రదర్శనలను అరికట్టలేకపోయింది. ఇంచుమించు అదేసమయంలో - అంటే 1943లో- గడియారం వేంకటశేషశాస్త్రి శివభారతము, దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన "జయజయజయ ప్రియభారత జనయిత్రీ! దివ్యధాత్రి!, జయజయజయ శతసహస్ర నరనారీ హృదయనేత్రి...." అనే గేయం, వేదుల సత్యనారాయణ శాస్త్రి రాసిన "జయము హిమగిరి మణికిరీటా! జయము సింహళ పాదపీఠా, జయము విజయాంకిత లలాటా!, జయము ప్రియజననీ!" అనే గీతం, "శాతవాహన తెలుగు చక్రవర్తుల శౌర్య, మిదె బ్రాహ్మ్య మిదె క్షాత్ర మన్న గర్జాఘోష పులకలే ఎత్తించెరా, పలనాట, పౌరుషమ్మే పొంగెరా... బుద్ధ నాగార్జునుడి బోధముద్రాజ్యోతి, వరమహాయానమై వసుమతీ ప్రవహించి, హెచ్చుతగ్గులు సమసెరా, పలనాట, విజ్ఞాన ప్రభ వెలిగెరా... మాల కన్నమదాసు మనసైన సుతుడుగా, వీరవైష్ణవ మెచ్చెరా, పలనాట, బ్రహ్మన్న కవిగీతిలో.... కృష్ణరాయల సభా కవిదిగ్గజాలలో.... వెనుకతరములవారి వీరచరితలు సిరులు, నార్వోసి త్యాగంపు నీర్వెట్టి పెంచరా, విరిసి సుఖములు పండురా, పలనాడు వెలలేని మాగాణిరా" అనే పులుపుల వెంకటశివయ్య చరిత్రాత్మకగీతం, "చేయెత్తి జైకొట్టు తెలుగోడా! గతమెంతో ఘనకీర్తి గలవోడా! సాటిలేనీ జాతి, ఓటమెరుగని కోట, నివురుగప్పే నేడు, నిదురపోతుండాది, వీరరక్తపుధార ధారపోసిన సీమ, పలనాడు నీదెరా, వెలనాడు నీదెరా! బాలచంద్రుడు చూడ ఎవరోడోయ్? తాండ్రపాపయగూడ నీవోడూ!, కాకతీరుద్రమ్మ మల్లమాంబా మొల్ల, మగువ మాంచాల నీతోడబుట్టిన వాళ్ళె, వీరవనితలగన్న తల్లేరా!, ధీరమాతల జన్మభూమేరా! .... నాగార్జునుడి కొండ, అమరావతీ స్థూప, భావాల పుట్టలో, జీవకళ పొదిగావు... రాయలేలిన సీమ, రతనాల సీమరా!" అనే వేములపల్లి శ్రీకృష్ణ ప్రబోధగీతం మొదలైనవి భారతమాతను కీర్తించటానికి బదులు ఆంధ్రమాతను ప్రస్తుతించి జనాన్ని ఉద్రేకపరిచాయి. జాతీయతకన్నా ఉపజాతీయత మరింత ఆకర్షకమయిం దన్నమాట!

రాజకీయ పరిస్థితులతో అవినాభావ సంబంధంగల మరో దశాంతరం తెలుగు సాహిత్యంలో కనిపిస్తుంది. 1946లో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా బొంబాయి కరాచీరేవుల్లో భారతీయ నావికులు తిరుగుబాటు జెండా ఎగురవేశారు. అదే సమయంలో హైదరాబాద్ సంస్థానంలో నిజాం రాజూ అతడి తొత్తులయిన రజాకార్లూ కాశీం రజ్వీ నాయకత్వంలో దారుణ మారణకాండ నిర్వహించి సాధారణ ప్రజాజీవాన్ని రక్తపంకిలం చేశారు. ఈ దుశ్చర్యలకు కోపించిన తెలుగుకవుల ప్రతిస్పందన కూరపాటి వెంకటరాజు రాసిన "భారతీయవీరులం, భరతమాత బిడ్డలం, జాతి కొరకు సేవచేయ, జన్మమెత్తి వరలినాం... ఆరిపోని అగ్నివోలె, జారిపోని గుండెతోడ, జయము

కలుగునంతదాక, వేగవేగ సాగుదాం" అనే ప్రబోధగీతం, "ఈభూమి నీదిరా, ఈ నిజా మెవదురా? ఈజులు మీజబర్దస్తీ, నెగురదన్ని వేయరా!" అన్న సుద్దాల హనుమంతు గర్జన, "తరతరాల పీడిత ప్రజా దాస్యబంధముల దెంచీ, యుగయుగాల సామ్రాజ్యవాదపు పునాదులు పెకలించీ, మానవతా మహోన్నత సమాజము నిర్మించు జెండ, జైయనరా!" అనే అతడే రాసిన మరోపాట మారుమోగాయి. జాతీయోద్యమం తీవ్రస్థాయిలో ఉండగా తుపాకి కాల్పుల్లో నలుగురు విద్యార్థులు తెనాలిలో హతులైనప్పుడు మిక్కిలినేని భగవంతరావు రాసిన పాట "స్వాతంత్ర్యసమరముకు, చేవదెచ్చావోయి, పరతంత్రరాజుపై, బాకు దూశావోయి, దేశమెల్లెడ నీకు విద్యార్థీ!, త్యాగముద్రలు గలవు విద్యార్థీ!' అనేది వీరారాధనకు దారిచూపింది. సుంకర, వాసిరెడ్డి రాసిన 'మాభూమి' నాటకం ప్రదర్శించినప్పుడల్లా వేలసంఖ్యలో. జనాన్ని ఆకర్షించింది.

స్వాతంత్ర్య సమరాన్ని చిత్రించిన తెలుగు సాహిత్య విశేషాలకిది కేవలం విహంగవీక్షణమే. అత్యంత ప్రజాదరణకు నోచుకున్న, ప్రత్యేకతగల, విలక్షణోదాహరణలను మాత్రమే ఇక్కడ ప్రస్తావించాం. వాస్తవంలో వేలసంఖ్యలో రచయితలుంటే లక్షల సంఖ్యలో వాటి ప్రభావంతో ఉద్యమంలో పాలుపంచుకున్న ప్రజలున్నారు. ఆ సాహితీధోరణులనూ నాటి భావనలనూ సంక్షిప్తంగా పరిశీలించినా కొన్ని ప్రధానలక్షణాలు కనిపిస్తాయి. అవి –

1. గాంధీజీ కన్నా కనీసం రెండుదశాబ్దాలకు ముందే తెలుగుకవి హరిజనోద్ధరణ ఆవశ్యకమని గుర్తించాడు.
2. స్వదేశాన్ని మాతృభూమిగా పరిగణించటమనేది వంగసాహిత్యం నుంచి ఎరువుగా వచ్చిన భావనేనని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. అయితే 1905లోనే తెలుగుకవు లాభావనను ఆమోదించి స్వీకరించారు. ఈ భావనను తరవాతి కాలంలో అబ్బూరి రామకృష్ణరావు గారు "జన్మభూమి జనని కాదు, సామాన్య సుమా ఆయను, వసుమతి యగు నామె కొరకు, వల్లభు లెందరు పెనగిరి?" అని ప్రశ్నించాడు. శ్రీశ్రీ ఆప్రస్తావన జోలికే పోలేదు. కానీ 1910లోనే గురజాడ వేంకట అప్పారావు దేశప్రేమకు విలక్షణ నిర్వచనమిచ్చి అంతర్జాతీయంగా ఎవరయినా ఆమోదించదగ్గ భావనగా ప్రతిపాదించాడు.
3. భారతమాతను ప్రస్తుతిస్తూ తొలిరోజుల్లో వెలువడ్డ పాటలూ పద్యాలూ 'హైందవుల' బాధలను గురించి మాత్రమే ప్రస్తావిస్తే, తరవాతి కాలంలోని రచనలు హరిజన సమస్యకు ప్రాధాన్య మిచ్చాయి.
4. భారతదేశమాత అనే భావనను ఆంధ్రమాతృపూజగా విస్తరించిన పాపపుణ్యాలు భావకవులవే. ఆంధ్రసామ్రాజ్యాల పురావైభవాన్ని కీర్తించింది కూడా చాలావరకు భావకవులే.

**"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించువాడు**
**ఓరుగల్లున రాజవీర లాంఛనముగ బలుశస్త్రశాలలు నిలుపునాడు**
**విద్యానగర రాజ వీధుల గవితకు పెండ్లిపందిళ్లు కల్పించునాడు**
**పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య దిగ్జయస్తంభ మెత్తించునాడు...."**

మొదలైన రాయప్రోలు సుబ్బారావుగారి పద్యాలకూ

**"గోదావరీ పావనోదార వాఃపూర మఖిల భారతము మాదన్ననాడు...**

"ఆంధ్రపల్లవ నృపాలుర హుంకృతి వ్యాఘ్రగర్జనగా...
"వేంగీపూజ్య సామ్రాజ్య గాథలు...
"ఈపొలాలెంత చేవెక్కించుకొన్నవో గుండెవ్రయ్య సముద్రగుప్త డదలె..."
వంటి విశ్వనాథ సత్యనారాయణగారి పద్యాలూ-
తెలుగు భావకవుల సామ్రాజ్యవాదాభిమానానికి నిదర్శనలు. ఈ మొత్తం వ్యవహారంలో తలదూర్చి తమ లౌకికభావనలనూ, సామ్రాజ్యవాద వ్యతిరేకతనూ, భూస్వామ్యవాద నిరాకరణనూ, నియంతృత్వ వ్యతిరేకధోరణులనూ విస్మరించి పురాతనాంధ్ర సామ్రాజ్య చిహ్నాలకు మహత్తర గౌరవమిచ్చి సమకాలంలో తాము ద్వేషించే, వర్గశత్రువుగా భావించే సామ్రాజ్య వాదులను దూషించటం కమ్యూనిష్టు కవులు చేసిన మహాపరాధం. ఈ పాపాన్ని చేయనివా డొక్క శ్రీశ్రీయే. అక్కడక్కడ అప్పుడప్పుడు ఫాసిస్టులనూ నాజీలనూ ఖండించినా మత నాయకులైన బ్రహ్మన్న నాగమ్మలను ఆదర్శపాత్రలుగా సమకాలిక సమాజానికి వర్ణించి చెప్పటం అసందర్భం. 1913 నుంచీ ఈవిధంగా గౌరవించి పెంచి పోషించిన ఉపజాతీయతే స్వతంత్ర భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రవిభజనకు దారితీసింది. సమాజం చీలిపోవటానికి కారణమయింది.

5. ఆనాటి రాజకీయ నాయకులు భిన్నకులాల, వర్గాల అభివృద్ధిని ప్రోత్సహించారు. కానీ వారిలో కొందరయినా నిస్సందేహంగా ఆయా కులాల, ఉపకులాల గతవైభవాన్ని చాటుతూనే ఆయా వృత్తుల, సాధనాల ప్రశస్తిని పేర్కొంటూనే తదితర వర్గాల, కులాల, వృత్తులమీద వైషమ్యాన్ని పెంచి పోషించారు. ఇందుకు ఒక గొప్ప ఉదాహరణ ఆచార్య ఎన్.జి. రంగా కాకతీయులు కమ్మవారని చేసిన వాదం. ఇతర కులాల వాళ్ళూ అలాగే తమనేదో ఒక రాజవంశానికో దేవతాజాతికో మహర్షికో అనుసంధించుకోవటం మొదలుపెట్టారు. కాలం గడిచే కొద్దీ సంఘం చీలి బలహీనపడ్డది. ఒక్కోవర్గం తదితర వర్గాలతో రాజీలేని పోరాటానికి సిద్ధమయ్యేందుకు ఉపచరించింది ఈ ధోరణి. ఫలితంలో జాతీయ సమైక్యభావం దుర్బలమై నిస్తేజమయింది.
6. గాంధీజీ ప్రతిపాదించిన అహింసా వాదం కొందరు రచయితలనైనా గౌతమబుద్ధ, అశోక, నాగార్జునాచార్యాదుల వైపు ఆకర్షించింది. 1930 ప్రాంతాల్లో పింగళి కాటూరులు రచించిన 'సౌందరనందం' వంటి కావ్యా లందుకు నిదర్శనం. చారిత్రక పురావస్తు పరిశోధన రంగాల్లో బయటపడుతున్న కొత్త విషయాలు ఈ నూతన మతాభిమానాన్ని పెంచిపోషించాయి. సహజంగా ఈ పరిణామం హైందవ సమాజం ఎదురుదాడులకు దిగే పరిస్థితిని చరిత్రలో మరోసారి కల్పించేట్లుంది.

మొత్తంమీద తర్కవాదాన్ని హార్దికభావనలు జయించాయని చెప్పాలి. స్వాతంత్ర్య సమర కాలంలో వెలువడ్డ తెలుగు సాహితీధోరణులు ఆ ఉద్యమంలాగానే ఏకోన్ముఖంగా లేవు. అయితే ఈ లక్షణాలు మొత్తం భారతజాతిలో ఉన్నవేగాని తెలుగువారి ప్రత్యేకతలు కావు. ఇందుకు అద్భుతమైన ఉదాహరణ స్వతంత్రభారతదేశం జాతీయగీతంగా ఎంపిక చేసిన రబీంద్రనాథ ఠాకుర్ రచనే. స్వాతంత్ర్య సమరంలో అంతర్భాగంగా ఒక మహోద్యమాన్ని సృష్టించిన

వందేమాతర గీతం అధికసంఖ్యాకులయిన హిందువులను ప్రశంసిస్తున్నది కాబట్టి ఠాకుర్ గీతం తరవాతి స్థానమే దానికి దక్కింది. సరిగా అదే కారణంవల్ల ఈనాడు సంఘ్‌పరివార్ వందేమాతర గీతాన్నే అభిమానిస్తున్నది. భారతరాజ్యాంగంలోని 51ఎ అధికరణం పౌరవిధుల్లో నిర్దేశించినందువల్ల ఇప్పు డుదాహరించబోతున్న ఠాకూర్ గీతం మాననీయమై పాకిస్తానులో భాగమయిన సింధు రాష్ట్రానికో జాతికో భారతపౌరులు విధేయత చూపవలసివస్తున్నది. స్వతంత్ర భారతదేశంలోని అనేక రాష్ట్రాల పేరయినా ఆ గీతంలో లేదుగాని, అది జాతీయగీతమయింది!

**"జనగణమన అధినాయక జయహే! భారతభాగ్య విధాతా!**
**పంజాబ సింధు గుజరాత మరాఠా ద్రావిడ ఉత్కళ వంగా....**
**జనగణ దుఃఖత్రాయక జయహే!..**
**తవ కరుణారుణరాగే**
**నిద్రిత భారత జాగే**
**తవ చరణేన తమాధా**
**జయజయజయహే!**
**జయ రాజేశ్వర! భారతభాగ్యవిధాతా!**

– 1998 జనవరిలో కేంద్రసాహిత్య అకాడమీ నిర్వహించిన గోష్ఠిలో చేసిన ఇంగ్లీషు ప్రసంగ వ్యాసానికిది తెలుగు అనువాదం.

# 5. తెలుగులో సాహిత్య విమర్శ

సాహిత్య శబ్దానికి శబ్దార్థ సహితత్వ మనే నిర్వచనం పాతబడిపోయింది. శబ్దమే ప్రధాన మనుకునే పరిస్థితి వచ్చింది. మాటలకున్న అర్థవిశేషాలు కాక మాటలూ, వాటి శ్రావ్యతా, వాటిని శబ్దాలంకార పూర్వకంగా పాడుకోడానికి వీలుగా సంధానించటం వగైరాలకు ప్రామాణ్యం కల్పించేవాళ్ళ సంఖ్య తెగ పెరిగిపోతున్నది. ఉదాహరణకు కరుణశ్రీ రచనల్లో నుంచి రెండు ఉదాహరణలు చాలు. "ఈ నిశ్శబ్దత కంతరార్థ మెదియో ఈకారుమేఘాలలో, ఏ నిర్భాగ్యనిరర్థ నీరవగళం బెల్గెత్తి వాపోవునో..." అన్న పద్యఖండం తీసుకోండి. ఎలుగు, గళం – సమానార్థకాలు. మొదటిమాట అచ్చతెలుగు పదమయితే రెండోది సంస్కృతశబ్దం. నీరవశబ్దానికి (నిర్–రవం) చప్పుడు చేయనిదని అర్థం. మూగపోయిన గొంతు ఎలుగెత్తి వాపోవటం అర్థరహిత ప్రసంగం. కానీ నకారావృత్తి, శబ్దమార్దవం ప్రధానమనుకొనే విమర్శకుడు శబ్దసంవిధానానికి హర్షించి, శ్రవణ మాధురికి పులకరించి, అర్థాన్ని పట్టించుకోవటంలేదు. కుంతీకుమారి అల్లంతదూరాన ఉండగా ఆమెను పాఠకులకు పరిచయంచేస్తున్న కవి "పోలిక రాచపిల్ల" అని విశదీకరిస్తాడు. పోలికనుబట్టి కులం నిర్ణయించగలగటం క్రాంతదర్శిత్వానికి చిహ్నమని వాదించవచ్చుగాని సామాన్య పాఠకుడు అంత ఎత్తుకు ఎదిగి అది నిజమేనని గ్రహించటం కష్టం. సాధారణలోకజ్ఞతకు ఈ ప్రసంగం అసందర్భమని తెలుస్తుంది. ఇటువంటివి ప్రాచీన సాహిత్యంలోనూ లేకపోలేదు.

ఉపపాండవులను నిద్రలో ఉండగా చంపిన అశ్వత్థామను అర్జునుడు బంధించి తెచ్చినప్పుడు పోతనగారి ద్రౌపది "భూసురుడవు బుద్ధిదయా, భాసురుడవు" అని ప్రశంసించి "ఆసురకృత్యంబు ధర్మ మగునే తండ్రీ?" అని ప్రశ్నిస్తుంది. గర్భశోకంలో క్రోధంలో ఉన్నతల్లి అంత్యానుప్రాసలతో తకిటతకిటలు సరిచూసుకుంటూ ఇంతశాంతంగా విలపించటం సామాన్యబుద్ధి హర్షించగల విషయంకాదు. కానీ ప్రాచీనపద్ధతిలో కవిరాక్షసుణ్ని ఆవాహనంచేసి, "గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళా వివేశ్వరః, శిరసా శ్లాఘ్యతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి" అని స్మరించి, కవితాగుణాలను ప్రస్తుతించి, దోషాలను దిగమింగి, విమర్శకు ప్రస్తుతి అనే అర్థం కల్పిస్తారు. పోతనగారి పద్యంలోలాగానే పెద్దనగారి పద్యాల్లో కూడా ప్రకృతి స్వభావవిరుద్ధ ప్రసంగాలు లేకపోలేదు. హిమాలయశిఖరాలమీద వాలిన ప్రవరుడి పాదలేపం ఘనీభవించకపోగా కరిగిపోతుంది! అక్కడ "మృగమదసౌరభవిభవ, ద్విగుణిత ఘనసార సాంద్రవీటీ విలసత్, స్థగితేతరపరిమళమై, మగువ పొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్" అని విశేషించి వర్ణించా డాయన. కడలిమట్టానికి ఆరువేల అడుగులపైన ఏవాసనా రాదన్న శాస్త్రవిషయాన్ని విస్మరించిన విమర్శకులు పద్యం చివరి పాదం నడక మహాద్భుతమని పరవశించి పోయారు. ఆ ప్రవరుడి సంగతే చెప్తూ "వాని చక్కదనము వైరాగ్యమునఁ జేసి, కాంక్షసేయు జార కామినులకు, భోగబాహ్యమయ్యె పూచిన సంపెంగ, పొలుపు మధుకరాంగనలకుఁ బోలె" అన్నాడు. రాణియీగ గూడు వదలదని ఆయన గుర్తించలేదు. ఒకటి రెండు అసందర్భ ప్రసంగాల వల్ల కవిగౌరవం, కావ్యగౌరవం పూర్తిగా పోవని వారు గుర్తించలేదు. కట్టమంచి రామలింగారెడ్డిగారు వేలెత్తి

చూపినట్లు మొత్తం గ్రంథాన్ని మన పూర్వులు దృష్టిలో పెట్టుకొని వ్యాఖ్యానించ లేదు. విమర్శించనూ లేదు. ఏపద్యాని కాపద్యం పరిశీలించి ఛందోవ్యాకరణాలంకార విశేషాలను ప్రస్తావించారే గాని కథ, పాత్రల వంటి వాటికి ప్రాముఖ్య మివ్వనేలేదు.

భారతీయ తత్వదర్శనాల్లో, తర్కవ్యాకరణాల్లో సమున్నత సిద్ధాంత మర్యాదగా స్ఫోటవాదం వ్యాపించినా ఛందోఉలంకారాల్లో దానికి ప్రవేశం లేకపోవటం దురదృష్టం. ఫలితంగా కావ్య నాటకాదులకు వెలువడ్డ టీకాటిప్పణీ వ్యాఖ్యానాదులు అసమగ్రంగా మిగిలిపోయాయి. ఏవయినా అవలక్షణాలు కనిపించినా వాటిని 'సమర్థించట'మే వ్యాఖ్యాతల విమర్శకుల సంప్రదాయ మయింది. దోషాలను చూపిన వ్యక్తి సహృదయుడు కాదని ఈసడించటం, వాటినికూడా "మహాకవి ప్రయోగత్వా త్సాధుః" అని సరిపెట్టుకోవటం సంప్రదాయ మయిపోయింది. సాంప్రదాయిక సాహిత్య విమర్శలోని మరో దుర్లక్షణం ఒకే వస్తువుతో, ఇతి వృత్తంతో రచించిన భిన్నకవుల గ్రంథాలను కూడా తారతమ్య దృష్టితో పరీక్షించక పోవటం. ఎక్కడయినా తులనాత్మకంగా చర్చిస్తే అది పూర్వపూర్వకవితో కావ్యంతో పోల్చి అనుకరణ, అనుసరణల్లోని వైశిష్ట్యాన్ని ప్రదర్శించటానికి మాత్రమే పరిమితమయ్యేది. కట్టమంచి రామలింగారెడ్డి "కవిత్వతత్వ విచారము", అక్కిరాజు ఉమాకాన్త పణ్డితుడి "నేటి కాలపు కవిత్వం" వెలువడే దాకా పాశ్చాత్యప్రభావం కనిపించే విమర్శల్లో కూడా శబ్దలక్షణసంబంధివిచారమే ఎక్కువగా ఉండేది. సమర్థన ఇష్టం కానప్పుడు 'ఖండనగ్రంథ' రచన చేసేవాళ్ళు. మొత్తంమీద గుణైకదృష్టితోనో దోషైకదృష్టితోనే విమర్శ కొనసాగేది. గుణదోష విచికిత్స అపూర్వంగా ఉండేది. ఈ విషయంలో తెలుగువాళ్లకన్నా సంస్కృతపండితులే 'సమదృష్టి'తో వ్యవహరించారని చెప్పవచ్చు. ఆనందవర్ధనాదులు కాళిదాసాదుల లోపాలను ఎత్తిచూపిన సందర్భాలు లేకపోలేదు. ఆపాటి స్వాతంత్ర్యంగాని సామంతంగాని తెలుగులాక్షణిక విమర్శకులు ప్రదర్శించలేదు.

ప్రాచీన కాలంలో పైన పేర్కొన్న సాధారణ లక్షణాలకు విరుద్ధమైన పద్ధతులు అక్కడక్కడ కనిపిస్తాయి. "గాడిద! నీవునుం గవివి కాదు కదా అనుమాన మయ్యెడిన్" లాంటి కఠోరాక్షేపణలు వినిపిస్తాయి. పురస్కారాలతో విర్రవీగిన కవులను తేలిక పరుస్తూ "ఎమితిని సెపితివి కపితము...., వదలక మ్రోయు నాంధ్రకవి వామపదంబున నున్న నూపురం, బుదిత మరాళకంత నినదోక్తుల నేమని పల్కు పల్కరా..., అతి కుటుంబ రక్షణాపేక్ష ప్రాల్మాలి..."వంటి పద్యాలు అందుకు సాక్ష్యం ఇస్తాయి. ఉత్తమనాయికానాయకులే ఉన్న మహాప్రబంధ నిర్మాణానికి అధిక్షేపణలుగా కూచిమంచి జగ్గకవి "చంద్రరేఖా విలాపము", కందుకూరి వీరేశలింగంగారి "అభాగ్యో పాఖ్యానము" వంటి గ్రంథాలు వచ్చినా వాటి సంఖ్య, వాటి ప్రభావం సాహితీపరులమీద చాలా తక్కువనే చెప్పాలి. ప్రాచీన సాహిత్యంలో పద్యకావ్యాలకేగాని తదితర ప్రక్రియలకు గౌరవాదరాలు లేవని వేరే చెప్పనక్కరలేదు. పొగడిగాని, తిట్టిగాని పొట్టపోసుకోవటం కవిలక్షణం కావటంవల్లనేమో తెలంగాణాలో సాహిత్య శబ్దానికి "స్వయంపాక" మనే అర్థం స్థిరపడిపోయింది. కవుల్లో విమర్శలకు తట్టుకొని బతకాలనుకొనేవారి సంఖ్య సన్నగిల్లిపోతున్నది. ఆక్షేపకులను నిర్లక్ష్యంచేసి "నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" అని రొమ్మువిరుచుకొనే శ్రీనాథుడి వంటివాళ్లు అల్పసంఖ్యాకులు. భట్టమురారిలాగా, భవభూతిలాగా ఆత్మవిశ్వాసంతో ఎదురొడ్డి నిలిచే

మనస్థైర్యం మనవాళ్ళకు చాలా తక్కువ. "మణి శ్శాణోల్లీఢ స్సమరవిజయీ హేతిదళితః" అనే శ్లోకానికి నిదర్శనాలుగా నిలిచిన తెలుగు రచయితల, కవుల సంఖ్య అల్పాల్పం. గురజాడ, దేవులపల్లి, శ్రీశ్రీల్లాగా సమకాలంలోని విమర్శకుల నోరుమూయించగలిగిన వాళ్లను వేళ్లమీద లెక్కించవచ్చు. శాస్త్ర వివాదాలూ చర్చలూ బహుశా తిరుపతి వేంకటకవుల కాలంతోనే పరిసమాప్తమైనా యనిపిస్తుంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడి, సాహిత్య అకాడమిని స్థాపించిన తరువాత సాహిత్య విమర్శలోకూడా ఆశ్రిత పక్షపాతం, ముఠాతత్వం, పరస్పర ప్రస్తుతి యుగధర్మమైపోయింది. "కోణంగి నాట్యముల్ కోతు లాడించంగ నూరబందులు తలలూపినట్లు... ఓగుధగిడీలు తమలోన నౌకరి నౌకరు, మెచ్చుకొనుచుందు రిదియేమి పిచ్చితనమొ?" అనే వేణుగోపాల శతకకవి ఆక్షేపణనుబట్టి చూస్తే ఈరుగ్మత అకాడమి పుట్టకముందే వ్యాపించిం దనిపిస్తుంది. ఇప్పు డది ముదిరి పాకాన పడిందని చెప్పవచ్చు.

పూర్వకవులు కూడా గండపెండేరాలు, బిరుదులూ తగిలించుకొని తిరిగారు. కంచుఢక్కలను పగలగొట్టవలసిన శాస్త్రచర్చలు అప్పుడూ జరిగేవని కొన్ని చారిత్రక నిదర్శనలు దొరుకుతున్నాయి. అయితే అటువంటి సందర్భాలు కదాచిత్తుగా ఉండే వనిపిస్తుంది. రాజుల, జమీందారుల పోషణలో సాహిత్యవిద్య శృంగార భూయిష్ఠమై ఊహాప్రపంచానికి పరిమితంగా ఉండేది కాబట్టి కవుల లోకజ్ఞానం సంగతి ఎవరికీ పట్టినట్లు లేదు. "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే..." వగైరా శ్లోకం తాతలనాటిది. కావ్యరచయితకేగాక పాఠకుడిక్కూడా అంతో ఇంతో యశస్సు దక్కేది. "నేను భాష్యాంతపండితుణ్ణి..., పంచకావ్యాలూ చదివాను" వంటి ప్రసంగాలు పాఠకుల ప్రశస్తి సంపాదనకు నిదర్శనాలు. గురువువల్ల కూడా శిష్యులకు గౌరవమర్యాదలు దక్కేవనటానికి తిరుపతి వేంకటకవుల పద్యం "అఇఉణ్ మొదలుగాగ నాభాష్య పర్యంత మభ్యసించితిమి బ్రహ్మయ్య యొద్ద" అనేది సాక్ష్యం. ఇటువంటి సందర్భాల్లో కూడా ఆభాష్యం, భాష్యపర్యంతం అనే సమానార్థక సమాసాలను ఈవిధంగా ఎందుకు పునరుక్తం చేశారని ఎవరూ ప్రశ్నించినట్లు లేదు. శ్లోకంలో రెండో విషయం అర్థసంపాదన. అది పెద్ద కవులకు అగ్రహారాలు సంపాదించిపెడ్తే చిన్నకవులకు "సాహిత్యం" దొరికించేది. మహాకవులనుంచి "కూరగాయ" కవులదాకా ఏదో విధంగా బతికినా, విమర్శ బతికిన దాఖలాలు కనిపించవు. అందుకు ప్రధాన కారణం కావ్యపఠనంద్వారా ఎవరికీ లోకజ్ఞానం కలక్కపోవడమే. కవులూ కవిపోషకులూ నిత్యజీవితంలోని కష్టసుఖాలనూ సామాజిక బాధ్యతలనూ కావ్య విషయాలుగా పరిగణించలేదు. అసలు తమచుట్టూ మానవసమాజ మొకటుందన్న స్పృహకూడా లేదు కాబట్టే రాజా లక్ష్మణసింగ్ దర్బారులో మొగలాయీ దండయాత్ర సమయంలో కూడా కావ్యపఠనం కొనసాగింది. వీటికితోడు సాహిత్యం మీద సంగీతప్రభావం. శబ్దార్థాలను వికృతీకరించయినా సరే సాహిత్యాన్ని వినసొంపుగా రాయటం కవితాలక్షణ మయింది. ఆలోచనామృతం కావలసిన సాహిత్యం ఆపాతమధురత్వానికి కట్టుబానిస అయిపోయింది. సినీ సాహిత్యం రాకతో భజన సంప్రదాయం కొత్త జీవంపోసుకుంది. సాహిత్యం అడుగంటింది.

సాహిత్యం బహువిధాలుగా బహు రూపాలతో విస్తరించి సమాజ శ్రేయస్సుకు మార్గదర్శకమైనప్పుడు దాని గుణదోషపరీక్ష నిర్వహించే విమర్శ దానితో బాటే ఉన్నతస్థాన మాక్రమిస్తుంది.

క్షుద్రసాహిత్యాన్ని ఎన్నివిధాల ప్రశంసించినా దాని గుణం మారదు – పెరగదు. అలాగే దాన్ని పరిశీలించే విమర్శ స్థాయికూడా గొర్రెతోకలాగే ఉంటుంది. సామాజిక రాజకీయ సిద్ధాంతాలను పక్కనబెట్టి సమాజ పరిస్థితిని, సామాజిక చిత్తవృత్తులను వర్ణించే సాహిత్యం కూడా మనకు చాలా తక్కువ. సమస్యలకూ పరిష్కారాలకూ స్థానమిచ్చే సాహిత్యం అత్యల్పం. మొత్తం తెలుగు సాహిత్యంలోని మహోత్తమగ్రంథాలను ఎంపిక చేసి అనువదించి ప్రచురిస్తే వాటిలో ఎన్ని మన సాహిత్యానికి ప్రపంచ దృష్టిలో గౌరవమర్యాదలు తేగలవో అంచనా వేయండి. దాన్నిబట్టే మన సాహిత్యాని కెంత ఉన్నత స్థాన మివ్వవచ్చో తేల్చుకోవచ్చు. ప్రపంచ సాహిత్యం మీద ప్రభావం చూపిన వెన్ని తెలుగు కావ్యాలు? కనీసం భారతదేశంవంటి బహుభాషా ప్రాంతంలో తన ప్రభావం చూపగలిగిన తెలుగు రచన లెన్ని? ఎన్ని తెలుగు రచనలు అనంతర కాలంలో అనేక రచనలకు ఆదర్శప్రాయంగా మార్గదర్శకంగా ఉన్నాయి? ఈ ప్రశ్నలకు సరయిన సమాధానాలు మనదగ్గర ఉన్నప్పుడు భాషాదురభిమానానికి అతీతంగా మన సాహిత్యం ఉన్నతస్థితిలో ఉందని నిరూపించగలం. అందుకు మన కవుల / రచయితల శక్తిలోప మొక్కటే కారణం కాదు. దృష్టిదోషంతోబాటు మన సాహిత్యవిమర్శ ఉన్నత ప్రమాణకల్పనకోసం ఆరాటపడక పోవటం కూడా కారణమే. గ్రంథానికి లేని విలువ దాని విమర్శకు రాదు; విమర్శకు లేని విలువ గ్రంథానికీ రాదు. ఈ రెండూ అన్యోన్యాశ్రితాలు. ఈ రెంటికీ విడదీయరాని పరస్పర సంబంధముంది. ఒకటి పేలవమైతే రెండోది అప్రశస్త మవుతుంది. ఒకటి దురభిమానభూయిష్ఠ మయితే రెండోది నిస్సారమవుతుంది. ఉన్నతసాహితీ సృష్టికి విమర్శలను తట్టుకొని పదికాలాల పాటు బతకాలనే ఆకాంక్ష బలవత్తరంగా ఉండాలి. ఉత్తమ విమర్శకు గుణదోష పరీక్షణ శక్తి కావాలి.

ఒక గ్రంథం వెలుగుచూడగానే దాన్నిగురించి పత్రికలలో సమీక్షలు రావటం ఆచారమయింది. రచయిత స్వయంగా గాని, ప్రచురణకర్త ద్వారా గాని సమీక్షార్థం దాన్ని పత్రికలకు పంపేటప్పుడే కొందరు కొన్ని చమత్కారాలు ఆరంభిస్తున్నారు. రచయిత తన అభిమానిచేతగాని, ఆశ్రితుడి చేతగానే తనకు కావలసిన విధంగా సమీక్ష రాయించుకొని గ్రంథంతోబాటు దాన్ని కూడా ఇచ్చి ప్రచురించమని వేడుకొనే దుష్టసంప్రదాయం ఇప్పటికే వేళ్లు తన్నింది. ఈవిధమైన సమీక్షల్లో కవికావ్య ప్రశస్తులేగాని దోషవిచారణకు తావేలేదు. పత్రికా కార్యాలయాల్లోని సంపాదకులనో ఇతరోద్యోగులనో ఆశ్రయించి, వెంటపడి వేధించి తమ రచన అద్వితీయమనే ప్రశంసనే గ్రంథసమీక్షగా ప్రచురింపజేసుకోవటం ద్వారా ప్రఖ్యాతి సంపాదిస్తున్నారన్నమాట. కొందరు తాము సంపాదించిన బిరుదులు, పదవులు పణంగాపెట్టి దబాయించిగాని ప్రలోభపెట్టిగాని ఇటువంటి సమీక్షలద్వారా గ్రంథ విక్రయశక్తిని పెంచుకోవటం పరిపాటి అయిపోయింది. ఫలితంలో నిష్పాక్షికపరిశీలన అసాధ్యమై, విమర్శ అర్థరహితమై నిరుపయోగకర మవుతున్నది.

ఇక మరో రకం సాహిత్య విమర్శ విశ్వవిద్యాలయాల సిద్ధాంత గ్రంథాలద్వారా ప్రకాశిత మవుతున్నది. తెలుగు విశ్వవిద్యాలయం పుణ్యమా అని ఇటువంటి గ్రంథాలను ప్రచురించేందుకు ఆర్థికసహాయం అంతో ఇంతో అందుతున్నది. కాబట్టి వీటి ప్రచురణ మూడుపూలూ ఆరుకాయలుగా వర్ధిల్లుతున్నది. పరిశోధన ఫలితాన్ని ప్రచురించుకొనే అవకాశం కలిగినందువల్ల

రచయితలకు ప్రోత్సాహం లభిస్తున్నమాట వాస్తవం. ఈ రకం విమర్శల్లో నాలుగయిదు రకాలున్నాయి – స్వభావరీత్యా.

1. గతానుగతికంగా పూర్వపూర్వ సిద్ధాంతాలను పునరుక్తం చేస్తూ, మూలగ్రంథంనుంచి వందల వేల పంక్తులను ఎత్తిరాస్తూ, పరిశోధన విషయంమీద ఇతరుల అభిప్రాయాలను సమన్వయించే ప్రయత్నం చేసేవి అసంఖ్యాకం. ఈ మహావ్యాసాలను ఎంత జాగ్రత్తగా చదివినా రచయిత అభిప్రాయమేమిటో ఒక పట్టాన తేలదు. చాలావరకు "ఇంకను బరిశోధింపవలసియున్న"దనే ప్రసంగంతో ముగుస్తాయి. ఇటువంటి విమర్శల్లో ఎక్కువభాగం ప్రాచీన సాహిత్యంలోని లక్షణాలనో, ప్రక్రియలనో, పూర్వకవులనో పరిశోధనాంశంగా తీసుకున్నవే.
2. పరిశోధకుడు తనకో తన పర్యవేక్షకుడికో అభిమానపాత్రుడయిన పూర్వ కవిని గురించిగాని ప్రస్తుత మహారచయితను గురించిగాని కనీసం రెండు మూడేళ్లు శ్రమించి సిద్ధంచేసిన సిద్ధాంత వ్యాసాలు రెండో కోవకి చెందినవి. ఇవి ప్రస్తుతులేగాని, విమర్శలుకావు. తన అభిమాన రచయిత మహత్వాన్ని లోకానికి చాటడానికి సమకాలంలోని ఇతర రచయితలను తక్కువ చేయటం అనివార్యంగా కనిపించే మరో దుర్లక్షణం. ఈ సమర్థనకోసం సందర్భశుద్ధిలేని తాత్విక సిద్ధాంతాలను ప్రస్తావించి బట్టతలకూ మోకాలికీ ముడివేయటం పరిపాటి. ఉదాహరణకు శ్రీరంగం నారాయణబాబును గురించి పరిశోధించిన విద్వాంసుడు శ్రీశ్రీకి అతడే మార్గదర్శకుడని, అధివాస్తవికతకు సిద్ధాంత ప్రతిపత్తి కల్పించిన వా డతడేనని, మార్క్సిజాన్ని ఆపోశన పట్టిన ఏకైక తెలుగు రచయిత అతడేనని, అంతటితో తృప్తిపడక మార్క్సిజాన్ని జిడ్డుకృష్ణమూర్తి సిద్ధాంత ప్రవచనాలు ప్రభావితం చేశాయని నిగ్గుతేల్చటాన్ని చెప్పవచ్చు. శ్రీశ్రీ మహాప్రస్థానంలో యోగశాస్త్ర రహస్యాలున్నాయనీ, అద్వైత సిద్ధాంతం ప్రతిపాదితమయిందనీ మరో పరిశోధకుడు గుర్తించి లోకహితార్థం సిద్ధాంత గ్రంథరచన చేశాడు. అభిమానరచయితకు విరుద్ధంగా వ్యతిరేకంగా వెలువడ్డ విమర్శలను బండ్లకెత్తే అవకాశమున్నా, అవన్నీ అందుబాటులోనే ఉన్నా, పరిశోధకుడు వాటిని చూడనట్లు, విననట్లు, అవి లేనేలేనట్టు వ్యవహరించటం మరో విలక్షణత. ఫలితంలో ఏకపక్షరచన సిద్ధాంతంగా చెలామణీ అవుతున్నది.
3. పర్యవేక్షకుడు తననుగురించి పరిశోధించమని బతిమాలిగాని, వేధించిగాని, ప్రలోభపెట్టి గాని రాయించుకున్న సిద్ధాంతగ్రంథాలు మూడోరకం. తాను పర్యవేక్షకుడు కాకపోయినా పరిశోధన విషయం తానే కాబట్టి పరిశోధక విద్యార్థికి కావలసిన సంభారం యావత్తూ తానే సమకూర్చి, తన ఘనతను తానే కీర్తించుకొని, దానికి అక్షర రూపం సంపాదించిన ప్రశస్తరచయితలు కొందరున్నారు. ఛాయాభేదమేగాని లక్షణంలో మార్పులేని ఇటువంటి సిద్ధాంతగ్రంథాలవల్ల విమర్శ పాక్షిక మవుతున్నది.
4. అన్యభాషాసాహిత్యాలను పరిశీలించీ, పరస్పర విరుద్ధాభిప్రాయాలను సేకరించీ తన దృష్టిలో ఏది ఎంత వరకు సమంజసమో, ప్రభావితమో, స్వతంత్రమో నిరూపించటానికి ప్రయత్నించినవారు లేకపోలేదు. తాను పరిశోధిస్తున్న గ్రంథంలోని గుణదోషాలను

పేర్కొంటూ, తులనాత్మకంగా నిర్దిష్ట సాహితీ ప్రక్రియలో ఆగ్రంథానికున్న స్థానాన్ని నిరూపిస్తూ వెలువడిన సిద్ధాంత గ్రంథాల సంఖ్య అల్పాల్పం. గుణదృష్టితో చూస్తే వీటివల్ల మాత్రమే విమర్శ ఒక నిష్పాక్షిక పరిశీలనగా బతుకుతున్నది – బతుకుతుందికూడా.

తన విద్యా సంస్కారాలూ అభిరుచులూ ప్రాతిపదికగా సాహిత్యావలోకనం చేసే విమర్శలు కొద్దిగానయినా వెలువడుతునే ఉన్నాయి. ఉదాహరణకు 'చేరాతలు'. వీటివల్ల వాదప్రతివాదాలకు అవకాశముంది కాబట్టి వీటి ప్రయోజనం సిద్ధాంత వ్యాసాలకన్నా ఎక్కువ. రారా వ్యాసాలవంటివి వీటికి పూర్వరూపా లనవచ్చు. ఈరకం విమర్శలు వ్యక్తి ప్రధానమైనవి. నేను, నాకు అనేది మూలసూత్రం.

రాజకీయ సిద్ధాంత భేదాలను పురస్కరించుకొని వెలువడిన సాహిత్య విమర్శలు మరోరకం. ఒకరాజకీయ సిద్ధాంతంలోని పరిభాషకూడా పట్టుబడకుండా అదే సిద్ధాంతం ప్రాతిపదికగా వెలువడ్డ విమర్శగ్రంథా లున్నాయి. వాటివల్ల ఆసిద్ధాంతంగాని, దానికి ప్రతీకగా ఉన్న రచనలుగాని పొందే, పొందిన ప్రయోజనాలకన్నా కలిగిన నష్టాలే ఎక్కువ. ఎటువంటి సంబంధమూ లేని పరస్పర విరుద్ధ శాస్త్ర ప్రసంగాలను గుదిగుచ్చి, సమన్వయించే ప్రయత్నం కూడా చేయకుండా, అవగాహనరహితంగా వెలువడ్డ విమర్శగ్రంథాల్లో వెల్చేరు నారాయణరావుగారి "తెలుగులో కవితావిప్లవాలు" ప్రసిద్ధమయింది. దాని పూర్వరూపం సిద్ధాంతగ్రంథత్వం. పరరూపం ప్రచురితగ్రంథం. భిన్నదేశాల్లో భిన్నాభిప్రాయ సిద్ధాంతాలతో భిన్న విషయాలకు సంబంధించి వచ్చిన భావాలను ఆయన మార్క్సిస్టు విమర్శనగా భాసింపజేశారు. ఇటువంటిదే మిరియాల రామకృష్ణగారు శ్రీశ్రీమీద చేసిన పరిశోధన. ఛందోబందోబస్తులను తెంచివేస్తానన్న రచయిత గ్రంథంలో పద్యచ్ఛాయలను కనిపెట్టడంలో, తెలుగు సాహిత్య చరిత్రను యుగాలుగా విభజించి వాటికి పేర్లు పెట్టడంలో ఆయనపడ్డ శ్రమ ఇంతా అంతా కాదు. ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించటానికి కావలసిన శక్తి యుక్తులుగాని, భాషా లక్షణ పరిజ్ఞానంగాని లేకుండానే వ్యక్తిగత ప్రతిష్ఠ నుపయోగించుకొని మహత్తర మౌలిక విమర్శగా ప్రచారం పొందిన ఇటీవలి మహారచన సినారేగారి "తెలుగు కవిత – లయాత్మకత" అనేది. చిత్రమేమంటే ఇటువంటి విమర్శకులు ప్రచ్ఛన్నయుద్ధం చేస్తారేమోగాని వాదోపవాదాలకు దిగరు. 'పలుకుబడి'ని పాండిత్య మనుకుంటారుగాని, దాన్ని పరీక్షకు పెట్టరు.

ఇక పలాయనవాదం, నవ్యసంప్రదాయవాదం, రూపవాదం వంటి సిద్ధాంతాలను ప్రతిపాదించే వారు సంఖ్యాధికంగానే ఉన్నారు. అన్యభాషల్లోని సాహితీ విమర్శలను అనువదించి గాని, అన్వయించిగాని, తెలుగు వారికి పరిచయం చేస్తున్న విమర్శకులు కూడా ఉన్నారు. ఆయా సిద్ధాంతాలు, మర్యాదలు ఒంటపట్టనందువల్ల ఆలంకారిక శైలిలో, కృత్రిమ అర్థకృత్రిమభాషలో విమర్శలు వెలువరించి పాఠకులను భంగపరిచే వాళ్లున్నారు. వారి దృష్టిలో భాష అభిప్రాయప్రకటనకుగాక భావగోపనానికే ఉపయోగపడుతుంది. మొత్తం మీద తెలుగు విమర్శ రెండురకాల వ్యక్తుల చేతిలో ఉంది. మొదటిరకంలో విశ్వవిద్యాలయాల్లో కళాశాలల్లో తెలుగు బోధించే పరిశోధకులు, పరిశోధనపర్యవేక్షకులుంటే, తదితరులు రెండోరకంలో ఉంటారు. వృత్తిరీత్యా విమర్శకులనీ, ప్రవృత్తిరీత్యా విమర్శకులనీ వీరిని వింగడించవచ్చు. పరిశోధక

విద్యార్థులనే మూడో తెగలో వ్యక్తిస్వాతంత్ర్య మున్నవాళ్ల సంఖ్య చాలా తక్కువ. గతానుగతికత్వం చాలా ఎక్కువ. పరిశోధన పద్ధతులనే ఉక్కుచట్రంలో, బిరుదులు సంపాదించాలనే ఆకాంక్షవల్ల వీరి విమర్శల్లో నూతనత్వం, విశాలదృష్టి లోపిస్తున్నాయని సాధారణీకరించవచ్చు. సూత్రాలకు అపవాదా లుండితీర్తాయని గ్రహించాలి.

తెలుగు విమర్శ తగినంతగా వర్ధిల్లకపోవటానికి ప్రధానకారణాలని నాలుగైదింటిని పేర్కొనవచ్చు.

1. తెలుగు రచనల్లోని వ్యవహారజ్ఞానలోపం – ఆ లోపాన్ని బయటపెట్టాలన్న సంకల్పంగాని, బహిరంగపరచగల సాహసంగాని విమర్శకులకు లేకపోవటం.
2. తెలుగు సాహిత్యంమీద, రచయితలమీద విమర్శకులకున్న భక్తితాత్పర్యాలు. ఈ భక్తి భావం తులనాత్మకపరిశీలనకూ అన్యభాషా సాహిత్య సంప్రదాయ పరిజ్ఞాన సంపాదనకూ అడ్డుపడుతున్నది.
3. విషయాన్నీ వ్యక్తినీ వేరుపరిచి వ్యవహరించాలన్న అభిప్రాయం అటురచయితలకూ ఇటు విమర్శకులకూ లేకపోవటం.
4. విమర్శనలకు తట్టుకొని బతకాలన్న ఆత్మవిశ్వాస స్థైర్యాలు రచయితలకు లేకపోవటం, పదవులకూ బిరుదులకూ భయపడే ఆత్మన్యూనతాభావం విమర్శకులను పట్టిపీడించటం.
5. సాహిత్య వ్యవహారాల్లో కూడా సర్వాంతర్యామిగా వ్యాపించిన వ్యాపారతత్వం.

పైన పేర్కొన్న లోపాలను పరిహరించగలిగినప్పుడు ఆరోగ్యకర వాతావరణంలో సాహిత్య విమర్శ ప్రవర్ధమాన మవుతుంది. తాతలనాటి సహృదయత్వ మొక్కటే విమర్శక లక్షణమనే దుర్భావం పోవాలి. విమర్శన ద్వారా ఆత్మసాక్షాత్కారం చేసుకున్న రచయిత ఉత్తమరచనలు చేయగలడు. ఉత్తమరచనలను నిష్కారణంగా, అపరిశీలితంగా, వ్యక్తిగత రాగద్వేషాలతో తూర్పార పట్టిన విమర్శకుణ్ని సమాజం క్షమించదు. సమర్థించదు. సాహితీసృష్టి సాహిత్య విమర్శలు పరస్పరాధారితాలని గుర్తించాలి.

– కొండేపూడి శ్రీనివాసరావు స్మారక పురస్కారసమయంలో
5.9.1993న చేసిన ప్రసంగ వ్యాసం.

# 6. అవధాన ప్రదర్శనలు

ఇటీవలి కాలంలో తెలుగువారికి అవధానాలమీద మరోసారి మోజు పుట్టింది. అందువల్ల భాషా సాహిత్యాలకు ఏపాటి ప్రశస్తి వచ్చిందనే ప్రశ్నవేసుకొని బాధపడేకన్నా కొందరు అవధానులకయినా సుఖజీవనావకాశం కలిగిందని సంతోషించటం మంచిది. ఇప్పటివారికి అవధానాలు పూర్వం ఎలా ఉండేవో తెలియదు కాబట్టి ఇదో అద్భుతప్రదర్శన మనిపించటం సహజం. అవధానమనేది తెలుగు సంస్కృతాల్లో తప్ప మరెక్కడా లేదనే ప్రచారం జరుగుతున్నది. రాజకీయవాదుల అనుగ్రహం ఈ విషయానికి ఎందుకు కలిగిందో తెలీదు. ప్రజా దృష్టిని దైనందిన సమస్యల నుంచి మళ్ళించటానికి చేసే ప్రయత్నాల్లో ఇదొకటి కావచ్చు. అవధానమనే మాటకు "ఏకాగ్రత, హెచ్చరిక" మొదలయిన అర్థాలను నిఘంటువు లిస్తాయి. అయితే ప్రదర్శన అనే అర్థం కూడా ఇటీవల చేరినట్లుంది.

నన్నయభట్టు అవధానాలు చేసినట్లు నిదర్శనలు దొరకలేదు. తెలిసినంతలో వసుచరిత్ర రచించిన రామరాజభూషణుడే (భట్టుమూర్తే) ఈ పనిచేసిన మొదటి పూర్వకవి అనుకోవచ్చు. నన్నయ భారతంలో శిశుపాల వధా సందర్భంలో "బూతు వొగడినట్లు వొగడెదు" అని భీష్ముడు శ్రీకృష్ణుణ్ని ప్రశంసించినందుకు కంటగించుకొన్న శిశుపాలుడి చేత పలికించాడు. అంటే ఆశువుగా పొగడటం అనే అర్థంతో ఈ మాటలనిపించా దనుకోవాలి. మరోవిధంగా ఆశుకవిత్వాన్ని ప్రస్తావించాడన్న మాట. ఆశువుగా అంటే ఎక్కువసేపు ఆలోచించకుండా తొందర తొందరగా అని అర్థం. తెలుగుభాష పుట్టినప్పటి నుంచీ ఇతర ప్రపంచ భాషలన్నిటిలో లాగానే ఆశురచన ఉంది. తొలిదశలో అలా చెప్పిన పాటలో పద్యాలో జానపద సాహిత్యంగా ఉంటే, లిపి లేఖనాలు అలవాటయిన తరవాత వాటిలో కొన్ని కావ్య గౌరవం తెచ్చుకొని ఉండవచ్చు. వేములవాడ భీమకవి, శ్రీనాథుడు మొదలైన పూర్వులు ఆశురచనలు చేశారు. అంటే అప్పటికప్పుడు ఏదో ఒక విషయం మీద ఏదో ఒక పద్యాన్నో (పరిమిత సందర్భాల్లో శ్లోకాన్నో) చెప్పారన్న మాట. ఇలా నిరాలోచనగా చెప్పిన తొందరపాటి పద్యాలను ఆశు 'కవిత' అనరు, శాస్త్రపద్ధతిలో. కవిత్వం ఆలోచనామృతంగా ఉండాలి గాని ఉబుసుపోకకు చెప్పిన ఊకదంపుడు రచనగా ఉండగూడదు. ఉంటే దాన్ని కవిత్వ మనరు. కవిత్వ మన్నవారిని ఆక్షేపిస్తూ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమ కంఠాభరణ నాటకంలో రామలక్ష్మణులనే జంటకవులను ప్రవేశపెట్టి "ఆశుకవిత యొకటి యావుపేడ మరొండు, స్వయముగాను శుద్ధచయము" అనిపించారు. నాటకంలోని ఆశు కవుల ప్రసంగాలు వింటే అందులో కవిత్వం లేదుగాని 'ధోరణి' ఉందని అంగీకరిస్తారు.

తోచిన పద్ధతిలో వేగంగా అడిగిన విషయాన్ని పద్యరూపంలో చెప్పటం ఆశుకవిత్వంగా చెలామణి అయిన, అవుతున్న మాట వాస్తవం. ఈ శతాబ్దంలో ఆశుకవితలో అవధాన విద్యలో సర్వోత్తములనిపించుకొన్న తిరుపతి వేంకటకవులు ఆశువుగా చెప్పిన పద్యాల్లో చెప్పినవారి బుద్ధిబలమేగాని కవితారసం ప్రధానం కాదనీ, కవితా లక్షణాలకోసం వెతకవద్దనీ తమ "శతావధానసారము" ఉపోద్ఘాతంలో స్పష్టీకరించారు. అవధాన రచనలో కవిత పాలు చాలా

తక్కువ అని వారే చెప్పారు. "ఆశుధారా కవయితలకు సుప్రయోగ విచారణమే కాక రసారస విచారణమును నంతగా నుండదని కవితా మర్మజ్ఞులకు స్పష్టమే" ననే అప్పకవి సమర్థననుకూడా ఉట్టంకించారు. ఆశుకవిత అనటం కన్నా ఆశుధార అనటం మేలు. ఎంత వేగిరం చెప్పారనేది ముఖ్యంగాని ఎంతబాగా చెప్పారనేది ప్రధానం కాదు. శ్రీనాథుని 'పదప్రసిద్ధ ధారాశుద్ధి' ప్రశంసనీయమయింది. అంటే వేగవంతంగా ఉండి కూడా తప్పులు లేని, పెద్ద పెద్ద మాటలు వాడిన రచనాధోరణి అని గుర్తించాలి.

## ఎప్పటినుంచో ఉంది...

నిరంతర ప్రచారం వల్ల ఆశుకవిత్వం తెలుగువారి సొమ్మనే అభూతకల్పన చాలా మందికి కలిగినట్లుంది. మన వందిమాగధులు, భట్టులు దేశసంచారం చేయకగాని, చేసిగాని ఆశురచనలు చేసినట్లు, చేస్తున్నట్లు పాశ్చాత్య ప్రపంచంలో బార్డ్స్ (bards) అనేవారు అదే పని చేస్తుండేవారు. ప్రాచీన కెల్టిక్ సమాజంలో తన పద్యాలనూ పాటలనూ పాడుతూ, హార్ప్, లూట్ వంటి వాద్యాలు వాయిస్తూ ఊరూరా తిరిగే వారిని ఈ పేరుతో పిలిచేవాళ్లు. స్కాట్లండులో దేశ సంచారం చేస్తూ పద్యగానం చేసేవాళ్లను ఇలా వ్యవహరించేవారు. మధ్యయుగాల్లో లిరిక్స్ అనే భావరచనలను పాడుకుంటూ తిరిగే కవులను మిన్‌స్ట్రల్స్ (minstrels) అని పిలిచేవాళ్లు. మన వందిమాగధ వైతాళికుల్లాగా, నారద తుంబురులవంటి స్తుతి పాఠకుల్లాగా, రామాయణగానం చేసిన లవకుశుల వంటి కుశీలవుల్లాగా, గంధర్వ మాగధ వృత్తిలో ఉండేవారిని ఈపేరుతో పిలిచేవాళ్లు. ముందుగా రాసుకోని, అప్పటికప్పుడు కూర్చిన పద్యగేయాలను ఏకసమయంలో రచించి పాడుతూ ప్రదర్శనలిచ్చేవారికి మరో పేరుంది ఇంగ్లీషులో – ఇంప్రొవైసర్స్ అంటారు. ఇటలీ భాషలో అటువంటి రచయితలను ఇంప్రువైసతో (improvvisotore) అనీ, రచయిత్రులను ఇంప్రొవైసచీ (improvvisatrice) అనీ వ్యవహరిస్తారు. రష్యన్ మహాకవి అలక్సాండర్ పుష్కిన్ రాసిన ఒక నవలికను ఇంప్రొవైసర్ అనే పేరిట ఇంగ్లీషులోకి అనువదించారు. చేయనిపనికి పుట్టని బిడ్డకులాగానే ఎవరూ పేరు పెట్టరు. ఆశువుగా పద్యగేయాలను రచించటం మనకు తప్ప మరెవరికీ చేతగాదని మనం తెలుగులో చెప్పుకున్నా, రాసినా ఎవరూ పట్టించుకో(లే)రు. మధ్యయుగాల్లోని అన్ని నాగరక సమాజాల్లోనూ ఆశురచన ఉంది. భాష లిపిబద్ధమైన తరవాత ఆశు సంప్రదాయం సన్నగిల్లింది. అంతే మార్పు.

ప్రపంచం మొత్తంలోని గిరిజన సమాజాల్లో వేదకాలంనాటి ఆర్య సమాజంలోలాగా విద్యా బుద్ధులూ పాటలూ పద్యాలూ చెప్పటం అన్నీ మౌఖికంగానే కొనసాగుతున్నాయి. శారద గాండ్లలాగా ఒక్కో కులానికో భాషా సమూహానికో వాటిని విపించటమే వృత్తిగా పెట్టుకున్న వారున్నారు. భట్రాజులు దేశ సంచారం చేస్తూ చెప్పే పద్యాలూ పాడే పాటలూ జగత్ప్రసిద్ధం. అవన్నీ ఆశుమార్గంలో అలిఖితంగా వస్తున్న సంప్రదాయాలే. ఆదిలాబాద్ జిల్లాలోని గోండులకూ కొలాములకూ వారి వారి పూర్వ వైభవాన్నీ వారికి ఆరాధ్యులైనవారిని గురించిన వివరాలనూ వర్ణించి ఆశువుగా చెప్పే ప్రధాన్లు ఉన్నారు. గ్రంథాలు లేనంత మాత్రాన భాషలు లేవనిగాని, వాటిలో ఆశుకవితా ధోరణి లేదనిగాని భావించటం పొరపాటు. సజీవంగా ఉన్న అన్ని సమాజాల్లోనూ ప్రపంచవ్యాప్తంగా ఆశురచనాధోరణి ఉంది. ఆటపాట లున్నాయి. కథలున్నాయి.

వాటిని చెప్పేవా రున్నారు. అందువల్ల ఆశుధోరణి మనకు మాత్రమే పరిమిత మనుకోవటం తెలియనితనమే.

## కొప్పరపు సోదర కవులదే రికార్డు!

ఆశుధోరణి మీద ఆధారపడి రచనలు చేసే విధానాల్లో మార్పులున్నాయి. పాశ్చాత్య ప్రపంచంలో పాట ఎప్పుడూ నాట్యంతో సంబంధం లేకుండా ఉండదు. వాద్య విరహితంగానూ ఉండదు. అన్ని గిరిజన సమాజాల్లోనూ అంతే. మన హరికథలు సంగీత, నాట్య, కవితల కలయిక. ఆశుకవులు తమ సంగీతజ్ఞానం మీద, కంఠమాధుర్యంమీద ఆధారపడినప్పుడు మరింత ప్రతిష్ఠ సంపాదించగలుగుతున్నారు. సంగీతం ఆలోచించే సమయాన్ని పొడిగించటంలో ఉపయోగపడుతుంది. అది రచయితకు వరప్రసాదం. సంగీత మాధుర్యం రచనలోని దోషాలను కప్పిపుచ్చగలుగుతుంది– నాట్యకత్తె సౌందర్యం నాట్యలోపాలను తగ్గించినట్లు, గాత్ర మాధుర్యం లేని హరి కథకుడికి వాద్య సంగీతం కావలసినంత సహకార మందించినట్లు. ఆశుధార ఎంత మందగిస్తే రచయితకు అంత ఇబ్బంది కలుగుతుంది. శ్రోతలు లోపాలను సులభంగా గుర్తించగలుగుతారు. గంటకు మూడు వందల పైచిలుకు పద్యాలను ఆశువుగా చెప్పిన కొప్పరపు సోదర కవులదే మనమెరిగిన రికార్డు, ఆశుకవితా ప్రదర్శనల్లో. ఆశుధార అంటారు ఆ ధోరణిని.

ఆశురచనాశక్తి ప్రధానాలంబనంగా అష్టావధాన, శతావధాన, సహస్రావధానాదులనే భేదాలు వచ్చాయి. తెలుగుదేశంలో ఈ ప్రదర్శనలు 1920–50 మధ్యకాలంలో సాహిత్యానికి ప్రచార గౌరవాలు కల్పించాయి. మహారాజులూ జమీందారులూ తమ తమ ఆస్థాన కవులనూ పండితులనూ పోషిస్తూ, పోటీలు నిర్వహించిన కాలంలో ఏకసంథాగ్రాహులూ (ఒకేసారి విన్నదాన్ని అక్షరం పొల్లుబోకుండా ఒప్పచెప్పగలవాళ్లు), ద్విత్రి సంథాగ్రాహులూ రాజసభల్లో ఉండేవారు. విద్యాస్పర్ధలు కొనసాగేవి. కవులూ పండితులూ సమాజంతో సంబంధంలేని సాహిత్య రచనలు చేస్తుండేవారు. దర్బారు కవిత్వం మొదలయింది. ఆ సమయంలోనే ఆ కవిత్వంలో గర్భకవిత్వం (పద్యంలో మరో పద్యాన్ని ఇమడ్చటం), ఒకే చక్రంలో కొద్ది అక్షరాల పద్యం ఇమడ్చటమనే బంధ కవిత్వం, చిత్ర కవిత్వం (అక్షరాల స్థానాలు మార్చి అనుప్రాసలు గుదిగుచ్చి పద్యాలు రాయటం) వగైరాలు మొదలయ్యాయి. శ్లేష యమకాలు జోరయినాయి. ఫలితంలో భావం, కల్పన, వర్ణనల వంటివి లేకుండా పదాల గారడీలు పెచ్చుపెరిగాయి. ఆశుకవిత్వం కవిశక్తికి నిదర్శనమై నిరూపక మయింది. అవధాన సాహిత్యం పుట్టింది. ఆశుధోరణికి తోడుగా ధారణ (గుర్తుపెట్టుకోవటం) అవసరమయింది. అష్టావధానంలో ఎనిమిది అంశా లుండాలన్నారు. శతావధానం నూరుగురు పృచ్ఛకులకు (ప్రశ్నలడిగేవారికి) పద్యరూపంలో సమాధానం చెప్పటం, వచనం వాడకపోవటం అనీ, సహస్రావధానం వేయిమందికి పద్యరూపంలో సమాధానాలివ్వటం అనీ ఒక సంప్రదాయ మేర్పరచుకున్నారు. కార్యక్రమం పూర్తి అయ్యేముందు మొదలుపెట్టినప్పటి నుంచీ చివరిదాకా చెప్పిన పద్యాలను ఒప్పచెప్పేవారు. కవితాలక్షణం అప్రధాన మయింది. ఈ బాపతు రచనల్ని క్షుద్రసాహిత్యంగా పరిగణించేవారు.

## అష్టావధానం సంగతి

అవధాన శబ్దాన్ని వధాన మనికూడా వ్యవహరించేవారు. అవధానం చేసే వ్యక్తి (అ)వధాని. శతలేఖినీ / శతఘంట అవధానమని శతావధానాన్ని పిలిచేవారు. "గడియకు నూరు పద్దెములు గంటము లేక రచించువారు', 'ఘంటాశతగ్రంథకరణధుర్యు'లు, 'శతలేఖిన్యవధాన పద్యరచనా సంధానధౌరేయులు', 'ధారణ నిల్చునా నిలువదా యను సందియ మింతలేని' ఉద్దండులు పుట్టుకొచ్చారు, కొద్దిసంఖ్యలోనయినా. ఈ ప్రసంగా లన్నింటిలో ఆశురచనకూ ధారణకూ ప్రాధాన్య మిచ్చినంతగా ఇతరాంశాల కివ్వలేదని తెలుస్తుంది. తమిళ దేశంలో కూడా ఈ ప్రదర్శనలుండేవి. దాక్షిణాత్యులు శతవధానమని పిలిచేదాన్ని మన అష్టావధానంతో సమాన మనవచ్చని గద్వాలలో తాతాచార్యులవారు చేసిన శతావధానాన్ని వర్ణిస్తూ తిరుపతి వేంకటకవులు వివరించారు. మొదట మన అష్టావధానం సంగతి చూద్దాం.

అడిగినవారి కోరిక ప్రకారం సంస్కృతాంధ్ర భాషల్లో పద్యరూపంలో కల్పన చేయటం ఒకటి. ఏదో ఒక పద్యం / శ్లోకంలోని అక్షరాల క్రమం మార్చి అప్పుడొకటి ఇప్పుడొకటిగా అవధానికి అందిస్తే సమాప్తి సమయానికి వాటిని సరిగా గుదిగుచ్చి చెప్పటం వ్యస్తాక్షరి (వ్యస్తం చేసిన / తారుమారు చేసిన అక్షరాలను సక్రమంగా సంధానించటం రెండోది. చదరంగం ఆడటం మూడోది. పూలను వీపుమీద వేసినా, గంటలు అలాగే వాయిస్తున్నా చివరికి వాటి సంఖ్యను సరిగా చెప్పటం నాలుగోది. అడిగిన విషయంమీద అడిగిన ఛందస్సులో (సాధారణంగా కందం లాంటి చిన్న పద్యంలో) ఆశువుగా చెప్తూనే పృచ్ఛకులు నిషేధించిన అక్షరాలను వాడకుండా పద్యం చెప్పటమనే నిషిద్ధాక్షరి అయిదోది. ఆకాశపురాణం చెప్పటం ఆరోది. అంటే చెప్పిన కథాంశాన్ని గాని, మూలగ్రంథాన్నిగాని సొంత పద్యాల్లో వివరిస్తూ పురాణం చెప్పినట్లు వ్యాఖ్యానించట మన్నమాట. మధ్యమధ్య పృచ్ఛకులు అడ్డుపడుతూ ఏవో లౌకిక విషయాలు ప్రశ్నిస్తే వాటికి సమాధానం చెప్పటమనే అప్రస్తుత ప్రశంస ఏడోది. ఇచ్చిన సమస్యలను పూరించట మనేది ఎనిమిదోది. గణితం, సంగీతం, చిత్రలేఖనం, వ్యాకరణశాస్త్రచర్చ, పేకాట, దత్తపది వంటి ఇతరాంశాలను చేర్చుకొని, ఇంతకు ముందు పేర్కొన్న వాటిలో కొన్నిటిని తొలగించి మొత్తంమీద ఎనిమిది అంశాలను క్రమపద్ధతిలో నిర్వహించటం కూడా కద్దు. ద్విగుణితాష్టావధానం (ఎనిమిదిగాక పదహారు అంశాలను నెరవేర్చే పద్ధతి), దశావధానం (పదిమంది పృచ్ఛకులకు సమాధానం చెప్పటం), చతుర్గుణితాష్టావధానం (ముప్పైరెండు విషయాలను చెప్పేది) వగైరా లుండేవని తిరుపతి వేంకటకవులు పేర్కొన్నారు. శతావధానంకన్నా అష్టావధానమే కష్టసాధ్యమంటారు. "అష్టావధానంబు కష్టవత్కార్యంబు నల్లేరుపై బండి నడక మాకు" అన్న ప్రతిజ్ఞ వారిదే.

వ్యస్తాక్షరిలో సంస్కృతాంధ్రాలేగాక అవధానులకు అర్థంగాని / తెలియని భాషలు కూడా ఉండవచ్చునని అది నెరవేర్చిన వారున్నారు – తిరుపతి వేంకటకవుల వంటి వారు. వారు జర్మన్, తమిళం, ఇంగ్లీషు భాషల వ్యస్తాక్షరులను సరిగా చెప్పగలిగి సెబా సనిపించుకున్నారు. నిషిద్ధాక్షరిలో ఏదో ఒక అక్షరాన్ని నిషేధించటమేగాక తాలవ్యాలు (చఛజఝలు) లేకుండా చెప్పమని అడిగినవా రున్నారు – అలాగే చెప్పినవా రున్నారు. అప్రస్తుత ప్రసంగాన్ని శాస్త్ర

చర్చగా మార్చిన పృచ్ఛకు లున్నారు. సమస్య లిచ్చి అది చివరిపాదంగా కాక రెండోది గానో మూడోదిగానో ఉండాలన్నవా రున్నారు. సమస్యాపూరణాన్ని దత్తపది (దత్త- అంటే ఇచ్చిన - పదాలను వాడటం) గా మార్చినవారూ అలా చేసి నెగ్గినవారూ ఉన్నారు. పృచ్ఛకులు స్థానాలు మారి వరస తప్పించి ముందు మాకు జవాబు చెప్పమంటే అలా చేసినవారున్నారు అవధానాల్లో. కవి ప్రయోగాన్ని తప్పుబట్టినవారితో పోరాడుతూ చేసిన శాస్త్రచర్చ లున్నాయి, పశ్యశబ్ద విచారం వంటివి. జంటకవులుగా కూడా వ్యవహరించిన తిరుపతి వేంకటకవులూ కొప్పరపు సోదరకవులూ ఒక చరణం మొదటివారూ రెండో చరణం రెండోవారుగా సమస్యాపూరణం కూడా చేసి మెప్పించిన సందర్భాలున్నాయి.

## వివిధ అవధానాలు

ఊరికి కనీసం నలుగురైదుగురు శతావధానులు పుట్టుకొచ్చిన రోజులుండేవి. "చేతగాని శతవధాని చేతినిండ, సర్టిఫికేట్ల కట్టలే"నని తిరుపతి వేంకటకవు లాక్షేపించిన విషయం జగత్ప్రసిద్ధం - తమది "డిగ్రీలు లేని పాండిత్య"మంటూనే! చాలామంది పది పదిహేనుగురితో చేసిన శతావధానా లున్నాయని, అలాంటిదే తామూ మామిళ్లపల్లిలో చేసి నెరవేరిందనిపించు కున్నామనీ అబ్బూరి రామకృష్ణరావుగారు సాక్ష్యమిచ్చారు. నూరుగురున్న సంపూర్ణ శతావధానం కూడా అష్టావధానమంత కష్టకార్యం కాదు. అలాగని అవధానులెందరో విన్నవించుకున్నారు. పాతకాలంలో లేని 'నాట్యావధానం, నేత్రావధానం' వాడుకలోకి వచ్చాయి. ముందుగా అడగదలచిన ప్రశ్నలను రాసి ఇవ్వక తప్పదు కాబట్టి 'రేడియో అవధానాలు' లాలూచీ కుస్తీల్లాంటి వనటంలో సందేహం లేదు- నిర్వాహకులతో సత్సంబంధాలున్న అవధాని వరేణ్యులు వాటికి ప్రత్యుత్తరాలను ముందుగానే సిద్ధం చేసుకొనే అవకాశముంది కాబట్టి! "శతసంఖ్యు లొక్కటయినను, సతతము శ్రీకృష్ణరాయ ధరణీపతితో, చతురంగ మాడి గెలిచెను, ధృతిమంతుడు బొడ్డుచెర్ల తిమ్మన భళిరే!" అన్న చాటుపద్య ముంది. ఆ కాలంలో 'చతురంగావ ధానం' కూడా ఉండేదేమో స్పష్టంగా తెలీదు. తోసిరాజని, ఉయ్యాల చేర్లని, బంటుతో ఆటకట్టు తానని, జంతువులను తగ్గించి ఆడతానని అనేక విధాల పందేలు కాసేవారు 'మస్తు' ఆటలో. అంతర్జాతీయ చతురంగంలోలాగా ఎనిమిదో గడికి చేరిన పావులన్నీ మస్తాటలో మంత్రులు కావు. జంతువు లన్నిటినీ కోల్పోయిన రాజును హింసించటంగాని, ఆటకట్టనడంగాని ఆ ఆటలో చెల్లదు. ఇన్ని నిర్బంధాలున్న చదరంగంలో నూరుగు రొక పక్కా తాను మరో పక్కా ఉండి ఆడి జయించటం మాటలు కాదు. తిమ్మన చతురంగ శతావధానం చేశాడనీ చెప్పలేం; చేయలేదనీ అనలేం. వందమందిని బాణాకర్ర పట్టుకొని నిలువరించగల వీరులు సినిమాల్లోనేగాక నిజజీవితంలో కూడా ఉన్నారంటారు. అదిన్నీ శతావధానం కాదా? చెప్పలేం.

నిన్నమొన్నటిదాకా జరిగిన అవధానాల్లో పృచ్ఛకులక్కూడా ఇబ్బందులుండేవి. అవధాని తానిచ్చిన ప్రశ్నకు, అడిగిన కోరికకు సముచితంగా స్పందించకపోయినా, సరిగా చెప్పలేక పోయినా పృచ్ఛకుడు తానే ఆ పని చేయాలి. తానూ ఏదోవిధంగా అవధానం చేసిన వ్యక్తి మరొక అవధానికి పృచ్ఛకుడుగా ఉండేవాడు. అవధాని చెప్పిన ప్రత్యుత్తరాన్ని సవాలు చేయగల

వ్యక్తి, సవరించి ఎలా ఉండాలో తానే చెప్పగలిగిన వ్యక్తి పృచ్ఛకుడు. అంతేగాని ఎవరయినా పృచ్ఛకులుగా ఉండవచ్చుననేది ఇటీవలి దుర్లక్షణం. ఒకప్పటి పృచ్ఛకుడు అవధానాన్ని చెడగొట్టడానికి నడుముకట్టినవాడే. ఆసభల్లో వాదప్రతివాదాలు తీవ్రంగా జరిగేవి. ఉదాహరణకు 'పశ్యాం పశ్యాం, పుశ్యాం పుశ్యాం' అనే వాటిలో ఏది సరైన రూపమో తేల్చటానికి, కొప్పరపు వారికీ, తిరుపతి వేంకటకవులకూ మధ్య వచ్చిన వివాదం మీద ధర్మనిర్ణయం చేయటానికీ, సభలకు రాని పెద్దల దగ్గరకు పోయి కూడా వచ్చారు. బెల్లంకొండ రామారావుగారూ తాతా సుబ్బరాయుడు శాస్త్రిగారూ నిర్ణేతలుగా వ్యవహరించారు. 'పశ్య శబ్ద విచారం' పేరిట పుస్తకాలే రచించారు. ఒకరి సభలను మరొకరు ధ్వంసం చేసేందుకే ప్రయత్నించారు గాని, సరిపెట్టుకొని పోయేవారుకాదు. అవి విద్వత్సభలు. "పండితః పండితం దృష్ట్వా శ్వానవత్ ఘుర్ఘురాయతే" అన్నట్లు ఒకరిని చూసి మరొకరు గుర్రుపెట్టి పోరాడటమే ఉండేది. తిరుపతి వేంకటకవులకూ కొప్పరపు సోదర కవులకూ మధ్య పెరిగిన విద్యాస్పర్థ శాఖా వైరుధ్యంగా మారింది. వైదికులకు చిహ్నంగా వంటవాడికి గజారోహణం చేయిస్తే, నియోగులకు ప్రతినిధిగా నీళ్లకావడి వాడికి అదే మర్యాద కల్పించారు! గురు శిష్య సంబంధాలు బెడిసికొట్టి అన్యోన్య దూషణలతో "హంసకాకోపాఖ్యాన" మొకరు రాస్తే, 'కాకోలూకీయం' మరొకరు రాశారు. కోర్టుల పాలైన వారున్నారు. 'గీరతము, గుంటూరిసీమ' అనే తిరుపతి వేంకటకవుల రచనలు ఈ కోవకు చెందినవే. అవధానం కారణంగా కొంత సాహిత్యం పుట్టిందన్నమాట.

## కాలం మారింది...

ఇప్పటికి కాలం మారింది. పృచ్ఛకులకు పాతలక్షణా లక్కరలే దన్నారు. అవధాని లాగే సత్కారా లందుకుంటున్నారు పృచ్ఛకులు కూడా. మళ్లీ వీళ్లను సాధారణ, విశిష్ట పృచ్ఛకులని విభజించి సమ్మానిస్తున్నారు. సభాధ్యక్షులుగా ధర్మ నిర్ణేతలు కాగలిగిన వారి స్థానంలో అనేక విధాల సహాయకులైనవారు ప్రవేశించారు. ప్రశ్నలను ముందే తీసుకుంటున్నారు. కొన్నివిధాల ప్రశ్నలకే జవాబు లంటున్నారు. అప్రస్తుత ప్రశంసలో అవధానికి బదులుగా అతడి శ్రేయస్కాములు వ్యవహరిస్తున్నారు. సమాధానాలు చాలా కాలం తరువాత వస్తున్నాయి. ఛందోబద్ధమైన పద్య రచన స్థానంలో పాటలు చెప్పటం వచ్చింది. అవధాన మధ్యకాలంలో విశ్రాంతి లభిస్తున్నది. ధారణ తగ్గిపోతున్నది. రాజకీయ నాయకుల ఆశీర్వాదాలూ వ్యాపార ధోరణులూ పదవీ కాంక్షలూ ప్రబలిపోతున్నాయి. అయితే మూలపడిన అవధానవిద్య తన పూర్వపు విద్యా వైభవానికి బదులుగా ప్రయోజనదృష్టితో నెరవేరుతున్నది. అంతా కాల ప్రభావం. ఇది ప్రచార యుగం. యుగ లక్షణాలు అన్ని రంగాలకూ వ్యాపించటమే విలక్షణత.

## చెణుకులూ చమత్కారాలూ...

- తిరుపతి వేంకట కవులు గద్వాలకు వెళ్ళారు. అక్కడి ఆస్థాన కవులు వైష్ణవులు. స్మార్తులయిన వీరికి స్వయంపాక మిప్పించి (తెలంగాణా మాండలికంలో 'సాహిత్య' మిప్పించి) వండుకొని తినమన్నారు. అలవాటులేని జంట కవులు "వంటనేర్పించె

గద్వాల విభు"డని వాపోయారు. అవధాన సభ అయిన తరవాత రాజావారు కేవలం పది రూకలు బహుమానంగా ఇచ్చారని మొత్తుకుంటూ కవులు పది పద్యాలు చెప్పారు! తరవాతి కాలంలో ఇచ్చిపుచ్చుకోళ్లు తృప్తికరంగానే జరిగాయి.

- పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి ''ంఠాభరణం' నాటకంలో ఆశు కవిత చెప్పిన జంటకవులకు బేడా (రెండణాలు, అంటే 13 పైసలు) ఇచ్చారు షష్టిపూర్తి సభలో! "తోడా లివలేవో? గుడి, ఘోడాలే నివ్వలేవొ కొమరుగ తలపన్? బోడెమ్మ, చాకలికి వలె, బేడా ఇచ్చెదవ? గేదె పేడా ధరలోన్?" అని నిందిస్తారు కవులు మీపాటి కవిత్వం నేను చెప్పలేనా అని. "చింతపండు తెచ్చి రాచ్చిప్పలో వేసి.... బజ్జి చేసి తినగ గజ్జి మొలచు" నంటాడు దాత!

- చాలామంది తిరుపతి వేంకటకవులు ఉపాసనాబలం వల్లనే గొప్పగా అవధానం చేయగలిగారంటే అవధానులు బుద్ధిబలం, సహజమైన ఆశుధార, ధైర్య స్థైర్యాలు, శాస్త్రజ్ఞానం అనే నాలుగు లక్షణాల వల్లనేగాని 'దైవకృపవల్ల కానే కా'దని నచ్చచెప్పటానికి అవస్థపడవలసి వచ్చింది! అలాగని వారే గ్రంథస్థం చేశారు.

– ఈనాడు ఆదివారం సంచిక, 3.3.1996

# ఆగమగీతి

- ఆలూరి బైరాగి

ఆలూరి బైరాగి మౌలిక రచనలతోబాటు ఆయన అనువదించిన 52 పేజీల సాహిత్యంతో ప్రచురితమైన 'ఆగమగీతి' నీటుగా అచ్చయిన తెలుగుకవితా సంకలన గ్రంథాల్లో ఒకటి. 'సంకలన' శబ్దానికి బదులు 'సంచయన' శబ్దం వాడటంతో బైరాగి హిందీలో కూడా ప్రసిద్ధకవి అని, ఆయన కీర్తి శేషులనే విషయాన్ని సూచించారు ప్రచురణకర్తలు.

తెలుగు సాహిత్యం భావకవితా మార్గం నుంచి అభ్యుదయ పథానికి మళ్ళిన తొలికాలంలో సుప్రసిద్ధులైన కొద్దిమంది కవుల్లో బైరాగి ఒకరు. ఆడంబరాలూ, ఆత్మవంచన పరవంచనలూ నచ్చని కవి బైరాగి. ఆధునిక సమాజంలోని దుర్భర జీవితాన్ని కవితా వస్తువుగా ఆయన స్వీకరించాడు. పుట్టుక, ప్రేమ, చావు అనే మూడు ప్రధాన ఘట్టాల్లో సామాన్య మానవుడు ఏవిధంగా కొట్టుమిట్టాడుతున్నాడో, జీవితం ఎంత కరుణమయంగా ఉందో, చుట్టూ అలుముకొన్న చీకటి ఎంత భయానకంగా ఉందో, చుట్టూ సమాజమున్నా సగటు మనిషి ఎలా ఒంటరితనంలో మగ్గుతున్నాడో సరికొత్త రూపకోత్ప్రేక్షలతో, ఉదాత్త కల్పనలతో బైరాగి కావ్యఖండాలు వర్ణిస్తాయి. కవి, కవిత్వ లక్షణాలను విశ్లేషించి నేటి వంచనామయ ప్రపంచ ధోరణిని బైరాగి తీవ్ర భాషలో విమర్శిస్తాడు. అతని కొన్నిమాటలు ఆయన 'సినిక్' అనిపిస్తాయి. మరికొన్ని 'ఆశావాది' అనిపిస్తాయి.

'కవితా సత్రం వెనక ఎంగిలి విస్తళ్ళ కొరకు వెదుకను నేను' (పిరమిడ్లు) అని బైరాగి శపథం. 'కవితాసతిని నడివీధిని వేలంవేసి' (ప్రేమకథలు -1) అభినందన వందనలు చేయటానికి కృపణప్రశంసలతో 'తీయని విషం' కలపటానికి నేను మీ కవిని కాను. బైరాగి సిద్ధపడదు. ఇతడు కాదు పూజారి, ఇతడొంటరి బాటసారి' (క్షమించండి). శ్రీరంగం నారాయణబాబు లాగానే బైరాగి కూడా నేటి సామాజిక వాతావరణంలో 'జీవిత శ్మశానంలో కవితా శవసాధన' అనే తాంత్రిక ధర్మం నెవవేర్చాడు. లోకవంచకులను బైరాగి క్షమించడు. కఠోర వ్యంగ్యంతో శిక్షిస్తాడు! 'అమాత్యుని ఆకాలమరణం' అనే ఖండికలోని ఈ పంక్తు లందుకు నిదర్శన: 'అమాత్యుని శేష చిహ్నాలు, అత డావిష్కరించిన ఎలకకన్నాలు.... గబ్బిలాల నృత్యాలకు ఉలూకాల గానాలు, పురుగుల పురిటిగది. అమాత్యుని సమాధి అది'. ఆవిష్కరణలూ శంకుస్థాపనలేగాని ఆచరణ శూన్యమయిన నేటి వంచనాశిల్పానికి బైరాగి వాక్యాలు ప్రతిశిల్పం.

తెలుగు సాహిత్యంలో వచన పద్యాలను అభిమానించి రచించిన తొలితరం కవుల్లో బైరాగి ఒకరు. సంప్రదాయబద్ధమైన పలాయనవాద సాహిత్యం ఆయనకు సరిపడదు. భాష విషయం లోనూ అంతే. రూపకోత్ప్రేక్షల్లో బైరాగి ప్రౌఢిమ, నూతనత్వం కనిపిస్తాయి. మచ్చుకు కొన్ని ఉదాహరణలు : 'జీవితం ఉరిత్రాటి ఉచ్చులాగు, ఒంటరి సున్నాలాగు పిలుస్తున్న రోజున' (క్షమించండి), 'ఆకాశపు కిటికీల్లా చీకటిలో చుక్కల్లా, ఇంటి కప్పుల్లో చిల్లులు' (త్రిశంకు స్వర్గం), చీకటి చెమర్చటం తెలుస్తుంది. కొంచెం గమనిస్తే (మల్లెపూలు), నిర్భాగ్యుని రెప్పల జేబుల్లోంచి, నిద్దురపర్సు కాజేసేది' (మేలుకొన్నవాడు) మొదలైనవి. 'చీకట చెమర్చటం' భాస

మహాకవి సుప్రసిద్ధ శ్లోకం లిం తీప తమోవంగాని, వర్ష తీ వాంజనం నభః" అనే దాన్ని తలపిస్తుంది.

బైరాగి రచనలో కొన్ని అద్భుతమైన ఇమేజెస్ కనిపిస్తాయి. మచ్చుకు కొన్ని : 'బల్లమీద మల్లెపూలు, గాలి గర్భవతిలా పరిమళంతో బరువెక్కి నిండినది తనలో తాను' (మల్లెపూలు), 'హిమాలయపు వయొలిన్‌పై మంచు తుపానుల కమాను లేసిన మహోగ్ర సంగీతం' (సూతాశ్రమం), నొచ్చిన నా రెక్క క్రింద పగులబోయే గ్రుడ్డులాగు భూమి, లోయల లోతుల్లో నీలినీడల పోరాటాలు' (ఒంటరి దేగ) మొదలైనవి. బైరాగిని బాగా ఆకర్షించింది మరణ రహస్యం. అనేక సందర్భాల్లో మరణాన్ని స్మరిస్తాడు కవి. 'ప్రేమన్న మరణమహాఫణి ఫణాగ్ర దివ్యమణి' అనేది అద్భుత కల్పన. 'మృత్యువును చూసి కాదు నేను, జీవితాన్ని చూసి జంకుతున్నాను, నాకు చావులేదు') అనే వాక్యం దువ్వూరి రామిరెడ్డి 'పానశాల'లోని 'మరణ భయంబు నాకు నణుమాత్రము లేదు, మదీయజీవసంభరణభయంబె మిక్కుటము' అనే చరణాన్ని తలపిస్తుంది. అదే ఖండికలో "తెరచిన చెర తలుపు వంటిది మరణం, విసిగిన బాటకు క్రొత్త మలుపు వంటిది మరణం, దూరపు వలపు పిలుపు వంటిది మరణం' అంటాడు కవి. 'అరచిత కవితలో' బైరాగి 'మరణానికి మరణం లేదు. మరణం కోసమైన కరుణజీవిత మిట జీవిస్తుం'దంటాడు. ఇది 'తరుణం మరణానికి, అమర మరణ వరణానికి' (అపూర్ణ కవిత – 1) అని ఆహ్వానిస్తాడు మృత్యువును. అబ్బూరి రామకృష్ణరావు గారి ఒక 'సన్నతి'లోని 'మరణం మరణించిందను మాయమాట రానీయకు, నీ హతకుడ నేనేనను నిందను నాపై వేయకు' అనే పంక్తుల్లో ఇటువంటి భావనలే కనిపిస్తాయి. బహుశా రాయిస్ట్ రచయితల్లోని భావస్వామ్యమే ఇందుకు కారణం కావచ్చు.

బైరాగి నిరాశావాది అనీ నిస్పృహుడనీ నిందించిన వారు లేకపోలేదు. అందుకు ఉపపత్తులుగా చెప్పదగిన కొన్ని పంక్తులు 'ఆగమగీతి'లో కూడా కనిపిస్తాయి. మచ్చుకు 'మూడే మూడు మజిలీ లిచట, పుట్టుక, ప్రేమ, చావు, ఎంతసేపు నడిచినా గడిచిపోము బయలుదేరిన తావు........ మన తోడుత నడిచిన ప్రొద్దు మన వెనకే క్రుంకుతుంది' (ఎంతెంతదూరం), 'జీవితపు జమాఖర్చు ఖాతాలిక మూసివేసి, బ్రహ్మాండపు కూడికలో కాలాన్ని తీసివేసి, మిగిలిన శూన్యం చేపట్టుక పోదాం పద' (పలాయనం) మొదలైనవి. ఆయన 'సినిక్' అని నమ్మించే గేయ మొకటుంది. 'సర్వము సత్యం, ఒకటే సత్యం, ఎల్లబాటలూ వల్లకాటికే, ఫేటమి తథ్యం, వోటమి సత్యం, అన్ని పాటులూ భంగపాటుకే' (ఒకే సత్యం). తీసుకున్న ఇతివృత్తాన్ని కవితా వస్తువును బట్టి ఆవిధంగా రాశా డనిపిస్తుంది. అతడు ఆశావాది అనీ, మానవమహత్త్వం మీద అతనికి అచంచల విశ్వాసముందనీ చెప్పదగిన పంక్తులు కూడా ఈ కావ్య సంకలనంలోనే ఉన్నాయి. ఉదాహరణకు – 'మానవుడు రాజరాజు, అతని నవరత్న ఖచిత సింహాసనం ఈ భూమి' (హుసేన్ సాగర్), 'నేస్తం నీవెరుగవు గానీ, నేను మాత్రం ప్రతిరాత్రీ మరణిస్తాను, ప్రతి ఉదయం కథలో యువరాజులాగు' జీవించి లేస్తాను – మరణానికి ముద్దులు పెట్టి, ఏరోజు జీవితాన్ని ఆరోజే కొంటాను' (వాన వెలిసింది) మొదలైనవి. బైరాగి దృష్టిలో మరణం అనాసక్తికి, అశక్తతకు, నిర్లక్ష్యానికి, నిష్క్రియత్వానికి ప్రతీకమాత్రమే. anti-establishment అతని తత్త్వం. 'విప్లవానికి

ద్దొడ్డి గుమ్మంలేదు' (జనంగెలుస్తారు) అని నమ్మిన వ్యక్తి. నిన్నమొన్నటి దిగంబర కవులకు దారిచూపిన ధీరుడు. మాట కఠినం, మనసు మెత్తన. ఒకప్పుడు పద్యాలు, కథా గేయాలూ రాసినవాడే. ఛందస్సును మలుచుకున్నట్లే వచనాన్ని స్వాధీనం చేసుకున్నవాడు. హిందీలో మంచి కవిత చెప్పాడు. తెలుగులో అతని రచనలన్నీ అచ్చుకాలేదు. సగటు మనిషిని అభిమానించాడు. దయదలిచాడు, ప్రేమించాడు. ప్రచార పరాయణుడు గాని, భిక్షుకుడుగాని కాదు. నిర్లిప్తుడు. అందువల్లే ఆయనకు రావలసినంత పేరు రాలేదు. అది ఆంధ్రుల దురదృష్టం. చదివి ఆనందించదగింది 'అగమగీతి'. కవిత్వం ఎలా ఉంటుందో ఎలా ఉండాలో కవి ఎలా ఉండాలో తెలియజేస్తుంది. భజన బృందాల, కిరాయికవుల కవిత్వం కాదిది. 'నా శబ్దాలు మలచని శిలలు, ఉలులకు తలలు పంచని శిలలు' అని అతడే చెప్పుకున్నాడు. ఇంగ్లీషులో uninhibited poetry అంటారే, అదే ఇది.

6.12.1981

# తెలుగులో వెలుగులు

**– ఆచార్య చేకూరి రామారావు**

**చే**కూరి రామారావుగారు తెలుగుభాష "లో" వెలుగులను వివరిస్తూ రాసిన వ్యాసాల సంకలనమిది. 1968 నుండి 1981 దాకా వారు రాసిన కొన్ని వ్యాసాలు ఇందులో ఉన్నాయి. మొదటి వ్యాసం "పరివర్తన సిద్ధాంతాన్ని" పరిచయంచేస్తుంది. చివరిది తప్ప తక్కినవి ఆ సిద్ధాంతాన్ని తెలుగు భాషకు అన్వయిస్తాయి. భాషాశాస్త్ర రచనలు తెలుగులో రెండు దశాబ్దాలుగా వెలువడుతున్నా "పట్టుమని పదిమంది" అయినా రచయితలు లేని కాలంలో ఈనూతన సిద్ధాంతాన్నీ, దాన్ని అన్వయించే విధానాన్నీ "లోతుగా పరిశీలించి" ఈ రచనలు చేసినందుకు రామారావుగారిని, ప్రచురించిన ఆంధ్రసారస్వత పరిషత్తువారినీ అభినందించకతప్పదు.

అసలు వ్యాకరణశాస్త్రమే గహనం. దాని పరిభాషలు ప్రక్రియలు గహనాతిగహనం. "సర్వే భగ్నాః కారకే" అని వాక్య ప్రకరణం దగ్గరకు వచ్చేటప్పటికి పూర్వం సంస్కృత వ్యాకరణ విద్యార్థులేకాక గురువులు కూడా పాఠశాలవదిలి పారిపొయ్యే వాళ్ళని ఒక ప్రవాదం. అంతోటి కారక వ్యవహారాలను ఆధునికపద్ధతిలో రామారావుగారు వివరించేటప్పుడు కూడా పరిభాషా క్లేశాన్ని తగ్గించటం సాధ్యపడలేదు. దీర్ఘాంతైక స్వరయుతధాత్వాదేశ రూపాలు (46,62), ఔపశేషికాధికరణకారక సమన్వితం (56), శైలీవిన్యాసహేతుకనామ్నీకరణాలు (96), క్రియా సంబంధసంహారసూత్రం (122) వంటి పరిభాష తప్పలేదు. బహుశా ఆయన "అతీత వ్యవహారశక్తి, మాన్యత"ల కోసం (235) ఈ పద్ధతి అవలంబించివుంటారు. కొన్ని సందర్భాల్లో ఆయన పరిభాష అస్పష్టంగా ఉంది. మచ్చుకు 'ఏటవాలు పదాలు మాటలు (93) అవ్యక్తకర్త (88), మొదలైనవి. బహుశా "అనిర్దిష్టకర్త" అనటానికి పై రెండోపదం వాడారేమో! కొన్ని మాటలు పరిభాష అనిపించటంలేదు. ఉదా: సమయానికి అడ్డం పెట్టుకున్న సూత్రం' (147). తెలుగులో 'తగిన పదజాలంలేదు' (175), 'సరి అయిన తెలుగు మాటలు దొరకలేదు' (80) వంటి కారణాలవల్ల అవి ఏర్పడేదాకా ఆగకుండా వ్యాసరచన చేసినందు కాయన వందనీయుడే.

'ఆపత్తిరక్షణ' (58) వంటి పరిభాష గ్రంథం చివరి పట్టికలో చేరలేదు. ఆయన ఉదాహరించిన రామానుజం (91), ఉష (203)ల వంటివారి రచనలు అముద్రితాలైనా ఉపయుక్త గ్రంథపట్టికలో చేరలేదు. ప్రతి పేజీలోనూ కనీసం ఒక్క అచ్చుతప్పయినా వుంది. పూర్వం అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రచురించిన సంస్కృత వ్యాకరణ వ్యాఖ్యానంలో వేలకొద్దీ అచ్చుతప్పులున్నా తప్పొప్పుల పట్టిక పేజీల కొద్దీ ఉంది. ఆపనిచేసినా బాగుండేది.

రామారావుగారి రచనలో ఎంత గంభీరమైన సంస్కృతముందో అంత విశృంఖలమైన ఆంగ్లం కూడా ఉంది. 'మౌఖికభాషలో ఉపయోగించినంత ఆంగ్ల పదజాలం లిఖితభాషలో కనిపించదు' (152) అని ఆయనే రాసినా (110), ప్రవృత్తులు (140), కోలెన్, గురించి (167) వగైరాచోట్ల ఆయన కేవలం ఇంగ్లీషులోనే అర్థాలు రాశారు. ఇది స్వహచనవ్యాఘాతం. ఫిల్‌మోర్ విభజనను సంస్కృతవ్యాకర్తల కారకవిభజన ప్రణాళికతో పోల్చిన పద్ధతి (103) పంచపాండవుల కథలాగా ఉంది. కొన్నిచోట్ల ఆయన చెప్పిన సూత్రాలకు ఉదాహరణలు లేవు. మచ్చుకు 'ప్రాచీనభాషలో తినకుండా తినకవంటి రెండు క్రియారూపాలూ ఒకే అర్థంలో వాడబడినట్లు కనిపిస్తున్నది' (119) అనే వాక్యం. 64వ పేజీలోని రిఫరెన్సుకు వివరణలేదు. కొన్నిచోట్ల పూర్వాపరాలను ఆయన సరిచూసుకున్నట్లు లేదు. బహుశా పూర్వవ్యాసాలను మార్పులు చేయకుండా ప్రచురించటమే అందుకు కారణం కావచ్చు. ఉదాహరణకు 'సర్వధాతువులూ వ్యాపారబోధకాలు కావు' (54) అని క్రియ వ్యాపారబోధకం (75) అనటం 'చెట్టుబొమ్మ' (85) ఉరఫ్ 'నిర్మాణసూచికా వృక్షం' (122) విషయంలోని వివరణను మరింత జాగ్రత్తగా రాసి వుండాల్సింది. 'వాక్యం (చెట్టుబోదె) మొదట రెండుకొమ్మలుగా చీలింది' (86) అన్నచోట వాక్యం అనే చెట్టుబోదె పైనుంది; కొమ్మలు కిందికున్నాయి. అమెరికాలో ఎలావుంటాయో తెలీదుగాని తెలుగువాళ్ళకు ఎబ్బెట్టుగా వుంటుంది – గిరీశం అమెరికాలో తలకిందులుగా నడుస్తారన్నట్లు. అటువంటిదే 'అతను తెలుగు చదవటానికి అమెరికా వెళ్ళాడు' (109) అనే వాక్యోదాహరణకూడా: 'నాకు ఆలస్యంగా నిద్రపోవటం మామూలు' (92) వంటి వాక్యాలు వ్యాకరణ విరుద్ధాలు కావనుకోవటం బాగాలేదు. 'కిందగీత ఉన్నవాక్యం (160), కిందికి జరుగుతుంది (161)', మొదలైనవి ఇంగ్లీషులో ఆలోచించి తెలుగులో రాసినట్లున్నాయి. శాస్త్రపరిభాషను గురించి వ్యాసకర్త సరయిన అవగాహన సాధించలేదు. కొన్ని ప్రసంగాలు చాలామెలకువతో చేసి వుండవలసింది. మచ్చుకు సమ్మతికీ అసమ్మతికీ మధ్యనలాగానే మంచికీ చెడుకూ మధ్య అంతరువు లుంటాయని గుర్తించక పోవటం (98).

పై వాక్యాలవల్ల గ్రంథ ప్రయోజనం దెబ్బతినలేదు. పరివర్తన సిద్ధాంతాన్ని తెలుగువారికి వివరించే, తెలుగుభాషకు అన్వయించిన మొదటి గ్రంథమిది. అందువల్ల రామారావుగారి ప్రయత్నం ప్రశంసనీయమయింది. అంతకన్నా ప్రశంసనీయం అనేక సందర్భాల్లో ఇంకా స్పష్టంగా తెలియలేదని చెప్పుకోవటం (134, 186, 215 మొ.). ఇది ఆయన అంతశ్శుద్ధికి నిదర్శనం. ఆధునిక భాషాశాస్త్రం (ముఖ్యంగా పరివర్తన సిద్ధాంతం) లోతుపాతులు తెలుసుకోవాలంటే ఈ గ్రంథమే శరణ్యం. వ్యాకరణ శాస్త్ర విద్యార్థులకిది అవశ్యపఠనీయం. తెలుగులో మరో పుస్తకంలేదు.

6.11.1983

# తెలుగు గజళ్ళు

– సి.నా.రె.

అరబ్బీభాషలో పుట్టి పర్షియన్, తుర్కీ ఉర్దూ సాహిత్యాల్లో మెట్టిన 'గజల్' శబ్దానికి నిఘంటువు లిచ్చే ప్రధానార్థం శృంగారరసాత్మకరచన అనేది. దాన్ని 'ప్రియురాలితో సల్లాప'మని సినారె, 'తరుణుల సరసా'లని దాశరథి వివరించారు. గజల్ ప్రభావంతో ఒకానొక గజల్ ఛందస్సును పోలిన ముత్యాలసరాలను సృష్టించిన గౌరవం మొట్టమొదట గురజాడకే దక్కుతుందని దాశరథి (చూ. 'జ్వాలాలేఖిని' పరిచయం) చెప్తాడు. 1918 నాటి అబ్బూరి రామకృష్ణరావు 'పూజా శిరీషములు' ఆపద్ధతిలోనే సాగింది. 1966లో దాశరథి తొలిగజళ్ళు వెలుగుచూశాయి. 1986లో కవి స్వయంగా పాడిన తెలుగుగజళ్ళను సినారె కేసెట్లతో సహా విడుదల చేశారు. 'గజల్'కు దాశరథి పెట్టిన 'వల్లరి' అనేపేరు ఇంకా వాడుకలోకి వచ్చినట్లు లేదు. సమీక్షిత గ్రంథంలో 35 'తెలుగు గజళ్ళు' ఉన్నాయి.

ఉర్దూసాహిత్యంలో గజల్ రచనకు అనేక లక్షణాలూ నిర్బంధాలూ ఉన్నాయి. రెండేసి చరణాలున్న 'శేర్'ల సంఖ్య పరిమితం కాకపోయినా, 'కాఫియా, రదీఫ్'లు (అంత్యప్రాసలు) ముఖ్యమే. ఒక్కో 'శేర్'ను ముక్తకంలాగా విడి విడిభావాలను వ్యక్తీకరించటానికి వాడినా, ప్రతిగజల్లోనూ అంతస్సూత్రంగా భావాన్వయం ఉండాలి. ఏదీ వాచ్యంగా చెప్పరాదు. ఈ 'తెలుగు గజళ్ళ'లో సినారె ఈ సూత్రాలన్నిటినీ పాటించకపోయినా 'మక్తా'లో 'తఖల్లుస్' మటుకు నియతంగా పాటించారు! 5, 7, 22 గజళ్ళలో కాఫియా, రదీఫ్–లు కూడా తప్పించారు. గజల్ మూలతత్వానికే విరుద్ధంగా "ప్రణయానికి బదులుగా మానవీయ దృక్పథాన్నీ, ప్రగతిశీలాన్నీ, మెత్తని అధిక్షేపాన్నీ" ప్రవేశపెట్టారు. 'తత్వం' మారినా 'లక్షణం' అంతగా మారలేదు! అయినా ఈ రచనలకు 'గజళ్ళు' అనే పేరెందుకుంచారో తెలీదు! మొత్తం మీద ఇదో ఆత్మాశ్రయ కవితావిశేషమని చెప్పాలి.

"గజలంటే మనదికాదనే గజి బిజి నీకెందుకు? పరసీమల డిస్కోలంటే ఉరవడి నీకెందుకు?" (35) అని ప్రశ్నించిన సినారె, స్వహస్తాలతోనే స్వాయత్తం చేసుకున్న గజళ్ళను స్వయంగా 'గజిబిజి'చేసి ఓ కొత్త 'ఒరవడి' పెట్టాలనుకున్నట్లుంది. పుస్తకంలో కవిగారి గానమాధుర్యం వినిపించదు. ఆయన 'నాగార్జునసాగరం, కర్పూర వసంతరాయలు' వంటి పూర్వ రచనల్లోని భావుకతనూ ప్రియంభావుకతనూ, రచనానైశిత్యాన్నీ వైశద్యాన్నీ స్మరిస్తే ఈ తెలుగుగజళ్ళు కేవలం మొక్కుబడికి రాసినవా అనే అనుమానం కలుగుతుంది. 1953–86 మధ్యకాలంలో 1961, 1962, 1963, 1984 అనే నాలుగు సంవత్సరాల్లో సినారె రచనలు పుస్తకరూపంలో వెలువడలేదు. ఈ గజళ్ళన్నీ పూర్వం ఆంధ్రజ్యోతిలో అచ్చయినవే. 1986లో ఇవి గ్రంథరూపంలో వచ్చినందువల్ల, ఆయన పూర్వరచనల్తో మాత్రమే దీన్ని పోల్చిచూసిన అభిమాని కూడా "కీళ్ళువాచి సినారె గతకీర్తి గతుకుతున్నాడు" (25) అని బాధపడవలసి వస్తున్నది! అయినా "అరుదైన 'సినారె'పై ఆరాధన లెన్నెన్నో"! (20).

సినారె కవిగా సుప్రసిద్ధులుకాబట్టి ఆయన రచనల్లో అపూర్వభావసంపదకోసం, తాత్విక దృక్పథం కోసం ఎదురుచూస్తుంటాం. అది ఆత్మాశ్రయ కవితకాబట్టి ఇలా అపేక్షించటం

అన్యాయం కాదనుకుంటా. 14వ గజల్లోని "మరణం ననువరించి వస్తే ఏమంటాను- నేనేమంటాను? షాలుపట్టీ జోలపాడీ పడుకోమంటాను" అనటంలోనూ, 15వ గజల్లో "బ్రతుకంతా పాడుకుంటూ మృతిలోనా నవ్వుకుంటా" ననటంలో కవి ఆంతర్యం అర్థం కావటం లేదు. ఇలాంటిదే అబ్బూరి రచన ఒకటుంది - 1966 నాటిది. అందులో "అనుదినమూ క్షణక్షణం మరణించే నాకోసం, అనుక్షణం ప్రతిదినమూ జీవించే నన్ను చేరి, ఎలా ఈ అసంబద్ధహాస్యాస్పద పరిహాసం... మరణం మరణించిం దను మాయమాట రానీయకు! నీహతకుడ నేనేనను నిందను నాపై వేయకు" అన్నప్పుడు, జీవన్మరణాలు శాశ్వత సత్యాలనీ వాటిని అధిగమించగల శక్తి మానవులకు లేదనీ రచయిత స్పష్టం చేశాడు. సినారె అంతస్తత్వం ఇలాంటి విషయాల్లోక్కూడా అస్పష్టంగానే ఉందనడానికి పైవాక్యాలే నిదర్శనాలు.

మంచి గెటప్‌తో వచ్చిన ఈ తెలుగు గజళ్లలో 35 పేజీల్లో అచ్చుతప్పులు దొర్లటం తెలుగు ముద్రణ పద్ధతి మనకు సంక్రమింపజేస్తున్న దురదృష్టం. ఉదాహరణకు 24వ పేజీలోని 'నవచేతన'ను చూపవచ్చు. 'బ్రతుకు, వ్రాసీ' వంటి అర్ధ గ్రాంథికరూపాలు ఇంకా మిగిలిపోయాయి. డా. గూటాల కృష్ణమూర్తి ప్రవేశపెట్టిన కవికంఠస్వరం కేసెట్లో వినిపించే పద్ధతిని సినారె తెలుగువాళ్ళకు అలవాటు చేస్తున్నందుకు అభినందించాలి. అయితే కేసెట్ వెల, అది లభించే చోటూ గ్రంథంలో కూడా సూచిస్తే బాగుండేది. తెలుగులో గజళ్లు ఎంతగా మారాయో గుర్తించడానికి చదవదగిన పుస్తకమిది.

15.3.87

## అక్షర యజ్ఞం

**- దుత్తా బాబూరావు**

ఇదో ఖండకావ్యం సంపుటి. 1964-86 మధ్యకాలంలో దుత్తా బాబూరావు రాసిన 73 ఖండికల సంకలనం. "అముద్రిత గ్రంథాలు ఇంట్లో విపరీతంగా పెరిగిపోతుంటే వాటిని కుదించి భద్రపరుద్దామనే స్వార్థంతో, సమాజ చరిత్రని కొద్దిలో కొద్దైనా చెప్పవచ్చు"నని, తన్ను తాను "ఊరడించుకోవడానికి" ఎన్నాళ్లగానో- ఎన్నేళ్లుగానో రాసుకున్న కవితల్ని ప్రచురించారు కవి. బాబూరావుగారి రచనాధోరణిలో 1972 తరవాత పెద్ద మార్పే వచ్చిందని గ్రంథం నిరూపిస్తుంది. కవిభావాలతో ఎన్నటికీ ఏకీభవించలేని దివాకర్ల వేంకటావధానిగారి ఎనిమిది పుటల పీఠికతో మొదలైన పుస్తకం పీఠికాకర్తకు నివాళులర్పించటంతో పూర్తి కావటం విచిత్రమే.

బాబూరావుగారు కాలక్రమాన హేతువాదిగా, సోషలిస్టుగా కూడా పరిణమించారు. ఈ దేశానికి 'కొల్లాయి గట్టిన సన్యాసు'లవల్ల స్వాతంత్ర్యం రాలేదని ఆయనకు గట్టి విశ్వాసం. నేను కూడా దేశస్వాతంత్ర్యంలాగానే 'జీవచ్ఛవాన్ని' అని వాపోయాడు. ఎందుకంటే, "స్వాతంత్ర్యం చక్కెర క్యూలో చిక్కుబడింది. బియ్యం క్యూలో బిక్కపోయింది. కిరసనాయిల్ క్యూలో కూలబడ్డది. మహామేధావుల్ని పరదేశాలకు తరిమివేసింది" కాబట్టి. ఇలాంటి కారణాలు ఇంకా సవాలక్ష ఉన్నాయి. తాను హిందువునని చెప్పుకోడానికి కవి సిగ్గుపడుతున్నాడు. హరిజనులకూ, స్త్రీలకూ దిక్కులేకపోగా, దొంగబాబాల దుర్మార్గాలు పెచ్చరిల్లిపోతున్నందుకు ఆయన కుమిలిపోతున్నాడు. యజ్ఞయాగాల పేరిట జరుగుతున్న వృథావ్యయం, లోకవంచనలు కవికి అసహ్యం కలిగించినా

గ్రంథానికి 'అక్షర యజ్ఞ'మనే పేరునే పెట్టాడు (బహుశా శ్రీశ్రీలాగా పౌరాణికోపమానాలతోనే ఆధునిక వ్యవస్థను వర్ణించాలనే కోరికవల్ల నేమో). దేశంలోని 'గుళ్లు భూమాతకు పుళ్లు' అని అసహ్యించుకున్నాడు. పతితుల భ్రష్టుల మీద అపారమైన కరుణావాత్సల్యాలు ప్రదర్శించాడు. సామాన్యుడి "బ్రతుకుబాట" కోసం "కవిత్వపు కంకర రాళ్లతో రోడ్డు" వేయాలని ఆయన ఆశ. అందుకే అడ్డువస్తే "భాష గొంతును సైతం నులిపివేస్తా" నన్నాడు.

కొన్ని సందర్భాల్లో ఆయన భాషకు అన్నంత పనీ చేశాడు: 'యమిని' (పే. 61), 'భానోదయం' (పే. 62), 'జీవనకచ్చురం', 'లోగిలిలో కర్కశం' (పే. 68), 'కాలజవ్వని' (పే. 122), 'ఉగ్రతాకిడి' (పే. 85), 'హరితభరిత కొండవాగులు' (పే. 84) వంటిచోట్ల. అయినా బాబూరావుగారి భాషలో పదును చాలా ఉంది. 'కుష్టువాడి అర అర చేయి', 'కంచిగోవు' లాంటి 'దొంగబాబా' మొదలైన చాలాచోట్ల. కొన్ని భావనలు చాలా బాగున్నాయి – "పారిపోయే మేఘం, దారితప్పిన కుర్రవాడి లాగున్నది" (పే. 14), "కుంపటిలాంటి సూర్యుడితోటి కాపురం చెయ్యలేక, ఛాయాదేవి చల్లనిగాలితో లేచిపోయింది" (పే. 23), "వేడికి తడబడ్డ నేల జలుబుతో బురదగా మారింది" (పే. 102) మొదలైన చోట్ల. 'నిగర్వి, హృదయాన్ని కదిలించే ఘట్టాలు', 'చంద్రనీతి చంద్రిక', 'హిందువును' వంటి అనేక ఖండికలు నేటి సమాజస్థితికి అద్దంపట్టాయి. "వేకువ కాన్పుకు చీకటి నొప్పులు, నలగని పుష్పం ఇవ్వదు గంధం, పగలనిరాళ్లూ కట్టవు సౌధం" (పే. 106) లాంటి వాక్యాలు కవి భావనాశక్తికీ, లోకానుభావానికీ నిదర్శనాలు. అయితే "నా కవితకు తెలియనిది స్తవం" (పే. 113) అన్న కవిగారు కనీసం రెండు స్తవాలను గ్రంథంలో ఎందుకు చేర్చారో తెలీదు.

చాలామంది ప్రఖ్యాత కవులకన్నా బాబూరావుగారు తమ రచనలో ఎక్కువపాలు కవిత్వం ప్రదర్శించారని చెప్పాలి. ఉత్తరకాలంలో 'అక్షర ఘోష'లో మరింత మంచి కవితను అందిస్తారని ఆశిద్దాం.

5.7.1987

## హృదయోల్లాస వ్యాఖ్య

**– తాపీ ధర్మారావు**

విద్వద్విమర్శకులైన తాపీ ధర్మారావుగారి శతజయంతి సందర్భంగా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు 'తాతాజీ' గారి రచనల్లో అత్యుత్తమమైన హృదయోల్లాస వ్యాఖ్యను విజయ విలాసంతో సహా ప్రచురించటం ముదావహం.

ధర్మారావుగారి జీవన విధానం, వాదసరళి తీవ్రవాద భూయిష్ఠంగానే నడిచాయి. తొలుత వీరగ్రాంథికవాదిగా ఉన్న ధర్మారావుగారు కాలక్రమాన వీరవ్యావహారికవాదిగా పరిణతి చెందారు. 'జనవాణి' సంపాదకులుగా పత్రికల్లో వ్యావాహారికరూపాలకు మొదటిసారి స్థానం కల్పించినవారుగా వారు చిరస్మరణీయులు. తొలుత జస్టిస్ పార్టీవారుగా, బ్రాహ్మణ వ్యతిరేకోద్యమంలో తీవ్రవాదిగా జీవించిన తాపీవారు తరవాత వ్యతిరేకతను విద్యాస్పర్ధతో ముగించి గతితార్కికవాదిగా పరిణమించటం విచిత్రమే. బాల్యం నుండి 'నాయుడు బిడ్డ' అయిన చేమకూర వేంకటకవి "విజయవిలాసం" మీద అభిమానం పెంచుకొని అలనాటి పండిత

ప్రకాండుడైన వేదం వేంకటరాయశాస్త్రితో పోటీపడి ఈ హృదయోల్లాసవ్యాఖ్యను బహుకాల పరిశ్రమ ఫలితంగా 1968లో మొదట ప్రచురించారు.

రెండు పేజీల 'మామాట'లోని పద్యంలో రెండు తప్పులూ (చూ. 1వ పేజీ, 12వపేజీ), 'మొదటి ముద్రణలోని తప్పొప్పులపట్టిక రెండు ముద్రణలో లేకుండా" (పే. 2) అనే చోట మరో తప్పు, "వేంకటకవి"ని 'వెంకటకవిగా' ఆధునికం చేసిన రూపంలో మరోతప్పుతో ప్రచురించిన ప్రకాశకులు మూలగ్రంథాన్ని ఆఫ్‌సెట్‌లో ప్రచురించినందువల్ల తొలిముద్రణలోని అచ్చు తప్పులను పూర్తిగా పరిహరించలేకపోయినా కొత్త తప్పులు దొర్లకుండా జాగ్రత్త పడ్డందుకు అభినందనీయులే.

తాతాజీ తమ జీవితంలోని రెండో దశలో రచించిన 'బండిరాపల్లకీ, కొత్తపాళీ' వగైరాలతో పోలిస్తే ఈ సమూలక వ్యాఖ్యాన గ్రంథం చాలా పాతధోరణిలోనే నడిచిందని చెప్పక తప్పదు.

పెద్ద భేదమల్లా ఎక్కడో తప్ప పూర్వ వ్యాఖ్యాతల్లాగా సంస్కృతాలంకారిక గ్రంథాలనుంచి లాక్షణిక వాక్యాలను ఎత్తి రాయకపోవటంలోనే ఉంది. వేదం వారిలాగా కాకుండా జూలూరి అప్పయ్యగారిలాగా వ్యాఖ్యానాన్ని వాడుకభాషలో రాసి తాపీవారు గిడుగువా రపేక్షించిన 'నిజ మైన సంప్రదాయాన్ని' పరిరక్షించటం కూడా ప్రత్యేకతగా భావించవచ్చు. బ్రౌన్ కాలం నుంచి 1952 దాకా వచ్చిన ప్రతులనూ, వ్యాఖ్యానాలనూ, వ్యాసాలనూ పరిశీలించి అంతటితో ఆగక "విబుధవరులచేత విన్నంత కన్నంత తెలియవచ్చినంత" తేటపరుస్తూ ఈ వ్యాఖ్యానం రాశారు. 'తెలియవచ్చినంత' అనటం ఎందుకనే ప్రశ్న రావచ్చు. మచ్చుకు 635వ పేజీలోని కేళీ గృహవర్ణనపద్యానికి సాంకేతికపదాలతో కూడిందనీ, దానికేదో అర్థాలు గిట్టించటం 'వ్యర్థప్రయాస' మనీ తాపీవారు వ్యాఖ్యానం రాయలేదు! అయితే మిగిలిన పుస్తకమంతటిలో లాగానే పూర్వవ్యాఖ్యాతల, విమర్శకుల అభిప్రాయాలనూ, పాఠభేదాలనూ ప్రస్తావించారు. ఇందువల్ల గ్రంథప్రయోజనం మరింత పెరిగిందని చెప్పవచ్చు.

వ్యాఖ్యానమంతా ఒక ఎత్తయితే 'పీఠిక' ఒక్కటే ఒక ఎత్తని చెప్పాలి. వ్యాఖ్యాత పడినపాట్లతో బాటు వారు కొత్తగా సేకరించిన పదపదార్థ వివరణ అందులో ఉంది. కవిజీవితం, చరిత్ర, హృదయావిష్కరణ పద్ధతులు అందులో స్పష్టీకరించారు. తాతాజీ తమకు విజయవిలాసం మీద వున్న విపరీతాభిమానం దాచుకోలేదు. 'విపరీత' మనడానికి బాహ్యకారణా లనేకం. కుకవినిందచేయని వేంకటకవి తన కవితా ధర్మాలను పేర్కొంటూ 'ఛాయా చోరక రససందర్భం' తగదనీ, స్వకపోలకల్పిత మనోజ్ఞ కళాగతి' గొప్పదనీ సూచించిన పద్యాన్ని ఘనంగా ప్రస్తావించిన తాతాజీ (పే. 20), ఆ పద్యం 'ప్రక్షిప్త'మేమోనని (పే. 580) అనుమానిస్తూనే వ్యాఖ్యానించారు. విజయవిలాసాన్ని 'పిల్లవసుచరిత్రగా' అంగీకరిస్తూనే (పే. 41), 'పిల్ల విజయవిలాసాలు' పుట్టాయన్నారుగాని ఒక్కదాన్నీ పేర్కోలేదు! శబ్ద రత్నాకరకారుడికి కూడా చేమకూర పద్యం బోధపడలేదని ఆక్షేపించారు. (పే. 41) రు – ల లకూ ల – డ ల కూ' అభేదం చెప్పి ఎన్నోచోట్ల నూతన భావావిష్కరణకు ప్రయత్నించారు. పూర్వపరిష్కర్తల్లాగానే చాలాచోట్ల పాఠాలను 'సవరించారు'. 'మామకాగమనవార్త' వంటి పదబంధాలను విరిచేటప్పుడు శబ్దాలంకారమే గొప్పకాదని లాక్షణికులకూ, శబ్దచిత్రమే కవిత్వమనుకొనే పూర్వకాలపు పండితులకూ, 'క్షీణయుగ'

మహాకవులకూ తాతాజీగారికీ భేదం లేనందుకు విచారం. సాఫీగా చదువుకోవలసిన పద్యాలను అక్కరకు మారిన విరుపులతో వింగడించి విశేషార్థాలు తీసే పండిత ప్రాగల్భ్యం చూపినప్పుడు, అసలు కవిమీద జాలిపుడ్తుంది. 'ఇంతలు కన్నులుండ తెరు వెవ్వరి వేడెదు?' అన్న మనుచరిత్ర పద్యాన్ని ఓ పండిత ప్రకాండుడు 'ఇంత అలుక? అన్నులు ఉండ' అని ముక్కలు చేసి, పెద్దన ఏనాడూ చేయని అత్సంధిని అంటగట్టి మరో (పే.336-38) అరసున్నా లేకపోవటం తప్పుకాదని సమర్థించాడు. అనైఘంటుకార్థాలు ఇతరులు చెప్పినా కవి హృదయావిష్కరణకు, ఉన్నతి ప్రదర్శనకు పనికి వస్తున్నా యనుకొన్నప్పుడే అంగీకరించారు. వేంకటకవి హెచ్.జి.వెల్స్ వంటి మహామహులకు (!) కూడా ఆదర్శప్రాయ మైనాడని మెచ్చుకున్నారు (పే.31, 205). కవి కల్పనలలో శాస్త్ర విరుద్ధాలూ లోకవిరుద్ధాలూ ఉన్నా కిమ్మనలేదు. (పే. 14 మధ్యాహ్నమహేశ్వరుని రాత్రి మహేశ్వరుని చేశాడు' మొదలైనవి).

పైపెచ్చు విజయవిలాసంలో 'వస్తై వ్యక్యత' ఉందన్నారు! (పే.37). "తెలుగుపదాల శ్లేషను గురించి చెప్పాలంటే ఆంధ్రకవీశ్వరులందర్నీ మించిపోయినవాడు మన చేమకూరకవి" (పే.45) అన్నారు. మరి అతనికి ముందేవున్న పింగళి సూరన రాఘవపాండవీయంలో కుప్ప తిప్పలుగా కనిపించే 'ఏనుంగని కరమరయక' వంటి పదబంధాలను పోల్చి చూశారో లేదో తెలీదు!

అలాగే తాపీవారు 'నూతనతనూ' అనే సమాసభాగాన్ని చూపి 'ఎటునుండయినా చదివి వికటకవి లాంటి రూపంద్వారా రసాస్వాదన చేయమంటే ఎంతో బాధ కలుగుతుంది!

ప్రాచీన భారతీయాలంకారికులుగాని, పాశ్చాత్య విమర్శకులుగాని అనేకార్థాలు వచ్చే శబ్ద చిత్రాలు ఉత్తమ కావ్యలక్షణాలని ఏనాడూ చెప్పలేదు. 'వసుచరిత్రతో' తెలుగు సాహిత్యంలో ఆవిర్భవించిన శబ్దాలంకార ప్రియత్వం, దానితో ఎందునా పోలని అనుకరణ గ్రంథాలు వెలయగానే మనకు క్షీణయుగ సాహిత్యాన్ని అందించి అభాసుపాలయింది. ఆ యుగంలో విజయవిలాసం చక్కని కావ్యమని చెప్పటంలో సందేహంలేదు. కానీ కత్తీకలమూ పట్టిన కొద్దిమంది తెలుగు కవుల్లో ఒకడైన వేంకటకవి మంచి యుద్ధవర్ణనలయినా అందించనందుకు దుఃఖపడాల్సిన వాళ్లం, పాత పరిష్కరణ చేసి మరి కొన్ని శబ్దచిత్రాలు సాధించటం ఎంత భావ్యం? మన సంప్రదాయ పద్ధతి విమర్శల్లో, వ్యాఖ్యానాల్లో కొట్టవచ్చినట్లుగా కనిపించే పెద్దలోపం కావ్యాన్ని మొత్తంమీద పరీక్షించటంకాక ఏపద్యాని కాపద్యంగా చదవటం, మెచ్చుకోవటం. 'కావ్యాత్మ' అనే భావన లక్షణగ్రంథాల్లోనే గాని మనకు ఆచరణలోలేదు. ఇంగ్లీషువాళ్ల ధర్మమా అని ఇప్పటి విమర్శకులు సమాహారం మీద కావ్య పరిశీలన చేస్తున్నారు. ఈ విద్య తెలిసిన తాపీవారు హృదయోల్లాసానికి ఆధునికత్వం జోడించివుంటే బాగుండేది.

ఈ వ్యాఖ్యానంలో పీఠికలో కొన్ని మెచ్చదగిన కొత్తదనాలున్నాయి. 'సందేహాంతాలు' (పే.47-55) వాటికి మకుటాయమానం. భావి పరిశోధకులు నిర్ణయించిన విషయాలందులో సూచించాడు వ్యాఖ్యాత. 'వ్యాకరణదోషా' లంటే 'వ్యాకరణాలు చేసిన దోషా'లనటం (పే.46) బాగుంది. ఎటొచ్చీ కొన్ని సందేహా లింకా మిగిలిపోయాయి. సంస్కృతభారతం ప్రకారం ఉలూచి 'వితంతువు' అని వీరేశలింగంగారే ఉపపత్తులు చూపారని, నన్నయ మాత్రం 'నాగకన్యక' అన్నారని తాపీవారు పేర్కొన్నారు. (తే. ఒక చిన్న రహస్యం' పీఠికలో). ఆ సంగతి తెలిసిన

తాపీవారు విజయవిలాసంలోని కన్నియగాని వేరొకతె గాను (పే. 25వి) అన్నప్పుడు మన కవికూడా నన్నయలాగానే తప్పు చేశాడని ఎందుకనలేదో గిరీశానికి కాకపోయినా గురజాడ కైనా ఈవిషయం ఎందుకు తెలీలేదో ఆశ్చర్యంగా ఉంది!

హృదయోల్లాసవ్యాఖ్యను తాము ప్రచురిస్తున్నప్పుడు 'ప్రబంధపఠనానికి విముఖత ప్రబలంగా కనిపిస్తున్న ఈ దినాలలో' (పే.12) తగినంత వ్యాప్తిరాదేమోనని తాపీవారు బాధపడ్డారు. నిజమే. ఈ కాలంలో నవ్యులు ప్రాచీన సాహిత్యాన్ని అభిమానించలేకున్నారు. కానీ భాషాపాటవ సంపాదనకోసమైనా ప్రాచీన కావ్యాల్ని చదవటం మంచిదని యువకులు గుర్తించాలి. తెలుగు భాషాభివృద్ధి సాధిస్తున్నామని గొప్పలు చెప్పుకుంటున్న ఈ రోజుల్లో, సరదాపడి చదువుదామను కున్నా ప్రాచీనసాహిత్యమేగాక నవ్యకవిత్వంకూడా దొరకని దుస్థితిలో ఉన్నాం. పేదపడిన గ్రంథాలయాలు, మూతపడిన సాహిత్య అకాడమీలు సంస్థలూ సంఖ్యాధికంగా పెరిగిపోతున్న ఈకాలంలో, ఒక ప్రాచీనకావ్యాన్ని సవ్యాఖ్యానంగా అందించిన విశాలాంధ్ర వారిని మెచ్చుకోవాలి.

ఆంధ్రభూమి (దినపత్రిక) 23-11-1987

# తెలుగు అధ్యయన పత్రిక

**ప్రచురణ : తెలుగు విశ్వవిద్యాలయం**

ఇది తెలుగు విశ్వవిద్యాలయంవారు ప్రచురిస్తున్న త్రైమాసిక పత్రిక. (అలాగని అట్టమీద సూచించనయినాలేదు). ఆంధ్రాంగ్లభాషల్లో వెలువడిన ఈ పత్రికకు సంపాదకులు డా.జి. లక్ష్మీనారాయణ. సంపాదకమండలి అధ్యక్షులు ఆ విశ్వవిద్యాలయం కులపతులే. సంపాదక మండలి సభ్యులెవరో చెప్పలేదు! నూట అరవై పేజీలకు గాను 37 పేజీలయినా "తెలుగు" భాషకు కేటాయించి గ్రంథంలో అక్కడక్కడా కలగాపులగంగా ప్రచురించినందుకు సంతోషించా ల్సిందే. కులపతిగారి పరిచయవాక్యాల్లో ఈ పత్రికను మొత్తం ఆంగ్లభాషలోనే ప్రచురించదలచి కూడా పరిశోధకులకు / రచయితలకు భాషాంతర పరిచయ ప్రాగల్భ్యం సమకూడనందువల్ల 'తెలుగు'లో కూడా కొన్ని వ్యాసాలు చేర్చినట్లు చెప్పారు (పే.IV, V). 'trans-linguistic participation' (పే.V) అని వారు పేర్కొన్న శక్తియుక్తులింకా తెలుగు విశ్వవిద్యాలయంలో పూర్తిగా అభివృద్ధి కానందుకు విచారించక తప్పదు. భవిష్యత్తులో మొత్తం ఇంగ్లీషులో వస్తుందనే హామీ చూసి ఆనందించటం మన విధి!

ఎటూ తెలుగు అక్షరమనేది తరువాతి సంపుటాల్లో కనిపించకపోవచ్చు. కాబట్టి, ఈ తెలుగు భాగాన్ని పత్రిక చివర ఇస్తే బాగుండేది. 1980 తరవాత పరిశోధనల స్థాయి పడి పోవటం మొదలయిందని, ఇది క్రమపరిణామంలో అట్టడుగుకు చేరకుండా ఆపటం నిమిత్తం ఈపత్రికను నెలకొల్పామని కులపతిగారు తమ పరిచయంలో రాశారు (పే.V). అలా పరిశోధనల స్థాయి పడిపోవటానికి ఏయే విశ్వవిద్యాలయం ఎంత బాధ్యత వహించాలో, తమ విశ్వవిద్యాలయం పాలెంతో చెప్పివుంటే మరీ బాగుండేది.

వ్యాసాల విషయం. తెలుగు విశ్వవిద్యాలయం వాళ్లు కొత్తగా కొన్ని ప్రచురణలు విడుదల

చేశారు. అందులో 'కోలాటం' అనే డా.బిట్టు వెంకటేశ్వర్లుగారి రచన ఒకటి (పే.110). ఆ గ్రంథ సారాంశాన్ని తిరుగా ఈ పత్రికలో 84-90 పేజీల మధ్య మళ్లీ ఎందుకు ప్రచురించారో తెలీదు. బహుశా కావలసినన్ని వ్యాసాలు దొరక్క ఇలా చేసివుండవచ్చు. 'పరిశోధన' అనే విభాగంలో 'భాస్కర రామాయణంలో ప్రాసవింత' అనే వ్యాసమో లేక చర్చాగోష్ఠియో కనిపిస్తుంది (పే.146-149). అచ్చుతప్పో ప్రాసతప్పో తేలని ఒక ప్రయోగాన్ని గురించి ముగ్గురు విద్వాంసుల సూచనలను ప్రచురించి, విషయం ఎటూ తేలనందువల్ల పాఠకుల అభిప్రాయాలను ఆహ్వానించారు. తమ అనుమానాలనేగాని అభిప్రాయాన్ని సంపాదకులు వెలిబుచ్చలేదు. మొత్తం చదివిన మీదట అది ప్రాసవింతో వింత ప్రాసో తేలలేదు. తేలని విషయాలను విశ్వవిద్యాలయం వాళ్లే తేల్చకపోతే సామాన్య పాఠకులేం చేయగలరో తెలీదు. తేలని మరో ముఖ్య విషయం. పత్రికల లక్షణాలను చెప్పే తెలుగు శీర్షిక – "తెలుగు సమగ్ర అధ్యయన పత్రిక". అది 'సమగ్రాధ్యయన' పత్రికో, సమగ్రాధ్యయనంచేసే 'తెలుగు పత్రికో' తేలటం లేదు.

శాస్త్ర విషయాలను తగినంత శ్రద్ధతో ప్రచురించలేదనిపించే అచ్చుతప్పులున్నాయి. ఉదాహరణకు 29వ పేజీలో ఉపేంద్రరాజు I, II లు ఇద్దరూ (తాతామనవలు) క్రీ.శ. 1500 ప్రాంతంలో ఉండగా, ఇమ్మడి ఉపేంద్రరాజు తండ్రి వీరపరాజు క్రీ.శ. 1575 ప్రాంతంలో ఉన్నట్లు పట్టికాబద్ధం చేశారు. అలాంటివే 'among the young Telugu Scholar, 'far and above the four walls of class room' లాంటి ఇంగ్లీషు పదబంధాలు కూడా. 'of course' అనేదాన్ని కలిపేరాయాలని రెన్, మార్టిన్ వ్యాకరణం చెప్పలేదు. కాని ఈ పత్రికలో ఆ పదాలు ఎక్కడవచ్చినా ఏకపదంగానే ప్రయుక్తమయ్యాయి!

విశ్వవిద్యాలయం ఏర్పడ్డ తరవాత రెండున్నర సంవత్సరాలకు ఇటువంటి పత్రికారాజం వెలుగు చూసిందంటే ఆనందం కలుగుతుంది. ఆ సంస్థలో జరిగిన పరిశోధనలను గురించి, అది నిర్వహిస్తున్న కార్యకలాపాలను గురించి ఈ తొలి సంచికలో వివరించివుంటే బాగుండేది. ఏంజరుగుతున్నదో దేశాంతర ఖండాంతరాల్లో కూడా తెలిసేది; మన కీర్తిపతాక రెపరెపలాడేది. విశ్వవిద్యాలయంవారు తెలుగుజాతిని కనికరించి తెలుగులో కూడా ఇటువంటి మరోపత్రికను వెలువరించినట్లయితే మన సంగతి ఇంగ్లీషురాని, వచ్చిందనుకున్నా మంచి ఇంగ్లీషురాని, తెలుగువాళ్లు కూడా చదివి తెలుసుకొని గర్వించగలరు. తెలుగు విశ్వవిద్యాలయం 'ప్రజా విశ్వవిద్యాలయం' (పే.III) అన్నారు. కాబట్టి సామాన్యప్రజలు తెలుసుకొని బాగుపడదగిన విషయాలను దీంట్లో కాకపోతే మరో తెలుగు పత్రికపెట్టి అయినా దాంట్లో అందించటం సమంజసం.

కొన్ని వ్యాసాల్లో పునరుక్తులు జోరుగా ఉన్నాయి. ఉదాహరణకు సంగీతవాద్యాలను గురించిన మొదటి ఆంగ్లవ్యాసం. జ్యోతిషం వంటి అత్యాధునిక శాస్త్రంలో ఒక్క వ్యాసం కూడా లేకపోవటం విచారకరమేగాని అపూర్వ విషయాలెన్నో ఉన్నాయి ఈ పత్రికలో. చదివి ఆనందించదగ్గ పత్రికే ఇది.

31.7.1988

# నారాయణబాబు
# మౌనశంఖం - రుధిరజ్యోతి

**- జాపల్లి ప్రేమ్‌చంద్**

శ్రీరంగం నారాయణబాబు శ్రీశ్రీకి బంధువుగా, సన్నిహితుడుగా, సహచరుడుగా ఉండి తరవాతి కాలంలో దూరమైపోయిన 'అధివాస్తవిక' కవి. ఆయన 'రుధిరజ్యోతి' కావ్యాన్ని - ముఖ్యంగా 'మౌనశంఖం' అనే ఖండికను పరిశీలించి అధివాస్తవిక కవితకు తెలుగులో నారాయణ బాబే ఆద్యుడని వివరిస్తూ జాపల్లి ప్రేమ్‌చంద్‌గారు శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి సమర్పించిన ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాస మిది. ఇటువంటి పరిశోధన లన్నిటిలోలాగానే తాము ఎంపిక చేసిన రచయితా, ఆయన గ్రంథాలూ సాహిత్యచరిత్రలో అద్వితీయస్థాన మాక్రమించినట్లు ఈరచనకూడా నిరూపిస్తుంది. అధివాస్తవిక కవితా ధోరణిని శ్రీశ్రీ ప్రయోగాత్మకంగా అనుసరించి వదిలిపెట్టిన తరవాత నారాయణబాబు దాన్ని చరమావధికి చేర్చారని రచయిత నిరూపించటానికి ప్రయత్నించాడు.

కాల్పనికవాదంనుంచి ప్రతీకవాదానికి, అక్కడినుంచి అధివాస్తకవికతకు క్రమపరిణామంలో చేరిన సాహిత్యానికి నారాయణబాబు అద్వితీయ సమర్థకుడని ప్రేమ్‌చంద్ నిర్వచనం. అయితే తెలుగులో కాల్పనికోద్యమానికే సరైన పునాదులు లేవని (11) రచయిత వాదన. పునాదుల్లేని నిరాధారకవితోద్యమాలు మరింత ఎత్తులకు ఎలా ఎగిరాయో ఆయనా చెప్పలేదు! బాబును ఒకప్పుడు 'బాంబు' అని పిలిచేవాళ్ళు సాహితీపరులు. ఆయన 'అధివాస్తవిక విప్లవఋషి' (134) అనీ, ఆయన కవితలో (సంప్రదాయ/పౌరాణిక) ప్రతీక లెక్కువనీ (95), భీభత్స (క్షమించాలి, మొదటి ఒత్తుకూడా రచయితదే) ప్రధానమైన వ్యక్తీకరణ ఆయన ప్రత్యేకత అనీ (169), పఠాభి తరవాత నగరజీవిత వర్ణన అద్భుతంగా చేసినవాడు ఆయనేనని(68), ఆయన కవితా లక్షణం నిగూఢత అనీ (77), మానవ చైతన్యానికి 'అనుభూతి పర్యవస్థానాలు' (అంటే ఏమిటో తెలీటంలేదు) చేసిన తొలివ్యక్తి నారాయణబాబే నని, తిలక్ కానే కాదని (21) రచయిత నిర్ద్వంద్వంగా వాదించాడు. అధివాస్తవికతావాదంలోని తాత్వికాంశానికి సొంత అవగాహన చేర్చి అతివాస్తవికతను అధివాస్తవికతగా తీర్చిదిద్దారని కూడా (18) పరిశోధకు లభిప్రాయ పడ్డారు. బైరాగిమాటల్లో నారాయణబాబు 'హర్షమర్షాలు' లేని మహర్షి (7).

భావకవిత్వంలోని వ్యక్తివాదపలాయనవాదాలకు వ్యతిరేకంగా 1925-33 మధ్యకాలంలో శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి 'ప్రణాళికాబద్ధంకాని తిరుగుబాటు' లేవదీశారుటగాని, తక్కిన ఇద్దరూ తప్పుకొన్న తరవాత చరమదశకు తెచ్చినవాడు నారాయణబాబేనట. ప్రపంచదారిద్ర్య విమోచనకోసం మార్క్సిజాన్నీ మనసిక (మానసిక కాదేమో) దారిద్ర్య నివారణకోసం సర్రియ లిజాన్నీ (అదే అధివాస్తవికతావాదం) నారాయణబా బంతవాడు అభిమానించి (31) మహోదాత్తంగా రచించినా, తెలుగుజాతి దురదృష్టం వల్ల అధివాస్తవిక కవిత్వం 'హాస్యస్థాయి'కి దిగజారిం దని (19) గ్రంథకర్త వాపోయారు. ప్రమాణాలు పడిపోయినప్పుడు ఎవరైనా ఏంచేయగలరు?

అసలు అధివాస్తవికతా వాదమేమిటో ఈ గ్రంథంలో తెలుస్తుంది. గ్రంథాంతంలో పాశ్చాత్య

పండితుల అభిప్రాయాలనూ సిద్ధాంత ప్రవచనాలనూ కవితలనూ మనకు మచ్చుచూపించారు. సినారే లెక్చరుల వంటి ప్రసిద్ధ విమర్శకుల అవగాహన లోపాలూ పరస్పర విరుద్ధ చర్చలూ అందించారు. చివరికి జిడ్డు కృష్ణమూర్తి తాత్విక ధోరణికీ (152) అధివాస్తవికతకూ బట్టతలకూ మోకాలికీ ముడిపెట్టినట్లు అన్వయించారు. నారాయణబాబు రచనలను యథాతథంగా ఉద్ధరించి వ్యాఖ్యానించారు. అభ్యుదయ కవితావాదమూ అధివాస్తవికతావాదమూ 'ఏకకాలంలోనే తెలుగునేలమీద అడుగుమోపినా, నారాయణబాబంత సమర్ధరచయిత విప్లవఋషిగా 'శిల్ప ప్రధానవాది'గా కవిత్వం వెలయించినా, ఆయన వాదమూ రచనలూ 'శ్రోతల ఆదరణ పొందలేక' పోవటం (165) విచార్యమే. 'పాఠకుల' ఆదరణనయినా సంపాదించాలంటే ప్రేమ్‌చంద్‌గారి వ్యాఖ్యానం ఎంతో అవసరం. అయితే ఈ దుస్థితి ఎందుకు వచ్చిందని ప్రశ్నించుకొందాం. రచయితమాటలే మనకు శరణ్యం - ఈ సందర్భంలో.

'శబ్దార్థాల్లోని అంతరాల్ని తుడిచేస్థితిలో (132) ఉన్న కవిత్వం, 'వ్యవహారభాషతో సర్రియలిస్టుభాషను... కొలవడానికి 'సమానమైన కొలబద్ధ' ('బద్ద' కాదు) లేనందువల్ల (137) పాఠకులకు అర్థంకాలేదని తేల్చిచెప్పారు పరిశోధకులు. అసలుట 'సర్రియలిస్టు కవిత్వానికి వ్యవహారిక అర్థం కాకుండా లోతుగా దాని సంపూర్ణమైన అర్థాన్నే పరిగణనలోకి తీసుకోవాలి'ట (145)! ఈ వాక్యం అర్థంకాని వాళ్ళు కె.ఎం. రాయుడుగారి పరిచయం చదివి అసలీ గ్రంథ ప్రత్యేకతను అర్థం చేసుకోవచ్చు. ఈ తీరు సాహిత్యం నేటికీ మూడుపూలు ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నదని, నారాయణబాంబు కవితాధోరణికి 'బైరాగి (సరేసరి), అజంతా, గుంటూరు శేషేంద్రశర్మ, వేగుంట మోహనప్రసాద్, ఇస్మాయిల్, కె. శివారెడ్డి' వంటి సుప్రసిద్ధ కవులు (21,183) ప్రత్యక్షంగానూ, దిగంబరకవులు 'పరోక్షంగా'నూ అనుయాయులని తేల్చారు! 'భీభత్స' (బీభత్స-కాదు) ప్రధానమయిన కవితాశకలం ఎక్కడున్నా అది బాబీయమే ననుకొన్నట్లుంది. మరి ఈ కవులు ఈ వారసత్వం అంగీకరిస్తారో లేదో!

గ్రంథంలో 'బడు' ప్రయోగాలు సమృద్ధిగా ఉన్నాయి కాబట్టి శాస్త్రీయరచనేనని బల్లగుద్ది చెప్పవచ్చు. 'సాహిత్యగూడు (46), సంక్లిష్టదారులు (96), అచేతనాలోతులు (122), మృత్యు ఊయల (132), ఎవ్వనం (102)' వంటి చక్కని ప్రయోగాలు విరివిగా ఉన్నాయి. అంతేకాదు. "ఖండకావ్యానికి కావలసిన విస్తృత ఇతివృత్తం"గల గీతం (98) ఉంటుంది. "మిరికివాడలూ వ్యభిచార్యపత్తీ (వృత్తి - కాదు) పారిశ్రామిక విస్తరణ ఫలితాలే" (110) వంటి సుభాషితాలు కొల్లలు. 'అర్థం అనర్థ' మనే పరిచయం ఈ గ్రంథానికే మకుటాయమానం.

ఇంతకాలం నారాయణబాబు అర్థం కావటంలేదనే విచారముంది. ఇప్పుడామహాకవిని ఎలా, ఎందుకు అర్థం చేసుకోవాలో తెలిసింది. అలా తెలుసుకోదలచిన వారంతా తప్పక చదవవలసిన పరిశోధన గ్రంథమిది. ఆయన కవితాధోరణికి వారసులు మరీముఖ్యంగా చదివితీరాలి. అచ్చుతప్పులు అడ్డమవుతాయనే భయమక్కరలేదు. కొన్ని మాత్రమే ఉన్నాయి- మొత్తం ముద్రితాక్షరాల్తో పోలిస్తే పదిశాతం కన్నా తక్కువే! కాకపోతే పుస్తకమంతటా 'భావకవులు' అని కావాలనే రాశారేమో తెలీదు!

2.10.1988

# భారతీయ భాషల్లో ముద్రణ,
# ప్రచురణల చరిత్ర

- బి.ఎస్. కేశవన్

నేషనల్ బుక్‌ట్రస్టువారు రజతోత్సవాలను పురస్కరించుకొని భారతదేశంలో ముద్రణ ప్రచురణల చరిత్రను కేశవన్‌గారిచేత రాయించారు. కలకత్తాలోని జాతీయ గ్రంథాలయాధికారిగా, జాతీయ శాస్త్ర గ్రంథసూచీ నిర్మాణకేంద్రానికి మొదటి సంచాలకులుగా, గ్రంథాలయోద్యమం లాంటి అనేకంలో ఆరితేరిన వృద్ధమూర్తి కేశవన్. ఇప్పటికి ఎనభైయేళ్ళ వృద్ధుడు. అయినా తన అపార విజ్ఞానానుభవాలను ఈ అద్భుత గ్రంథరచనలో ప్రచురించిన విజ్ఞాని ఆయన. మొదటి సంపుటంలో దక్షిణ భారతంలో ముద్రణ మొదలై ఎలా విస్తరించి బెంగాలులో కూడా స్థానం సంపాదించిందో చారిత్రకంగా నిరూపించా డాయన. ఈ రెండో సంపుటంలో కర్ణాటకాంధ్రమలయాళ భాషలకు సంబంధించినంత వరకు ముద్రణ ప్రచురణలు ఎలా క్రమాభివృద్ధి పొందాయో విపులీకరించారు.

ఈ గ్రంథం మూడుభాగాలు. మొదటి భాగంలో కన్నడం (పే.1-254), రెండోభాగంలో తెలుగు (పే. 255-447), మూడోభాగంలో మలయాళం (పే. 449-782) భాషాప్రాంతాల్లో ముద్రణ మొదలెప్పుడైందో, ఎవరెవరి సేవల ద్వారా క్రమాభివృద్ధి చెంది, ప్రస్తుత దశకు ప్రచురణలు చేరుకున్నాయో వివరించారు. ప్రతిభాగంలోనూ ఆయా భాషాసాహిత్యాల చరిత్రను సంక్షేపంగా చెప్పి, సాహిత్యాభివృద్ధి సాధించిన ప్రధానవ్యక్తులనూ, గ్రంథాలనూ పరిచయం చేసి, ఆ తరువాత ముద్రణ వికాసానికి ప్రచురణ కార్యక్రమాలకూ తోడ్పడిన ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసుల సేవలను తేదీల ప్రకారం వివరించటమనేది విశేషం. తొలిరోజుల్లో అచ్చయిన పుస్తకాలనేగాక బ్రిటిష్‌యుగంలో పాశ్చాత్య పండితుల కృషి ఫలితంగా వచ్చిన వ్యాకరణ నిఘంటు గ్రంథాలను గురించి కూడా కేశవన్ చర్చించారు. ఎన్నో వివాదగ్రస్త విషయాలను సవిమర్శకంగా సమీక్షించి నిష్కర్షచేశారు. ఏ భాషలో ఎప్పుడు ఎవరు పత్రికలను స్థాపించారో ఎంతకాలం నిర్వహించారో ఈ గ్రంథం నిరూపిస్తుంది. విపులమైన ఆధారగ్రంథాల పట్టికలతో, పదసూచులతో చక్కగా ముద్రించా రీగ్రంథాన్ని. కేశవన్‌గారి స్వభాషలుకాని తెలుగుమలయాళ భాషల విషయంలో కొన్ని నెరసులు దొర్లాయి. తెలుగువిషయంలో డా. మంగమ్మగారు గ్రంథకర్తృత్వంలో భాగం పంచుకోనందుకు కేశవన్‌గారు ఎంతో నొచ్చుకున్నారు. అందువల్ల ప్రామాణికతలో కొంతలోపం కనిపిస్తే, అందుకు తామే బాధ్యులమని హుందాగా ఒప్పుకున్నారు.

ప్రస్తుత సమీక్షలో మానుముందు తెలుగుముద్రణ ప్రచురణల సంగతి ప్రస్తావించి, చివరికి స్థూలంగా ఇతరభాషల విషయం గమనిద్దాం. గ్రంథప్రాశస్త్యానికి నిదర్శనంగా తొలి రోజుల్లో అచ్చయిన తెలుగుపుస్తకాల ముఖపత్రాలనూ, బ్రౌన్ అనువాదంతో కూడిన వేమన పద్యాలు వంటి అపూర్వ గ్రంథభాగాలనూ, సుప్రసిద్ధ కవిపండితుల చిత్రాలనూ ఈ గ్రంథంలో ప్రదర్శించారని చెప్పవలసివుంది. ఆ విధంగా గ్రంథం విలువ మరికొంత పెరిగింది.

తెలుగుభాషా సాహిత్యాల చరిత్రను స్థూలంగా వివరించడంలో కేశవన్‌గారికి ఆధార

గ్రంథంగా ఉపయోగపడ్డది డాక్టర్ గిడుగు వెంకటసీతాపతిగారు ఇంగ్లీషులో రాసిన ఆంధ్రభాషా చరిత్ర; కేంద్రసాహిత్య అకాడమీ 1968లో ప్రచురించిన గ్రంథం. అందువల్ల ఆ గ్రంథానికున్న పరిమితులే దీనికీ వచ్చాయి. తెలుగుభాషా సాహిత్యాలను విపులంగా చెప్పే మరోగ్రంథం ఆంగ్లభాషలో లేకపోవడానికి కారణం మనమూ మన విద్యాసంస్థలే కాబట్టి ఇందులోని లోపాలకు కేశవన్‌గారిని నిందించి ప్రయోజనంలేదు. ఈ కారణంగా క్రీ.శ. ఏడోశతాబ్దికి ముందు తెలుగు శాసనాలు లేవన్నా చేసేదేమీలేదు.

ఈ గ్రంథంద్వారా అనేక విషయాలు స్పష్టంగా సాధికారంగా తెలుస్తాయి. రెవరెండ్ బెంజిమన్ షూల్జ్ అనే క్రైస్తవ మిషనరీ తెలుగులో ముద్రణ మొదలుపెట్టాడు. తాను చేసిన బైబిల్ అనువాదాలను 1746, 1747ల్లో జర్మనీలోని హాల్ (Holle) నగరంలో మొదటిసారిగా అచ్చువేయించాడు (పే.343). ఆయనే తెలుగుపదాలను రోమన్‌లిపిలో (ఇంగ్లీషక్షరాల్లో) మొదటి సారిగా రాసిన వ్యక్తి. తెలుగు గ్రంథాలనూ, శాసనాలనూ తాటాకు ప్రతులనూ పెద్ద ఎత్తున సేకరించిన మహాపురుషుడు కర్నల్ కాలిన్ మెకంజీ. ఆయన 1790-94 మధ్యకాలంలో ఈ బృహత్కార్యం నిర్వహించడమేకాక, 1794లో మొట్టమొదటి లిఖితపత్రికను నడిపాడు. ఆయనకు తోడ్పడ్డ తెలుగువాళ్ళు కావలి వేంకటబొర్రయ్య, లక్ష్మయ్య అనే సోదరులు. ఆయన ఏ ఒక్కభాషలోనూ పండితుడు కాకపోయినా అనేక భారతీయ భాషల్లోని గ్రంథాలను సేకరించాడు. ఆయన తన చేతిసొమ్ము 15 వేల పౌన్లు ఖర్చుపెట్టి ఈ పనిచేస్తే ఈస్టిండియా కంపెనీవారు ఆయన మరణానంతరం (1821) 10వేల పౌన్లు ఆయన భార్యకు చెల్లించి ఈ సేకరణలు సొంతం చేసుకున్నారు. హెచ్. హెచ్. విల్సన్ అనే విద్వాంసుడు 1828లో ఈ సేకరణలకు ఒక కేటలాగు సిద్ధం చేశాడు. ఆ సేకరణ 152 సంపుటాలు. అందులో 1355 కైఫీయతు లున్నాయి (పే. 345-349).

చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తెలుగులిపిలో ఉన్న 1273 సంస్కృత గ్రంథాలనూ, 1116 తెలుగు గ్రంథాలనూ స్వయంగా సేకరించి ఇచ్చాడు (పే-349). బ్రౌన్ నిఘంటు నిర్మాణంలో తలమునకలుగా ఉన్నందున, 1857-62 మధ్యకాలంలో ఈ సేకరణలకన్నింటికీ విలియం టైలర్ కేటలాగు తయారు చేశాడు (పే. 349).

తెలుగుభాషకు వ్యాకరణం రాసిన మొట్టమొదటి పాశ్చాత్యపండితుడు కేరీ (Carey). ఆయన గ్రంథం 1813లో బెంగాల్లోని సెరాంపూర్లో అచ్చయింది (పే.361). అచ్చుపని భారత దేశంలో మొట్టమొదటిసారిగా మొదలయింది కూడా సెరాంపూర్లోనే - 1812లో. అచ్చయిన మొదటి తెలుగుసాహిత్యగ్రంథం బ్రౌన్ అనువాదాలతో సహా వేమన పద్యాలు - 1829లో. అయితే తెలుగు సామెతలు అంతకు రెండేళ్ల ముందే అచ్చుపడ్డాయి, మద్రాసులో (పే. 351-53). తెలుగక్షరాల మూసను తయారుచేసిన మొదటి పాశ్చాత్యుడు ఉర్గు హార్ట్ -1819లో.

అకారాది క్రమంలో వచనంలో తయారైన మొట్టమొదటి తెలుగు నిఘంటువు మామిడి వెంకయ్య 'ఆంధ్రదీపిక'. అది 1805-6లో నిర్మితం (పే.377). వరదయ్య పండిట్ మొట్టమొదటి తెలుగు - ఇంగ్లీషు నిఘంటునిర్మాత. నిర్మాణ కాలం 1811. ఆయన మరో తెలుగు నిఘంటువును కూడా 1813లో ప్రకటించాడు (పే378). డాల్జెల్ అనే పాశ్చాత్యుడు 1812లోనే ఇంగ్లీషు -

తెలుగు పదపట్టిక సిద్ధం చేశాడు (పే.383). ఆంధ్రదీపిక అనే పేరుతోనే మరొకరు గ్రంథచౌర్యం చేశారు (పే. 377-380). వార్డా అనే మిషనరీ ఇంగ్లీషు ఛందస్సులో తెలుగులో కీర్తనలురాసి 1857లోనే 'బైబిల్‌తెలుగు'కు శ్రీకారం చుట్టాడు (పే. 372). ఇంగ్లీషుభాషలో స్వీయచరిత్రను 1873లో రాసుకొన్న మొదట తెలుగువాడు వెన్నెలకంటి సుబ్బారావు (పే. 372). జె.సి. మారిస్ నిర్మించిన ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు (1813) ఆ రకం గ్రంథాల్లో మొదటిది (పే. 385).

తెలుగులో వెలువడ్డ మొట్టమొదటి వారపత్రిక కందుకూరి వీరేశలింగంగారు ప్రచురించిన 'వివేకవర్ధిని' (1885) అంటూ (పే.326), 'వర్తమాన తరంగణి' అనే పత్రిక 1842-43లో వెలువడిందన్నారు (పే.342). మొదటి తెలుగు దినపత్రిక 'ఆంధ్రపత్రిక' 1908లో బొంబాయిలో పక్షపత్రికగా ఆరంభమయింది. 'కృష్ణాపత్రిక' పక్షపత్రికగా 1907లో మొదలై వారపత్రికగా మారింది. తెలుగును 'వర్తకభాష' (పే.343), 'జెంతూభాష', 'తెలింగభాష' అని పిలిచారు కొంతకాలం (పే. 393). బెంజమిన్ షుల్జ్ 'దరుగ' అని పిలిచాడు (అదే పే.). తమిళ సోదరులు మన భాషను 'వడుగ' భాష (అంటే 'ఉత్తరాది' భాష) అనే వాళ్లు పూర్వం. మద్రాసులో బందరులో ముద్రణసంస్థలు నెలకొన్న తరవాత మన చరిత్ర 1851లో అచ్చయింది.

ఇంత శాస్త్రీయంగా వెలువడ్డ గ్రంథంలో తెలుగుపేర్లను ఇంగ్లీషులో లిపిలో రాసినప్పుడు స్పష్టంగా ఏ నియమమూ పాటించకపోవటం దురదృష్టకరం. టడలమారుపాటు వంటివీ, అచ్చు హ్రస్వదీర్ఘత్వాలూ ఆంధ్రేతరులకు మరోవిధంగా ఆయా రూపాలను పరిచయం చేస్తాయని గ్రంథకర్త గుర్తించలేదు! '1838'కి బదులు '1938' అని అచ్చుకావటం (పే. 365), నండూరు సుబ్బారావు 'నందిని' సుబ్బారావు కావటం (పే. 305), ముట్నూరి కృష్ణారావు 'ముతుమురి' కృష్ణారావు కావటం (పే. 326), 'తేటగీతి'ని 'తేతగీతి'గా చదివే అవకాశం కల్పించటం (పే. 377), 'సటీకాంధ్రం' 'సైతికాంధ్రం' కావటం (పే.386) వంటి స్ఖాలిత్యాలు చాలా వచ్చాయి. బ్రౌణ్య 'మిశ్ర' నిఘంటువును 'భాషా' నిఘంటువనటం పెద్ద పొరపాటు (పే. 389). అప్పకవి ఇంటిపేరు (పే.397) తప్పుగా పడ్డందుకు కాకపోయినా శ్రీశ్రీ వంటి ఆధునిక మహాకవుల పేర్లు లేనందుకూ, పత్రికారంగంలో ఇటీవల వచ్చిన పరిణామాలకు స్థానంలేకపోయినందుకూ విచారించక తప్పదు.

శాసన ప్రచురణ పరిశోధనల విషయంలో ఈనాటికీ తెలుగు కన్నడంకన్నా చాలా వెనకబడి వుందని ఈ గ్రంథం నిరూపిస్తుంది. మలయాళంలోని ముద్రణ ప్రచురణలు ఈ రెండు పెద్దభాషలనూ అధిగమించడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి - పాశ్చాత్య ప్రభావం వారిమీద ఎక్కువ కావటం, రెండు - ఆలిపిలో కింది ఒత్తులూ పై గుణింతాలూ లేకపోవటం.

మెకంజీ, ఫిలిప్‌బ్రౌన్ వంటి మహనీయులు తెలుగు భాషకూ, రైస్, రీవ్, కిటెల్‌వంటి మహాత్ములు కన్నడానికీ, గుండర్ట్‌వంటివాళ్ళు మలయాళానికీ చేసిన సేవలతో స్వభాషీయుల సేవలను పోల్చిచూస్తే విచారం పెరుగుతుంది. మన సామాజిక దురవస్థలే ఈదుస్థితికి కారణాలని మనం మనల్ని ఓదార్చుకోవటం మానివేసేదాకా పరిస్థితిలో మార్పురాదనిపిస్తుంది. ఈమహాగ్రంథం అటువంటి నిర్వేదభావాన్ని కల్పించినా, అనేక చారిత్రక సత్యాలను శాస్త్రీయంగా నిర్మోహంగా బయటపెట్టినందుకు శ్లాఘనీయమే.

ఇలాంటివి తప్పక చదవవలసిన గ్రంథాలు. వీటిని చదివినప్పుడు తెలుగుభాషా సాహిత్య సంస్కృతి చరిత్రలు ఇంగ్లీషులో ప్రచురించనందుకు మన విశ్వవిద్యాలయాలూ విద్యాసంస్థలూ విద్వాంసులూ ఎంతో సిగ్గుపడవలసివస్తున్న దనక తప్పదు. ఈలోపాన్ని పూరించుకొనేదాకా ఇతరుల దృష్టికి తెలుగువాళ్లను గురించిన అనేక విశేషాంశాలు చేరవనీ ఫలితంలో నష్టపోయేది మనమేనని గుర్తిస్తే అదే పదివేలు.

19.3.1989

## మడికిసింగన కవి

– డాక్టర్ కె. కుసుమాబాయి

ఇది కుమారి కుసుమాబాయికి 1980లో పిహెచ్.డి. పట్టం సంపాదించి పెట్టిన సిద్ధాంత వ్యాసం. తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో దీన్ని ప్రచురించారు. క్రీ.శ. 1420 ప్రాంతంలోని మడికి సింగన రచించిన నాలుగు గ్రంథాలనూ పరిశీలించి వాటిలోని ప్రత్యేక లక్షణాలను ఆవిష్కరించిన వ్యాసమిది.

సింగన రచనల్లోని మూడు ఆధ్యాత్మిక గ్రంథాల్లో, మొదటిది అష్టాదశ పురాణాల్లో రెండోదయిన పద్మపురాణంలోని ఉత్తరఖండానికి స్వేచ్ఛానువాదం, రెండోది భాగవత దశమస్కంధాన్ని పోతనకు ముందే ద్విపదకావ్యంగా రాసింది, మూడోది వాల్మీకికృతమైన యోగవాశిష్ఠానికి 'వాసిష్ఠ రామాయణ' మనే పేరున చేసిన అనువాదం. ఈ మూడూ భక్తులకూ ఆస్తికులకూ ఆనందం కలిగించేవయితే, నాలుగోది తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి ఆకరగ్రంథమయిన 'సకలనీతి సమ్మతము'! తన నాటికి ప్రసిద్ధి సంపాదించిన సంస్కృతనీతిశాస్త్ర గ్రంథాల భాగాలను అనువదించటమేగాక తెలుగు గ్రంథాల నుంచి ఉద్ధరించాడు కవి కొన్ని పద్యాలను. ఆయన స్వయంగా రాసిన పద్యాల సంఖ్య చాలా తక్కువ. తొలి సంకలన గ్రంథంగా సకలనీతి సమ్మతానికున్న ప్రశస్తిని ఒక్క ఉదాహరణతో చెప్పవచ్చు.

ఇటీవలి కాలంలో నన్నెచోడుడి కుమారసంభవ గ్రంథం కూటసృష్టి అనీ, మానవిల్లి రామకృష్ణకవి కల్పితమనీ వాదిస్తూ వ్యాసాలేగాక ఒక మహాగ్రంథం కూడా వచ్చింది. అయితే ఆ గ్రంథంలోని మూడు పద్యాలను మడికి సింగన ఉద్ధరించి చూపాడని ఈ వ్యాసరచయిత్రి నిరూపిస్తున్నది! (చూ.పే.178, 179). దూతలక్షణాలను (పే.156), షోడశ సంధి పద్ధతులను (పే.158, 159), సప్తవిధోపాయాలను (పే.160) ఇందులో సంక్షిప్తంగా చదివి తెలుసుకోవచ్చు.

ఈ సిద్ధాంతవ్యాసం (సరళ) గ్రాంథికంలో ఉన్నందుకు విచారించినా, శాఖాచంక్రమణాదులు లేనందుకు సంతోషించాలి. మూలశ్లోకాలనూ సింగన అనువాదాలనూ పోల్చి చెప్పటం సీదాసాదాగా ఉందేగాని సిద్ధాంతవ్యాస సాధారణధోరణిలో అతిశయోక్త్యాదులు గుప్పించినట్లు లేదు. పైపెచ్చు సింగన కవిమాత్రుడేగాని తిక్కనాదులతో పోల్చదగినవాడు కాదని, రాజకీయానుభవం లేనివాడనీ (పే.148) అంగీకరించటం అరుదైన సుగుణం. ఇది చదవదగ్గ మంచి సిద్ధాంత వ్యాసం.

16.7.1989

# తెలుగు పర్యాయపద నిఘంటువు

- ఆచార్య జి.ఎన్. రెడ్డి

ఆచార్య జి.ఎన్. రెడ్డిగారు కీర్తిశేషులయిన తరవాత ఆయన సహాయకులు ఎనిమిది మందే కాక ఆయన శిష్యులు, మిత్రులు వెలువరించినది ఈ నిఘంటువు. నిఘంటు నిర్మాణం చివరి దశలోనూ ముద్రణ సమయంలోనూ ఆయన లేనిలోటు అడుగడుగునా కనిపిస్తూనే ఉంది.

నిఘంటువు ప్రధానంగా రెండుభాగాలు. ప్రధానారోపాలకింద వాటి పర్యాయపదాలను అకారాదిక్రమంలో సమకూర్చిన మొదటిభాగం 190 పేజీల గ్రంథమయితే నిఘంటువులో చేరిన పదాలన్నిటినీ ఆకారాది క్రమంలో సూచించిన పదసూచిక 347 పేజీలయింది. గ్రంథం మొత్తం 558 పేజీలు. దాదాపు 38 వేల పైచిలుకు మాట లిందులో చోటుచేసుకున్నాయి. పర్యాయపదాలను 40 వర్గాలుగా విభజించి 4336 ప్రధానారోపాల కింద సంతరించారు. క్రియాపదాలను మాత్రం సందర్భానుసారంగా ఆయావర్గాల కింద చేర్చారు. 19 ప్రధానారోపాలకు సంఖ్యాసంకేతా లివ్వలేదుగాని వాటిని ఏ సంఖ్యా సంకేతం కింద చూడవచ్చో పేర్కొన్నారు (పే. xiii). వివరణాత్మకమయిన ఆరోపాలకు పదసూచికలో స్థానంలేదన్నారు (xii). వాటి సంఖ్య చాలా పరిమితం కాబట్టి అంత యిబ్బంది కలగదు.

విషయ విభజనలో అతివ్యాప్తి, అవ్యాప్తులకు అవకాశముందని అంగీకరించారు (పే. xi). విషయ ప్రధానంగా వర్గీకరించిన పదజాలాన్ని ఆయా శీర్షికలకింద చూపలేదు. పీఠికలో మాత్రం వివరించారు. ఆయా వర్గాల కింద ఉన్న ప్రధానారోపాలకు సంఖ్యా సంకేతాలిచ్చారేగాని అకారాది క్రమంలో పెట్టలేదు. అందువల్ల నిర్మాత ఆలోచనాధోరణి తెలిస్తేనేగాని విషయ క్రమాన్ని గుర్తించటం కుదరదు. అయితే రెండోభాగంలో అకారాది క్రమంలో ఉన్న పదసూచిక దగ్గర ఆయా పదాలు ఏ సంఖ్యా సంకేతం కింద దొరుకుతాయో సూచించారు కాబట్టి ఇబ్బంది కలగదు. పర్యాయపదాలని లోకపద్ధతిలో అన్నారేగాని నిజానికి ఏ భాషలోనూ ఒకే భావాన్ని అన్ని సందర్భాల్లోనూ సమానంగా చెప్పే ఒకేఒక పదం లేదు. ఉండదు. అందుకే వ్యావహారికంగా పర్యాయపదా లనేవాటిని కొందరు సమానపదాలని, మరికొందరు సమీపపదాలనీ, కొందరు బదులు మాటలనీ, మరికొందరు సన్నిహితపదాలనీ, దగ్గరిమాటలనీ పిలుస్తుంటారు శాస్త్ర దృష్టితో. ఏ పేరుతో పిలిచినా ఇది తెలుగుభాషలో ఈ రకంకోశాల్లో పెద్దదే.

'ఇట్టి నిఘంటు నిర్మాణం తెలుగులో తొలిప్రయత్న'మని (పే.xi) పేర్కొన్నా, లెక్కకు 1973లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురించిన 'సమాన వ్యతిరేకార్థక పదనిఘంటువు' మొదటిది - శాస్త్రీయం కాకపోయినా. అందులో 750 ఇంగ్లీషుమాటలు ప్రధానారోపాలుగా, వాటి ఇంగ్లీషు పర్యాయపదాల తెలుగు అనువాదాలు పర్యాయపదాలుగా ఇచ్చారు - ముగ్గురు మనీషులు. దానితో పోలిస్తే ఇది బృహన్నిఘంటువు.

ఇలాంటి కోశాల అవసరం, ప్రయోజనం చెప్పనక్కరలేదు- అందరికీ తెలిసిన విషయం కాబట్టి. ఒక విద్వాంసుడు జీవనచరమసంధ్యలో తయారుచేస్తూ కన్నుమూస్తే ఆయన శిష్యులూ మిత్రులూ దాన్ని ఒకరూపంలో పెట్టి ముద్రణకు సిద్ధంచేయటం, విశాలాంధ్రవాళ్ళు దాన్ని

ప్రచురించటం అభినందనీయాలు. భాషాభిమానులకూ రచయితలకూ ఎన్నో విధాల ఉపకరించే ఈ కోశం తెలుగువాళ్ల ఆదరాభిమానాలు సంపాదించాలని ఆశిద్దాం.

17.2.1991

## ఆధునిక ఆంధ్రప్రదేశ్ చరిత్ర

– ఆచార్య పి. రఘునాథరావు

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చరిత్రాచార్యులుగా ఉన్న రఘునాథరావుగారు ఆంగ్ల భాషలో రాసిన గ్రంథాని కిది తెలుగు అనువాదరూపం. ఈ అనువాదాన్ని సిద్ధం చేసినవారు రచయిత మిత్రులైన గజేంద్రరెడ్డి, రవీంద్రనాథ రెడ్లు. ఇది ఎం.ఏ. విద్యార్థులకూ, రకరకాల పోటీ పరీక్షలకూ హాజరయ్యే విద్యార్థులకే గాక సామాన్య పాఠకులక్కూడా ఉపయోగపడాలని ప్రచురించారు.

మంచి అట్ట, కాగితం, ముద్రణ ఉన్న గ్రంథం విలువ నూటయాభై రూపాయలు మాత్రమే. ప్రచురణ ముచ్చటగా ఉండాలని పడ్డ తాపత్రయాన్ని రచనా భాషలోనూ, శైలిలోనూ, తప్పుల సంఖ్యను తగ్గించటంలోనూ చూపినట్లు లేదు. రాజకీయ చరిత్ర ప్రధానంగా రచించిన పుస్తకం చివర తెలుగు సాహిత్యాన్ని చారిత్రకంగా సమీక్షించిన భాగం, కొందరు ఆంధ్రప్రముఖుల జీవిత విశేషాలు రాసిన భాగం అనుబంధాలుగా 50 పేజీల్లో చేర్చటం హర్షణీయమే. కాని ముప్ఫైపేజీల్లోనే ప్రాచీనాంధ్రచరిత్రను 'ప్రవేశిక'గా రచించారు. అతిసంక్షేపణ వల్ల ఎన్నో అనర్థాలు వచ్చాయని స్థూలదృష్టికే కనిపిస్తాయి.

శాతవాహనులకాలంలోని శ్రేణులను ప్రస్తావించినా నిగమసభలను పేర్కోలేదు (పే.7). తూర్పు చాళుక్యులను 'చిన్న రాజవంశం' కింద జమకట్టారు (పే.10). కాకతి గణపతిదేవుడు (క్రీ.శ. 1198–1262) దాదాపు 60 సంవత్సరాఉల పాలించాడని పన్నెండో పేజీలోనూ, 64 సంవత్సరాలని దాని ఎదురు పేజీలోనూ రాశారు! తిక్కన భారతం 15 పర్వాలనూ వరంగల్లులో పూర్తిచేశాడన్నారు! (పే.17). అందుకు ఆధారం తెలియదు. కొన్ని అనువాదాలు – ముఖ్యంగా పారిభాషికాల విషయలో – ఎబ్బెట్టుగా ఉన్నాయి. మచ్చుకు blue water policyని 'నీలి నీటి విధాన'మన్నారు – మక్కికి మక్కిగా (పే. 32). సముద్రాధిపత్య విధానమని పూర్వ మనేవాళ్ళు. వ్యక్తుల, స్థలాల పేర్లలో అచ్చుతప్పులు కుప్పలు. 1905లో 'చేపట్టిన' బెంగాలు విభజనను 1903 డిశంబరులోనే భారత జాతీయ కాంగ్రెసు వ్యతిరేకించిందన్నారు! (పే. 124, 125). ఇలాంటి వనేకం.

తెలుగు సాహిత్యానికి గ్రంథకర్త చేసిన చారిత్రక సమీక్ష అనేక లోపాలున్న అతుకుల బొంత. హాలుడు 'గాథాసప్తశతి'ని 'రచించా'దన్నారు (పే. 298). అది సంకలన గ్రంథమనీ, అందులో హాలుడి గాథలు నాలుగు మాత్రమే ఉన్నాయని వారు గుర్తించినట్లులేదు. తెలుగుభాష క్రీస్తుశకం మొదటి శతాబ్దిలో "స్వతంత్రంగా రూపుదిద్దుకోవడం ప్రారంభించిందని" అదే పుటలో ఆవిష్కరించారు. అలాగే క్రీ.శ. 600 – 800 మధ్యకాలంలో తెలుగు పదాలు శాసనభాషలో ఉన్నాయన్నారు. అప్పటికి పూర్తి తెలుగు శాసనాలే వచ్చినట్లు వారికి తెలియదేమో! అంతకన్నా అధ్వాన్నం "9వ శతాబ్దికల్లా తెలుగు సాహిత్యం ముఖ్యంగా కథాసాహిత్యం విశేషంగా

వెలువడిందని చెప్పవచ్చు" అని అదే పుటలో చెప్పిన సూక్తికన్నా అసత్యం మరిలేదు. బహుశా 19కి బదులు 9 అచ్చయిందనాలేమో! ఇటువంటి మాటలకు పరీక్షల్లో సున్నా మార్కులు తప్పవు.

అష్టదిగ్గజాలలో సూరన, భట్టుమూర్తి, రామకృష్ణులను ఏసాక్ష్యాధారలతో ఈ చరిత్రాచార్యులు చేర్చారో (పే. 302) తెలుసుకుని తరించాలి – లోక ప్రవాదాన్ని చరిత్రగా చెప్పదలిస్తే తప్పు. మొల్ల "13వ శతాబ్దికి చెందిన తిక్కన మహాకవికి సమకాలికురాలు" (పే.304) వంటి ప్రసంగాలు సాహితీపరులను చకితపరుస్తాయి. 'నవలా సాహిత్యం' అనే శీర్షిక కింద చిన్నయసూరి నీతిచంద్రికను పేర్కొనటం (పే.306), కందుకూరి సంధితంత్రం 'సులభ వచనం'లో రాశారనటం (అదే పేజి), శ్రీశ్రీ 'పద్యాలు' రాసి 'తానే ఒక విప్లవకారుడిగ మారి'పోయాడనటం, "శ్రీశ్రీని ఆయన అభిమానులు 'మహాకవి'గ పిలుస్తారు" (పే.314) అని చెప్పటం చరిత్రాచార్యుల సాహితీ ప్రాగల్భ్యానికి నిదర్శనలు.

ఈ గ్రంథానికి ఈపాటి గౌరవమిచ్చి సమీక్షించనక్కరలేదు గాని ఇంత ఖరీదుపెట్టి దీన్ని కొని పోటీ పరీక్షలకు సిద్ధమయ్యే విద్యార్థుల భవితవ్యాన్ని తలుచుకుంటే వచ్చే దుఃఖాతిశయమే ఈ మాటలు రాయించింది. విద్యాప్రమాణాలకు ప్రతీకలైన విశ్వవిద్యాలయాచార్యులు విషయజ్ఞానం తాము సంపాదించకుండా ఎందరినో అభాగ్యులను చేయడం మన దురదృష్టం.

14.4.1991

# సాహితీసుగతుని స్వగతం

– తిరుమల రామచంద్ర

**సు**ప్రసిద్ధ పండితులూ పాత్రికేయులూ అయిన తిరుమల రామచంద్రగారు 1935–90 మధ్యగల 55 సంవత్సరాల సుదీర్ఘకాలంలో 'భారతి, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రిక' వగైరా పత్రికల్లోనూ ఇతరత్రా ప్రచురించిన 38 వ్యాసాల సంపుటికి ఇది మూడో కూర్పు. రచనాకాలం పేర్కొనని మరి రెండు వ్యాసాలిందులో ఉన్నాయి. ఇటువంటి రచనలు 25 ఏళ్లలో మూడోసారి ముద్రణకు రావటం విశేషమే. తొలిముద్రణ 1969.

సాహిత్యం, సంగీతం, వైద్యం, విదేశీయాచార సంస్కృతులు, ఛందోవ్యాకరణాదులు, మహనీయుల జీవితవిశేషాలు మొదలైన అనేక ప్రక్రియలకు చెందిన అంశాలను ఈ గ్రంథాలలో చూడవచ్చు. గాథాసప్తశతి వంటి ప్రాకృతభాషా గ్రంథాలమీద, లిపి శాస్త్రంమీద రామచంద్రగారి కున్న అభినివేశం జగద్విదితం. కథ కంచికే ఎందుకు వెళ్తుందో రచయిత వివరించారు (పే.222). ఆఫ్రికన్ తెగల్లో ఒకటి హెచ్చవేతల్లో పాటించే చిత్రవిధానం ఇందులో కనిపిస్తుంది (పే.200). చేతబడి, గర్భనిరోధం, బుద్ధుడికి ముందుకాలం నుంచీ ఉన్న ధూమపానం వంటి భిన్న ధర్మాలనుంచి తెలుగు ఏకాంకిక, నవల, వ్యాసం, కాల్పనిక సాహిత్యం వంటి సాహితీ విశేషాలను కూడా ఇందులో పరామర్శించారు.

గ్రంథంలోని కొన్ని ప్రసంగాలకు ఆధారం దొరకదు. ఉదాహరణకు సుప్రసిద్ధ సంస్కృత నాటకాలనే "పద్యంగా పిండికొట్టిన కాల"మని కేతన కాలాన్ని ఎందుకు ఏ ఆధారంగా వర్ణించారో తెలియదు (పే.225). అసలు గ్రంథకర్త కేతన మీదికి ఒంటికాలితో లేచినట్లుంది. "అనుసరణ

# ఆరుద్ర జీవితం - రచనలు

- డాక్టర్ ఎల్. నంగయ్య

ఇది తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థికసహాయంతో ముద్రితమైన, ఉస్మానియా విశ్వ విద్యాలయం ఆమోదించిన సిద్ధాంతవ్యాసగ్రంథం. అయి దధ్యాయాల గ్రంథానికి ఆరు అనుబంధా లున్నాయి. తప్పొప్పుల పట్టిక కాక, ఆరుద్ర జీవితం మొదటి అధ్యాయంలో, కవితాశక్తులు రెండో దాంట్లో, వచన రచనలు మూడో దాంట్లో, సమగ్రాంధ్ర సాహిత్య సమీక్ష నాలుగో అధ్యాయంలో, సినీరచనల పరిశీలన చివరి దాంట్లో ఉన్నాయి.

'నేను ఎవర్నీ పొగడ్డానికి జంకను' అనే శపథం చేసిన విద్వాంసులున్నారు. సిద్ధాంత గ్రంథాల్లో ఇదే సిద్ధాంతం మూలసూత్రంగా కనిపిస్తుంది. భాగవతుల సదాశివ శంకరశాస్త్రి ఉరఫ్ ఆరుద్ర మూడేళ్ళలో వ్యాకరణశాస్త్రం మథించి (పే.23), పన్నెండు నెలల్లో పన్నెండు శతాబ్దాల సాహిత్య చరిత్రను రచించి (పే.24), సినిమా కథ కోసం వెతుకుతూ సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర రచనకు పునాది వేసి (పే.22-23), ప్రూఫులు దిద్ది సంపాదించిన సొమ్మంతా సినీమాలు చూడటానికే వినియోగించి (పే.22), సొంత యిల్లు లేకపోయినా ఆరులక్షల రూపాయలు విలువైన గ్రంథాలయం సంపాదించి (పే.23), తీరిక లేక గడ్డం పెంచి మహర్షిగా కనిపించే (పే.24) సాహిత్యమూర్తి (పే.26) అని నిగ్గుతేల్చారు. ఆయన 'త్వమేఽ వాహం' కళాపూర్ణోదయం లాంటిది (పే.28-29). సైన్యంలో గుమాస్తాగా పనిచేస్తూ, సైనిక వాద్యబృందంతో పనిచేస్తూ తాను 'వాడిన' బ్రెన్‌గన్, స్టెన్‌గన్నులను అక్కడే పారవేసి అభ్యుదయ కవి అయినాడు (పే.19).

సమకాలిక జగత్తులో భౌతికంగా కనిపిస్తున్న వ్యక్తిని గురించి చెప్తూ రచయిత అంటే ఆరుద్రే, ఆరుద్రే సాహిత్యమూర్తి (పే.26) అని అందలమెక్కించిన పరిశోధకులు తక్కిన రచయితలూ తెలుగు సాహిత్యమూ అర్థరహితమని సూచిస్తున్నామని గుర్తించలేదు. అభ్యుదయ రచయితల సంఘం నుంచి తప్పుకోవటంలో, శ్రీశ్రీమీద, తాను గురువని సంభావించిన రోణంకి అప్పలస్వామిమీద దండెత్తటంలో, కన్యాశుల్కం కర్తృత్వ వివాదం సృష్టించటంలో ఆరుద్ర పాత్ర ఎంత వివాదాస్పద మయిందో పరిశోధకులు ప్రస్తావించనయినా లేదు. ఆరుద్ర దేశభక్తి కవితను ప్రస్తుతించిన రచయిత, 1960 ప్రాంతాల్లో "ఉపకారి అమెరికా వాడు, ఊరికే పోనీకు నేడు, విపులమౌ భరత మాగాణి, విత్తనీ అమెరికా వాణి' అని ఎలుగెత్తి ఆలిండియా రేడియోను వాయిసాఫ్ అమెరికాకు అనుబంధం చేయమన్న దేశభక్తిని కూడా ప్రస్తావించి ఉండవలసింది.

1942 ఏప్రిల్ 6వ తేదీన విశాఖపట్టణం మీద జపానువాడు 'బాంబుల వర్షం' కురిపిస్తే నానా దేవతలకు మొక్కుతున్న వెర్రిజనాన్ని ఆరుద్ర వెక్కిరించాడని రచయిత కథనం (పే.15, 16, 64 వగైరా). నిజమా? పోలీసు యాక్షనులో హైదరాబాద్‌లో జరిగిన విధ్వంసం వంటిదే కదూ అది? పుట్టిన రోజులు మార్చుకొని మరి కొన్నేళ్ళు ఉద్యోగం కొనసాగించడానికి చాలామందికి తోడ్పడ్డవి ఈ 'వాస్తవిక' దుర్ఘటనలే కదా! సూర్యుడిలో కూడా మచ్చలున్నాయి. గుణదోషాలూ రెండూ ఉన్నా గుణాధిక్యం వల్ల ఒకరు ప్రశస్తులు కావచ్చు, సమకాలిక సాహిత్యం అంతా ఆరుద్ర భిక్ష అన్నట్లు ఏకపక్షంగా సిద్ధాంతీకరించటం డిగ్రీ సంపాదనలో చెల్లుతుందేగాని

ప్రపంచంలో కాదు. ఆరుద్ర మీది ఆక్షేపణలను, విమర్శలను వినను, చూడను, మాట్లాడననే ఈ గ్రంథాన్ని భక్తులు చదివి తరించవచ్చు. నేటి పరిశోధనల ధోరణి కీగ్రంథ మో మచ్చుతునక - మచ్చుతునక కూడా.

6.10.1991

# అక్షింతలు

- గజ్జెల మల్లారెడ్డి

ప్రస్తుతం 'ఉదయం' దినపత్రిక సంపాదకవర్గంలో పనిచేస్తున్న గజ్జెల మల్లారెడ్డిగారు సదరు పత్రికలో 1989 అక్టోబరు 6వ తేదీకీ 1991 మార్చి 30 వ తారీఖుకూ మధ్యకాలంలో "పూర్తి ఛందోబందోబస్తులతో" రాసి ప్రచురించిన వ్యంగ్యకవితల సంపుటి ఇది. వార్తావిషయాన్ని తేదీతోసహా సూచించి, ఆ తరవాత స్వపక్ష విపక్ష నిర్ధూమధామంగా రాసిన ఎనిమిది పాదాల కవిత్వమూ, దానిపక్కనే వ్యంగ్యచిత్రమూ ఇందులో కనిపిస్తాయి. వ్యంగ్య చిత్రాలు గీసిన 'మోహన్, సురేంద్ర, రాజు'లలో ఎవరు గీసిన బొమ్మ ఏదో అన్ని సమయాల్లోనూ స్పష్టంగా తెలియదుగాని గేయాలూ, పద్యాలూ సమస్తం మల్లారెడ్డిగారివే. కొన్ని వార్త లేనాటివో తెలియదు. ఉదాహరణకు చిట్టచివరిది. కొన్ని పునరుక్తమైనాయి. ఉదాహరణకు తెలుగు టీ.వీ. మీద వేసిన అక్షింతలు 121, 215 పేజీల్లో మార్పు లేకుండా కనిపిస్తాయిగాని వ్యంగ్యచిత్రం మారింది. పేజీకి రెండు చొప్పున ఇందులో 596 'అక్షింత' లున్నాయి.

కీర్తిశేషులు రాచమల్లు రామచంద్రారెడ్డిగారు 1962 మార్చిలో తమ 'సవ్యసాచి'లో మల్లారెడ్డి గేయాల్లోని 'కొత్తదనము'ను వివరిస్తూ రాసిన వ్యాసం, శ్రీశ్రీ సిఫారసు ఉత్తరపాఠంతోబాటు కనిపిస్తుంది గ్రంథారంభంలో. ఎటొచ్చీ శ్రీశ్రీ, రారాలు పేర్కొన్న ఇంటిపేరుకూ గ్రంథంమీది ఇంటిపేరుకూ అక్షరక్రమంలో కొద్దిపాటి భేదముంది. రారాగారు సహజధోరణిలో మల్లారెడ్డి కవితలో least complicated వాక్యాల్లో కూడా భావం complexగా, involvedగా ఉందన్నారు. ఆ ఇంగ్లీషు మాటలకు సరైన తెలుగుపదాలేమో ఆయన వివరించలేదు. కాబట్టి పాఠకులే గ్రంథం చదివి నిర్ణయించుకోవాలి.

శ్రీశ్రీ ప్రాసక్రీడల్లోని రాజకీయ వ్యంగ్య కవితాధోరణిని, 'అక్షరాల' పాటిస్తూ మల్లారెడ్డిగారు రచించిన ఈ పద్యాల్లో గేయాల్లో 'వ్యక్తిగత రాగద్వేషాలకూ, ఈర్ష్యాసూయలకూ బుద్ధిపూర్వకంగా అవకాశం ఇవ్వలేదని మనవి' చేశారు. కాబట్టి ఇందులో ఎన్టీఆర్, సినారేల వంటి పెద్దలను ఎద్దేవా చేస్తూ రాసిన 'అక్షింతలు' ఎక్కడో ఒకచోట తప్ప 'గురితప్పి బాధ కలిగించ'గూడదు! 'జీవితంలో సకలరంగాల్లో తాండవిస్తున్న అక్రమాల మీద, అన్యాయాల మీద, వంచనమీద, కుల, మతతత్వాలమీద' కవిగారు 'అక్షింతలు' వేశామన్నారు. అక్షింతలను ఆశీర్వాద పూర్వకంగానూ, అధిక్షేపదూషణ పురస్సరంగానూ వేయటం తెలుగువాళ్ళ సంప్రదాయం. తన కత్తికి రెండువైపులా పదునుండాలనేమో ఈ శీర్షికను కవిగారు స్వీకరించారు!

మల్లారెడ్డిగారు ఆపాదమస్తకం రాజకీయాల్లో కవితాదృష్టితోనూ, కవితలో రాజకీయ దృష్టితోనూ జీవించిన వ్యక్తి కాబట్టి, వార్తలను కూడా కవితేతర భాషలో రాయలేరని గ్రంథం నిరూపిస్తుంది. మాత్రాఛందస్సులో ఆయనకు మంచిపట్టుంది. పూర్వం రాసిన గేయాలను

ఒక్కోసారి యథాతథంగాను, కొన్నిసార్లు కొద్దిపాటి మార్పులతోనూ అక్షింతల్లో ఉపయోగించుకున్నారు. ఆయన ఆస్తిమీద ఆయనకున్న సర్వాధికారాలను ఎవరూ ప్రశ్నించలేరు. అక్కడక్కడ గీతపద్యాలు వాడినా ప్రాసక్రీడలకు, ముఖ్యంగా అంత్యప్రాసలకు లోపం జరక్కుండా చూసుకున్నారు. తాత్కాలిక రాజకీయ సామాజిక వార్తాశకలాలకు ఛందోబందోబస్తులు చేసిన మల్లారెడ్డిగారు తమ గురువు శ్రీశ్రీ తెంచేసిన, తెంచిపారేద్దా మనుకున్న శృంఖలాలను తెలుగుతల్లికి తగిలించినమాట వాస్తవం. ఆ ఒక్క విషయంలో ఆయన శ్రీశ్రీ గురుత్వాన్ని గౌరవించలేదు. అందుకు కారణం అక్షింతలను శుద్ధకవిత్వంగా కాక అనువర్తితకవితగా రచించటమే కావచ్చు.

పదశిల్పం, నడక, ప్రాసక్రీడలు తెలుసుకొని చదివి ఆనందించవచ్చు. క్షణక్షణం రంగులు మారే రాజకీయాదులను కవితాదృష్టితో చూడదలచినవాళ్ళు అక్షింతలు చదవటం మంచిది.

13.10.1991

# విశ్వవిద్యాలయాలు - పరిశోధన

- నమమాసస్వామి

**మూ**డు సంవత్సరాల (1987-90) వ్యవధిలో 18 విశ్వవిద్యాలయాల్లో తెలుగులో జరిగిన పరిశోధనలను పేర్కొనే గ్రంథమిది. విద్యారంగంలో లాగానే పరిశోధనల స్థాయి పడిపోయిన సమయంలో (పే.vi), 'అమితంగా' జరుగుతున్న పరిశోధనలు 'సమన్వయ లోపం.... అనిశ్చిత వాతావరణం'లో కొనసాగుతున్న సమయంలో (పే.xv) ఈ గ్రంథం వెలిసింది. తెలుగు, కేంద్ర విశ్వవిద్యాలయాలవల్ల 'చెప్పలేనంత గందరగోళం' (పే.xvi) ఈ రంగంలో వచ్చిందట. 'పరిశోధన మీద ఆసక్తి' లేనివాళ్లు డిగ్రీల కోసం ఎగబడుతున్నారట (పే.xvii). విశ్వవిద్యాలయాలతో సంబంధం లేనివారికి రిసెర్చి డిగ్రీ లిచ్చే సంప్రదాయం కూడా (పే. xviii) పీఠాధిపతుల పుణ్యమా అని వచ్చిందట. పరిశోధక విద్యార్థులకు అంశాలను 'కేటాయించే' సంప్రదాయం కూడా ఏర్పడింది (పే.xvii). స్థూలంగా ఇన్ని శుభలక్షణాలున్న తెలుగు పరిశోధనలు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనే జోరుగా సాగుతున్నందుకు గర్వించాలి.

రెండు విశ్వవిద్యాలయాల్లో ఒకే అంశం నమోదు చేసుకున్న 'ఆదర్శ అధ్యాపకులున్నా'రని (పే.xvi) రచయిత వాపోయారు. అయితే 'ఒకే విశ్వవిద్యాలయంలో అంశాల కేటాయింపులో ఈ పొరపాటు జరిగే అవకాశం లేదు' (పే.xix) అని రాశారేగాని, ఉస్మానియా తెలుగుశాఖలోనే "కరీంనగర్ జిల్లా గ్రామనామాలు" అనే అంశం మీద ఇద్దరు ఏకసమయంలో పరిశోధిస్తున్నారని వీరిచ్చిన పట్టికే నిరూపిస్తున్నది (పే. 42). ఆ యిద్దరికీ బహుశా ఒకే గురువున్నారేమో తెలీదు - గురువుల పేర్లివ్వనందున! కొందరి పరిశోధనాంశాలకు ఆంగ్లశీర్షిక లున్నాయి. అవి అచ్చయిన తీరు, వాటిలోని వర్ణక్రమదోషాలు హృదయ విదారకం. గ్రంథకర్తగాని, పీఠికాకర్తగాని పేరెత్తి చెప్పని నిత్యానందరావు ప్రచురించిన గ్రంథంతో పోలిస్తే ఇది విపులమూ కాదు - అన్ని వివరాలూ ఇచ్చిందీ కాదు.

తెలుగు పరిశోధనలు గ్రంథాలను గురించి గాక వాటిలోని స్కంధాలకూ, ఒక్కో మండలంలోని ఒక్కో కులంవారి ఇంటిపేర్లకూ పరిమితమయ్యేంతగా విస్తరించినందుకు గర్వించాలో దుఃఖించాలో చెప్పలేం. విషయవిస్తృతి తగ్గినందువల్ల గంభీరత పెరిగితే గర్వించాలి. లేదా

దుఃఖించాలి. పుటల స్థాయికి ఎదిగినా చేయగలిగిందేమీ లేదు. ఒక విద్వాంసుడు సాటి పరిశోధనాచార్యుల ఉపయోగం కోసం, వందల సంఖ్యలో ఉన్న పరిశోధక విద్యార్థుల ప్రయోజనం నిమిత్తం ప్రచురించిన గ్రంథంలో "హైయ్యర్ లర్నింగ్" (పే.75) వంటి వర్ణ క్రమం అంత పెద్దచ్చులోనూ తప్పులేదంటే ఎంత శ్రద్ధ చూపారో చెప్పనక్కరలేదు. ఇది సాధారణ సాహితీపరులకు పనికివచ్చే పుస్తకం కాదు కాబట్టి అంత విచారించనక్కరలేదేమో.

10.11.1991

## నాలుగు శతాబ్దాల సాక్షిగా నా మహానగరం

**- నిఖిలేశ్వర్**

ఇప్పటికి నాలుగు వందల సంవత్సరాల గత వైభవం సంపాదించిన "సుందరనగరం" హైదరాబాద్‌కు దిగంబరకవిగా ప్రసిద్ధులైన నిఖిలేశ్వర్‌గారు తమ రుణం తీర్చుకోటానికి రచించి ప్రచురించిన "శబ్దాంజలి" ఈ గ్రంథం. 1962 నుంచి 1991 దాకా ఈ నగర జీవితానికి ప్రతిస్పందించి అప్పుడప్పుడు రాసిన తెలుగు కవితలు ప్రధానంగా, ఒక ఉర్దూ కావ్యఖండం కొసరుగా, హిందీ ఉర్దూ ఇంగ్లీషుల్లోకి తామే అనువదించిన, అనువదింపజేసిన మరికొన్నింటిని మొగ్గగా ఈ గ్రంథరూపంలో అందిస్తున్నారు. 1976లో తాము మరో దినపత్రికలో ప్రచురించిన పన్నెండు శబ్ద చిత్రాలనుంచి మూడు మాత్రం ఎంపికచేసి ఇందులో చేర్చారు. అన్ని కవితలూ హైదరాబాదుకే అన్వయించినందువల్ల 'దృష్టి దోషం' (తెలుగులో 'దిష్టి) తగలకుండా 'వాయుగుండంలో మహానగరం' అని మద్రాసును గురించి రాసిన కవితను చేర్చినట్లుంది. "కొన్ని ప్రతీకలని మినహాయిస్తే ఈ కవిత మన దేశంలోని ఏ మహానగరానికైనా వర్తిస్తుంది" అని కవి పీఠికలో చెప్పిన మాట పాక్షికసత్యం. ద్రవిడ సంస్కృతిని ప్రతిబింబించే మద్రాసు లక్షణాలను హుసేన్‌సాగర్, దాని ఒడ్డున పాతిన విగ్రహాలు వగైరాలను పురస్కరించుకొని ఎంత సర్దుకుని హైదరాబాదుకు అన్వయించుకున్నా సముద్రపు ఒడ్డు, చెమటకంపు వగైరాలు లేనందువల్ల కొంతవరకే కుదురుతుంది.

ఈ గ్రంథంలో మూడు శబ్దచిత్రాలూ, ఇరవైఏడు కవితాఖండాలూ తెలుగులో ఉన్నాయి. హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు అనువాదాలు రెండేసి ఉన్నాయి. మొత్తంమీద మహానగర సౌందర్యం కన్నా అందులోని లోపాలనూ, మత దురభిమానాలనూ వ్యంగ్యంగా అపహసించటమే అంతర్లీనంగా ఉన్న సామాన్యలక్షణం. అయితే అందులో అసత్యదోషం లేదు. సామాన్య పౌరుల ఆవేదన అక్షరాక్షరంలో కనిపిస్తుంది. "ఆయాసపు సెలవులు' (పే.9), "ఆత్మహత్యకైనా నీళ్లులేని లోతు" (పే.24) వంటి శబ్దచిత్రాలు గుండెలు పిండుతాయి. "ఆకలిని తినేస్తున్నారు శ్రమజీవులు (పే.9), తెగిన బల్లితోకలా బతుకు! (పే.10), మురికికాల్వల గట్లమీదుగా, మారిపోయింది నగరమే హుస్సేన్ సాగర్‌గా (పే.13) అనే వ్యుత్పత్తి, కరిగిన తారులో నల్లని రక్తమైన వేగానికి ఆవిరైపోతున్న జీవితం... కడియాల చప్పుడును మోస్తూ ఇనుపబిందెలతో లంబాడీ కాళ్లు... అలవోకగా అవయవాలను పారేసుకుంటున్న నడక... తెలుగుతనపు ఎరుపు కీలలపై రెపరెప

లాడుతున్న కాషాయ కెరటపు భ్రమలు (పే.26,27) అనే వర్ణనలు, దూరం నుండి అది ఎర్రగులాబి, దగ్గరికి వెడితే రక్తస్రావపు వ్రణం (పే.43) అనే నగర లక్షణ నిర్వచనం, కాగితాల గుట్టలపై కూర్చున్న దరిద్ర దేవత, నాగరికత కాగితాలపై నల్లని సిరా వొలికించింది (పే.49) అనే పరిశీలన, వగైరాలు నిఖిలేశ్వర్ కవితాశక్తికి నిదర్శనాలు.

"కాలం ఇముడ్చుకున్న నిష్ఫలప్రేమలు, ఈ అవశేషాలక్కూడా దక్కని మనం" (పే.53) ఈ నగర ప్రత్యేకతలుట! "ధనం దైన్యాన్ని తరుముతుంది తన సుఖం కోసం" (పే.46) అనే నైరాశ్యం, "గూండాల వికృతలీల! నగరంలో మృత్యుహేల" – అనే ప్రాసక్రీడల వార్తావ్యాపారం!- జరుగుతున్నదని పాత్రికేయుల అంత్యప్రాసాభిమానానికి ఓ చురక అంటించాడు కవి. ఇలా వివరిస్తూ పోతే గ్రంథంలోని చాలా భాగాన్ని ఉదాహరించవలసి వస్తుంది. భాగ్యనగర దౌర్భాగ్యాన్ని ప్రత్యేకించి వర్ణించిన కావ్యం బహుశా ఇదొక్కటేనేమో. చదివి కవితో దుఃఖం పంచుకోవటం మహానగర పౌరులకేగాక దాన్ని పాలిస్తున్న, పీడిస్తున్న మహోద్యోగులకూ, మంత్రిసత్తములకూ కర్తవ్యం – కనీసం కవితాభిమానంతోనయినా.

29.12.1991

# కాశీయాత్ర చరిత్ర

**– ఏనుగుల వీరాస్వామయ్య**

**తె**లుగు సారస్వతంలో యాత్రాచరిత్రలు లేని లోపం తీర్చిన మహనీయుడు ఏనుగుల వీరాస్వామయ్య. నాటికీ నేటికీ ఇటువంటి గ్రంథం మరొకటి లేకపోవటమే ఇది అద్వితీయ రచన అనటానికి నిదర్శనం. ప్రస్తుత రచన 1832 నాటికే మూడు ప్రతులుగా వెలిసింది. నిఘంటుకారుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనుకూ వీరాస్వామయ్యగారికి ఉత్తరప్రత్యుత్తరాలకు మించిన స్నేహసంబంధా లుండేవి. బ్రౌన్ సలహాలు కూడా పొంది వీరాస్వామిగారు 'అల్లించిన' ఈ యాత్రాచరిత్రను ఆయన మిత్రుడయిన కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లగారు పుదూరి నారాయణ శాస్త్రిగారిచేత 'లేఖక తప్పులు' సరిదిద్దించి మొదటిసారిగా 1838లో అచ్చువేయించారు. ఈ గ్రంథం 1869లో ద్వితీయ ముద్రణ పొందింది. 1941లో సుప్రసిద్ధ చరిత్రకారులైన దిగవల్లి వేంకట శివరావుగారు అనేక వివరణలతో 'బెజవాడ'లో ప్రచురించారు. దాని కిది పునర్ముద్రణం. ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్‌వారి పుణ్యమా అని ఇప్పుడో ఉత్తమ గ్రంథం మళ్ళీ వెలుగు చూసింది.

కాశీయాత్ర చరిత్రను పనయూరు వెంకుమొదలారి అరవంలోకి అనువదించాడు. నాగపూరి వీరాస్వామి మొదలారి మరాఠీలోకి భాషాంతరీకరణం చేశారు. అప్పటి నాగపూరు రెసిడెంట్ కోరిక మేరకు రచయిత స్వయంగా కొంతభాగాన్ని ఆంగ్లీకరించాడు. తెలుగులోని వచన రచనా సంప్రదాయం ఎలా ఉండేదో నిరూపించే ప్రయత్నంలో మహామనీషి గిడుగు వేంకటరామమూర్తి గారు తమ 'గద్యచింతామణి'లో ఈ రచయితనూ గ్రంథాన్నీ ఎంతో మెచ్చుకున్నారు. క్రీ.శ. 1780 ప్రాంతాల్లో పుట్టి 3.10.1836లో అస్తమించిన వీరాస్వామయ్యగారు అనువాదకుడుగా, దుబాసిగా, పండితుడుగా, తత్వవేత్తగా, దాతగా, దయాశీలిగా, చివరకు రచయితగా అఖండ ప్రఖ్యాతి సంపాదించారు. మదరాసులో పుట్టి, తొమ్మిదేళ్ళ చిన్నవయస్సులోనే తండ్రిని

పోగొట్టుకొని, పన్నెండో సంవత్సరం నుంచి 'కుంఫిణీ' వారి వాణిజ్య విభాగంలో వాలంటీరుగా పనిచేసి, 1819లో మదరాసులోని అప్పటి సుప్రీంకోర్టులో తెలుగు, అరవం, ఇంగ్లీషు భాషల్లో ఇంటర్ ప్రిటర్‌గా చేరిన రచయిత 1835లో పదవీ విరమణచేసి ఆ మరుసటేడు కన్నుమూశాడు.

ఉద్యోగ ధర్మాలు నిర్వర్తిస్తూనే 'స్మృతిచంద్రిక' వంటి గ్రంథాలను ఆంగ్లంలోకి అనువదించాడు. 'ఇంద్రాణి, శీదా, పొలకట్టు, పలవరకాయ' వంటి మాటల అర్థనిర్ణయంలో తనకు ప్రామాణికుడైన వాడు వీరాస్వామయ్యేనని బ్రౌన్ తన తెలుగు నిఘంటువులో (1852-54) పేర్కొన్నాడు. 1822-23లో క్షయమాస నిర్ణయం గురించి వచ్చిన వాదోపవాదాల్లో పాల్గొని తన వాదం నెగ్గించుకోగలిగాడు. గయలో పండితులతో తలపడి అధర్వణవేదం మూలవేదం కాదనీ, మూలస్మృతులూ, మూలపురాణాలూ ఇవేనని నిర్ధరించి నిష్కర్ష చేశాడు.కన్యాకుమారినుంచి కాశ్మీరుదాకా మొత్తం భారతదేశాన్ని రెండుసార్లు చుట్టివచ్చాడు. 1833లో వెంబాకం రాఘవాచార్యులు, శ్రీనివాసపిళ్ళలతో కలిసి, అప్పటి అడ్వకేట్ జనరల్ నార్టన్ను కలుపుకొని మద్రాసులో 'హిందూ లిటరరీ సొసైటీ' స్థాపించి, పచ్చయప్ప కళాశాల పోషణకు దారిచూపాడు. ఆధ్యాత్మిక దృష్టికి దయాదాన బుద్ధులు తోడుకాగ 1832 నాటి నందన కరువు / గుంటూరు కరువు కాలంలో వేల మందికి నిత్యాన్నదానం చేశాడు - చేయించాడు. తన పైఅధికారులయిన జడ్జీలతో కూడా నిరాఘాటంగా మతవిషయాలు చర్చించేవాడు. శ్రీనివాస పిళ్ళకోరిక మేరకు 18.5.1830 నుంచి 3.9.1831 దాకా "15 మాసాల 15 దినాల 10 నిమిషాల" కాలం కాశీయాత్ర చేసిన ఆవైనం ఎప్పటికప్పుడు రాసి పంపాడు. ఆ రాతప్రతిని 25 ప్రకరణాలుగా ఈ గ్రంథరూపంలో చూడవచ్చు. తొలి మలి ప్రతులకు అక్షరక్రమంలో ఉన్న మార్పులు, అర్థం కాని అనేక పదాలకు వివరణ, ఆయన జీవితచరిత్ర, ఆయన మిత్రుల విషయం, ఆయన యాత్రామార్గం, అప్పటి దేశ సామాజిక రాజకీయ పరిస్థితులు వగైరాలు అనేకం చేర్చి దిగవల్లివారు ఈ అపూర్వగ్రంథాన్ని లోకానికి అందించారు.

వీరాస్వామయ్య సనాతనవాది అయి కూడా భిన్నమతాల వాదాల సామ్య వైషమ్యాలను సమన్వయ దృష్టితో చూడగలిగాడు. ఆయన ప్రాస్తావికంగా రాసిన శాస్త్రచర్చలూ ఆయన అభిప్రాయాలూ నేటి సనాతనులకూ యువతరానికీ నచ్చకపోవచ్చు. కానీ ఆయన పరిశీలన, సమాజ లక్షణ జ్ఞానం, లోకజ్ఞానం అపారమనీ శత్రువులయినా అంగీకరిస్తారు. తాను సిఫారసుల ద్వారా తన యాత్రను ఎంత సుఖప్రదంగా నెరవేర్చుకోగలిగాడో, అప్పటి సంస్థానాల్లో ఇంగ్లీషు రాజ్యభాగాల్లో, చివరికి పౌరోహిత్యంలో కూడా ఎన్ని విధాల మోసం, లంచగొండితనం, అవినీతి ఉన్నాయో దాపరికం లేకుండా రాశాడు. రాణా రంజిత్ సింగ్ లాహోరు ముఖ్యపట్టణంగా సిక్కురాజ్యం పాలిస్తున్న రోజు లవి. విలియం బెంటింకూ ఆయన తరవాతి రాజప్రతినిధులూ ఎన్ని విధాల, ఎన్ని కుమార్గాలతో స్వదేశీ సంస్థానాలను క్రమంగా ఆక్రమించుకుంటున్నారో, దేశంలో జమీందారుల, దోపిడీ దొంగల ప్రభావం ఎంత తీవ్రంగా ఉందో, సామాన్య ప్రజలు ఎన్నెన్ని రకాల ఇబ్బందులకు గురవుతుండేవాళ్లో ఆయన మొహమాటం లేకుండా రాశాడు. ఆయా ప్రదేశాల్లో కులమత ప్రాంతభేదాలు ఎన్ని అనర్థాలు తెచ్చిపెడ్తున్నాయో, భిన్న ప్రాంతాల్లో ఆర్థిక పరిస్థితు లెలా ఉన్నాయో ఆయన చిత్రించాడు. అప్పటి రాజకీయ సామాజిక స్థితికి ఈ

యాత్రా చరిత్ర అద్దం పట్టింది. మరి అలాంటి గ్రంథం పుట్టలేదు. అంతకుముందు తెలుగులో లేదు.

ఒక్క తెలుగుదేశాన్ని గురించి ఆయన రాసినవి చాలు. వుప్పాడలోని బెస్తలు పుట్టినప్పటి నుంచి చచ్చే దాకా ఎలా అప్పుల పాలయినారో ఆయన మాటల్లో చూడండి. "వీరి యిండ్లలో మొగవాడు పుట్టితే తల 1కి రూ. 1½ సరకారువారికి తీరువ యివ్వవలసినది... యీ బోయస్త్రీలు.... మొగవాండ్ల నిమిత్తము పన్ను సహా యిచ్చుకుంటారు... అప్పులు మిక్కటమయితే తీర్చడానికి దేశాంతరములకు జతలుగా కలిసి వచ్చి బోయీ కొలువుచేసి మళ్ళీ దేశమునకు వచ్చి చేసియున్న అప్పులు తీర్చుకుంటూ వుంటున్నారు.... నాతో వచ్చిన బోయీలలో యిద్దరు యీదేశము వదిలి బహుకాల మౌటచేత వారి భార్యలు వారిని గుర్తుపట్టలేకపోయినారు..." (పే. 337, 338). ఇలాంటి హృదయ విదారక విషయాలెన్నో ఉన్నాయి ఈగ్రంథంలో. మతం పేరిట జరిగే దుర్మార్గాలను కూడా ఆయన వదిలిపెట్టకుండా చెప్పాడు.

తననాటి వాడుక భాషలో సమకాలిక జీవిత దౌర్భాగ్యాలనూ, తన పోషకుల వంచనాశిల్పాన్నీ, తన బలహీనతలనూ నిర్వికారంగా రాయగలిగిన రచయిత శ్లాఘనీయుడు. చరిత్ర, రాజకీయం, సమాజ పరిస్థితి, ఆర్థిక పరిస్థితి, ఆచారవ్యవహారాలూ, భాషాభేదాలూ వాటి విలక్షణతలూ అప్పటి రవాణా సౌకర్యాలూ - ఒకటేమిటి - రకరకాల వాస్తవాలను తెలుసుకోదలచిన వారందరూ చదివి తీరవలసిన పుస్తకమిది. బ్రిటిష్‌వాళ్లు అప్పటికింకా మొత్తం భారతదేశాన్ని అదుపులోకి తెచ్చుకోలేదు. భారతజాతి ఎన్నివిధాల పతనదశలో ఉందో ఈ గ్రంథం రూపుకట్టిస్తుంది. ఆయన బ్రిటిష్ రాజభక్తి మాత్రం అచంచలం. రచయితగా, విద్వాంసుడుగా, త్యాగమూర్తిగా పేరుమోసిన వీరాస్వామయ్య తన వెంట రెండు వందల మందికి యాత్రావకాశం కల్పించాడు. వైద్యంచేసి పరిచారకులను బతికించుకున్నాడు. తెలుగుదేశంలో - ముఖ్యంగా హైదరాబాద్, కర్నూలు నవాబుల రాజ్యంలో, కళింగప్రాంతంలో జమీందారీల్లో జరుగుతున్న ఆగడాలను వివరించాడు. సాహితీపరులేగాక చరిత్రాభిమానులు కూడా చదివి తీరవలసిన మహారచన యిది.

2.2.1992

## మొదటి ఎత్తు

**- అనువాదం : డాక్టర్ ఆర్. నాగేంద్ర**

మేధాశక్తిని పరీక్షించే, దానికి పదును పెట్టే అద్భుత క్రీడ చదరంగం / చతురంగం. సహస్రాబ్దాలుగా భారతదేశంలో రాజుల నుంచి పేదల దాకా అభిమానించిన విద్య ఇది. జూదం కాదు - పులిమేక, పాచికలాటల్లాగా. 16వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయలు అభిమానించాడు. బొడ్డుచెర్ల తిమ్మన అనే వ్యక్తి వందమంది రాజుకు తోడ్పడ్డా ఆడి గెలిచేవాడని ఒక చాటువు చెప్తుంది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ జాతీయ క్రీడ నొక అద్భుత కథానికలో వర్ణించారు. నిన్నమొన్నటిదాకా తెలుగు పల్లెటూళ్లలో ఇది నిత్య క్రీడగా ఉండేది. మన పద్ధతికీ అంతర్జాతీయ విధానానికీ కొన్ని భేదాలున్నాయి. మన 'మస్తు ఆట'లో 'జంతువులు' లేని రాజుతో ఆటకొనసాగదు.

మన రాజుకో గుర్రమెత్తుంది, ఒకేఒకసారి. 'వెళ్లేదారిలో' (en passant) బంటు ఎదిరి బంటును చంపటం దేశవాళీ ఆటలో లేదు. ఇలా అనేక భేదా లున్నాయి.

ఇప్పటికీ మన పల్లెటూళ్లలో 'తోసిరాజు, తెరచి రాజు, ఉయ్యాలచేరు' మొదలైన పద్ధతులతో మంత్రి, ఏనుగు, గుర్రం, శకటం లేకుండా ఎదిరితో ఆడతామనే పెద్దలున్నారు. చదరంగం బల్లమీద 'పగ' లేకుండా ఎన్ని మంత్రులను, గుర్రాలను నిలపగలవని పిల్లలను రెచ్చగొట్టి ఆడించేవాళ్లున్నారు. అయినా ఎందుచేతనో ఈ ఆట మధ్యకాలంలో ప్రశస్తికి రాలేదు. విశ్వనాథ్ ఆనంద్ పుణ్యమా అని మళ్లీ చదరంగమాట పుంజుకొంటున్న రోజుల్లో ఇంతమంచి పుస్తకం వెలువడటం ముదావహం.

మంత్రి/ రాణి, శకటం / ఒంటె వంటి పర్యాయపదాలు భిన్న ప్రాంతాల్లో వాడుకలో ఉన్నా ఆటతీరు ఒక్కటే. చదరంగం మీద రష్యన్, ఇంగ్లీషు భాషల్లో వేనవేల గ్రంథాలున్నాయి. గణితశాస్త్రం మీద ఆధారపడ్డ ఈ ఆటకు సిద్ధాంత ప్రాతిపదికను, ఎత్తుల తారతమ్యాలను, బలగం బలాబలాలనూ వివరించే గ్రంథాలు తెలుగులో ఉన్నట్లు లేదు. ఈ గ్రంథం ఆ లోపం తీరుస్తున్నది. ఇందులో 742 బొమ్మల ద్వారా ఆటలోని పట్టులెలా ఉంటాయో వివరించారు. 65 అభ్యాసాలున్నాయి పాఠకుల కోసం. అనుబంధంలో వాటికి జవాబు లిచ్చారు. రకరకాలుగా ఆట మొదలుపెట్టడంలోని లాభ నష్టాలను, వ్యూహ విధానాలను, ఆటలో పాటించవలసిన నియమాలను, ఆట ఎలా సాగుతున్నదో కాగితం మీద సంకేతాలతో రాసుకొనే పద్ధతులను, ఆట చరమదశలో ఎన్నెన్ని రకాల సమస్యలు వస్తాయో వాటిని ఎలా పరిష్కరించాలో చెప్పే వివరణలను ప్రఖ్యాత రష్యన్ క్రీడాకారుడు సాకోల్స్కీ అసంపూర్ణంగా రాయగా, తరవాతి ఆవిష్కరణలను చేర్చి ష్తెయిన్ ససీర్ పూర్తిచేసిన ఈ గ్రంథాన్ని 'రాదుగ' ప్రచురణాలయం వారు చక్కని తెలుగులో సులభగ్రాహ్యంగా అందించారు. వారిని ప్రశంసించాలి.

భాష ఎంత సులభంగా ఉందో, రచన ఎంత స్పష్టంగా ఉందో, ముద్రణ, బొమ్మలూ అంత చక్కగా ఉన్నాయి. మన దేశీయ పద్ధతి మాత్రం లేదిందులో. అంతర్జాతీయ చతురంగ క్రీడా విధానాలు సోదాహరణంగా ఇచ్చారు. అనువాదం సాఫీగా నడిచింది. ధర కారుచౌక అనే చెప్పాలి. క్రీడాభిమానులేగాక శాస్త్రగ్రంథాలు తెలుగులో రావాలని కోరుకొనే వాళ్లు కూడా చదవదగ్గ గ్రంథం. శాస్త్ర రచన ఎలా సులువుగా ఆకర్షణకరంగా ఉండాలో, ఉండగలదో ఈ గ్రంథం నిరూపిస్తుంది.

22.3.1992

## మహాభారత చరిత్రము

– పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

దాదాపు 60 సంవత్సరాల క్రితం ఆంధ్రసాహితీ ప్రపంచంలోనూ ఆస్తిక ప్రపంచంలోనూ అల్లకల్లోలం పుట్టించిన ఈ పరిశోధక గ్రంథాన్ని దాదాపు దశాబ్దం సాగిన పరిశోధన ఫలితంగా పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1928లో ప్రచురించారు. 1933లో పునర్ముద్రణభాగ్యం కలిగిన ఈ గ్రంథాన్ని విశాలాంధ్ర ప్రచురణాలయంవారు మళ్ళీ ముద్రించి లోకోపకారం చేశారు. ఇప్పటిలా విశ్వవిద్యాలయాలూ, పీఠాలూ, పీఠాధిపతులూ లేని రోజుల్లో ఒక సనాతన పండితుడు,

గ్రంథాలయ సౌకర్యంకోసం కళాశాలోద్యోగం మాని ఉన్నత పాఠశాలోద్యోగం చేసిన ఒక పరిశోధకుడు, భారతం వంటి మహేతిహాసప్రతులు సంపాదించి, శాస్త్ర గ్రంథాలను అవలోకనం చేసి, దానిలోని లోటుపాట్లను ఎత్తిచూపాడు ఈ శతాబ్ది మూడో దశకంలో. గ్రంథపఠనంవల్ల కంటిజబ్బు వస్తే అది దైవదూషణ ఫలితమని ఎందరెన్ని చెప్పినా ఆధునిక విజ్ఞానమే తనకు రోగవిముక్తి కలిగించగలదని నమ్మి, ఆచరణలో నిరూపించా డాయన.

కట్టమంచి రామలింగారెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణన్, ప్రొఫెసర్ కీత్‌వంటివారు ఆయన వాదాలను సమర్థించారు. శ్రీపాద కృష్ణమూర్తిగారి వంటి పండితకవులు విమర్శగ్రంథ రచనతో సరిపుచ్చుకోక పెండ్యాలవారిని కోర్టుకీడ్చి భంగపడ్డారు. ఇప్పటి హేతువాద దృక్పథం ఆయనకుందో లేదోగాని తార్కిక దృక్పథంతో ఆయన చేసిన నిరూపణలు నాటికీ నేటికీ కాదనలేనివి అనేకమున్నాయి. భారతం నేటి రూపంలో మూడోదశలో పరిణమించిందని ఆయన నిరూపించాడు. అది పంచమవేదం ఎందుకయిందో వివరించాడు. వైయాసికీ సంహితామాత్రం కాదన్నాడు. వ్యాసరచనకు 'జయ'మనే పేరు. దానికి నరనారాయణులిద్దరూ నాయకులే. దాన్ని మూడు సంవత్సరాల కాలంలో భారత యుద్ధారంభం దాకా ఉన్న ఇతివృత్తంగా వ్యాసుడు 8,800 శ్లోకాల్లో రచించాడు. వ్యాస శిష్యుడైన వైశంపాయనుడు ఉపాఖ్యానాలు లేకుండా దాన్ని 24,000 శ్లోకాలుగా విస్తరించి 'భారత' మన్నాడు. అలాగే సుమంత, జైమిని, శుక, పైల మహర్షులు విడివిడిగా భారత సంహితలు రచిస్తే, జైమిని రాసిన అశ్వమేధపర్వ మొక్కటే మిగిలింది. వైశంపాయన గ్రంథమే మొత్తం మిగిలిం దీనాటికీ. 'జయం'లోని విశేషాలతో, సౌతి, శౌనక, జనమేజయ వైశంపాయనుల ప్రశ్నోత్తరాలతో, ఉపాఖ్యానాలతో అది 'మహాభారతం'గా లక్షశ్లోక పరిమితమయింది. క్రీస్తుపూర్వం 5వ శతాబ్దినాటి భాసుడి నాటికి ఇప్పటి భారతరూప మేర్పడింది. అందువల్లే అతడు ఆరణ్యపర్వం నుంచి శల్యపర్వం చివరిదాకా జరిగిన కథను నాటకాలుగా మలిచాడు. మహాభారతం సృజనాత్మకరచన కాబట్టే అప్పటి భాసుడినుంచి నిన్నమొన్నటి త్రిపురనేని రామస్వామి చౌదరిగారి వరకూ తమకు తోచిన విధంగా కథను మార్చి రాయగలిగారు.

మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం 16వ శతాబ్దిలో కురుక్షేత్రం నుంచి అలహాబాదు దాకా విస్తరించిన ప్రాంతంలో జరిగిందని పెండ్యాలవారి నిరూపణ. క్రీస్తుపూర్వం 12వ శతాబ్దిదాకా (శాకటాయనుడి కాలందాకా) శ్రీకృష్ణుణ్ని మహావీరుడుగా మాత్రమే పరిగణించారని, పాణిని నాటికి (క్రీ.పూ. 6వ శతాబ్ది) 'వాసుదేవ' కృష్ణుడు భగవదవతార మైనాడని, పతంజలినాటికి అర్జునుడు పూజాస్థానం పోగొట్టుకున్నాడనీ ఆయన వాదన. శాంతిపర్వంలో పేర్కొన్న సాత్వతావతార మేదో నేటికీ తెలియటంలేదన్నాడు. వ్యాసుడు నిషాదుడని, ద్రోణుడు జారిణీ పుత్రుడని, విదురుడు దాసిన కొడుకని, భీష్ముడి బ్రహ్మచర్యం అనుమానాస్పదమని కుమారిలభట్టే చెప్పాడని, ద్రోణుడు అశ్వత్థామకు పట్టంకట్టాలని ఉభయపక్ష విధ్వంసం చేశాడని, కుంతి కర్ణుణ్ని తొమ్మిదినెలలు మోసి కన్నదని దేవీభాగవతం పేర్కొంటున్నదని ఆయన సాక్ష్యాలు సేకరించాడు.

సర్పయాగం అవైదికమని, అది నాగజాతిని ఆర్యులు ధ్వంసం చేయటానికి నిదర్శనమని వాదించాడు. శ్రీకృష్ణుడు చంపిన 'పూతన' రాక్షసికాదు. అదో బాలారిష్టమని సుశ్రుతసంహిత

వివరించిందని, ఆ రోగం నుంచి బయటపడటమే చంపటమని అతిశయోక్తిగా చెప్పారన్నాడు. ఇప్పటికీ జాతకర్మ సమయంలో, మంత్రపన్నాల్లో, ఏకాగ్నికాండలో బాల్యపీడలుగా సోకుడు రోగాలుగా పేర్కొన్నవాటినే శకటాసుర వధ, ఉలూఖల బంధనాదులుగా వర్ణించారేగాని అవిరాక్షస విజయాలు కావన్నాడు. భారతం మొత్తం 13 స్థలాల్లో ద్రౌపదీ పరాభవ ప్రస్తావనవస్తే పదింట్లో కచగ్రహణ, సభాప్రవేశ, దూషణలనే ప్రస్తావించారుగాని వస్త్రాపహరణ విషయం రాలేదు కాబట్టి ఆ విషయం అబద్ధమని తేల్చాడు. భాస, క్షేమేంద్ర, భారవ్యాదులు వస్త్రాపహరణం సంగతే చెప్పలేదని, ఆరణ్యపర్వంలో సంబంధ, గౌరవ, సఖ్యాలవల్ల మాత్రమే ద్రౌపది శ్రీకృష్ణుడికి రుణపడ్డట్లు చెప్పిందిగాని మానరక్షకు దనలేదని వాదించాడు.

పాండవు లడిగిన అయిదూళ్ళలో కుశస్థలం కర్ణుడు యాదవులనుంచి పుచ్చుకున్నది. మాకందీ వారణావతాలు ద్రోణుడు పాంచాల ద్రుపదుడి నుంచి లాక్కొన్నవి. తనవికాని ఊళ్ళను దుర్యోధను డివ్వలేడని తెలిసి అలా అడిగారని, అది కైజరు మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు చేసినవాదం వంటిదన్నాడు. రాజసూయ యాగంలో శిశుపాలుణ్ని విశసనం చేశారని, అశ్వమేధం చేయవలసిన అవసరంగాని యోగ్యతగాని శాస్త్రప్రకారం ధర్మరాజుకు లేదన్నాడు. అప్పట్లో వ్యభిచారం, తాగుడు, జూదమాడటం సంఘ దృష్టిలో నేరాలు కావన్నాడు. నిజాని కది కురుపాంచాల యుద్ధమనీ, సంకరులందరూ కలిసి గెలిచారనీ వాదించాడు.

తిలక్, డాంగే, సురవరం ప్రతాపరెడ్డి వంటి వారెందరో భారత రామాయణ విమర్శలు రాశారు. కేవలం మహాభారత మూలగ్రంథాన్ని శాస్త్రదృష్టితో, తర్కదృష్టితో పరిశీలించి, అందులోని పరస్పర విరుద్ధాంశాలను ఎత్తిచూపిన మొదటి తెలుగువాడు పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. మహాభారతం విజేతలు వాస్తవాన్ని వక్రీకరించి రాయించుకున్నదేనని ఆయన వాదం. రచన అప్పటి సరళ గ్రాంథిక భాషలో ఉన్నా ఆ మూలం చదివిస్తుంది. ఈనాటి పరిశోధకులు గమనించి నేర్చుకోవలసిన విధానాలు ఇందులో ఎన్నో ఉన్నాయి. వాదప్రతివాదా లుంటాయి. కానీ వాదపద్ధతి ప్రధానమనుకొనే పరిశోధనలు ఇప్పటిలా శిక్షణాది సౌకర్యాలు లేని రోజుల్లో వాటిని ఎంత నిష్పాక్షికంగా నిర్దుష్టంగా చేయవచ్చో ఈ గ్రంథం చదివయినా తెలుసుకొంటే ధన్యులవుతారు. గ్రంథ విషయం నచ్చినా నచ్చకపోయినా పెండ్యాలవారు చూపిన ఉపపత్తులను, నిదర్శనలను, తర్కపద్ధతులను కాదనటం అసాధ్యం. చదివితీరవలసిన మహారచన ఇది.

12.7.1992

## అభ్యుదయ కవిత్వంలో ఆరుద్రత

– డాక్టర్ ఆర్. నరసింహారావు

నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి పిహెచ్.డి. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసమిది. దీనికి తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయం లభించింది. ఇటీవలి కాలంలో భాగవతుల సదాశివ శంకరశాస్త్రి (ఆరుద్ర) మీద వెలువడుతున్న అనేక సిద్ధాంత వ్యాసాల్లో ఇదొకటి. పరిశోధన గ్రంథం కాబట్టి ఎంపిక చేసుకొన్న రచయిత మీద ఆరాధన భావంతో రచన సాగటం పరిపాటే గాని ఇందులో కొన్ని సాధారణ లక్షణాలతోబాటు కొన్ని అసాధారణ విషయాలు లేకపోలేదు. ఆరుద్ర 'ఆరో రుద్రుడు' (పే.7) అని రచయిత అభివర్ణించారు గాని మొదటి

అయిదుగు రెవరో చెప్పలేదు. ఆరుద్ర కవితలో అతడి లక్షణమైన 'ఆరుద్రత' ఉండటంలో ఆశ్చర్యం లేదుగాని అది శీర్షికలో భాగం కావటమే వింత. జపానువాడు విశాఖ మీద బాంబుదాడి జరిపాడని రచయిత ప్రగాఢ విశ్వాసంతో చెప్పటం (పే. 296) అపరీక్షితం. 'లోహ విహంగాలు' అనే రచన "శ్రీశ్రీకి నచ్చిందట" (పే. 296) అనే ప్రసంగం సందేహ పూర్వకం – అనుమానాస్పదం.

కొన్ని అపూర్వ ప్రసంగాలు – సాధారణంగా సిద్ధాంతవ్యాసాల్లో కనిపించనివి – ఈగ్రంథాలలో కనిపించటం విశేషం. ఉదాహరణకు "... అతనే మాత్రం ఉడుక్కోకుండా వెటకారపు పేరునే బిరుదుగా భావించి శాశ్వతంగా స్వంతం చేసుకున్నాడు (పే. 3)" అనేది ఇందాకా అది నక్షత్ర నామ మనుకొనేవాళ్ళకు కనువిప్పు. అలాంటివే "శ్రీశ్రీ ప్రాసల్లో సహజత్వం ఉంటే ఆరుద్రలో ప్రాసకోసం కొన్నిచోట్ల పదాల బనాయింపు కనిపిస్తుంది" (పే. 298). "శ్రీశ్రీ మంటలుమండే సూర్యుడయితే – ఆరుద్ర చమక్కుమనే నక్షత్రం" (పే. 300), "అంత్యప్రాస ఆరుద్ర ముద్ర అని అందరూ అనుకుంటారుగాని అది అసలు పతాభిముద్ర" (పే. 338) వగైరాలు. ఈ పాటి నిష్పాక్షికత సిద్ధాంతగ్రంథాల్లో అరుదు.

సిద్ధాంత గ్రంథంకాబట్టి పాశ్చాత్య సిద్ధాంతాలను, ఇతరకవుల విమర్శభావాలను వివరించారు. కావలసినన్ని కర్మణి ప్రయోగాలు – సగటున పేజీకి పది – కనిపిస్తాయి. సంగీత కుర్చీలాట (పే. 281) వంటి అపూర్వ ప్రయోగాలుండటం కూడా సహజమే. రచయిత "ఆరుద్ర సహజంగా తీవ్రవాద కమ్యూనిష్టు చైనా అభిమాని" (పే. 255) అని తేల్చుకొనేముందు ఆయన కెనెడీ మీద రాసిన పద్యం, భారతదేశంలో అమెరికావాడు 'ఉపకార' బుద్ధితో రేడియోస్టేషన్లు స్థాపిస్తానంటే సమర్థించటం వంటి చిన్న రచనలను కూడా పరీక్షించి ఉంటే బాగుండేది. అలాగే సాహిత్యోప నిషత్ (పే. 119–135) రాతప్రతి ఎవరి దగ్గర ఎందుకుందో పరిశీలిస్తే మరింత బాగుండేది. ఆరుద్ర ఆంగ్ల చిత్రాలను గురించి (పే. 299, 330), ప్రతీక వాదం గురించి (పే. 102–110) విపులంగా చర్చించినవారు, ఆయన కవిత చమత్కారవంతమే గాక ధ్వనిప్రధానం (పే. 300) అనటం పరస్పరం విరుద్ధ ప్రసంగమనిపిస్తుంది. ఆరుద్రను ప్రభావితం చేసినవారిలో రావూరి దొరస్వామి శర్మగారిని కూడా చేరిస్తే చరిత్ర కొక సమగ్రత వచ్చేది. అవన్నీ లేకపోయినా కొంత ప్రత్యేకతను సాధించిన రచయిత అభినందనీయుడే. సాహితీజిజ్ఞాసువులు చదవదగిన పుస్తకం.

27.9.1992

## లలితకళా పదకోశం

**సం॥ చీమకుర్తి శేషగిరిరావు, తిరుమల రామచంద్ర, వజ్ఝ శ్రీనివాసశర్మ**

**ము**గ్గురు దిగ్దంతులవంటి పండితులు సిద్ధంచేసిన ద్విభాషానిఘంటు విది. అట్టమీద నయినా చెప్పలేదుగాని ఇది ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు. ఇందులో చిత్రశిల్పకళా పారిభాషిక పదాలున్నాయని, 'ఇదివరకు తెలుగులో వెలువడిన లలితకళా గ్రంథాల్లోని కొన్ని పదాలను సంపాదకులు స్వీకరించా'రని, 'అవసరమైనపుడు పాత పదాలతోపాటు కొత్తపదాలకు రూపకల్పన చేసి పదకోశంలో చేర్చా'రని భూమికాకర్తలు వివరించారు.

సంగీత సాహిత్య నృత్యాదులు కూడా అందులో ఉన్నాయనీ, శిల్ప చిత్రలేఖనాలు మాత్రమే

లలితకళలు కావనీ విన్నాం. కేవలం శిల్ప చిత్రలేఖనాలకు సంబంధించిన పదాలున్న కోశం లలితకళలన్నింటికీ నిఘంటువనటం న్యాయంకాదు. ఏ నిఘంటుకర్త అయినా తన సంకలనానికి ఆకరగ్రంథాలేవో, ప్రమాణాలేవో, సంకలన సూత్రాలేవో వివరిస్తాడు. ఈ సాధారణ కర్తవ్యాన్ని కూడా సంకలనకర్తలు నెరవేర్చలేదు. ప్రాకృత గ్రంథాలనుంచి ఈ పండితులు పదాలు సేకరించినట్లుందిగాని, సుప్రసిద్ధరచనలైన అభిలషితార్థచింతామణి, సమరాంగణ సూత్రధారాదులనుంచి సేకరించినట్లు లేదు. భాషలో ప్రయుక్తమైన మాటలనుగాక తాము 'కల్పించిన' పదాలను కోశంలో ఆరోపాలుగా ప్రదర్శించటం నిఘంటు నిర్మాణ మూలసూత్రాలకే విరుద్ధం. 'Commission Internationale del'Eclairage వంటి ఫ్రెంచి పదాలకు 'ఉద్దీపన సంబంధి అంతర్జాతీయ సంఘం' లాంటి కృతకానువాదా లెందుకు రాశారో తెలియదు. Engraving అనే మాటకు 'రేఖాశిల్పం, అధిరేఖనం, సంరేఖనం' అనే మూడు 'తెలుగు' పర్యాయపదాలిచ్చారు. Opacifier అనే ఆరోపానికి "కాంతిరోధకి" అనే పర్యాయరూపమిచ్చి "మార్తవములలో ద్యుతికములను కాంతి నిరోధకాలుగా చేయటానికిగాను వాడే అనుబద్ధం" అనే వివరణ ఇచ్చారు. మార్తవం, ద్యుతికం, అనుబద్ధం - అనే మాటల అర్థాలకోసం ఇతర నిఘంటువులను చూసినా ప్రయోజనం లేకపోయింది. నిఘంటువులో చిత్రపటాలను, రేఖా చిత్రాలనూ ఏ నియమం ప్రకార మిచ్చారో తెలియదు.

ముగ్గురు పండితులు నిఘంటు నిర్మాణ సూత్రాలతో సంబంధంలేకుండా ఒక ప్రణాళిక లేకుండా, ఆకరాల వివరాలు లేకుండా, ఆధారగ్రంథప్రస్తావన లేకుండా కోశనిర్మాణం చేసిందీ, ఒక విశ్వవిద్యాలయం ఇటువంటి కృతకనిఘంటువును ప్రచురించిందీ బహుశా ఇదే మొదటి పర్యాయం కావచ్చు. తెలుగుభాషలో వెలువడ్డ శిల్పచిత్రలేఖన శాస్త్రరచనలతో నిమిత్తం లేకుండా, లలితకళలన్నిటి పేరిటా వాటికి సంబంధించిన పారిభాషికాలూ వాటి అర్థవివరణా లేకుండా ప్రచురించిన కృత్రిమనిఘంటు విది. నిఘంటు నిర్మాణం ఎలా చేయగూడదో తెలుసుకోవటానికీ ఇంతకన్నా ప్రామాణికమైన, 'దోషప్రకరణానికి' లక్ష్యాలు కావలసినవారికి ఇంతకన్నా పనికివచ్చే, నిఘంటువు మరొకటి లభించటంకష్టం.

1.11.1992

## తెలుగు కవిత - లయాత్మకత

– డాక్టర్ సి. నారాయణరెడ్డి

భాష, భావం, అర్థం వంటివాటికి ప్రాముఖ్యంలేని (చెక్క) భజన సంప్రదాయం తెలుగు దేశంలోనూ ఉంది. తమిళ సోదరులు త్యాగరాయ కృతులను పాడేటప్పుడు ఈ సంప్రదాయలేశం ప్రతిధ్వనిస్తుంది. దీపస్తంభం చుట్టూ ప్రదక్షిణిస్తూ (మందుకొట్టి) చిందులు వేసే భక్తులు "గోపాల కృష్ణుడు పక్షి, గోవిందకృష్ణుడు పక్షి" అని తాళలయబద్ధంగా పాడ్తారు. మూడోకాలంలో పాడిపాడి అలసిపోతున్న సమయంలో "వాహన మెక్కె" అని పాట పూర్తిచేస్తారు. వారి భక్తిని శంకించ నక్కరలేదు. స్వరమాధుర్యాన్ని పరిగణించ నక్కరలేదు. వారు ఆరాధించే దేవుడు మొదట పక్షిగా తరవాత పక్షివాహనుడుగా పరిణమించటం భాషాభిమానులకు బాధాకరంగా ఉంటుంది. సరిగ్గా ఈ సంప్రదాయ ధోరణిలో వెలువడిన కవితావిమర్శ ఈ గ్రంథంలో సాహితీ పీఠాధిపతుల దయావిశేషంవల్ల లోకులకు తెలియవస్తున్నది.

యువభారతి రజతోత్సవ సందర్భంలో ఆ సంస్థకు మేనమామలాంటి (పే. VI) సినారెగారిచ్చిన నాలుగు మహోపన్యాసాల కిది గ్రంథరూపం. ఇందులో కోహల 'దర్శనానికి' నారాయణరెడ్డిగారి 'అన్వయ'మని ఇద్దరాచార్యులు సెలవిచ్చారు (పే. VIII). "తాళాంతరాళవర్తీ యః కాలోఽసౌ లయనామకః" అన్న కోహల నిర్వచనను "తాళాల అంతర్గతమైన కాలం లయ" అని అనువదించిన సినారెగారే "లయ అంటే తాళమే" అని వ్యాఖ్యానించారు (పే. 6). "నృత్తం తాళలయాశ్రితమ్" వంటి ప్రతిపాదనలలో తాళలయలు భిన్నాలన్న భరతుణ్ని విశ్వసించాలో, ఈ నూతన వ్యాఖ్యాతను నమ్మాలో తెలియదు. 'ఆయన బుర్రలో / కడుపులో అన్నీ ఆలోచనలే' అనే తెలుగు వాక్యాన్ని ఈపద్ధతిలో అన్వయిస్తే బుర్రే/ కడుపే ఆలోచన అని అర్థం చేసుకోవా లన్నమాట!

లౌకిక సంస్కృతాన్నే ఇలా అర్థం చేసుకున్న విద్వాంసులు వైదిక సంస్కృతాన్ని విపరీతంగా వ్యాఖ్యానించలేరా? అందుకే "మంత్రాలు తాళబద్ధం" (పే. 1) అని కనిపెట్టారు. "మంత్రంలోని మాత్రల సర్దుబాటు" (పే. 11) ద్వారా లయాత్మకతను సాధించవచ్చన్నారు. తాళం కుదరకున్నా లయాత్మకంగా చదవటం అవసరమన్నారు (పే. 28). "అపి మాషం మషం కుర్యాత్, ఛందోభంగం నకారయేత్" అన్న లాక్షణికులను స్మరించారు (పే. 36). 'పరమవచనం' (పే. 70)లో కూడా ఏదో రూపంలో గేయగుణాన్ని కనిపెట్టవచ్చని నిర్ధరించారు (పే. 80). "లయ తప్పితే విలయం" (పే. 6) అని భయపెట్టారు. గద్యపద్య గేయరూపక సాహిత్యం మొత్తాన్ని "తకిట తకిట"లకు అనుగుణంగా సరిపెట్టాలన్నారు. "కమ–లాకుచ చూచుక..." అని పాడా లన్నారు (పే. 44). అలా ఎందుకు పాడి తీరాలో చెప్పలేదు. శబ్దార్థసహితమైన సాహిత్యాన్ని వాటి స్వరూప లక్షణాలతో నిమిత్తం లేకుండా విరిచి భజన సంప్రదాయాన్ని పాదుకొల్పుతున్నారు!

ఇంగ్లీషు కవితను 'stress' ఆధారంగా వర్గీకరించా రన్నారు. కాని 'accent, tone' అనే భాషా లక్షణాలను స్మరించనయినా లేదు! వైదిక సంస్కృతం స్వరప్రధానమని గమనించలేదు. "యథేంద్రశత్రు స్స్వరతోఽపరాధాత్" వంటి ప్రసంగాలు విన్నట్లయినా కనపడలేదు. వృత్తగంధి, తాళగంధి, చూర్ణికాది వచనభేదాలను శతాబ్దాల కిందటే మన పూర్వులు గమనించి చర్చించారని గ్రహించలేదు. "మార్చి చదవటం" (పే. 25) వల్ల కవితాభాషకూ కవితాత్మకూ జరిగే అపచారం, అనర్థం గుర్తించలేదు. 'రామునితోక – పివరుం డిట్లనియె, లంగూడి' వంటి కల్పనలవల్ల భాషాపచారం జరుగుతుందన్న స్పృహే ఉన్నట్లులేదు. కవితకు రూపంకన్నా శబ్దార్థపుష్టి ప్రధానమని రచయితకు తోచనేలేదు. లయాత్మకం కానిదీ, తకిట తకిటలకూ, తకథిమి తకథిమి తోములకూ సరిపడనంత మాత్రాన కవితాగుణానికి లోపం లేదని సాహితీ పీఠాధిపతులు గమనించక ప్రసంగించటమే ప్రమాణాలు పడిపోయా యనటానికి నిదర్శనలు.

ఎండవేడిమికి భయపడ్డ నీడలు చెట్ల మొదళ్ళలో తలదాచుకున్నాయని గాథాసప్తశతిలోని ఓ కవితాఖండం. ఈ అద్భుత వర్ణన తకిట తకిటలకు అనుగుణంగా లేకపోతే ఉత్తమ కవితకాదా? సాహితీ విమర్శనలోని మూలసూత్రాలకు తిలోదకాలిచ్చిన ఈ విశ్లేషణ కేవలం భజన సంప్రదాయాన్ని సినిమా సంస్కృతిని ప్రతిబింబిస్తుందేమోకాని ఏనాటి సాహితీ విమర్శ ప్రమాణాలకు సరిపడదు. ఈ గ్రంథాన్ని చదివి పీఠాధిపతుల భాషాజ్ఞాన ప్రమాణాలను తెలుసుకొని ఆనందించెదరుగాక! "సర్దుబాటు" మనస్తత్వం పెంపొందించుకొనెదరు గావుత!

23. 5. 1993

# పదకవితా వైజయంతి

– డాక్టర్ పొన్నా లీలావతమ్మ

ఇంతకుముందు చిన్నా పెద్దా పత్రికలలో వ్యాసాలుగానూ ఆకాశవాణి ప్రసంగాలుగానూ కనిపించిన, వినిపించిన వాటిని రచయిత్రి ఈ రూపంలో వ్యాససంపుటిగా ప్రచురించారు. అందుకు దాదాపు ముప్పై పేజీల ప్రశంసలు కూడా పొందారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారూ తెలుగు విశ్వవిద్యాలయం వారూ గ్రంథప్రచురణకు ఆర్థికసహాయ మందించారు. వ్యాస రచనానుభవం సంపాదించటానికి తాను చేసిన కృషిని "వ్యాసపరామర్శ కృతజ్ఞతా సుమాంజలి" అనే పరిచయ భాగంలో విశదీకరించారు. ప్రచురించిన 50 వ్యాసాల్లో 37 అన్నమయ్యను గురించినవి. తక్కినవి త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి, రామదాసు, క్షేత్రయ్య వగైరాలకు సంబంధించినవి. అన్నమయ్య సంకీర్తనలతో తనకున్న అనుబంధాన్ని ప్రత్యేక వ్యాసంగా (22) వెలువరించారు. ఆయన వాడిన ప్రత్యామ్నాయాలను కూడా సోదాహరణంగా ప్రకటించారు.

వాగ్గేయకారుడుగా అన్నమయ్యకు ప్రశస్తినీ, తెలుగు సాహిత్యంలో ఆయనకున్న స్థానాన్నీ ఎవరూ కాదనలేరు. అయితే ఈ వ్యాసపరంలో ఆయనకున్న 'సామాజిక చైతన్యాన్ని' (12), ఆయన చేసిన 'ప్రజాబోధ'ను (26), 'సంఘ సంస్కర్త'గా ఆయన ఉన్నతిని (28), 'సమతా వాది'గా ఆయన ప్రశస్తిని (31), అచ్చు తప్పుతో 'మినిఫెస్టు'గా విషయసూచికలో కనిపించినా గ్రంథంలో 'ఫెమినిస్టు'గా ఆయన ప్రసిద్ధిని (36) కూడా చర్చించటం విడ్డూరమనిపిస్తుంది. ఈ మాటల కిప్పటి సాహితీ ప్రపంచంలో ఉన్న ప్రత్యేకార్థాలను ఆమె గమనించినట్లు లేదు. ఉదాహరణకు 236, 261, 93 వగైరా పేజీల్లో అన్నమయ్య రాజారామమోహన్ రాయ్, కందుకూరి, గురజాడ వగైరాలకు మార్గదర్శకుడయినట్లే ఆమె చిత్రించారు! 'ఫెమినిస్టు'గా ఆయనను ప్రశంసిస్తూ రచయిత్రి చేసిన ప్రసంగం హృదయ విదారకం. "అన్నమయ్య దైవవశాన ఇద్దరు స్త్రీలకు భర్త అయినా ఏనాడూ వారిని బాధపెట్టినట్టుగానీ పొరపాటున కించపరచినట్లుగానీ అన్నమాచార్య జీవితచరిత్రలో ఎక్కడా చెప్పబడలేదు... తిమ్మక్క... తన భర్తగారి పేరు చెప్పుకున్నదంటే అన్నమయ్య తన స్త్రీపట్ల చూపిన అనుకూల్యత ... గమనించవచ్చు... అన్నమయ్య... మానవతావాది" (పే.293, 294). ఇటువంటి ప్రసంగాల వల్ల కనీసం ఇద్దరు భార్యలు లేకపోతే ఫెమినిస్టు కాలేడేమోనన్న అనుమానం కలుగుతుంది. ఎందుకో ఈపిచ్చి ప్రసంగం?

అన్నమయ్య కీర్తనలు పధ్నాలుగు వేలని ఒకసారి, పదిహేను వేలని మరోచోట విరుద్ధ ప్రసంగాలు కనిపిస్తాయి. భిన్న కాలాల్లో భిన్న సందర్భాల్లో రాసిన వ్యాసాలు కాబట్టి పునరుక్తులు మెండు. ఈ గ్రంథం చదివిన వారికి అన్నమయ్య సర్వలక్షణ సంపన్నుడయిన సర్వజ్ఞుడని చాటాలనే ప్రయత్నంలో అనేక విపరీత ప్రసంగాలు చేసిన రచయిత్రి నిజానికి ఆయనకు అపచారమే చేస్తున్నదనిపిస్తుంది. "ఆర్ద్ర పూరితంగా" (పే.408) రాసిన రాతలు ఇలాగే ఉంటాయి. వాటిలో పరిణతి కనిపించదు. భక్తులు చదివి తరించవచ్చు.

21.11.1993

# ఆధునిక మహాభారతము

– గుంటూరు శేషేంద్రశర్మ

ఈ గ్రంథానికి "నాదేశం నా ప్రజలు" అనే మరో పేరుందని ఒకటో పేజీలో ఉంది. అట్ట మీదగాని, ముందు పేజీల్లోగాని కవి నామధేయం లేదు. అదో ప్రత్యేకత. అట్టమీది ముఖచిత్రం ద్వారా కవిగారిని గుర్తించవచ్చు. దాన్ని ప్రఖ్యాత గ్రీకు చిత్రకారుడు గీశాడు. అదో విశిష్టత. 1985లో మొదటి ముద్రణ, 1992లో రెండో ముద్రణ వెలువడ్డాయి. 'తృతీయ సంస్కరణ' రూపంలో ఇది 1993లో ప్రచురితం. ఈ భారతాన్ని పదిపర్వాలుగా విభజించారు. వాటిని సర్గలుగా పునర్విభజించారు. 1972–85 మధ్యకాలంలో ఆయా పర్వాలను రచించారు. పర్వా నుక్రమణికకూ వాటి రచనాకాలాలకూ భేదముంది. మొదటిది ప్రజా పర్వము (1975), రెండోది సూర్యపర్వము (1974), మూడోది పశుపర్వము (1976), నాలుగోది ప్రవాహ పర్వము (1976), అయిదోది ఆర్మీపర్వము (1983), ఆరోది ప్రేమ పర్వము (1980), ఏడోది సముద్ర పర్వము (1979), ఎనిమిదోది జ్యోత్స్నాపర్వము (1979), తొమ్మిదోది మౌక్తిక పర్వము (1985), చివరిది మయూర పర్వము (1975). సర్గాంతాల్లో ప్రాచీన సంప్రదాయానుగుణంగా 'గద్య'లు రాశారు. వాటిలో రచనాకాలాన్ని సంస్కృత సమాసాల్తోనూ అరబిక్ అంకెల్తోనూ నిర్దేశించారు. కవిగారి బిరుదాలుగా "విప్లవ భాషా విధాత, కవి సేన మేనిఫెస్టో ప్రణీత" అనే వాటిని వక్కాణించారు. "పారాయణం చేయండి. ప్రజలకు వినిపించండి" అని గ్రంథాదిని పాఠకలోకాన్ని ప్రబోధించారు. గ్రంథపఠన ప్రయోజనాన్ని 'ఫలశ్రుతి'లో నిర్దేశించారు. గ్రంథాని కొక 'అవతారిక'ను కూడా ప్రసాదించారు. ఇది గ్రంథ భౌతిక లక్షణం.

శేషేంద్ర శర్మగారు సంప్రదాయ పద్ధతిలో సంస్కృత భాషాభ్యాసం చేశారు. జ్యోతిర్మంత్ర శాస్త్రాల్లో విశేష పాండిత్యం సంపాదించారు. తొలి దినాల్లో పద్యరచన చేసి తరవాత వచన కవితాధోరణిలో గ్రంథ నిర్మాణం చేశారు. బాల్య యౌవనదశల్లో కమ్యూనిస్టు కార్యకర్తలతో స్నేహసంబంధాలున్నా కాలక్రమాన విప్లవ భావాలు నచ్చినా విప్లవకారులు నచ్చక తమదైన ప్రత్యేక విప్లవ సిద్ధాంతాలను ఈ మహాభారతంలో ప్రతిపాదించారు. వారికి సంస్కృతాంధ్రేతర భాషా సాహిత్యాలతో విశేష పరిచయముంది. గ్రంథనామధేయాన్నీ పర్వాలపేర్లనూ గ్రాంథిక రూపాల్తో నిర్దేశించినా సంప్రదాయ వ్యాకరణాల కట్టుబాట్లను ఆయన ఖాతరు చేయలేదు. వ్యుత్పన్నుడు. ఉద్రేకి. భావచిత్రకల్పనలో సమర్థుడు. అయినా కవిత్వం "అల్పాక్షరముల ననల్పార్థరచన"గా ఉండాలనే తాతలనాటి సిద్ధాంతాలను ఆయన పాటించలేదు. నిజానికి కావ్య శాస్త్ర విషయాల్లో ఆయన సర్వతంత్ర సమర్థుడుగానే వ్యవహరిస్తాడు. అలాగని పాఠకులు తమంతట తామే గుర్తించగలరు.

తీవ్ర పదజాలంతో విశృంఖల భావజాలంతో తన కవితాత్మను, ఆదర్శాలను, అభి లాషలను, విద్వేషాలను నిస్సంకోచంగా వ్యక్తీకరించగల శేషేంద్ర శర్మగారి ప్రశస్తరచన ఇది. కావ్య రసాస్వాదనకు మధ్యవర్తుల అవసరం లేదు కాబట్టి సాహితీ ప్రియులు స్వయంగా చదివి ఆనందించవచ్చు.

1.5.1994

# జనవంశమ్

- గుంటూరు శేషేంద్ర శర్మ

జనవంశమ్ - అనే ఈ గ్రంథం 'కావ్యకృతి' వ్యాసభారతానికి హరివంశంలాగా ఈ కవే రచించిన 'ఆధునిక మహాభారతము' అనే తెలుగు గ్రంథానికి అనుబంధకావ్యం. అలాగని 'ఆధునిక మహాభారతస్య అనుబంధకావ్యమ్' అని సంస్కృతంలో విశదీకరించారు. వ్యాస వాల్మీకుల రచనలతో గ్రీకు మహాకవి హోమర్ ఇలియడ్‌తో ఈ గ్రంథానికి పోలిక. రచయిత నేటి తీరున తమ నామధేయాన్ని గ్రంథం అట్టమీదగాక గ్రంథాంత కాండాంత గద్యల్లో ప్రాచీనాంధ్ర కవి సంప్రదాయ పద్ధతిలో తెలియజెప్పారు. ముఖచిత్రం కవి ఎవరో నిర్దేశిస్తుంది. భారతీయ సంస్కృతికి ప్రతీకగా భగవద్గీతలోని "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనే శ్లోకాన్ని ప్రత్యేకించి గ్రంథంలో ఉద్ధరించినందువల్ల ఈ కావ్యం ఈయుగంలో ధర్మసంస్థాపన, శిష్టరక్షణ, దుష్టశిక్షణలు ధ్యేయంగా వెలువడిందని ధ్వని.

గ్రంథం ఋతుకాండ, భ్రమరకాండ, ప్రజాకాండ, చంపూకాండ, యుద్ధకాండ, చమత్కారికా కాండ - అనే ఆరు కాండలుగా విభక్తం. దీని కాధారగ్రంథమైన "ఆధునిక మహాభారతము" పర్వాలుగా విభక్తమైతే ఇది కాండాలుగా విభక్తం. ప్రచురణకాలం 1994 అయినా గ్రంథ భాగాలు భిన్నకాలాల్లో రాసినవే గాని, ఆధారగ్రంథంలోలాగా అనుబంధ కావ్యంలో కాలనిర్దేశం లేదు. ఇందులో పద్యం, గద్యం, గేయం వంటి భిన్న రూపాల్లో కవిత్వముంది. శర్మగారి ఆశుకవితాప్రసంగా లున్నాయి. సరససంభాషణశకలా లున్నాయి. ఆధార గ్రంథంలోని అనేక భాగాలను ఇందులో అక్కడక్కడ ఉద్ధరించారు. కవిగారు కవిత్వాన్ని శతఘ్నిగా (పే.170) ప్రయోగించిన వైనం చదివినవారికి తెలుస్తుంది.

రచనా కాలక్రమంలోగాని, కవితా విషయభేద నిరూపణతోగాని ఈ కావ్యం వెలువడి వుంటే శర్మగారి కవితా దర్శాలు, భావ విన్యాసాలు, రచనా ధోరణులు ఎలా క్రమపరిణామం పొంది ఇప్పటికిలా వికసించాయో గ్రహించటం సులభమయ్యేది. అయితే కావ్యాన్ని ఆసాంతం చదివిన మీదట పాఠకులు తమంతతామే రూపుకట్టించుకోగలరు. ఇతిహాస పఠన శ్రమకు తట్టుకోలేని సుకుమారులు ఈ కావ్యపఠనం ద్వారా పర్యాప్తమైన ఆనందం పొందవచ్చు. పేరు కనుబంధమేగాని ఆధునిక మహాభారతానికిది తాత్పర్యం వంటిది. మొదట ఈ కావ్య పఠనం చేసి, తరవాత ఆధారగ్రంథాన్ని చదివితే బాగుంటుంది. 'శేషేంద్రజాలం' కొంతకు కొంత భాసిస్తుంది.

3.7.1994

# ఎ హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్

- డాక్టర్ సాళ్వ కృష్ణమూర్తి

మదరాసులోని ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్ వారు కొన్ని పరిశోధన కార్యక్రమాలు చేపట్టి షు హికోసక, జి.జాన్ సామ్యూల్ అనే ఇద్దరు విద్వాంసుల సాధారణ సంపాదకత్వంలో

ఇప్పటికి చాలా గ్రంథాలు ప్రచురించారు. విదేశాల్లోని పాఠకుల ఉపయోగార్థం తెలుగు సాహిత్య చరిత్రను అయిదు సంపుటాల్లో ఇంగ్లీషులో రాయించి ప్రచురించాలని సంకల్పించారు. ఇది మొదటిసంపుటం. తొలి సంపుటంలో ఆంధ్రుల సామాజిక మత రాజకీయార్థిక చరిత్రలను కొంత విపులంగా డా. సాళ్వ కృష్ణమూర్తిగారిచేత రాయించి ప్రచురించారు. ఇది అనాదినుంచి నన్నయ యుగాంతం వరకు (క్రీ.శ. 1100 దాకా) ఆంధ్రుల ప్రాచీనతను, తెలుగు భాష పుట్టుక, పెరుగుదల వంటి అంశాలను సవిస్తరంగా చర్చించిన భాగం. తక్కిన నాలుగు సంపుటాల్లో బహుశా ఆధునిక సాహిత్య చరిత్రను కూడా చేర్చవచ్చు. ఇంత విస్తృతమైన ప్రణాళికతో ఆరంభించిన గ్రంథాన్ని మరిఎనిమిది వందల పేజీల్లో ఎలా ఇమడ్చగలుగుతారో వేచిచూడాలి.

ఈ సంపుటిలో పన్నెండు ప్రకరణాలున్నాయి. ఆయా విశేషాలను నిరూపించటానికి శాసనాధారాలను కూడా ప్రచురించారు. గ్రంథం ఇంగ్లీషులో ఉంది కాబట్టి వాటికి ఆంగ్లానువాదా లివ్వటం తప్పనిసరి అయింది. గ్రంథం విస్తరించింది. ప్రాచీనాంధ్ర భూగోళం, ప్రాచీనతను నిరూపించే ప్రస్తావనలు, దేశం జాతి మతం భాష వగైరాల ప్రాచీన స్థితి, ద్రవిడ భాషల్లో తెలుగు స్థానం, ప్రాచీనాంధ్ర శాసనాల అనుక్రమణిక, ప్రాఙ్నన్నయ యుగంలోని ఛందోరీతులు, ప్రాఙ్నన్నయ యుగకవుల పరిచయం, యుగంలోని సాహిత్య పరిస్థితి మొదలైన అనేకాంశా లిందులో చోటుచేసుకున్నాయి. ఆంధ్రుల మీద జైన బౌద్ధమతాల ప్రభావానికి పెద్దపీట వేశారు. ప్రాచీనాంధ్ర భాషా చరిత్రకు సంబంధించిన పాపపుణ్యాలకు ఈ సమీక్షాకర్తనే బాధ్యుణ్ణి చేశారు కాబట్టి, విషయ వివరణలోని గుణదోషాలకు మాత్రమే గ్రంథ రచయితలు బాధ్యులు.

కన్నడ కవిత్రయంలోని మొదటి ఇద్దరైన పంప పొన్నలు తెలుగువాళ్లేనని (పే. 37), శతక రచన, మన చంపూ కావ్యాల్లోని ఇష్టదేవతా ప్రార్థన వంటి వాటికి (పే. 36, 37) కన్నడిగులే ఆద్యులని, మొదటి శాతవాహన ప్రభువు సుముకుడే ఆంధ్రవిష్ణువు తండ్రి అయిన సుచంద్రుడని (పే. 57), 'లంచం' అనే మాట తెలుగులోనే పుట్టిందని (పే. 72), నన్నయభట్టు గొప్ప శాస్త్రజ్ఞుడని (పే. 192, 193) ఈ గ్రంథం ద్వారా తెలుసుకోవచ్చు. 'లంచాఽ లంచయో ర్మధ్యే' అనే శ్లోకం బహుశా తెలుగువాడు రాసిందేమో తెలీదు. నన్నయభట్టు కాంతి వేగం సెకనుకు 1,70,454 మైళ్లని గురికి బెత్తెడెడంగా చెప్పగలిగాడని ప్రశంసిస్తూ (పే. 192), తరవాతి పేరాలోనే భూమికీ సూర్యుడికీ మధ్యగల దూరం రమారమి 9 లక్షల మైళ్ల పైగా ఉంటుందని తప్పుగా చెప్పాడని కూడా రాశారు! ఇది నన్నయ శాస్త్రజ్ఞానానికి ఎలాంటి నిదర్శనమో గమనించినట్లు లేదు. ఇలా అనేకం. 'ష్ట' అనే 'ప్రత్యేక వర్ణం' ప్రాచీనాంధ్రంలో ఉందని (పే. 108) ఎలా నిర్ణయానికి వచ్చారో తెలీదు.

మత విషయాలకూ, ఆంధ్రుల ప్రాచీనత్వ నిరూపణకూ అత్యంత ప్రాధాన్యమిచ్చిన రచన ఇది. భాషాశాస్త్ర విధానాలను పాటించకుండానే సత్తాసైలోని తెలుగు మాటలను బయటికి తీశారు (పే. 72-76). తెలుగు సంస్కృతాదిపదాలను వాటిలోని ధ్వనులనూ స్పష్టపరచటానికి వాడిన ప్రత్యేక సంకేతాలు అచ్చు పొరపాట్లుగా మిగిలిపోయిన సందర్భాలనేకం. 'colophon' అనే మాటకు చివర రచయిత చేర్చిన 'e' ఇంగ్లీషు నిఘంటువుల్లో కనిపించటంలేదు. చిన్న చిన్న వివరాల మీద చూపిన శ్రద్ధ స్థూలపరిచయ మపేక్షించే ఆంధ్రేతర పాఠకులకు ఎంత

ఉపయోగకరమో గమనించలేదు. తరవాతి సంచికల్లో ఇటువంటి లోపాలను పరిహరించి పఠనీయత పెంచుతారని ఆపేక్షించవచ్చు. ఇంగ్లీషులో ఇలాంటి గ్రంథం లేనందువల్ల ఇదేశరణ్యం.

31.8.1994

## చైతన్య కవిత (1993) ప్రత్యేక సంచిక

**సంపాదకులు : తంగిరాల సుబ్బారావు, ఆర్వీయస్ సుందరం**

ఇదొక సాహితీ పత్రిక (?). దీని సంపాదకులు జానపద విజ్ఞానఖనులు. పత్రికా విషయం సంప్రదాయ కవిత. ఇది సాధారణంగా షాణ్మాసికం. ఈ పర్యాయం సాంవత్సరికం. అందులోనూ ఇది ప్రత్యేక సంచిక. పేరు చైతన్య కవిత. ఇందులోని చైతన్యం శేషేంద్రులది. కవిత విశ్వనాథ వారిది. ఈ రెంటికీ సంధానకర్తలు సంపాదకులు. దీని ప్రత్యేకత గురుకుల క్లిష్టులయిన మల్లంపల్లి శరభయ్యగారి సంస్కృతాంధ్ర కవితల ప్రచురణ. దీనికి కృతిపతి ఉన్నారు. విశ్వనాథ వారి 'భ్రష్టయోగి' ఖండకావ్య కృతిపతులు కూడా వారే (పే. VII). వారి మీది ప్రస్తుతులూ అంకిత పద్యాలూ వారి ఫోటో కూడా ఇందులో ఉన్నాయి. దాత లున్నారు. వారికీ ఇటువంటి మర్యాద జరిగింది. ప్రత్యేకితులైన శరభయ్యగారు శేషేంద్రులవారిని ప్రశంసించిన శ్లోకా లున్నాయి. వారు శరభయ్యగారిని గద్యపద్యాదుల్లో కీర్తించిన విశేషా లున్నాయి. వారి విశ్వనాథ ప్రశంస కూడా ఉంది. పూరకాలుగా (fillers) విశ్వనాథవారి పద్యాలున్నాయి; తప్పితే చాలావరకు శేషేంద్రులవి.

శరభయ్యగారు విశ్వనాథవారిపై తమకున్న ప్రత్యయాన్ని శపథంగా మలిచి రాసిన శ్లోకార్ధం అట్టమీదా పత్రికలోనూ కనిపిస్తుంది. దాన్ని విశ్వనాథవారు పూరించిన వైనంకూడా అలాగే దర్శనమిస్తుంది. అందులో ఒక చమత్కారముం దన్నారు. శరభయ్యగారికి నత్తివల్ల కకారం పలకదని విశ్వనాథవారు 'వేళాకోళం చేయాలనే ఉద్దేశంతో' (పే.4) తమ శ్లోకార్ధంలో అయిదుసార్లు కకారావృత్తి చేశారట! పాపం. శరభయ్యగారు పౌరుషనామంగా పెట్టుకున్న 'పావకి' లోనే ఒక కకారముంది. వారి ప్రతిజ్ఞాశ్లోకార్ధంలో మరి నాలుగు కకారాలున్నాయి. అందులో లేని నత్తీ, ఉన్న కకారావృత్తీ విశేషాలు కావన్నమాట! ఈ ప్రసంగం చేసిన సంపాదకుల చమత్కృతిభావన సారస్యం అంజలించదగింది. ఈమాట లెవరికి గౌరవాపాదకాలో చెప్పలేం.

శరభయ్యగారు వైయాకరణఖసూచులు. వారు చేయలేని, కలలో కూడా క్షమించలేని ఛందశ్శబ్ద దోషాలన్నిటినీ ఈ సంచిక ప్రత్యేకంగా ప్రదర్శిస్తుంది. పూర్వసంచికలో తప్పులు మిగిల్చినవారు 'మాట తప్పినందుకు' (పే. VI) కంటకించుకున్న సంపాదకులు, తమ లోపం లేకుండా శరభయ్యగారి రచనలను ప్రత్యేకించి నిర్లక్ష్యం చేసినట్లుంది. సంప్రదాయ (కవితా) పరిరక్షణ ఎంత కష్టసాధ్యమో ఇప్పటికయినా సంపాదకులు గ్రహించగలిగితే అది పదివేలు. వైశ్వనాథ సాత్యనారాయణీయమో శేషేంద్రజాలమో కాని సాహిత్యం ఉంటుందన్న అనుమానం కలిగించ గలిగినా ఈ సంచికను అభిమానించవచ్చు. మూడు నాలుగు భాగాలుగా విభజించి ప్రచురించిన దీన్ని పత్రిక అనటంకన్నా గ్రంథ మనటం బాగుంటుంది. సంపాదకు లిటువంటి సంకుచిత పరిధిగల 'పత్రిక'ను నిర్వహించే కన్నా శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి యథాశక్తి వ్యాఖ్యానమో మహాభాష్యమో రచించి ప్రచురిస్తే అటు విశ్వనాథకు, ఇటు సంప్రదాయ సాహితికి తిరుగులేని

సేవ చేసినవారవుతారు. అందుకు కావలసిన చైతన్యం వారికి, అదృష్టం సాహితికి పట్టుందా అనేది శేషప్రశ్న. విశ్వనాథ శరభయ్యగారల చిత్రపటాల కోసమైనా కొనదగిన గ్రంథమిది. బొమ్మలు బాగున్నాయి.

9.10.1994

# కన్యాశుల్క నాటక కళ

**- సర్దేశాయి తిరుమల రావు**

**ఈ** గ్రంథం రెండో ముద్రణలో సరళ గ్రాంథికం నుంచి శిష్టవ్యావహారికంలోకి మారి విశాలాంధ్ర వారి ప్రచురణగా ఈ యేడు వెలువడింది. మొదటి ముద్రణ గ్రంథకర్తే ప్రచురించారు. రచయిత మాతృభాష కన్నడమయినా, వృత్తి తైలసాంకేతిక పరిశోధన మయినా కన్యాశుల్కంమీద ప్రామాణిక గ్రంథంగా దీన్ని వెలయించటం చెప్పుకోదగ్గ విషయం. గ్రంథంలో 'నాటకం, నాయికా నాయకులు, గిరీశం, మధురవాణి, సంఘ సంస్కరణ, హాస్యం, మానవత' అనే ఏడు ప్రకరణాలే కాక మూడు అనుబంధాలున్నాయి. ప్రకరణాంతాల్లో వివరణాత్మకమైన అధస్సూచిక లున్నాయి.

పుస్తకం ఆసాంతం చదివిస్తుంది. చదువుతున్నంతసేపూ రచయిత బహుభాషా పాండిత్యం ఆకట్టుకుంటుంది. ప్రపంచ సాహిత్యాలతో ఆయనకున్న ప్రగాఢ పరిచయం, భిన్న సంస్కృతులను తులనాత్మకంగా పరిశీలించి తనదైన సిద్ధాంతాన్ని సతార్కికంగా, సమన్వయపూర్వకంగా ప్రతిపాదించటం, వాదపటిమ మొదలైన విశేష గుణాలు సమ్మోహపరుస్తాయి. పరమాన్నంలో తెడ్డులాగా వృత్తిరీత్యా సాహిత్యవిమర్శకు లయినవారు ఆయాసిద్ధాంతాలనూ అభిప్రాయాలనూ ఎత్తిరాస్తూ స్వీయాభిప్రాయం బయటపడకుండా పడికట్టు రాళ్ళవంటి పారిభాషిక పదాలను వాడుతున్న కాలంలో, భిన్నాభిప్రాయాల సామ్యవైషమ్యాలను మౌలికంగా పరిశీలించిన ఇటువంటి రచనలు ఆలోచనలు రేకెత్తిస్తాయి. చదువుతున్నంతకాలం తెలుగుపండితుల ఆలోచనాపరిధి ఎంత అల్పమో, ఎంత సంకుచితమో తెలుస్తూనే ఉంటుంది.

అక్కడక్కడ చాలా సంక్షేపంగా సాగిన వచనరచన పరిశోధన విషయాన్ని సూత్రీకరించిన ట్లనిపిస్తుంది. ఉదాహరణకు "అక్షిగోచరం కావలసిన దృశ్యకావ్యంలో శ్రవ్యగోచరమైన శబ్దమే ముఖ్యం (పే. 17), దృష్టికంటే వాక్కే మానవునికి స్థిరమైనదని అనిపిస్తున్నది (పే.18), కాముకులకు ఆనందమే వ్రతం. ధార్మికులకు వ్రతమే ఆనందం (పే.29), సంగీతంలో జంత్వంశ ఉంది. 'సరిగమపదని' అనే స్వరనామకరణంలో ఇది స్పష్టం (పే.100), పురుషాధిక్యం గల సమాజంలో వరకట్నం సహజమైన ఆర్థికాంశ (పే. 171), నిజానికి కవిచౌడప్ప మొట్టమొదటి 'దిగంబర' కవి (పే.189)" - వంటి వాక్యాలు రచయిత నిశితపరిశీలనలకు నిదర్శనాలు. గిరీశం రాసిన వెకిలి ఉత్తరానికి గ్రాంథికం వాడిన గురజాడ లుబ్ధావధానికన్నా గ్రాంథిక భాషనే ఎక్కువగా నవ్వులపాలు చేస్తుందని, సంప్రదాయ నాటకకర్తలు పాత్రోచితభాష పేరిట వ్యావహారికం వాడినందుకు ప్రతిగా ఇటువంటి ప్రయోగం చేశాడని (పే.97, 98) గ్రంథకర్త గుర్తించారు. ఇంగ్లీషులోని ట్రాజెడీ అనే మాటకు విషాద/ విషాదాంత నాటకాలనే అనువాదం చెల్లుబడి అవుతుండగా, రచయిత వాటిని 'త్రాసదాలు' అన్నారు. కాల్ గరల్సును పిలుపు పిల్లలని (పే. 88), కాఫ్ తాను దూడప్రేముడి (పే. 128) అని, రెడ్‌లైట్ డిస్ట్రిక్టును రక్తదీప

ప్రాంతమని (పే. 138), బ్లూప్రింటును నీలిముద్రణ (పే. 202) అని అనువదించటం కొంత ఎబ్బెట్టుగా ఉంది. ఇంతమంచి గ్రంథంలో అచ్చుతప్పులు దొర్లటం దురదృష్టకరం.

గురజాడ అభిమానులేగాక ఆయన్నూ ఆయన రచనల్నీ ద్వేషించేవాళ్ళుకూడా తప్పక చదవవలసిన, చదవదగ్గ ఉత్తమ రచన ఇది. భిన్నశాస్త్రాలతో ప్రపంచ సాహిత్యాలతో ప్రగాఢ పరిచయమున్న విమర్శకులు ఎంత చక్కని రచనలు చేయగలరో తెలుసుకోడానికి, తమకు ఒరవడిగా పెట్టుకోడానికి సాహితీ పరిశోధకులు చదివితీరవలసిన మంచి పుస్తకం.

13.11.1994

## చాసో కథలు

**- చాగంటి సోమయాజులు**

**చా**గంటి సోమయాజులు (1915-94) గారి కథలు చాసోకథ లనే పేరున 1968లో వెలువడ్డాయి. అది మొదటి కూర్పు. రెండో కూర్పు 1983లో వెలుగుచూసింది. అందులో తొలికూర్పులోని 23 కథలకు మరి 17 చేర్చారు. ఈ రెండోకూర్పు కిది దశాబ్ద కాలంలో మూడో ముద్రణ. ఇందులోని 'బుగ్గిబూడిదమ్మ' అనే 34వ కథకు విషయ సూచికలో స్థానం లభించలేదు! "ఏలూ రెళ్ళాలి, ఫారిన్ అబ్బాయి, పోనీ తిను" అనే మూడు కథలు మొదటిసారి ఎప్పుడు అచ్చయినాయో తెలియదు. మిగిలినవి ఏ పత్రికలో ఎప్పుడు ప్రచురితమైనాయో విషయసూచికలోనే సూచించారు. ఈ సంపుటిలోని రచనలు 1942-79 సంవత్సరాల మధ్యకాలంలో వివిధ పత్రికల్లో విడిగా వచ్చాయి. రచనాకాలాలను పరీక్షిస్తే 1946-48 మధ్య ఒక్క సంవత్సరం, 1948-52ల మధ్య నాలుగేళ్లు, 1954-68ల మధ్య పద్నాలుగు సంవత్సరాలు, 1969-74ల మధ్య అయిదేళ్లు - వెరశి 24 సంవత్సరాలు ఆయన రచనలు వెలువడలేదని తెలుస్తుంది. ఇంత విరామంతో కథా రచనలు చేసిన మరో తెలుగుకథకు లెవరయినా ఉన్నారేమో తెలియదు. చాసో మొదటి కథలు 'చిన్నాజీ' 1941లో వచ్చింది. స్వీయరచనలను దాచుకోవటం, కనీసం ఎప్పుడెక్కడ ప్రచురితమైనాయో గుర్తయినా రాసుకోవటం, వాటికి ప్రచార ప్రసిద్ధులు సంపాదించటానికి ప్రయత్నించటం, తానో గొప్ప కథకుడని లోకానికి తెలియాలని అపేక్షించటం, వాటిని మిత్రుల కయినా వినిపించి మెప్పు సంపాదించాలని తాపత్రయపడటం వంటి లక్షణాల్లో ఏ ఒక్కటీ లేని ఉత్తమ కథకుల్లో చాగంటి సోమయాజులు (చాసో)గా రొకరు. గురజాడ, చింతా దీక్షితుల తరాల తరవాత మూడో తరం తెలుగు కథకుల్లో అగ్రగణ్యులయిన చాసోగారి నిర్మమత్వ, నిర్మోహబుద్ధులకు ఇంతకన్నా నిదర్శన లక్కరలేదు. తెలుగు కవుల్లో అబ్బూరి రామకృష్ణరావు గారిలాగా తెలుగు కథకుల్లో గ్రంథపఠనానికి ప్రాముఖ్యమిచ్చి స్వీయరచనలను కూడా పోగొట్టుకొన్న కొద్దిమంది రచయితల్లో చాసోగా రొకరు. అబ్బూరి పద్యగేయ కవితలకు ప్రాధాన్యమిచ్చి తాము రాసిన కథలనూ తదితర వచనరచనలనూ పట్టించుకోనట్లే, చాసోగారు 1941 నుంచి ఆంధ్రాంగ్ల భాషల్లో రాసిన కవితలను విస్మరించి, కథలకు అంతో ఇంతో ముఖ్యత్వ మిచ్చినా వాటిని భద్రపరచుకో-- ...కోలేదు. ఈ సంపుటిలో ఆయన 1942-79 సంవత్సరాల మధ్య గడచిన 37 సంవత్సరాల కాలంలో తాముగా ఎంపిక చేసిన 40 కథలున్నాయి. 'గంగిగోవుపాలు గంటెడైనను చాలు'నన్నట్లు ఆయన కీర్తిప్రతిష్ఠల కోసం,

బిరుదులకోసం పదవుల కోసం కాక, మనస్తృప్తి కోసం, తన మనోవేదనలను సామాజిక రుగ్మతలను బయటపెట్టాలనే ఆకాంక్షను, ప్రకృతిలో మానవ ప్రవృత్తులలో భిన్న కాలాల్లో సామాజిక రాజకీయార్థిక పరిస్థితుల్లో తన గుండెను కదిలించిన విషయాలను పరిశీలన దృష్టితో వ్యక్తీకరించటం కోసమే రాశారనిపిస్తుంది. ఆయన ప్రచురించిన 'థామస్ వ్యాసా'లలో (1943) కనిపించే తీవ్రవాదం ఈ కథల్లో ఎక్కడా కనిపించదు. సొంత ఆస్తి పోయినప్పుడు ఓదార్చవచ్చిన వ్యక్తులను తానే ఓదార్చి మానవ జీవితంలో ధన సంపాదన కన్నా ఉన్నత విషయాలున్నాయని నచ్చ చెప్పి పంపిన నిర్మోహభావం ఈ కథల్లో కనిపిస్తుంది, ఆయన వ్యక్తిత్వంలో లాగానే.

చాసోగారు తమ రచనల్లో కాల్పనికత్వానికి చోటివ్వలేదు. పలాయనవాదాన్ని నెత్తికెత్తుకో లేదు. తన చుట్టూ ఉన్న సమాజంలోని భిన్న స్తరాలకు చెందిన వ్యక్తుల బలహీనతలను, దుర్మార్గాలను, బాధలను, మానసిక సంక్షోభాలను, అభ్యుదయ భావాలను, వికారాలను, అవినీతిని వాస్తవిక దృష్టితో చిత్రీకరించినట్లే చరాచర భూతప్రపంచంలోని పక్షుల కష్టసుఖాలను (చూ. మాతృధర్మం) అద్భుతంగా సులభభాషలో (సూటిగా), పారిభాషిక పదరహితంగా వెలిబుచ్చారు. కథల్లో కావలసినంత వైవిధ్యముంది. కళింగ మాండలిక పదాలు పుష్కలంగా కనిపిస్తాయి. ఉత్తమరచన లెలా ఉంటాయో తెలుసుకోదలచిన సాహితీపరులందరూ చదివితీరవలసిన, చదివి తెలుసుకోవలసిన గ్రంథ మిది.

11.12.1994

## మాధవనిదానము

**అనువాద వ్యాఖ్యానం : పండిత డి. గోపాలాచార్యులు**

**సు**ప్రసిద్ధ ఆయుర్వేద విద్వాంసులూ చికిత్సకులూ అయిన దివి గోపాలాచార్యులు గారు (1872–1920) తామే స్థాపించిన ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలో మొదటిదిగా 1911లో ప్రచురించిన ఈ గ్రంథం, వారి అనంతరం రెండు ముద్రణలు పొందింది. తృతీయ ముద్రణ కిది ప్రాచీ పబ్లికేషన్సువారు వెలువరించిన పునర్ముద్రణ రూపం. గోపాలాచార్యులవారు మదరాసులో తెలుగువారికి గౌరవమర్యాదలు చేకూర్చిన పండితులూ దాతలూ కూడా. చరక సుశ్రుత సంహితలనేగాక అనేకాయుర్వేద గ్రంథాలను వారు అనువదించి తెలుగులో శాస్త్ర సాహిత్యానికి ఎంతో తోడ్పడ్డారు. ప్రాచీనాయుర్వేదగ్రంథాల్లో బహుళ ప్రచారం పొందిన మాధవనినాదానికి 'నిదానదీపిక' అనే ఆంధ్ర వ్యాఖ్యానరూపంలో ఈ గ్రంథం వెలువడింది. మూలశ్లోకాలనూ వాటికి తెలుగుతాత్పర్యాలనూ సమకూర్చిన ఈ రచనలో ఆయా సందర్భాల్లో ఇతర గ్రంథాల అభిప్రాయ విశేషాలను కూడా చూడవచ్చు.

రోగ స్వభావ లక్షణాలనేగాక అందుకు పూర్వ రూపంలో ఉన్న కారణాలను కూడా ఈ గ్రంథం నిరూపిస్తుంది. కాయచికిత్స, భూతవిద్య, శల్యతంత్రం, శాలాక్య తంత్రం, కౌమార భృత్యం, అగదతంత్రం అనే ఆరు ప్రధాన విభాగాల్లో రోగనిదానం (అంటే గుర్తించటం) దీని ద్వారా తెలుసుకోవచ్చు. మాధవ నిదానానికి అనేక వ్యాఖ్యానాలున్నాయి. మూలగ్రంథంలోని పాఠభేద ప్రక్షిప్తాలతో సహా ఆయా వ్యాఖ్యానాల్లోని వివరణలను తెలుగులో ఒకచోట దివివారి వ్యాఖ్యానం నిరూపిస్తుంది. సంస్కృత భాషాజ్ఞానం తగ్గిపోతున్న కాలంలో, వైద్యశాస్త్రంలోని

సాంకేతిక పదాల అర్థజ్ఞానం తక్కువైపోతున్న కాలంలో ఈ రచన అవసర మనిపించిందన్న (పే.xii) వ్యాఖ్యాత తన "భాషాశైలి మొదలగువానిలో పెక్కు దోషము లుండుననుటకు సంశయము లేదు" (అదే.) అని సవినయంగా అంగీకరించారు. ఇప్పటి పరిస్థితులలో ఆ దోషాలు లేకపోయినా ఈ గ్రంథం ఎందరు ఆయుర్వేద వైద్యులకు కొరుకుడుపడుతుందో ఊహించటమూ అసాధ్యమే. మూలగ్రంథమూ వ్యాఖ్యానమూ ప్రామాణిక రచనలని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఈనాటి ఇంగ్లీషు వైద్య విధానాలకు రకరకాల 'పరీక్షలు' నిర్వహించే యంత్రసాధనా లున్నాయి. అవి నిరూపించిన లక్షణాలమీద ఆధారపడి వైద్యం జరుగుతున్నది. ఇటువంటి సౌకర్యాలు లేని కాలంలో ఆయుర్వేద వైద్యులు నాడీపరీక్ష ద్వారా రోగ లక్షణాలను, స్వభావాలనూ నిర్ణయించుకొనే సమయంలో మాధవ నిదానం బహువిధాల వారికి తోడ్పడేది. ఈ ప్రశస్త గ్రంథాన్ని శ్రమపడి అర్థం చేసుకొని విద్యార్థులకు బోధించవలసిన బాధ్యత ఆయుర్వేద పాఠశాలలమీదా, కళాశాలల మీదా ఉంది. ఆ పద్ధతిలో వైద్యం చేస్తున్న వారికిది అవశ్యపఠనీయ గ్రంథం. ఆ శాస్త్రాభిమాను లీగ్రంథాన్ని ఆదరించటం అవసరం.

18.6.1995

## తెలుగు సామెతలు

– డాక్టర్ టి.వి. రామనరసయ్య

ఇది తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో వెలువడిన ఉస్మానియా విశ్వ విద్యాలయ సిద్ధాంత గ్రంథం. ఇది "ఒక సవిమర్శక పరిశీలనము" అని గ్రంథకర్త అట్టమీదనే కుండలీకరించి ప్రకటించారు. ఇందులో అనుబంధంతో సహా పది ప్రకరణాలున్నాయి. అర్ధ గ్రాంథికంలో రచన కొనసాగింది. పరిశోధన గ్రంథం కాబట్టి సహజంగానే ఇతరుల అభి ప్రాయాలను ఎత్తి రాయక తప్పింది కాదు. 'సామెత' అన్న మాటకు పర్యాయవాచి శబ్దాలని రచయిత భావించిన ఆంధ్రాంగ్ల పదాలను ఆయా రచయితలు ఎన్నివిధాల నిర్వచించారో ఎత్తి రాశారు, తెలుగు అనువాదాల్తో సహా. ఆ మాట 15వ శతాబ్దినాటి వరాహపురాణంలో మొదటిసారి కనిపిస్తుందని (పే.3), "........ తెలుగు భాషలో సామెతలు క్రీ.శ. 11వ శతాబ్దికి ముందే వ్యాప్తిలో ఉండెననుటకు సందేహం లేదు" (పే.26) నిష్కర్ష చేశారు గాని ప్రాఙ్నన్నయ సాహిత్యంనుంచి ఒక్క సామెతనయినా ప్రదర్శించలేదు.

భారత భాగవతాదుల్లోని అర్థాంతరన్యాస దృష్టాంతాదులను, నుడికారాలను సామెతల కిందనే పరిగణించటం, ఇదొక అపూర్వ పరిశోధనమని ఆచార్యవర్యులు కీర్తించటం దిగ్భ్రాంతిని కలిగిస్తాయి. ఉదాహరణకు "గణపతియ చువ్వభార్యకు (పే.32), సత్సంగమున నగు సద్గుణముల్ (పే.40), మాట దిరుగలేరు మానధనులు (పే.53), గోవుతో పెరిగెడు కొమ్ములట్లు (పే.77), సరిత్తులు సాగరంబున తెఱంగున (పే.89), వాడు దరియించు సంసారవార్ధి (పే.135), ఆసపజ్జం బోవమి సుఖకరంబు (పే.157), క్షీరోదకగతి (పే.165), క్షణక్షణముల్ జవరాంద్ర చిత్తముల్ (పే.178), రక్కెసతాల్మి (పే.193)" మొదలైనవి సామెత లని పరిశోధకప్రకాండుల

నిర్ణయం! అలాగే "బావా పేరూ బంతిపువ్వు - నా పేరు సన్నజాజులు (పే. 211), నిమ్మపండులవలె రొమ్ములున్నాయి సామీ, రొమ్ము లెవ్వరి చేతి కిత్తూర జాణా" (పే. 229) వంటివి 'జానపద' సాహిత్యంలోని సామెతలని నిరూపించారు. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. వీటినిబట్టి సామెతల గురించి పరిశోధకులకున్న అవగాహన ఎటువంటిదో, నేటి పరిశోధనల తీరేమిటో పాఠకులే గ్రహించవచ్చు.

ఏవి సామెతలు కావో గ్రహించటానికి గాని, దోషప్రకరణానికి నిదర్శనలకోసం గాని ఈ మహత్తర పరిశోధనను కొని చదివి తరించెదరు గాక!

30.7.1995

## బారిష్టర్ పార్వతీశం

**- మొక్కపాటి నరసింహశాస్త్రి**

**మొ**క్కపాటి నరసింహశాస్త్రి గారి (1892-1973) నవల బారిష్టర్ పార్వతీశం మొదటిసారి 1924లో వెలుగు చూసింది. అది ప్రథమభాగ మనాలి. 1971లో నార్ల వేంకటేశ్వరరావుగారి ప్రోత్సాహ ఫలితంగా రచించిన రెండు మూడు భాగాలు 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో ధారావాహికంగా వెలువడ్డాయి. 1995లో పుస్తక రూపంలో వచ్చిన మొత్తం గ్రంథాని కిది బాపు చిత్రాలతో కూడిన సంయుక్త తృతీయ ముద్రణ రూపం. ఈ ఇరవయ్యో శతాబ్దిలో తెలుగు సాహిత్యంలో వెలసిన స్వతంత్ర పాత్రల్లో 'శుద్ధ హాస్య' ప్రతీకగా పేరు తెచ్చుకున్న పార్వతీశ మొకడు. రెండు మూడు భాగాల్లోని కథాంశాలు ముద్రణకు పూర్వమే రేడియో ద్వారా లోకానికి తెలిశాయి. గ్రంథకర్తగాని, ప్రచురణ కర్తలుగాని ఎందుచేతనో సినిమా రూపంలో వచ్చిన బారిష్టర్ పార్వతీశం సంగతిని మాట మాత్రంగా నైనా ప్రస్తావించలేదు! అమాయకత్వానికి పార్వతీశం ప్రతిరూపంగా పేరు తెచ్చుకొన్నాడు. మొదటిభాగం వెలువడ్డ తరవాత అప్పటి పత్రికలు ('భారతి' కూడా) ఈ గ్రంథానికి సముచిత స్థానం ఇవ్వలేదని గ్రంథకర్త నొచ్చుకున్నారు. ఆయన ప్రస్తుతినే గాని విమర్శను సహించలేకపోయా రనటానికి ఆయన 'తుదిపలుకులు' సాక్ష్యమిస్తాయి. రచయిత దృష్టిలో కందుకూరి, చిలకమర్తి, పానుగంటి, గురజాడ వగైరాల రచనలు 'హాస్యమనుకోడానికి... అంత వీలు కానివి' (పే. 129). చింతా దీక్షితులు, మొక్కపాటి - ఇద్దరే 'శుద్ధ హాస్య రచయిత' లనటం, తక్కిన వారు కాదనటం ఎంత సమంజసమో పాఠకులూ విమర్శకులూ తేల్చుకోవలసిన సంగతి.

బారిష్టర్ పార్వతీశం కాలానుగుణంగా ఎన్నో విధాల ఎదిగినందువల్లనూ, మొదటి భాగం రాసిన తరవాత- ఇంచుమించు యాభై సంవత్సరాల తరవాత- రెండో భాగం వెలుగు చూసినందువల్లనూ రానురాను గ్రంథంలో హాస్యం తక్కువయిందని గ్రంథకర్తే గమనించి అంగీకరించారు. అయినా సరే. ఆధునికాంధ్ర సాహిత్యంలో హాస్య రచనగా ఈ నవల, హాస్యపాత్రగా పార్వతీశమూ సముచిత స్థానం సంపాదించుకోగలగటం విశేషం. అంతకన్నా విశేషం ఇంతకాలం గడచిన తరవాత పూర్తి అయిన రచనలో చెప్పుకోదగినంత భాషా శైలీ భేదం లేకుండా రాయటం. హాస్యమున్నా లేకపోయినా రచన చదివిస్తుంది. గ్రంథంలో మొదటి

(28.7.1914 నుంచి 11.11.1918 దాకా), రెండో (1.9.39 నుంచి 8.5.1945 – జర్మనీ విషయంలో / 14.8.1945 – జపాన్ విషయంలో) ప్రపంచయుద్ధాల మధ్యకాలానికి సంబంధించిన అనేక రాజకీయార్థిక విషయాల ప్రస్తావన వస్తుంది. గ్రంథ గౌరవాన్ని పెంచే విశిష్టతల్లో ఈ ప్రత్యేకత ఒకటి. భారతీయ సంప్రదాయాలనూ పాశ్చాత్య జీవన విధానాలనూ. పోల్చి, సమన్వయించి చెప్పే సంగతులెన్నో ఇందులో ఉన్నాయి.

మొదటి భాగం రచనా కాలంలో టెంపస్ చేతి గడియారం వెల రూ.2.50; సేఫ్టీ రేజరు ఖరీదు రూ.1.25 (పే.74). రిజిస్ట్రారాఫీసులో కేవలం పదిరూపాయల లంచంతోనే పనులు నెరవేరేవి (పే.77). మారని చిల్లిగవ్వ లుండేవి (పే.379) కథాంతకాలంలో కూడా. అయిదు రోజుల పెళ్లిళ్లు జరుగుతుండేవి (పే.379; 447–50). తొలిభాగం నాటికి గుమాస్తా జీతం రూ.15 మాత్రం (పే.81). కథాకాలంలో మూకీ చిత్రాలు నడుస్తుండేవి (పే.156, 255). రష్యాలో జార్ ప్రభుత్వ పతనం (పే.276), బ్రిటిష్ ప్రధాని ఆస్క్విత్ యుద్ధ సన్నాహాలు (అదే), ఎడింబరోలో సరోజినీ నాయుడు (పే.225), ఆనందకుమారస్వామి (పే.226), దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (పే.227 మొదలైనవి) వంటి మహనీయుల ప్రసంగాల ప్రస్తావన ఉంది. అప్పటికే బలిజేపల్లి లక్ష్మీకాంతకవి సత్యహరిశ్చంద్ర (1912) నాటకం పేరు ప్రఖ్యాతులు సాధించింది. పార్వతీశం బారిష్టరు కాకముందే బందరు నుంచి వచ్చిన బోడె నారాయణరావుగారు (పే.43), బిపిన్ చంద్ర పాల్ (పే.47) వంటి దేశభక్తుల ప్రభావ మతని మీద పడ్డది. బారిష్టరై తిరిగి వచ్చి మదరాసులో ప్రాక్టీసు పెట్టదలచే సమయానికి టంగుటూరి ప్రకాశం పంతులు ఆ రంగంలో వెలిగిపోతున్నాడు. పార్వతీశం రాజకీయరంగ ప్రవేశ సమయంలో దువ్వూరి సుబ్బమ్మగారు మార్గదర్శకులుగా ఉన్నారు. లాయడ్ జార్జి (పే. 296), ప్రకాశం పంతులు (పే.496) విసిరిన విసుర్లు కొన్ని గ్రంథస్థ మైనాయి. ఒకనాటి రాజకీయ సామాజిక చరిత్రకు గ్రంథం అద్దం పడుతుంది.

గ్రంథంలోని కొన్ని ప్రసంగాలు వివాదాస్పదమయినవి. ఉదాహరణకు "గిరీశాన్ని సహించ లేము. కానీ పార్వతీశాన్ని విడిచి ఉండలేము" (పే.16–17) అనే గ్రంథకర్త అభిప్రాయాన్ని సాహితీ విమర్శకులు పరిశీలించవలసి వుంది. అలాగే అల్లూరి సీతారామరాజుగారి పితూరీకి చాలాకాలం ముందే ఎడింబరోలో ఉన్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు "పదిమందినీ కూడ గట్టుకుని చిన్నచిన్న పట్టణాల్లో పోలీసు ఠాణాలమీద దాడిచేసి అక్కడి ఆయుధాలను స్వాధీనం చేసుకోవటం...." స్వరాజ్య సంపాదన కొరక 'కార్యక్రమ' మన్నారనే ప్రసంగం (పే.344). దీని నిజానిజాలను చరిత్ర పరిశోధకులు పరీక్షించాలి.

బారిష్టర్ పార్వతీశం అనే ఈ నవలను 'శుద్ధ హాస్యం' కోసం గాని, కేవలం వినోదం కోసం కాని చదివి సరిపెట్టుకోవటం సమంజసం కాదనటానికి పైప్రసంగాలను ప్రస్తావించటం జరిగింది. 1924–71 మధ్యకాలంలోని తెలుగు జన జీవితం ముఖ్యంగా గ్రామసీమల్లో ఎలా ఉండేదో, అప్పటి విద్యావంతుల లక్ష్యాలెలా ఉండేవో, అదే సమయంలో బ్రిటిష్ – ముఖ్యంగా స్కాటిష్ – జన జీవన విధానా లెలా ఉండేవో వంటి సాహిత్యేతర విషయాలను తెలుసుకోవటం కోసం

కూడా చదవదగిన ఉత్తమ రచన ఇది. దీన్ని ఈ రూపంలో ప్రచురించిన అభినందన పబ్లిషర్స్‌ను అభినందించవలసి వుంది.

3.9.1995

## విశ్వనాథ వారి కృష్ణకావ్యాలు

– డాక్టర్ టి. రంగస్వామి

ఇది కాకతీయ విశ్వవిద్యాలయంవారి పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయంతో ముద్రితమయింది. ఇందులో రామాయణ కల్పవృక్ష రచయితగా రామభక్తులుగా ప్రఖ్యాతులైన విశ్వనాథ సత్యనారాయణగారి కృష్ణభక్తి వైభవాన్ని నిరూపించారు. ఇందులో "శృంగారవీధి, భ్రమరగీతలు, గోపికా గీతలు, ప్రద్యుమ్నోదయము, శ్రీకృష్ణసంగీతము' అనే అయిదు ఖండకావ్యాలను, నందమూరు మున్నంగి శతకాలను, రచయిత పరామర్శించారు. 'మనస్సన్యాసిని' అని చెప్పుకున్న (పే.203) విశ్వనాథ సత్య నారాయణగారి మధురభక్తిని విపులీకరించారు. శ్రీనాథుడి కాలం నుంచీ తెలుగు సాహిత్యంలో ప్రవేశించిన రాధాప్రసక్తిగల కావ్యవిశేషాలు విశ్వనాథవారి రచనల్లో ఎలా ఆధ్యాత్మిక శృంగార విశిష్టతలను ప్రతిఫలించాయో చర్చించారు.

"ఈ కావ్యాల ఉపరితలంలో భావకావ్యాల్లోలాగా రచనా సౌందర్యంతో అభివ్యక్తం కావడం ఆయన ప్రతిభా లక్షణం" (పే. 204) అనే వాక్యంలో ఏదో లోపమున్నా విశ్వనాథవారి కృష్ణకావ్యాల లక్షణాన్ని దీనిద్వారానే గ్రంథకర్త వ్యక్తీకరించారు. విషయ స్పష్టత కోసం ఆతరవాత "కాని, అంతర్వాహినిగా తపోధ్యాన ఉపాసనాది విషయములకు జ్ఞానభక్తియోగులకు సంబంధించిన అనేకవిధమైన అంశాలు ఈ కావ్యాలలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్నవి. సహృదయుల అనుభవ పరిమితుల మేరకు ఆ నదీతరంగాలు కాంతివక్రతలతో ఆనంద స్పందన కలిగిస్తున్నాయి" అనే మాటలను ప్రస్తరించారు. ఈ (సిద్ధాంత) వ్యాసం వస్తుస్వరూప వస్తువిన్యాసాలు ప్రధానంగా సాగిందనీ (అదే పేజీ), దీని ద్వారా విశ్వనాథ సాహిత్య వైభవస్మరణ సాధ్యమయిందనీ తెలుస్తుంది.

విశ్వనాథ మీద, ఆయన రచనలమీద ఆరాధన భావమున్నవారు చదివి ఆనంద తన్మయత్వం పొందదగిన రచన ఇది. ఆయన రచించిన ప్రత్యక్షరంలోనూ ఆధ్యాత్మిక విశేషాలున్నాయని ఈ రచన నిరూపిస్తుంది. శృంగారంలో వేదాంత రహస్యాలను గుర్తించగలిగిన సహృదయత్వమున్న వారందరూ చదవవలసిన పుస్తకం. కేవలం 'ఉపరితలం'లోని భావ కవితాలక్షణాలను మాత్రమే గుర్తించగలవారికిది అందని మానిపండు.

22.10.1995

## కృష్ణాపత్రిక అక్షర తూణీరాలు

– పిరాట్ల వెంకటేశ్వర్లు

కృష్ణాపత్రికలో 1990–94 సంవత్సరాల మధ్యకాలంలో ఆ పత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లుగారు ఆయా రోజుల్లో రాసిన సంపాదకీయాలను ఎంపిక చేసి కూర్చిన 73 వ్యాసాలు ఈ గ్రంథంలో ఉన్నాయి. వారు అనేక విషయాలను గురించి సంపాదకీయాలు రాసినా,

'గాడితప్పిన నక్సలిజం' గురించిన వాటినే ఇందులో చేర్చారు. అయితే గ్రంథానికి పరిచయం రాసిన ఆర్.ఎస్.కృష్ణమూర్తిగారు " ఈ సంకలనం రెండు భాగాలుగా ఉంటుంది. మొదటి భాగంలో 'గాడితప్పిన నక్సలిజం' గురించిన సంపాదకీయాలు, రెండవభాగంలో 'కమ్యూనిజం హంసగీతం'కు సంబంధించినవీ ఉన్నాయి" (పే.XI) అన్నారు. విషయ సూచికలో అటువంటి విభాగాన్ని నిర్దేశించలేదు. బహుశా 47వ వ్యాసంనుంచి రెండో భాగం కావచ్చు.

సంపాదకీయ వ్యాసకర్త శుద్ధజాతీయవాదినని చెప్పుకున్నారు. గ్రంథం నక్సలిజం/ కమ్యూనిజం మీద కఠోర విమర్శ. ముద్రాపకులు విప్లవ ప్రింటర్స్ వారు. గ్రంథావిష్కర్త కాంగీ మాజీ ముఖ్య మంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డిగారు. పుస్తకం చివరి అట్టమీద కృష్ణాపత్రికను పఠిస్తున్న 'అసామాన్య అమూల్య పాఠకులు మాన్యులైన ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు' గారి బొమ్మ ఉంది. గ్రంథంలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీ, సోషలిస్టులు, భారతీయ జనతాపార్టీ మినహా తదితర రాజకీయ పక్షాలమీద చాలా బోలెడు విమర్శలున్నాయి. ఉత్తుత్తి విమర్శలుకావు. కత్తులతో ఈటెలతో మాటలతో బాణాలతో యుద్ధం చేసిన వారిని గురించి విన్నాం. కాని కత్తి పిడితో కొట్టినట్టు తూణీరంతో (అంటే అమ్ములపొదితో) పోరాడిన వైనం ఈ గ్రంథమూ దాని శీర్షికా ప్రదర్శించటం చూస్తాం. పౌరహక్కుల సంఘం 'కుహనా మేధావుల సంస్థ' (పే.13) అనీ, సోషలిస్టులు వగైరాలు 'కుహనా ప్రజాస్వామ్యవాదులు' (పే.85) అనీ గ్రంథకర్త విస్పష్టంగా పేర్కొన్నారు. భారతీయ కమ్యూనిస్టులు "దింపుడు కళ్ళెం" (పే.167, 169) ఆశతో ఉన్నారన్నారు. దింపుడు కళ్లం సంగతి సరేగాని, కళ్ళెమేమిటో తెలీదు. 'ఘణంగా (పే.25), శృతిమించిన (పే.72), శతృనిర్మూలన (పే.87సి) వంటి ప్రౌఢ ప్రయోగాలున్నాయి. 'వ్యితిరేకం' అనే పదం (బహుశా వ్యతిరేక శబ్దానికి ముద్రారాక్షస స్వరూపం కావచ్చు) చాలాసార్లు కనిపిస్తుంది.. నక్సలిజం సమస్యకు 'చట్టబద్ధపాలన ఒక్కటే' పరిష్కార మార్గమని సంపాదకుల నిర్ణయం. ఎవరి పాలన, ఎటువంటి పాలన 'చట్టబద్ధ'మో వారు స్పష్టంగా చెప్పలేదు. రచయిత జాతీయవాది అయినా ఆయనకు కుంభకర్ణుడి కన్నా రిప్‌వాన్ వింకిల్ (పే.84, 120 వగైరాలు) చాలా ఇష్టుడని తోస్తుంది. గ్రంథంలోని సంపాదకీయాలు బాగా అర్థం కావటానికి వాటి సారాంశాలను కూడా సమకూర్చటం మరో ప్రత్యేకత.

పిరాట్ల వారి అభిమానుల కన్నా, వారి సిద్ధాంతాలతో విశ్వాసాలతో ధోరణితో ఏకీభవించని వారు తప్పక చదవదగిన గ్రంథం. రచన 'ఆవేశవంతం'గా (పే.XVI) సాగింది కాబట్టి చదివిస్తుంది.

29.10.1995

## అక్షింతలు

– డి.వి. నరసరాజు

**ఆం**ధ్ర నాటక కళాపరిషత్తు నుంచి సినీ రంగంలోకి రచయితగా, నటుడుగా, దర్శకుడుగా ప్రవేశించి ప్రఖ్యాతులైన డి.వి. నరసరాజుగారు 1981 నుంచి నేటిదాకా 'ఈనాడు'లో నడుపుతున్న 'అక్షింతలు' అనే కాలంలోని 50 వ్యాసాలను ఈ గ్రంథరూపంలో ప్రచురించారు. భాషలో భావంలో రచనలో సౌకుమార్యం, వ్యంగ్యం ఈ రచనలకు జీవం. నేటి (తెలుగు) సమాజంలో

సాంక్రామిక వ్యాధిలాగా విస్తరిస్తున్న ఆత్మ వంచనలను, లోకవంచనలను, కళారాధన పేరిట జరుగుతున్న వ్యాపార వ్యభిచారాలను, దేశభక్తి ప్రజాసేవల పేరిట జరుగుతున్న దురంతాలను విశదీకరించే విమర్శించే వ్యాసాలివి.

ఈ గ్రంథంలో 'వుప్పు చెమట' వంటి నుడికారాలున్నాయి. ప్రజాషేవ్ (పే. 2), దేశభోక్తలు (పే. 69) వంటి నూతన పదకల్పనలున్నాయి. "నల్లధనం ప్రొడక్షనుకు సారారంగం, డిస్ట్రిబ్యూషన్‌కి సినిమారంగం" (పే. 42) వంటి సూక్తులున్నాయి. ప్రచారంకోసం పాకులాడుతూ దాన్నో వ్యాపార కళగా మారుస్తున్న, మార్చిన మహనీయుల గురించి, అంతర్జాతీయ స్థాయి నుంచి వీధిస్థాయికి దిగజారుతున్న దేశభక్తిని గురించి (పే. 14-16), రాజ్యాంగేతర శక్తుల గురించి (పే. 30-33), రాజకీయాలకూ బూతురచనలకూ వ్యాపారానికీ ఉన్న అన్యోన్య సంబంధాల గురించి (పే. 94-97), సన్మానాలకోసం దేబిరించే మహా రచయితల గురించి (పే. 98-102), దిక్కులేని దేవుళ్లను గురించి (పే. 167 నుంచి), ఇంకా ఇలా అనేక సమకాలిక దౌర్భాగ్యాల గురించి వినోదాత్మక విమర్శలున్నాయి. మేధావుల వలస వల్ల మన రాజకీయాల్లో గాడిదలకు స్థానం లభించవచ్చునన్న ఆశంక (పే. 122-3) వాస్తవ పరిస్థితిని వర్ణిస్తుంది. హింసావాదాన్నీ, మద్య వ్యాపారాన్నీ వ్యంగ్యంగా విమర్శించిన వ్యాసా లిందులో ఉన్నాయి. తెలుగువాళ్ల అన్యభాషాభి మానాన్ని వెక్కిరించి వేళాకోళం చేస్తూ "కనీసం కుక్కలకైనా తెలుగుపేర్లు పెట్టగూడదూ?" (పే. 72-75) అని ఆవేదన పడుతూనే తెలుగుపేర్లు సూచించమని అధికార భాషా సంఘాన్ని కోరా లనటం గొప్ప సంగతి. సదరు సంఘం సమూలంగా, మూతపడ్డందువల్ల అది అసాధ్యం కావటం తెలుగుదనానికి అంతిమ విజయమనే భావించాలి.

తమ వ్యక్తిగత పరిచయాల, అనుభవాల, అనుశీలనల లిఖితరూపంగా ఈ వ్యాస సంపుటిని తీర్చిదిద్దారు. ఈ విమర్శల ప్రభావం, ఈ వ్యంగ్య చమత్కారాల ప్రభావం ప్రస్తుత సమాజంమీద ఎంతగా ఉంటుందో వేచి చూడాలి. దున్నపోతు మీద జడివాన కాగూడదని ఆశిద్దాం. తప్పక చదవవలసిన వ్యాస సంపుటి ఇది.

12.11.1995

# సివిల్ ప్రొసీజర్ కోడ్

**అనువాద వ్యాఖ్యానం : పెండ్యాల సత్యనారాయణ**

గుంటూరులోని స్నేహ ప్రచురణల వారు న్యాయశాస్త్ర గ్రంథాలను తెలుగులో ప్రచురించాలనే సత్సంకల్పంతో తొలి ప్రచురణగా విడుదల చేసిన గ్రంథమిది. 1966లోనే అధికార భాషా శాసనాన్ని ఆమోదించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చిత్తశుద్ధిలోపం ప్రధానకారణంగా ప్రధాన శాసనాలయినా అనువదించి ప్రచురించలేదు. ఆ లోపం తీర్చటానికి అధికార భాషా సంఘం పరిశ్రమించిన దాఖలాలూ లేవు. ప్రభుత్వంలోని న్యాయశాఖా విభాగాలు నత్తనడకలు నడుస్తూ సాధించిందంటూ ఏమయినా ఉంటే అది అల్పాల్పం. ఈ సందర్భంలో అక్కడక్కడ అప్పుడప్పుడు కొందరు న్యాయవాదులూ, కొన్ని ప్రచురణ సంస్థలూ ఆయా ముఖ్య శాసనాలను తెలుగులోకి అనువదించి ప్రచురించటం హర్షణీయం, ప్రశంసనీయం. ఇది కేవలం భాషాభిమానానికి సంబంధించిన విషయమేకాదు. మాతృభాషలో విద్యా విజ్ఞానాలు సంపాదించటం, ప్రభుత్వం

నిర్వహించటం అనేవి ప్రజాస్వామ్య మూలసూత్రాలు. తెలుగుభాషను నవీకరించటంలో, తెలుగు వారికి తాము పాటించవలసిన న్యాయవిధులను పరిచయం చేయటంలో ఇటువంటి ప్రయత్నాలు ఎంతో తోడ్పడతాయి. ఆ దృష్టితో అనువాదకులనూ ప్రచురణ కర్తలనూ బహుధా ప్రశంసించాలి.

ఈ గ్రంథంలో 1908 నాటి సివిల్ ప్రొసీజర్ కోడ్‌ను 1976 నాటి సవరణలతో సహా (ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేసిన సవరణలతో సహా) చూడవచ్చు. చట్టంలోని 'note' అనే భాగాలను 'గమనికలు'గానూ, తమ వ్యాఖ్యానాలనూ 'వివరణలు'గానూ చిన్న అచ్చులో ఇవ్వటం ముదావహం. అర్థస్పష్టత కోసం సాంకేతిక పదాలనూ అనూదిత వాక్యభాగాలనూ మూలభాష (ఇంగ్లీషు)లో కూడా సూచించారు. ఇది మంచి పద్ధతి. అడ్డు సవాలని వాడుకలో ఉన్న 'Cross Examination' వంటిపదబంధం అనువాదంలో క్రాస్ విచారణగా కనిపించినా, మూలభాషాపదాన్ని సూచించినందువల్ల అవగాహనకు లోపం కలగలేదు. శ్రేయోభిలాషి (next friend), ప్రధాన పరీక్ష (examination-in-chief) వంటి అనువాదాలు బాగున్నాయి. అనువాదం సాఫీగా జరిగిందని చెప్పవచ్చు. ఉదాహరణకు "వాదివేసిన దావాకు సమాధానంగా ప్రతివాది కూడా దావా (Cross Suit) వేసిన పక్షంలో దాని ప్రభావం ఎంత ఉంటుందో, సెట్ ఆఫ్ ప్రభావం కూడా అంతే ఉంటుంది" (పే. 114). సెట్ ఆఫ్ అనే పదాన్ని అంతకుముందే "చెల్లుకు చెల్లు" అని అనువదించారు కాబట్టి అర్థబోధకు ఇబ్బందిలేదు.

శాస్త్రంగా చదివే విద్యార్థులకూ వ్యవహారం నడిపేవారికే గాక భాషా సాహిత్యాభిమానులు కూడా చదవదగిన, చదవవలసిన పుస్తకమిది. శాస్త్ర సాహిత్య గ్రంథా లెన్నివస్తే అంతగా భాషాభివృద్ధి జరుగుతుంది. ఈ గ్రంథ రచయిత ఇలాగే శిక్షా స్మృతి వగైరాలను అనువదించాలని అభిలషిద్దాం.

31.12.1995

## ఆచార్య నాగార్జున శూన్యతాసప్తతి

**అనువాద వ్యాఖ్యానం : డాక్టర్ ఎం. రాజగోపాలరావు**

**రెండో** బుద్ధుడనీ మహావైద్యుడనీ ఖండాంతర ప్రశస్తి సంపాదించిన ఆంధ్రుడు నాగార్జునాచార్యులు. ఆయన రచనలన్నిటిలోకీ గొప్పది మూలమాధ్యమికకారిక. అందులో ప్రతిపాదించిన శూన్యవాద సిద్ధాంతాలను సంగ్రహంగా చెప్పేది ఆయనే రాసిన శూన్యతాసప్తతి. అది చాలా కాలం భారతీయ భాషల్లో అలభ్యంగా ఉండి ఇటీవల సంస్కృత హిందీ భాషలతో బాటు ఆంగ్లంలోకి కూడా టిబెటియన్ భాషనుంచి అనూదిత మయింది. సంస్కృత శ్లోకాలకు తాత్పర్యమిచ్చి తరవాత వాటిని సమర్థంగా వ్యాఖ్యానించిన రాజగోపాలరావుగారు బౌద్ధ దర్శనంలో విశేషకృషి చేసినవారు. బహుగ్రంథరచయితలు.

సప్తతి అంటే డెబ్బయ్యేగాని ఇందులో 73 శ్లోకాలున్నాయి. ఈ గ్రంథానికి మూలమైన మూల మాధ్యమిక కారికలనూ, ఇతర గ్రంథాలనూ అధోదీపికల్లో వివరించినందువల్ల తమ వ్యాఖ్యానానికి రచయిత ప్రామాణ్యం చూపారు. ప్రపంచంలోని పదార్థాలన్నీ నిరంతరం చలిస్తూ పరివర్తనకు లోనవుతున్నాయి కాబట్టి వాటిని కార్యకారణ వాదం వివరించలేదని, ఎటువంటి లౌకిక యథార్థాన్నీ పరమార్థానికి ఆరోపించటం వీలుకాదని, ఉత్పత్తి స్థితిలయలకు లోనుగాని

ఉన్నతమైన యథార్థం మాత్రమే తాత్విక యథార్థం/ పరమార్థ సత్యం అనీ నాగార్జునుడి వాదం. లౌకిక యథార్థాలన్నీ స్వ-భావశూన్యాలని ఆయన సిద్ధాంతం. ఆ తరవాత శతాబ్దాల అనంతరం ఆదిశంకరాచార్యుల వారు ప్రతిపాదించిన వ్యావహారిక పారమార్థిక సత్యాలనే భావనకు నాగార్జున ప్రసంగంలో బీజాలు కనిపిస్తాయి. అందువల్లనే అద్వైతసిద్ధాంతాన్ని అపరబౌద్ధ మన్నారు.

శుద్ధతర్కంతో తనకు పూర్వమున్న వందలకొద్దీ వాదనలను ఖండించి బౌద్ధదర్శనానికి ప్రధానమైన తన సిద్ధాంతాలను ప్రతిపాదించిన వాగార్జునాచార్యుల ప్రతిభావిశేషాన్ని, వాద పద్ధతినీ గ్రహించటానికి ఈగ్రంథం చాలా ఉపయోగపడుతుంది. అనువాదం సరళంగా సాఫీగా సాగింది. పరిభాషను వీలయినంత సులభంగా వివరించే ప్రయత్నం జరిగింది. తత్వశాస్త్రాభి మానులు - విశేషించి బౌద్ధమతప్రియులు - తప్పక చదవదగిన గ్రంథం.

21.4.1996

## చేరా పీఠికలు

**- ఆచార్య చేకూరి రామారావు**

**చా**లామంది అత్యాధునిక యువకవులనూ స్త్రీవాద కవయిత్రులనూ 'చేరాతల' ద్వారా వెలుగులోకి తెచ్చిన చేకూరి రామారావుగారు ఆయా రచనలకు రాసిన పీఠికలను ఎంపికచేసి రాజమహేంద్రవరంలోని ఆయన సాహితీ మిత్రులు 1994లో షష్టిపూర్తి కానుకగా ప్రచురించిన గ్రంథమిది. భాషాశాస్త్ర పరిశోధన పద్ధతులను కవితాస్వాదన విశ్లేషణల్లో స్వానుభవ పూర్వకంగా మేళవించి తెలుగు విమర్శను సుసంపన్నం చేసిన చేరాగారి పీఠిక లీగ్రంథంలో నలభై రెండున్నాయి. విడివిడిగా పేర్లుపెట్టకపోయినా గ్రంథంలోని అంశాలు మూడు విధాలు. మొదటి ఇరవై నాలుగు పీఠికలూ ఆయా గ్రంథాలను రాసిన పీఠికలయితే, ఆ తరవాతి పధ్నాలుగూ కవితలకు మాత్రమే రాసినవి. చివరి నాలుగింటిలో ఒక నవలకు, ఒక నాటికకు, ఒక పాక శాస్త్రగ్రంథానికీ రాసినవి కాక, సొంత పుస్తకానికి రాసుకున్న పీఠిక కూడా ఉంది. మొదటి రెండు విభాగాల్లోనూ మరి మూడు 'స్వపీఠిక'లున్నాయి. ఇరవై నాలుగో పీఠిక మాత్రం ఇంగ్లీషు భాషలో ఉంది. ఆధునిక సాహిత్యంలో యుగ విభజనను అందులో సూచించారు పీఠికాకారులు (పే. 131).

ఇందులోని కొన్ని పీఠికలు (ఉదాహరణకు 'కొయ్యగుర్రం' ఆధునిక మహాకావ్యమని నిరూపిస్తూ రాసింది) వివాదాస్పదమైనాయి. ఈ సంపుటిలో చేర్చిన పీఠికలను కాలక్రమానుసారంగా అమర్చలేదు. అందువల్ల చేరాగారు తమను గురించి ఆత్మవిమర్శ మార్గంలోనో ఆత్మసాక్షాత్కార విధానంలోనో రాసుకున్న కొన్ని విషయాల క్రమపరిణామాన్ని గ్రహించటానికి కొంత శ్రమించవలసి వస్తుంది పాఠకులు. తమ సాహిత్య దృక్పథం అవ్యవస్థ నుంచి పుట్టి స్వేచ్ఛావర్తనద్వారా ఏర్పడిందని (పే. 8), తమకు పట్టుదలా పరిశ్రమ చేసే శక్తి అంతగా లేవని (పే. 20), నిన్నమొన్నటి దాకా అర్థమయ్యే భాషను గురించి అర్థం కాని తెలుగులో రాస్తూ ఇప్పుడిప్పుడే అపండితశైలిని అభ్యాసం చేస్తున్నామని (పే. 62), తమకంచేత పీఠిక రాయించిన రచయితకున్న వజ్రసంకల్పంలో తమకు సహస్రాంశమైనా లేదని (పే. 135), అంత శాస్త్ర పాండిత్యమూ లేదని (పే. 126) వినయం కోసమో విమర్శ దృష్టితోనో రాశారు. 20, 22, 40

సంఖ్యలు గల పీఠికలూ, 103వ పేజీలో వెలిబుచ్చిన కొన్ని భావాలూ చేకూరివారు సాహిత్య విమర్శలో 'నేను వాదం' అనే పద్ధతిని ప్రవేశపెట్టారనే ఆరోపణకు ఆలంబనా లయినాయి.

గ్రంథంలో అక్కడక్కడ వారు పరిశీలనపూర్వకంగా వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలూ కనిపిస్తాయి. అభ్యుదయ విప్లవ కవిత్వాలు రెంటిలోనూ వస్తువైవిధ్యం లేదని (పే. 137), మహాకావ్యం సహజంగా సైజులో పెద్దది కూడా అవుతుందనీ విస్తీర్ణతే ప్రధానం కాదు గాని అవసరమైన ఒక లక్షణమనీ (పే.144, 146) వారు అభిప్రాయపడ్డారు. ఇటువంటి అనేక రహస్యాలను గ్రహించటానికి చదవదగిన గ్రంథమిది. గ్రహణవ్యూహాల వంటి (పే.220) సులభమైన సాంకేతిక పదాలను గ్రంథంలో చూడవచ్చు. సాహితీప్రియులు చదివి ఆనందించదగిన పుస్తకం.

12.5.1996

# గుంటూరు మండల సర్వస్వము

సంపాదకులు : దరువూరి వీరయ్య

నేటి గుంటూరు జిల్లాకు సబంధించిన రాజకీయ చారిత్రక సాహిత్యాంశాలను గురించి ఆజిల్లాలోని స్వాతంత్ర్యయోధుల్లో సుప్రసిద్ధులైన దరువూరి వీరయ్యచౌదరిగారు స్వీయ రచనలకు ఇతరుల రచనలను జోడించి ఈగ్రంథంలో ప్రచురించారు. ఇది పరిష్కృత తృతీయ ముద్రణ. తొలి ముద్రణ 1959లో, మలి ముద్రణ 1964లో వెలుగుచూడగా "గత్యంతరంలేక 'గుంటూరు మండల సర్వస్వము'గా" ప్రచురిస్తున్నానని సంపాదకులు "నామాట"లో చెప్పారు. "ఈనాడు-వ్యాపార ప్రకటనలు కాని, సంపన్నుల ఆర్థిక సహకారంగాని, అధికార పదవులు, హోదాలతో ముడివడివున్నాయి" కాబట్టి "నన్ను ప్రేమించే, ఆదరించే, అభిమానించే, సహకరించే ఆ ఒక్క ప్రజానాయకుడు, నా గురుదేవులు ఆచార్య రంగాజీ కూడా పరమపదించారు" కాబట్టి ఈ రూపంలో ఈ గ్రంథాన్ని ప్రచురించవలసి వచ్చిందని సంపాదకులు విచారపడ్డారు 'నామాట'లో. సమాజంలో విలువలు మారాయనటానికి ఇంతకన్నా గొప్ప నిదర్శన అక్కరలేదు.

ఇందులో వీరయ్య చౌదరిగారు సొంత రచనలు ప్రధానంగా నాలుగు. తమ జీవితాన్ని గురించి (పే. 187–224), పలనాటి పన్నుల నిరాకరణ మహోద్యమ వీరులు పర్వతనేని వీరయ్య చౌదరిగారిని గురించి (పే.225–53), క్విట్ ఇండియా ఉద్యమాల గురించి (పే. 254–77), (నాగళ్ల) గాంధి కృష్ణయ్యగారి గురించి (పే.278–87) వారి వ్యాసాలున్నాయి. గ్రామీణ ప్రజోద్యమాల గురించిన ఆచార్య రంగా వ్యాసముంది (పే.173–186). గుంటూరు మండల ప్రాచీనచరిత్రను వివరించే వ్యాసం (పే.25–58) కొత్త భావయ్య చౌదరిగారిది. కోన వేంకటరాయశర్మ కొండవీటి సామ్రాజ్యం గురించి (పే.113–126), జాయప సేనాని గురించి (పే.82–85) రాసిన వ్యాసాలు కాక, నాగార్జున గురించి జి.వి. కృష్ణరావుగారు (పే.86–102), అమరావతి గురించి నార్ల వెంకటేశ్వరరావుగారు (పే.103–112), భట్టిప్రోలు గురించి బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు (పే.127–130), ప్రధాన పాలక వంశాల గురించి విష్ణుభొట్ల సూర్యనారాయణరావుగారు (పే.146–172) రాసిన వ్యాసాలున్నాయి. రైతు రక్షణ యాత్ర, రైతాంగం పోరాటాలకు సంబంధించిన వివరాలున్నాయి. గ్రంథాంతంలో ఆ మండలానికి చెందిన రచయితల గురించిన సంక్షిప్త పరిచయాలున్నాయి (పే.329–294).

1909 నుంచి 1950/52 దాకా ఆ మండలంలో జరిగిన స్వాతంత్ర్యయుద్ధ ఘట్టాల వివరణ ప్రశస్తమయింది. పల్నాటి పుల్లరి నిరాకరణ, చీరాల - పేరాల వనవాసం విశేషాలు బ్రిటిష్ పార్లమెంటునే కదిలించాయి. అప్పటి పోరాటాలను గురించి తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు రాసిన పద్యాలు, గుంటూరు కవిత్రయం జాషువా, తుమ్మల, ఏటుకూరుల ప్రశంసా ఇందులో కనిపిస్తాయి. రాజకీయ సామాజిక ధర్మాల్లో నాటికీ నేటికీ వచ్చిన ప్రచండ పరిణామాలూ విలువల మార్పులూ కళ్లకుగట్టినట్లు కనిపిస్తాయి. చరిత్ర విభాగం కాలక్రమానుసారంగా స్పష్టంగా లేదుగాని అందుకు సంపాదకులను నిందించనక్కరలేదు. అంతర్జాతీయ తెలుగుసంస్థ, తెలుగు అకాడమి వంటివి ఆంధ్రుల చరిత్రను సమగ్రంగా అందిస్తామని ఆర్భాటంచేసి ఆ పనికి ఆదిలోనే మంగళహారతి పాడిన వైనం, మాటలకే గాని చేతలకు దిగని మన వీరాంధ్రనాయకుల ప్రగల్భాలూ గమనించినప్పుడు ఒంటిచేత్తో ఇంత మంచిపని ఇంతబాగా నిర్వహించిన సంపాదకులను అభినందించక తప్పదు. మన ఆదర్శాలూ ఆచరణలూ ఒకప్పుడు ఎంత ఉన్నతస్థాయిలో ఉండేవో తెలుసుకోగోరిన నేటి పౌరులు తప్పక చదవదగిన గ్రంథం.

9.6.1996

## శేషేంద్ర సాహిత్య దర్శిని

**- సంపా. సాత్యకి, ఆచార్య తిరుమల**

గుంటూరు శేషేంద్ర శర్మగారి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని 1995 అక్టోబర్ 20వ తేదీ నాటికి ప్రథమ ప్రచురణగా ఆయన ద్వితీయ పుత్రులు సాత్యకిగారు పునర్ముద్రణ రూపంలో వెలువరించిన పూర్వరచనల సంపుటి ఇది. ఈ పనంతా పరుగులమీద సాగినట్లుంది. అందువల్ల నవోదయబుక్ హౌస్ పేరే రెండుసార్లు వెంటవెంటనే అచ్చుపడింది. గ్రంథానికి విషయసూచిక లేదు. విషయవిభజన కాలక్రమానుసారి కాదు. ఆంగ్ల రచనలు గ్రంథంచివరో మొదటోకాక మధ్యలో ప్రత్యేక పుటసంఖ్యలతో కనిపిస్తాయి. 20, 250 పేజీల తరవాత ప్రత్యేక గ్రంథాలని సూచించే ప్రత్యేక పుటలున్నాయి. అనుబంధం -1 తరువాత మరి 60 పేజీలు పైగా ఉన్నాయి గాని రెండో అనుబంధం ఎక్కడి నుంచి మొదలయిందో, ఎన్ని అనుబంధా లున్నవో లెక్కతెలీదు. 'జీవితరేఖలు' గ్రంథమధ్యలో ఉన్నాయి. ఇంటర్వ్యూల మధ్య చివరి పదిపేజీల్లో కొన్ని కవిత లున్నాయి. ఆయన ప్రశ్నోత్తరాలు 'శేషేంద్ర శరసంధాన' మని ఒకచోటా (పే.201-14), 'ప్రశ్నలు - జవాబు'లని మరోచోట (పే.23-116) కనిపిస్తాయి. పాఠకుల సహనాన్ని పరీక్షించేట్లు సంపాదకత్వం నడిచింది. ఆచార్య తిరుమల సంపాదకత్వంలో మొదలయిన 'ఆధునిక కవిత-అభిప్రాయవేదిక' అనే భాగం ఎక్కడ మొదలయిందో తెలుస్తుందిగాని, ఎక్కడ ముగిసిందో పాఠకులు కనిపెట్టాలి. తప్పదు.

గ్రంథవిషయం శేషేంద్రశర్మగారి అభిప్రాయాలూ కవితలూ. ఆధునికాంధ్రకవుల్లో డొక్కశుద్ధి ఉన్న చాలా కొద్దిమంది కవుల్లో ఆయనొకడు. జాషువా తనకు ఆస్థానకవి పదవిరానందుకు బహిరంగంగా బాధపడ్డట్లు శేషేంద్రశర్మగారు తమకు తమశక్తికి తగినంత గుర్తింపురాలేదని విచారించటంలో వింతలేదుగాని, అదివాచ్యం చేయటం దురదృష్టకరం. అందులోనూ "కేవలం ఆశ్రితులకే అవార్డులు ఇస్తున్నా"రని తెలిసే (పే.37) వ్యసనపడటం బాగాలేదు. "కరుడుకట్టిన

చాదస్తం సాహిత్యాన్ని లాభదాయకవ్యాపారంగా తలచే నయవంచన, అభ్యుదయ విరోధ లక్షణాలు" (పే.221) ఉన్న "సాహిత్య మారీచు'లున్న కాలంలో (పే.221), 'భువన విజయం' లాంటి అసంబద్ధ ప్రదర్శనలు సాహితీసేవగా సంస్కృతిపరిరక్షణగా చెలామణి అవుతున్న కాలంలో ఈ నిర్వేదం "జీర్ణ మంగే సుభాషితమ్" అన్నట్లుండటమే నయం.

శర్మగారు కొన్ని ప్రసంగాలను చాలా అసహనంతో చేశారనీ చేస్తారనీ ఈ గ్రంథం మరోసారి నిరూపిస్తుంది. "ఎక్కువమంది కవులు భట్రాజులు" (పే.47), తెలుగు సాహిత్యంలో "శ్రీశ్రీ ప్రభావం పోయింది" (పే.233), "శ్రీశ్రీలో కవిత్వపు పాలుతక్కువ" (అదే.) వంటివి వివాదగ్రస్త మైన విషయాలు. అలాంటిదే సంస్కృతభాష "పితృవాక్యంలాంటి"దని, "మాతృవాక్కులాంటి ఇంగ్లీషు భాష" (పే.65) అనే ప్రస్తావన! ఛందోబద్ధమైన రచనలను సమర్థిస్తూ (పే.203) "ఛందస్సుల బరువు మోయలేక జారవిడిచాను" (పే.206) అనటం విచార్యం. "కవిత్వానికి కాల విభజన కుదరదు" (పే.24) అని తెగేసి చెప్పినవారు, ఆధునిక సాహిత్యయుగ విభజనలలో "ద్వితీయ లక్షణార్థ ప్రధానయుగం (శేషేంద్రతో ప్రారంభించి ఇప్పుడు నడుస్తున్న కవిసేన యుగం వరకు)" అనేది 'శాస్త్రీయ విభజన' అని (పే.42) ఆత్మస్తుతిగా తాము చెప్పుకోదగ్గమాట కాదు. ఇతరు లనవలసిన మాట, వివాదాలకు దారితీసినా.

గ్రంథ పరిచయమాత్రంలో ఇంతకన్నా విపులచర్చ సాధ్యంకాదు. ఇంతకుముందు కొన్ని దిన వార పత్రికల్లో అచ్చయినవే ఈ సంపుటిలో ఉన్నాయి. అప్పుడు వాటిని పరిశీలన పూర్వకంగా చదవని సాహితీప్రియు లిప్పుడు ఈ గ్రంథాన్ని చదివి నేటి సాహిత్యంలో శేషేంద్రశర్మగారి స్థానాన్ని తాముగా నిరూపించి నిర్ణయించుకోవచ్చు. శర్మగారి భాషా భావతీవ్రతల కిదో మచ్చుతునక. కవులూ విమర్శకులూ చదివి స్వీయాభిప్రాయాలనూ శర్మగారి భావాలనూ తైపారువేసుకోవటం మేలు.

14.7.1996

## ఆరె భాషా నిఘంటువు

**– ఆచార్య పేర్వారం జగన్నాథం**

ఈ గ్రంథానికి ఆచార్య రవ్వా శ్రీహరిగారు సహసంపాదకులు. ఆయన భాషా విశ్లేషణ చేశారు. విషయ సంగ్రాహకులూ సంపాదకులూ అయిన జగన్నాథంగారు నిఘంటు నిర్మాతలు. నిఘంటువు 39 పేజీల గ్రంథం. దీనికి ఆచార్య రామకృష్ణారెడ్డిగారు ఆంగ్లభాషలో మున్నుడి రాశారు. నిఘంటువులో వాడిన ప్రత్యేక సంజ్ఞలను డాక్టర్ ఉషాదేవిగారు ఇంగ్లీషులో వివరించారు. ఆరె భాషలోని సామెతలను ఒక్క పేజీలో (40) ఇచ్చారు. తరవాత ఆరె భాషలోని జానపద కథలను గురించీ, జానపద గేయాలను గురించీ జగన్నాథంగారు ఇంగ్లీషులో రాసిన రెండు వ్యాసాలేగాక, కీర్తిశేషులు ఆచార్య జి.ఎన్.రెడ్డిగారు "ఆరె జానపద సాహిత్యం – తెలుగు ప్రభావం" అనే సిద్ధాంత గ్రంథాన్ని గురించి రాసిన ఇంగ్లీషు వ్యాస ముంది. ఇది గ్రంథ భౌతికస్వరూపం.

ఏడు పుటల సంక్షిప్త వ్యాకరణం విషయంలో ద్వితీయాది షష్ఠీ విభక్తి పర్యంతం నామవాచక రూపాల్లో వచన భేదం కనిపించటం లేదు. భూతవర్తమాన క్రియారూపాల బహువచనాలు

మహదమహద్భేదాన్ని సూచించటం లేదు. మరాఠీ మాండలికమైన ఆరె భాషకు తెలుగులోని లింగవచన ప్రణాళిక ప్రాతిపదికగా సంప్రదాయపద్ధతిలో వ్యాకరణ రచన చేసినందున ఆ భాషా ప్రత్యేకత తెలియకుండా పోయింది. XVవ పేజీలో రెండు చకారాలూ రెండు జకారాలూ ఒకేవిధంగా తాలవ్యాలని (palatals!) రాశారు. 'followed by' అనటానికి బదులు 'following' అని అక్షరక్రమ వ్యాకరణదోషం కనిపిస్తుంది. ఇలాంటివి పెరుగులో వడ్లగింజల్లా బాధిస్తున్నాయి.

ఇక 'నిఘంటువు'లో రమారమి 900 పదాలు (వాక్యాలను కూడా పదాలకిందనే పరిగణించిన సందర్భాలున్నాయి– ముఖ్యంగా తిట్ల విషయంలో) ఉన్నాయి. మొదట ఆరోపాన్ని తెలుగులిపిలో ఇచ్చి, తరవాత దాన్ని రోమన్‌లిపిలో రాసి, తెలుగులో అర్థం, దానికి ముందు వ్యాకరణ విభాగం పేర్కొని, దరిమిలా అదే తీరున ఇంగ్లీషులో అర్థ వివరణ చేసి ఇంగ్లీషు వచ్చిన వారికీ తెలుగురాని వారికీ ఆరె భాషా శబ్దార్థాల పరిచయ భాగ్యం కల్పించారు. అర్థవివరణ గ్రాంథికభాషలోగాని (పే. 2: చేయుటకు, ఉండుటకు), కొన్ని సమయాల్లో మారుమూల పదాల్లోగాని కనిపిస్తుంది. ఉదాహరణకు, 'ఉగ్ద' అంటే 'బరిబాతల' (నగ్నమంటే– లేదా దిసమొల అంటే– సులభంగా అర్థమయ్యేదేమో), 'ఉల్తని' అంటే 'సరాతం' ("a spoon with a flat-thin(?) to roast bread or pancake etc."), 'సద' అంటే 'చానుపు' (కల్లాపి /కలయంపి అంటే బోధపడేది).

తీగె, పొద, మొక్క, చెట్టు, మాను అనేవాటి మధ్యగల భేదాన్ని నిఘంటువులయినా పాటించటం అవసరం. 'అంబాడాస ఝాడు' అంటే గోంగూర 'చెట్టు' అని, 'a green vegetable plant' అని ఇంగ్లీషులోనూ వివరించారు! 'కకూల్తి కర్‌న' అనే క్రియారూపానికిచ్చిన అర్థాల్లో 'etreat' అనే మాటుంది. బహుశా అది 'entreat' కావచ్చు. "ఘారువోస్పాడా" అంటే "ఇల్లు పాడుగాను – ఒక తిట్టు" అని వివరిస్తూ, అది విశేష్యమని ఎలా పరిగణించారో తెలీదు. "చిమ్ని' అనే మాటకు "ఊరబిచ్చుక" అనే స్పష్టార్థమిచ్చిన తరువాత "bird (of any kind) which quents a village, sparrow" అని రాశారు. quents బహుశా frequents అనే భావంలో రాసిన మాటై ఉంటుంది. "మకడు" అంటే "ఒక తిట్టు (కోతి అని దీనికర్థం)" అని వాడుక భాషలో వివరించారు. కోతి, గాడిద, పంది వంటి మాటలను తిట్లుగా వాడినంత మాత్రాన వాటికున్న సాధరణార్థాన్ని ఇలా వివరించటమెందుకో తెలీదు. ఒక్కమాటలో నిఘంటు నిర్మాణం అసంతృప్తికరం. మరో గతిలేదు కాబట్టి ఆరె భాషను గురించి తెలుసుకోటానికి ఇదే శరణ్యం. భాషాభిమానులు దీన్ని కొని, స్వబుద్ధితో సవరించుకొని ఉపయోగించెదరుగాక!

1.9.1996

## వీరతెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు

– పుచ్చలపల్లి సుందరయ్య

నైజాం సంస్థానంలో 1946–1951 మధ్యకాలంలో నైజాముకు, రజాకార్లకు, భూస్వాములకు వ్యతిరేకంగా జరిగిన సాయుధసంఘర్షణ, 1948 సెప్టెంబరులో స్వతంత్ర భారత ప్రభుత్వం

పోలీసు చర్య జరిపిన తరవాత కూడా సాగింది. నాటి పోరాటానికి నాయకత్వం వహించిన పుచ్చలపల్లి సుందరయ్యగారు స్వానుభవంతో కన్న, విన్న, నిర్వహించిన తిరుగుబాటు చరిత్రను 1972లో ఇంగ్లీషు భాషలో 760 పేజీల మహాగ్రంథంగా రాస్తే, కలకత్తా నుంచి మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయం ప్రచురించింది. అది ప్రధాన భారతీయ భాషలన్నింటిలోనూ పూర్తిగానో సంక్షిప్తంగానో అనూదితమైంది. చైనీస్ భాషలోకి కూడా అనువాదం చేశారు. తెలుగు అనువాదం 1973లో తొలిసారి వెలువడి 1987లోగా మూడు ముద్రణలు పొందింది. జనహిత వారి కోరిక మేరకు సంక్షిప్త రూపంలో 1992లో కుదింపు కూర్పు వచ్చింది. ఇది పునర్ముద్రణ – అయిదో కూర్పు. రచన జనరంజకత్వాని కిదో నిదర్శన. అనువాదం సంక్షేపణ వి.ఆర్. బొమ్మారెడ్డి చేసినవి. సరళంగా సాఫీగా సాగింది. గ్రంథానికి చివర హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ ఇంగ్లీషులో ఆ ఉద్యమాన్ని వర్ణిస్తూ రాసిన గేయకావ్యమూ, దానికి ఆరుద్ర చేసిన అనువాదమూ కనిపిస్తాయి.

అలనాటి తెలంగాణా పోరాటంలో పదమూడువేలమంది పాల్గొన్నారు. నాలుగువేల మంది హతులైనారు. పదివేలమంది మూడు నాలుగేళ్లు కటకటాల మధ్య ఉండగా, అరలక్ష మంది వివిధ నిర్బంధాలకు లోనైనారు. పోలీసు చర్య తరవాత ఆంధ్రలో, విశాలాంధ్రలో కమ్యూనిస్టు పార్టీ బలపడింది. 1952 ఎన్నికల్లో 85 మంది శాసనసభలకూ 19 మంది లోక్‌సభకూ ఎన్నికయి నారు. భారతసేనలను కూడా ప్రతిఘటించవలసిన దుస్థితిలో ఉద్యమాన్ని విరమించక తప్పలేదు. ఓటమి ఫలితాలనూ పర్యవసానాలనూ విమర్శించటంలో అభిప్రాయభేదాలు వచ్చి అవిభక్త కమ్యూనిస్టు పార్టీ చీలిపోయింది. మరోవైపు నైజాం నవాబు రాజ ప్రముఖయినాడు. రాజభరణాలు పొందాడు. అప్పటి రాజభక్తులైన భూస్వాములు పోలీసుచర్య తరవాత క్రమంగా పుంజుకున్నారు. తెలంగాణాలో కాలక్రమాన బలపడి నేటి నక్సలిస్టుల పుట్టుకకూ విజృంభణకూ కారకులైనారు. సాయుధ పోరాటం ఆశించిన ఫలితాలను ఈనాటికీ సాధించలేదు. అందువల్ల సంఘర్షణ తప్పటంలేదు.

స్వతంత్ర భారతంలో జరిగిన మొట్టమొదటి భయంకర సాయుధ సమరం తెలంగాణా పోరాటం. దాని వైఫల్యాలకు కారణాలనేకం. అది నేర్పే గుణపాఠాలు అపారం. సుందరయ్యగారు వాటిని కూడా క్రోడీకరించి చర్చించారు. ఆయన అభిప్రాయాలు అందరికీ నచ్చకపోవచ్చు గాని, ఆయన కళ్లకు కుట్టినట్టు వర్ణించిన పోరాటగాథల చరిత్రలో ఎవరూ తప్పుపట్టలేరు. దాని కాయన ప్రత్యక్షసాక్షి, ఉద్యమ నాయకుడు. చరిత్ర దృష్టితో చూడదలచిన వారికీ మహాగ్రంథం పేదల బాధలూ కన్నీళ్లూ కష్టాలూ వారనుభవించిన దుర్భర జీవితాలనూ వివరించి, చరిత్ర రాణుల ప్రేమపురాణాలు కావని రుజువు చేస్తాయి. సాహిత్య దృష్టిలో ఇదొక చారిత్రక విషాదకావ్య మనిపిస్తుంది. కంటనీరు పెట్టకుండా ఈ మహారచనను చదవగలగటం అసాధ్యం – కమ్యూనిస్టు సిద్ధాంతాలను వ్యతిరేకించే వాళ్ళు కూడా. మన గత చరిత్రకు ఇది అద్దం పడుతున్నది. తప్పక చదవవలసిన మహాగ్రంథమిది.

6.10.1996

# చాసో కవితలు

– చాగంటి సోమయాజులు

కథా రచయితగా పేరుమోసిన చాగంటి సోమయాజులు (చాసో) చిన్న వయసులో రాసిన 'పిడికెడు కవిత'లను (పే.24) ఆయన కుమారుడు శంకర్ 1957లో ప్రచురించాడు. ఇది పునర్ముద్రణ. ఆయన కథానికల సంఖ్యే అల్పం. కవితల సంఖ్య అల్పాల్పం. 'గంగిగోవు పాలు కడివె డైనను చాలు' నన్నట్లు కొద్దిగా రాసి పెద్దగా పేరు సంపాదించిన ఉత్తమ రచయితల్లో చాసో ఒకరు. 1937 – 46ల మధ్యకాలంలో రాసిన పది కవితలను ఈ రూపంలో పునః ప్రచురించారు. రాయటం, రాయగానే ప్రచురించటం చాసో లక్షణం కాదు. తనకు నచ్చిన వాటినయినా, ఏ మిత్రుల, అభిమానుల నిర్బంధం మీదనో ప్రచురణ కివ్వటం ఆయన ఆచారం. ఇందులోని కవితలన్నీ ఒకప్పుడు ముద్రితాలే.

'వంతెనపైన' అనే శీర్షికతో 1940లో చాసో రాసిన కవితాఖండాన్ని రోణంకి అప్పల స్వామిగారు ఇంగ్లీషులోకి అనువదించారు. దాన్ని అనుబంధంగా ప్రచురించారు (పే. 21–22). కె.వి.రమణారెడ్డిగారు, మానేపల్లివారు, చాసో పుత్రిక తులసిగారు రాసిన విమర్శ వ్యాసాలను కూడా అనుబంధంలో చూడవచ్చు (పే.23–47). 'అల్పాక్షరముల ననల్పార్థరచన' చేసిన, చేయగలిగిన కొద్దిమందిలో చాసో ఒకరు. 'ఉమ్మెత్తలో రిమ్మెత్తిన తుమ్మెద'లనూ (పే.9), 'ఎడారి చూపు'లనూ 'చిగురులు పెట్టిన చీకట్ల'నూ (పే.12), 'తాళ్ళలా వేళ్ళాడుతున్న పిల్లలనూ' (పే.14), 'అక్షయపాత్రలాగున్న అర్ధచంద్రుణ్నీ' (పే.15), 'ఏరై పరుగెత్తుతున్న ఏడ్పునూ' (పే.17) చూసి కవిలా పాఠకులు కూడా కరిగిపోవచ్చు. మొత్తం సంకలనంలో 'కాందిశీకుడు' గుండెలు పిండే కావ్యఖండం (పే.19). పొట్టకోసం పెళ్ళాం బిడ్డలనూ ముసలితల్లినీ వదిలి రంగం (రంగూన్) వెళ్ళిన అభాగ్యుడు యుద్ధకాలంలో ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని కాలిబాటను నడిచి స్వగ్రామం చేరినప్పుడు తల్లి కొడుకును చూసి 'మారురైతుకు పోయె మన సాగుభూమిరో, మారు మనుముకు పోయె నీబిడ్డ తల్లిరో' అని బావురు' మని 'నిప్పు నేకున్నాము, నీకేటి పెట్టేది?' అని గుండెలు బాదుకోవటం బండరాతి నయినా కరిగిస్తుంది. కొద్దిమాటల్లో అనంతవేదనను ప్రకటీకరించిన చాసో కవితామార్గంనుంచి కథా రచనవైపు మరలటం తెలుగుసాహితి దురదృష్టం. ఈ ఒక్క కావ్యఖండం చాలు ఆయన రచనాశక్తిని చాటి చెప్పటానికి.

సమాజంలోని దౌర్భాగ్యాన్ని సానుభూతితో గమనించి దానికి కావ్యరూపమిచ్చిన చాసో అభినందనీయుడు. నినాదాలు కవిత్వ మనుకొనే అమాయక కవికిశోరాలు తప్పక చదివి మార్గనిర్దేశం చేసుకోటానికి ఈ చిరుపొత్తం ఉపకరిస్తుంది.

13.10.1996

# పోతన భాగవతం - శృంగారం

– డాక్టర్ మేళ్లచెర్వు భానుప్రసాదరావు

నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి పిహెచ్.డి పట్టం పొందిన పరిశోధన ఫలితం ఈ రూపంలో వెలువడింది. ఇందులో అయోగవియోగసంభోగ శృంగార భేదాలనూ వాచికాంగిక క్రియా శృంగార విశేషాలను బమ్మెర పోతన ఎలా భాగవతంలో 'అతి శ్రీనాథం'గా 'అతి మాన

సంగా' వర్ణించాడో సోదాహరణంగా రచయిత వివరించారు. అసలు భాగవత కల్పతరు వర్ణననే శృంగారపరంగా వ్యాఖ్యానించారు (పే. 167). పోతన భక్తి శృంగార రసపరిప్లావితంగా (పే. 4) మహాభాగవత రచనచేసి 'పారలౌకిక ఆనందాన్ని' (పే. 7) పాఠకులకు కల్పించాడని నిరూపించారు. భాగవతులూ నిరీశ్వరవాదులూ ఈ రహస్యాన్ని గుర్తించలేకున్నారని బాధ పడ్డారు (పే. 109). గ్రంథాంతంలో పోతన భాగవతం 'అతిమానుష మానుష శృంగార రత్నాకర'మని (పే. 198) నిష్కర్ష చేశారు. శ్రీకృష్ణపరమాత్మ 'అనుచిత శృంగారం' (పే. 151), పోతన వర్ణించిన 'నిరింద్రియ శృంగారం' (పే. 150) ఎంత మహత్తరమైనవో ఈ గ్రంథ పఠనంవల్ల తెలుస్తుంది. పోతన రసాభాస పోషణ (పే. 137) కూడా సమర్థనీయ మనిపిస్తుంది. ఆ మహాకవి ఇంతటి శృంగార వీర ప్రదర్శనకు దిగటానికి కారణం ఆనాటి రాజుల, రాజకవుల, కవిరాజుల అభిరుచి మాత్రమే కాదని, అప్పటి 'ప్రజల' శృంగారచింతనకూడా అంత పర్యాప్తమేనని రచయిత విశ్వాసం (పే. 6-8).

తాము పూజించే దేవీమూర్తుల అంగాంగ వర్ణన చేయని భక్తులైన కవులు లేరనిపిస్తుంది. కానీ కాళిదాస కుమార సంభవంలోని పార్వతీపరమేశ్వరుల సంభోగవర్ణన 'పిత్రో స్సంభోగవర్ణన మివ సుతరా మసహ్య' మని అధిక్షేపించిన ఆనందవర్ధనాచార్యుల వంటి విమర్శకులూ ఉండేవారు పూర్వం. మరోవైపు గీతగోవిందంలోని శృంగారం జీవాత్మపరమాత్మల సంయోగమని హర్షించి భక్తిపారవశ్యంలో మునిగి తేలినవాళ్ళూ ఉండేవారు. ప్రస్తుత రచయిత రెండో కోవకు చెందినవారు. జనశ్రుతిలో, చివరకు సినిమాల్లో కూడా నిరాడంబరుడుగా మహాభక్తుడుగా లోకం గుర్తించిన పోతన పరమశృంగారి అని, ఆయన భోగినీ దండకం కన్నా భాగవతమే శృంగారమయ మని ఈ పరిశోధన నిరూపిస్తున్నది. 'మధురభక్తి'ని ప్రతిపాదిస్తుంది. 'పుష్టిమార్గాన్ని' నిర్దేశిస్తుందో లేదో తెలియదు.

పరిశోధకులు తమ పూర్వ నిర్ణయాలకు విరుద్ధమైన అభిప్రాయాలను ప్రస్తావించటం, చర్చించి తమదే సముచిత నిర్ణయమని నిరూపించటం అవసర మనీ శాస్త్రీయమనీ గుర్తించరు. అది నేటి సంప్రదాయం. అందువల్లనే 'ఇందలి రతిక్రమ విధానం కామశాస్త్ర ప్రసిద్ధమైన క్రమంలోనే సాగింది' (పే. 149) అని నిర్దాక్షిణ్యంగా చెప్పగలిగారు. 'రతిచక్రప్రవృత్తస్య నైవ శాస్త్రం న చ క్రమః' అనే మరో వాదముందని రచయిత గుర్తించినట్లే లేదు. మొత్తంమీద ఇది ప్రవరులకు నిషిద్ధగ్రంథం. మాయాప్రవరులకు ఉపాదేయం. వాత్స్యాయన కామసూత్రాలను వేరే చదవనక్కరలేదు. కోణార్క ఖజురాహో శిల్ప చిత్రాలను కూడా సందర్భోచితంగా ముద్రిస్తే బ్రహ్మాండంగా ఉండేది. వృద్ధ రసికులు మానసికానందాన్నీ, యువకులు కాయికానుభూతినీ పొంది మోక్షసాధకులు కావటాని కిది ఉపకరిస్తుంది.

1.12.1996

# యతిగీతం

మూలం - స్వామీ వివేకానంద

అనుకృతి - గజ్జెల మల్లారెడ్డి

జగత్ప్రసిద్ధుడైన స్వామీ వివేకానంద 'కవితా సంపుటి' ఇది. సికిందరాబాద్‌లోని

యువకళావాహినివారు ప్రచురణకర్తలు. బెంగాలీ, సంస్కృతం, హిందీ భాషల్లో స్వామి అప్పుడప్పుడు రాసిన కవితలను, పాటలను, స్తోత్రాలను యతిగీతం పేరిట ప్రచురించారు. తెలుగుచేసినవారు గేయకవితలో సిద్ధహస్తులైన మల్లారెడ్డిగారు. బహుశా మూలరచనల హిందీ అనువాదాలకిది 'అనుకృతి' కావచ్చు. అనువాదమో కాదో, ఎటువంటి అనువాదమో నిరూపించటానికి ఈసంపుటిలో మూలరచనల్లేవు. ఇందులో 25 గేయాలున్నాయి. వాటిలో సర్వోత్తమ రచన 'సృజనగీతం'. దాన్ని పరిచయకర్తలు 'సృష్టి' అని వ్యవహరించారు. అది వివేకానందరచన అనేకన్నా ఋగ్వేదంలోని నాసదీయసూక్తానికి ఆయన చేసిన అనుకృతికి తెలుగు రూపమని చెప్పటం మంచిది. లేఖాయణం అనే 24వ కవితకు ఆ శీర్షికను మూల రచయితే పెట్టారో అనుకృతికారులు పెట్టారో తెలియదు. వ్యాకరణం ప్రకారమది 'లేఖాయనం' అని ఉండవలసింది.

'అది ఛందోవాక్యంలో అతిరమ్యమనోజ్ఞ విరతి, సంగీత విభావరిలో సమరస లలిత విరామం' (పే. 8); 'కన్ను లన్నిటి చూడగలవుగాని, తమ్ము తామెప్పుడూ దర్శించనేలేవు!' (పే. 24); 'పగతో పగ రగులుతుంది, చావులోన బ్రతుకులోన' (పే. 34;) 'చావొకటే కాదు బ్రతుకు సైతం జీవికి శాపం' (పే. 35); 'రాళ్ళూ చెట్లూ ప్రకృతి నియమాలను మీరలేవు, అవి ఎప్పుడూ యథాస్థితికి అచ్చమైన నమూనాలు' (పే. 49); 'పడిన కెరటం లేచి తీరును' (పే. 52); 'వణికించు చలిగాలి వసనమైతే నేమి?' (పే. 56); 'పుడమి కడుపులో రగిలిన మంటల కొండలు సైతం కుతకుతలాడెను' (పే. 70); 'చషకాలలోన ద్రాక్షాహృదయ రక్తమ్ము' (పే. 70); 'సుఖములో దుఃఖమ్ము సుధలోన గరళమ్ము ఉన్న దిదియే లోకవృత్త సారాంశమ్ము' (పే. 72-3) వంటి చక్కని భావా లీకవితల్లో కనిపిస్తాయి. కొన్ని సందర్భాల్లో – ఉదాహరణకు, 'కడలేని కడగండ్ల వడగండ్ల వానలో, తడిసి ముప్పందుమై...." (పే. 49) వంటిచోట్ల వివేకానందుల పాలెంతో, మల్లారెడ్డి భాగమెంతో నిరూపించటం కష్టం.

పెరుగులో వడ్లు కలిసినట్లు 'అసత్ నుంచి (పే. 22), తృటిలోన (పే. 34), శృతిపథములో (పే. 70), యవ్వనరీవి (పే. 71), పండిజ్జీ (పే. 79) వంటి ప్రయోగాలు బాధిస్తాయి. 'సర్వభూతేభ్య ప్రవచనం (పే. 5), మిథ్యా స్వప్నాల తెరలు నీనా మధ్యాన ఇకపై (పే. 15), అవాంగ్మానసగోచరం (పే. 16), కృంగేటప్పుడు (పే. 19), భజన జపతప సాధనలను (పే. 24), దివ్యాలేశ ప్రాభావితమై' (పే. 78) వంటి అవ్యాకృత ప్రయోగాలు లేకుంటే బాగుండేది.

కొన్ని సందర్భాల్లో భావాభివ్యక్తి అస్పష్టంగా ఉంది. మచ్చుకు – 'ఒక స్వప్నంవోలె ప్రకృతి, ఏకజలార్ణవ మయ్యెను' (పే. 28), జ్ఞాతాజ్ఞానం జ్ఞేయం ఏకీకృతమైనప్పుడు (పే. 29), ఈ రహస్యం నానడే, అది నను జడిపిస్తుందా?' (పే. 77) వంటివి. అయితే 'తొలి మలి సంజల కెంజాయలలో, జలధితరంగ్గ మృదంగఘోషలో, పులుగులు చేసే కలగానంలో (పే. 19), 'శిశిరంలో కడుగుకున్న, ముఖాలెత్తి పుష్పమ్ములు, ఆకాశంలో వెలిగే, అహస్కరుని దర్శించును' (పే. 32) వంటి కవితలు ఆహ్లాదకరమైనవి. ఇంత మంచి కవితా సంపుటిలో అచ్చుతప్పులు తప్పకపోవటం దురదృష్టం. వివేకానందుల విశ్వరూపంలో ఈ కవితా సంపుటి ఒక అంశ మాత్రం. చదవదగిన రచన.

6.7.1997

# తెనుఁగులెంక తుమ్మల సీతారామమూర్తి కవిత్వం - వ్యక్తిత్వం

- అమూల్య శ్రీ

తెలుగు లెంకగా గాంధీ కవిగా సుప్రసిద్ధులైన కీర్తిశేషులు తుమ్మల సీతారామమూర్తిగారి (25.12.1901- 21.3.1990) కవిత్వ వ్యక్తిత్వాల గురించి ఆయన వీరాభిమాని, ఆయన దగ్గర కృతి పుచ్చుకొన్న భాషాసాహిత్యాభిమాని అమ్ములయ్యగారు రాసిన మహాగ్రంథమిది. తన జీవిత కాలంలో ఒక్క గాంధీ మీదనే పదిహేనువేల పద్యాలు పైగా రాసి, జీవితాంతం గాంధీమార్గంలోనే నిరాడంబరంగా నిత్యసత్యవ్రతంతో ఒకరి దగ్గర చేయి చాచకుండా, తాను కృతి ఇచ్చినవారినుంచి కూడా ప్రతిఫల మాశించకుండా ఆదర్శజీవితం గడిపిన ఉపాధ్యాయుడి జీవితగాథ ఇందులో ఉంది. బిరుదుల కోసం, పదవుల కోసం, ధనగౌరవాల కోసం ఆత్మగౌరవం అమ్ముకోడానికి వెనుదీయని సాధారణ కవులు వందల సంఖ్యలో బతుకులు వెళ్ళదీస్తున్న కాలంలో వాటిని ఆశించని, పెద్దలిచ్చిన 'అభినవ తిక్కన' బిరుదాన్ని కూడా 'నాకు నిది సైరింపరాని ప్రేగాయె మీముందు విడిచెదన్ దీని' (పే.394) అని విసర్జించిన త్యాగాభిమానధనుడి జీవితవిశేషాలు ఈ గ్రంథంలో సవివరంగా చూడవచ్చు. నిస్స్వార్థంగా వినయాశ్రమసేవలో, పన్నుల నిరాకరణ ఉద్యమంలో గాంధీభక్తుడిగా జీవించి ప్రతిఫలం కోరని మహావ్యక్తి తుమ్మల.

1930లోగా ఆయన 24 కావ్యాలు రచించాడు. 'ఆత్మకథ (1936, 1951), మహాత్మకథ (1968), గాంధీగానము (1987) గాంధీకవిగా ఆయనకు పేరు సంపాదిస్తే, ఆత్మార్పణం (1932), రాష్ట్రగానము (1938), పతిగపంట (1993) మొదలైన కవితలు తుమ్మలవారికి రాష్ట్రకవిగా, రైతు కవిగా ప్రశస్తి తెచ్చిపెట్టాయి. తెలుగు కవితలో తెలుగుదనం సాధించాలని ఆయన విశేష కృషి చేశారు. 'నవాక్కర, అభినవాక్కర' అనే కొత్త ఛందస్సులను సృష్టించారు. శ్రీశ్రీ (పే.401), జాషువా (పే.403) లను తొలిదశలో సమదృష్టితో చూడలేకపోయినా పరిణత దశలో అభిమానించారు. సొంత సొమ్ముతో రచనలు ప్రచురించి గాంధేయ మిత్రులకు మాత్రమే అంకితమిచ్చి అభిమానులకు ఉచితంగా ఇచ్చారేగాని కవితావృత్తిలో సంపాదనమార్గా లన్వేషించలేదు. ఆయన కవిత్వం కన్నా ఆయన వ్యక్తిత్వం లక్ష రెట్లు గొప్పది.

గ్రంథంలో అభిప్రాయాలూ, 38 పేజీల అనుబంధాలూ కాక, 14 అధ్యాయాల్లో ఆయన వ్యక్తిత్వ విశిష్టతనూ రచనాశక్తినీ అక్కడక్కడ కొన్ని పునరుక్తులతో గ్రంథకర్త చర్చించారు. వీరాభిమానికాబట్టి నేటి పరిశోధక విద్యార్థుల ధోరణిలో సమస్త విషయాల్లోనూ తుమ్మలవారికో ప్రత్యేక స్థానం కల్పించాలని తాపత్రయపడ్డారు. 'నవ్యసంప్రదాయ భావవిప్లవ కవి'గా తుమ్మల వారికి గుర్తింపు రాలేదని (పే.141-169) వ్యసనపడటం నిష్ప్రయోజనకరం. తుమ్మలవారికి ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్రలో ఉన్న స్థానాన్ని అటువంటి గుర్తింపు పెంచదు - తుంచదు. ఈ ఒక్క విషయాన్నీ, అక్కడక్కడ 'అరాటంనకు' (పే.21) వంటి అపప్రయోగాలనూ మినహాయిస్తే ఈ తరం సాహితీపరులు చదివి తీరవలసిన ఉత్తమ గ్రంథమిది. గాంధీజీకీ ఆయన విధానాలకూ లేని ఆమోదం ఈ కాలంలో ఆయన అనుయాయి అయిన తుమ్మలవారికి రాకపోవచ్చు. అంతమాత్రాన వారి వ్యక్తిగౌరవాలకు భంగమేమీ లేదు. ఆదర్శరహితమైన నేటి

(కవి) సమాజం ఇటువంటి రచనల ద్వారా సచ్ఛీలతనూ ఆత్మగౌరవాన్నీ అలవరచుకోగలిగితే అదే పదివేలు. రచయిత పరిశ్రమ ప్రశంసనీయం.

7.9.1997

## పలుకు చిలుక

**- బేతవోలు రామబ్రహ్మం**

ఇది 'ఆధునిక భారతీయ భాషాకవితలకు పద్యానుసృజన'గా వెలువడ్డ రచన. ఇండియన్ లిటరేచర్, ఉదయభారతి పత్రికల్లో ప్రచురితమైన భారతీయ భాషా కవితల్లో అనువదనీయ మనిపించి, 'హృదయ సహధర్మం కుదిరి' ఈ రచయిత పద్యరూపంలో పెట్టిన 50 కవిత లిందులో కనిపిస్తాయి. గ్రంథ ప్రచురణకు తెలుగు విశ్వవిద్యాలయం వారు మూడువేల రూపాయల ఆర్థిక సహాయం చేశారు. తమ సంస్థలో అనువాదశాఖ కూడా ఉంది కాబట్టి పఠన పాఠనాల్లో ఈ గ్రంథం విశ్వవిద్యాలయం వారికి కూడా ఉపయోగపడుతుంది. వీటిలో కొన్ని ఇంతకుపూర్వమే పత్రికల్లో వచ్చాయి; ఆకాశవాణి వినిపించినవి కొన్ని ఉన్నాయి. రచయిత పద్యసాహితి పునరుద్ధరణ దృష్టితో 'అనుసృజించారు'– అనువాదం చేశామని చెప్పలేదు. మూల రచనలతో పోల్చుకుని పరిశీలించటం సాహితీ జిజ్ఞాసువుల కర్తవ్యం.

ఈసంపుటిలో "ఏవో నాలుగయిదు పదాలు తప్ప అప్రసిద్ధ పదాలు కూడా వాడలేదు" అంటూ కొన్ని 'పదకల్పనలు' చేసినట్లు రచయిత పేర్కొన్నారు (పే. 17). "కొండ చనుబాలు (పే. 6), వానకత్తి (పే. 14), మబ్బుపువ్వు (పే. 15), గుండె చప్పుడు గీతలు (పే. 29), సెల యేటి పండుముసలి (పే. 29), ఎడంద యుద్ధము (పే. 75), రెండునాల్కల చీకటి" (పే. 81) వంటివి మంచి పదబంధాలు. "కాగిన రాగిపళ్ళెరముగా నెరుపెక్కిన నేల (పే. 13), సగము చెక్కిన చీకటి రాతిబొమ్మ" (పే. 33) వంటివి ముచ్చటగొలిపితే, "ప్రసవించిన కన్నతల్లి" (పే. 58) వంటివి సుబోధం కావు. రచన సాధారణంగా గ్రాంథిక భాషా రూపంలోనే సాగినా 'నెమిలీకలు' (పే. 19), 'కొవ్వొత్తి' (పే. 21) వంటి రూపాలు సమకాలిక సాహితీ ప్రభావంవల్లనేమో చోటుచేసుకున్నాయి.

"అరయఁ గుహరమందు..." (పే. 27) అనే పద్యంలోని రెండో చరణం మాత్రం తేటగీతి పాదం; తక్కిన మూడు చరణాలూ ఆటవెలది పాదాలు. రచయిత కావాలనే ఈ ప్రయోగం చేశారేమో చెప్పలేం. "ఓసి కుసుమమా!...." (పే. 24) అనే పద్యంలోని రెండో పాదంలోని 'చేయంగా' అనే మాట దీర్ఘాంతమైనందువల్ల గణభంగం జరిగింది. 68వ పేజీలోని 'ధనము పంపించు కాగితమ్ము నింపు' అనే గీతపాదంలో అక్షరలోపంవల్ల గణభంగం. "కానీ...." అనే కంద పద్యం చివరిపాదంలో "ఊనిన వేళన్ దుఃఖాశ్రు లురలు గనులన్" అన్న చోట అదేస్థితి (అదే పేజీ). 70వ పుటలోని ఉత్పలమాల మూడోపాదంలోని 'వైద్య' శబ్దాన్ని తొలగించక పోతే గణభంగం తప్పదు. 56వ పేజీ చివరనున్న 'ఉప్పరిగ మీద – గుండెచప్పు దనగ' అన్న గీతపాదంలో 'గుండియ' అనే రూపముంటేనే గణభంగం జరగదు. ఇటువంటి పొరపాట్లవల్ల కవితానుసృజనకు ఇబ్బందిలేకపోయినా పద్యవిద్యకు ప్రమాదం జరుగుతుంది. రచయిత జాగరూకత చూపవలసింది.

తెలుస్తుంది. ఇతరు లెంతటివారో బోధపడుతుంది. భిన్నభాషీయుల మధ్య సదవగాహనకు దారితీసే ఇటువంటి రచనలను ఆహ్వానించాలి. మలయాళకవితల కిందులో పెద్దపీట వేసినట్లుంది. కవితాప్రియులు చదవదగ్గ గ్రంథం.

9.11.1997

## జనకథ

– రాంభట్ల కృష్ణమూర్తి

కవిగా, రాజకీయ కార్టూనిస్టుగా, పాత్రికేయుడుగా ప్రఖ్యాతుడైన రాంభట్ల కృష్ణమూర్తిగారు మార్క్సిస్టు దృక్పథంతో మానవజాతి నాగరకతా సంస్కృతుల వికాసాన్ని తన పద్ధతిలో వివరించిన గ్రంథమిది. స్వయంకృషితో విద్యావిజ్ఞానాలార్జించిన వ్యక్తి కాబట్టి రచయిత విశ్వవిద్యాలయ పరిశోధనల పద్ధతులను అనుసరించలేదు. ఇంతకుముందు బాలగంగాధర తిలక్, ఎస్.ఎ.డాంగే, రాహుల్ సాంకృత్యాయన్, సురవరం ప్రతాపరెడ్డి వంటి వాళ్లు ఈ రంగంలో తమ అభిప్రాయాలను స్పష్టీకరించారు. రాంభట్లవారు మార్క్స్, ఏంగెల్స్, మోర్గనులతో కొన్ని సందర్భాల్లో విభేదిస్తూ కూడా, మార్క్సిస్టుగా మానవజాతి చరిత్రను తమ దృష్టితో పరిశీలించి కొన్ని నిర్ణయాలకు వచ్చారు. వాటి నీగ్రంథంలో ప్రతిపాదించారు. అందువల్ల అనేకస్థలాల్లో 'నా అభిప్రాయం' అని స్పష్టీకరించారు.

ఈ గ్రంథంలో 45 ప్రకరణాలున్నాయి. ఆహారాన్వేషణలో భాగంగా మానవజాతి పురోగతి సాగిందనీ, అప్పటప్పటి అవసరాలకు అనుగుణంగా సంప్రదాయాలను కల్పించుకున్నారనీ నిరూపించటం గ్రంథసారాంశం. మానవులు గణాలుగా ఉండి వ్రాతాలుగా పరిణమించి జనంగా పర్యవసించటానికి లక్షల సంవత్సరాలు పట్టాయని, మూడు మహాయుగాలుగా ఈ పరిణామ చరిత్రను విభజించవచ్చని, ఒక్కో మహాయుగం 6 లక్షల సంవత్సరాలయినా ఉందని, వాటిలో అంతర్యుగా లున్నాయనీ గ్రంథకర్త నిరూపించారు. మొదటిది శావేజీ మహాయుగం. దాన్ని క్రవ్యాదమహాయుగమంటే బాగుండేది. రెండోది బర్బర మహాయుగం. మూడోది నాగరక మహాయుగం. తొలియుగంలో మానవుడు అరణ్యజీవనంచేస్తూ మౌనాన్వేషణలో ఉండి మాతృస్వామిక గణాల్లో బతుకుతుండేవాడు. మత్స్యాహారం తినటం, విల్లమ్ములు కనిపెట్టడం ఆ మహాయుగం చివరి దశ. గ్రామ నిర్మాణం, నౌకా నిర్మాణం, వ్యవసాయం, సాహిత్యసృష్టి, ఆయుధశక్తి పెంపుదల ఆ యుగ విశేషాలు. నగర నిర్మాణం, డబ్బును కనిపెట్టడం, పెట్టుబడిదారీ విధానం మూడోయుగం లక్షణాలు. రెండో యుగంలో 'పశ్వాన్నం' తినటం మొదలుపెట్టాడు. 'పశ్వన్నం' అంటే వ్యాకరణదోషం రాదు. మాంసాహారం అంటే సులభంగా అర్థమయ్యేది.

సంస్కృతభాషనూ వేదసాహిత్యాన్నీ తెలుసుకొన్న పాశ్చాత్య విద్వాంసులు పురాణగాథలను పోల్చి చూడటం మొదలుపెట్టారు. మానవుడి పుట్టుక, మూలభాషల ఏకత్వం వగైరాలను చర్చించారు. రాంభట్ల వారు ఆ పద్ధతిలో మానవోత్పత్తి బైకాల్ సరస్సు దగ్గర మొదలయిందని, పందినుంచి వ్యవసాయ విద్యను మొట్టమొదట సుమేరియన్లు నేర్చుకున్నారని (అందుకే 'ఆదిసూకరవేదవేద్యుడు' మహనీయుడట), సుకన్యాచ్యవనుల కథ మనదేశంలో జరిగింది కాదని, అసుర ఉన్మన్ మందాయి మ[illegible]గు 'మందికి' పూర్వబంధువని, కేదారగౌరీ వ్రతం,

సుక్కమ్మపూజ, ఎంకిడు వంటి తెలుగువాళ్ల సంప్రదాయాలకు ఎక్కడెక్కడో పూర్వరూపాలున్నాయని గ్రంథకర్త నిరూపణ.

శబ్దసాదృశ్యాన్ని బట్టి నిర్ణయాలకు రావటం, తన నిరూపణలకు ఆధారమైన ఇతర గ్రంథాలను ప్రస్తావించకపోవటం స్థూలలక్షణాలు. సాధారణ పాఠకులను దిగ్భ్రాంతులను చేసే, పండితుల గుండెలు చీల్చే అనేక విశేషాలు గ్రంథంలో ఉన్నాయి. మానవజాతి చరిత్రను మరోకోణంలో చదివి తెలుసుకోదలచిన వారందరికీ ఈ రచన అవశ్యపఠనీయం.

23.11.97

## మన తెలుగు తెలుసుకుందాం...

– డాక్టర్ ద్వా.నా.శాస్త్రి

అమలాపురంలోని ఎస్.కె.బి.ఆర్. కళాశాల తెలుగుశాఖలో రీడర్‌గా పనిచేస్తున్న ద్వా.నా.శాస్త్రిగారు ఇంతకుపూర్వం ఒకానొక దినపత్రిక ఆదివారం సంచికలో 'ఇదీ మన తెలుగు' అనే శీర్షిక కింద ధారావాహికంగా ప్రచురించిన వ్యాసాలను ఈ రూపంలో ఇప్పుడు ప్రచురించారు. శీర్షికను మార్చి భాషా సాహిత్య విశేషాలను 'పాపులర్'గా చెప్పాలనే ఈ ప్రయత్నంలో "ఊహమీద ఆధారపడి చెప్పినవీ కొన్ని ఉన్నా"యని గ్రంథపరిచయం చేసిన రామనరసింహం గారు పేర్కొన్నారు, 'మిత్రవాక్యం'లో. అది నిజమే. గ్రంథరూపంలో పెట్టిన వ్యాసపరంపరకు విషయసూచిక లేదుగాని, ఉపశీర్షిక లున్నాయి.

తెలుగులోని ధ్వనులనూ వాటికున్న లిపినీ చర్చిస్తూ 'f' సంగతి ప్రస్తావించారుగాని (పే.6), ae విషయ మెత్తుకోలేదు. 'అచ్చిక తెలుగు – అచ్చతెలుగుగా అయింది' (పే.9) అనే వాక్యార్థం సరిగా బోధపడదు. చిలక శబ్దం చిల్కగా మారిందనటం, అక్షరాలు (ధ్వనులుకాదా?) తారుమారయినందువల్ల నవ్వులాట అనేది నవ్వుటాలగా మారిందనడం (పే.12) భాషాశాస్త్ర పద్ధతి కాదు. "పర్యాయపదాలు – అన్ని భాషల్లోనూ ఉంటాయి" (పే.15) అనేది 'పాపులర్' ప్రసంగం. నిజానికి ఏ భాషలోని ఏ రెండు మాటలూ అన్ని సందర్భాల్లోనూ ఒకటి మరోదానికి పర్యాయపదం కాదని భాషాశాస్త్ర సిద్ధాంతం. "సంస్కృతం వాడుకలో లేదు కాబట్టి పూర్తిగా వ్యాకరణానికి లొంగిపోయింది. కాబట్టి, ఆ భాషలో అర్థాలకి పెద్ద మార్పులేవీ ఉండవు" (పే.25) అనేది పూర్తిగా శాస్త్రవిరుద్ధమైన, అనాలోచితనమైన తీర్మానం. "ముక్కడి (ముక్కులేనివాడు)" వంటిచోట్ల అచ్చుతప్పులున్నాయి. (పే.37). ఉప్పిడి, ఉప్పిండి అనే రూపాంతరాల్లో కేవలం వ్యతిరేకార్థంలో ఇడి ప్రత్యయం వాడుకలో ఉందని గుర్తించినట్లు లేదు. 'శక్తివంతంగా' (పే.74) వంటి 'అక్షర దోషాలను' పరిహరించలేదు.

అక్షరదోషాలను వివరించటం, కొన్ని జాతీయాలకు వివరణ లివ్వటం బాగుంది. కాని 83వ పేజీ నుంచి 'ప్రకటన'లను– వాణిజ్య ప్రకటనలను – ఎత్తిరాసిం దెందుకో తెలీదు. వాటిని విశ్లేషించి గుణదోష చర్చ చేయనప్పుడు ఆ ప్రసంగం అనవసరమనిపిస్తుంది. అలాంటివే 'ఉత్తరాల కథ' (పే.76–82), తెలుగు వచన రచనలోని భేదాలూ (పే.86 నుంచి). ఏదో ఒక నిర్దిష్ట ప్రణాళికకు కట్టుబడి రాసివుంటే బాగుండేది. తోచిన భిన్న విషయాలన్నిటినీ ఒకచోట చేర్చటంవల్ల ఉద్దేశించిన ప్రయోజనం నెరవేరదు. అయితే సులభంగా వివరించాలన్న ప్రయత్న

భావాలు హర్షించదగ్గవి. క్లుప్తంగా ఈనాటి తెలుగును గురించి తెలుసుకోదలచినవారికి ఈ గ్రంథం కొంత ఉపయోగపడుతుంది.

14.12.1997

# ప్రజావాఙ్మయము

**– చింతా దీక్షితులు**

**సు**ప్రసిద్ధ కవి, కథారచయిత చింతా దీక్షితులుగారు శ్రీశ్రీ వంటి వారికి మార్గదర్శకులని పించుకొన్న వ్యక్తి. ఆయన వ్యాససంగ్రహం 1955లో చలంగారి పీఠికతో వెలువడింది. ద్వితీయ ముద్రణగా ఈ రూపంలో ఆ గ్రంథం ఇప్పుడు వెలుగు చూసింది. ఇందులో స్త్రీల సారస్వతం, ఆడవాళ్ల పాటలు, బాలవాఙ్మయం, బాలసాహిత్యం, యక్షగానం, కొరవంజి అనే అంశాల మీద ఆయన భిన్న సమయాల్లో రాసిన ఆరు వ్యాసాలున్నాయి. ఆయా విషయాలమీద తరవాత కాలంలో అనేక పరిశోధనలు జరిగినా, నూతనాంశాలు ఆవిష్కృతమైనా, ఈ తొలి తరం మహారచయితను ఒకటి రెండు స్వల్ప విషయాల్లో తప్ప విభేదించవలసి రాదు. అదే ఆయన ప్రత్యేకత.

జానపద సాహిత్యం ప్రత్యేక లక్షణాల్లో కర్త ఎవరో తెలియకపోవటం, భిన్నప్రాంతాల్లో పాఠాంతరాలు చేర్పులతో మార్పులతో దొరకటం వంటి వుంటాయనేది నేటి విశ్వాసం. దీక్షితులుగారు "కుయ్యూరి గ్రామమందలి సీతారామదాసు వ్రాసిన పాట"ను (పే.3), రామ చంద్రరాజు రచించిన కుశలాయకాన్నీ (పే.11) ప్రస్తావించారు. లిఖిత సారస్వతంలో ఆయా ప్రజావాఙ్మయ ధోరణుల పూర్వరూపాలు కనిపిస్తాయని ఉదాహరించారు. ప్రజావాఙ్మయంలోని ఉత్తమ రచనలను బయటికి తీశారు – చక్కని చిక్కని తెలుగు భాషకు నిదర్శనలుగా. "కఠినంబు లుంచితే కాపులకు తెలియదని, మరుగు లుంచుట మాని మాట లుంచితిని (పే.11), చేసిన పాపమ్ము వండిన చద్ది, కుడువకపోదయ్య కొంతకాలముకు (పే.13), ఆడవారికి గలవు అగ్ని మంత్రములు, అలికేరు తుడిచేరు ముగ్గుపెట్టేరు, మండేటి మంటలకు మారు మసిలేరు (పే.14), రమణిరో! నిను చూసినప్పుడె, రాతిరే శివరాతి రాయెను (పే.53) వంటి మధురగీతాలను ఆవిష్కరించారు.

సూళాదులు తమకు దొరకలేదని (పే.25) దీక్షితులుగారు విచారపడ్డారు. నేటికీ దొరికినట్లు లేదు. తమ నాటికి తెలిసిన 400 యక్షగానాల్లో సగం మాత్రమే ముద్రితమైనా యన్నారు (పే.51). ఈనాటికీ అదే పరిస్థితి మార్పులేకుండా కొనసాగటం తెలుగుజాతి భాషా సాహిత్యాభిమానాలకు నిరూపణ. "సంస్కృత నాటకాల్లో విదూషకుడివంటిదే తెలుగు యక్షగానాల్లో కొరవంజి" (పే.57) అనే దీక్షితులుగారి అభిప్రాయం పూర్తిగా సమర్థనీయం కాదు గాని ఆయన సహృదయ విమర్శకుడే గాని, పరిశోధకుడు కానందువల్ల ఇటువంటి ప్రసంగం వచ్చివుంటుంది.

గ్రంథం ఆసాంతం చదివిస్తుంది. అక్షరాక్షరం దీక్షితులుగారి ఆర్ద్రమనస్సును ప్రతిఫలిస్తుంది. చదవదగ్గ పుస్తకం.

28.12.1997

# దిశ (వ్యాస సంపుటి)

– డాక్టర్ నముమాస స్వామి

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడర్‌గా ఉన్న నముమాసస్వామిగారు బహు గ్రంథకర్తలేగాక పరిశోధకులు కూడా. తెలుగు కథా సమితిని స్థాపించి కథాసాహిత్య సేవ చేస్తున్నవారు. ఈ వ్యాససంపుటిలో ఆయన కథాగతికి సంబంధించిన ఏడు వ్యాసాలను ప్రచురించారు. "1995 కథాకమామీషు, తెలంగాణా రవళి వినిపించిన కథకుడు సురమౌళి, సమకాలీన కథారచన ధోరణులు, కథాసాహిత్యంలో 'దిశ', తెలుగు కథను కాపాడుకునేదెలా? అటు పత్రికలు ఇటు రచయితలు మధ్య నలిగే మంచి కథ, కథకులకీ – పాఠకులకీ మధ్య దూరం వ్యాపారమే" అనే వవి.

రచయిత 1995లో వెలువడ్డ తెలుగు కథా సాహిత్యం మొత్తాన్ని ఆపోశన పట్టి ఆ ప్రక్రియకు మాత్రమే కవితకన్నా, నవలకన్నా అధికాదరణ లభించిందని తేల్చారు. అంటే మిగిలిన రెండు ప్రక్రియాలను కూడా అవలోడనం చేశారని చెప్పాలి. ఆ యేడు వెలువడ్డ 40 కథా సంపుటాలూ వివిధ పత్రికలు ప్రచురించిన రెండువేల కథలూ (పే.10) ఆయన పరిశీలనకు వచ్చాయంటే ఆయన పరిశ్రమ ఎంతటిదో ఊహించవచ్చు. "దళితులే దళితకథలను రాయాలనే నియమం" (పే.10) ఒకటి కొత్తగా వచ్చిందని తెలుస్తున్నది. దళితవాదానికీ స్త్రీవాదానికీ పితృస్వామ్యం మీద వ్యతిరేకత ఉందనే విషయం (పే.12) ఈ రచన ద్వారా తెలుస్తుంది. కాకపోతే ప్రజాస్వామ్యవాదులు, ప్రజాతంత్ర పార్టీలు, పౌరహక్కుల సంఘాలు స్త్రీవాదోద్యమానికి బాసట నిల్చాయి" (అదే.) అనే వాక్యంలో మహదమహత్కర్తలు రెంటినీ అమహత్ క్రియారూపంతో నిర్దేశించటం బాధాకరమనిపించవచ్చు. "భర్త సంపాదనలో ... నాకెందుకంటుంది రాజ్యలక్ష్మి" (పే.16) అనే నాలుగు వాక్యాలు చదివితే విషయమేమో అర్థం కాదు. రచయిత అర్థస్పష్టత కోసం మరింత శ్రమిస్తే బాగుండేది.

ప్రజారసవాదం (పే.19) ఏమిటో సామాన్య పాఠకులకు అర్థం కాదు. "స్వాతంత్ర్యం వచ్చి చైతన్యాన్ని చంపివేసింది" (పే.52), "కథ పాఠకుడికి చేరువకావాలనే మిషతో కథకులు కొందరు వాడుకభాషను ఉపయోగిస్తున్నారు" (అదే), ఇండస్ట్రియలైజ్డ్ సివిలైజేషన్‌లో స్పెషలైజేషన్ ఎలా వస్తుందో కథాకారుల కోసం ఓ సంస్థ ఆవిర్భవించడం అత్యంతావశ్యకం" (పే.51), "ప్రయోజన కరమైన ప్రయోగం లేకపోవడంవల్లే కథ ముందుకు పోవడంలేదు" (పే.45), "సమాజంలో సగంగా ఉండిన నపుంసకలోకంనుంచి తృప్తి చెందని స్త్రీ" (పే.31), "మద్యనిషేధ దుష్పరిణామాలు వ్యక్తుల మూర్ఖత్వం వల్ల జాగాడాలు మామూలేగదా" (పే.18) వంటి అమూల్య వాక్యాలు దురవబోధంగా ఉన్నాయి. ఇంత చిన్న పుస్తకంలో ఉన్న అక్షర దోషాలనూ భాషాదోషాలను ఎత్తిరాస్తే ఇందులో సగం గ్రంథమవుతుంది పరిమాణంలో. పాఠకుల మీద దయదలచటమేగాక ఉపాధ్యాయవృత్తిలో ఉన్నవాళ్లు తమ రచనలు విద్యార్థుల కెలా భాసిస్తాయో గమనించి కూడా గ్రంథాలు ప్రచురించటం మంచిది. తెలుగు కథ, దాని మీద విమర్శ ఎలా ఉన్నాయో ఈ గ్రంథం స్పష్టీకరిస్తుంది.

12.4.1998

## తెలుగు సాహిత్య చరిత్ర

- డాక్టర్ ద్వానాశాస్త్రి

ఇది "తెలుగు సాహిత్య విద్యార్థులకు, గ్రూప్ -1, సివిల్ సర్వీసెస్ మొదలైన పోటీ పరీక్షలకు వుపయోగపడే విధంగా రూపొందించిన గ్రంథం." దీన్ని 'సాహిత్యాంశాలకే' ప్రాముఖ్యం ఇస్తూ, డా. ద్వా.నా. శాస్త్రిగారు రచించారు. గ్రంథకర్త తమ జీవిత విశేషాలను ప్రచురపరుస్తూ తమ జన్మకాలాన్నే విస్మరించారు! చరిత్రగతితో, కాలక్రమ నిర్ణయంతో సంబంధం లేని 'సాహిత్య చరిత్ర'ల్లో బహుశా ఇదే మొదటి మహాగ్రంథం తెలుగులో. నానా విశ్వవిద్యాలయాల్లోని పండిత పరిశోధకులు తమతమ సిద్ధాంత వ్యాసాల్లో కనిపెట్టిన విశేషాలను సేకరించి, గుదిగుచ్చి ఆయా కవుల, ప్రక్రియల మంచిచెడ్డలను ఇందులో నిర్దేశించారు.

గ్రంథం రెండు భాగాలు : ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యం అని. చరిత్రకన్నా సాహిత్యాంశాలే ముఖ్యమనుకొన్నందువల్ల కంకంటి పాపరాజు కవితా వైభవాన్ని విశదీకరించిన తరవాతగాని పురాణ వాఙ్మయం సంగతి గుర్తుకు రాలేదు. నన్నయకు ముందునుంచే ఉన్నదనుకొన్న జానపద సాహిత్యం అవధానవిద్య తరవాత సాక్షాత్కరించింది. ఆధునిక సాహిత్య భాగం మరీ విచిత్రం. ఆధునిక కవిత్వ లక్షణాలు, వాదాలు, ధోరణులు, ప్రక్రియలు, ఉద్యమాలు చర్చలోకి వచ్చిన తరవాత, ఆధునిక సాహిత్య నిర్మాతగా వీరేశలింగం పంతులు, 'వాడుక భాషాయోధుడు'గా గిడుగు రామమూర్తి ప్రస్తావనకు వచ్చారు. గిడుగువారిని గురించి రాస్తుండగా తానే గురజాడతోబాటు ఆధునిక కవిత్వానికి సహాయుగకర్తగా పరిగణించిన రాయప్రోలు గుర్తుకు వచ్చి ఆ ప్రకరణంలో ఉపాంశంగా స్థానం సంపాదించాడు! తరవాత తనకు నచ్చిన కవులను గురించి రాసి, 'మరి కొందరు కవులు' అనే శీర్షికలో వారి పూర్వీలను గుర్తుచేశారు. అభ్యుదయ కవులు, దిగంబర కవులు, విప్లవ కవులు స్మరణకు వచ్చిన తరవాత వారందరికీ పూర్వులైన నయాగరా కవులు స్మృతికి వచ్చి, చేతనావర్త అనుభూతి కవులతో పొత్తు కలిపారు!

గ్రంథకర్త తనకు "సాహిత్యంపట్ల వెర్రి అభిమానం" పుట్టిందని 'ముకుళిత హస్తాలతో'. నివేదించారు. ఆమాట పచ్చినిజ మనిపిస్తుంది. విస్పష్టమయిన రచనా ప్రణాళికగాని, చారిత్రక దృష్టిగాని, అవగాహనగాని లేకుండా అప్పడప్పటికి దొరికిన సిద్ధాంత వ్యాసాల్లోని విషయాలను సేకరించి ఒక వావీవరసా లేకుండా రాసిన అతుకుల బొంత రచన ఇది. వివరాలకు పోతే ఇంత గ్రంథమూ రాయవలసివస్తుంది. ఈ మహాగ్రంథపఠనం ద్వారా పోటీ పరీక్షల్లో నెగ్గిన వారికి వివిధ ఉద్యోగాలిచ్చే ఏర్పాటుంటే లోకానికి ఉపకారం జరుగుతుంది, సాహిత్యానికి అపచారం జరిగినా. వినోదం కోసం చదవవచ్చు. ఆ దృష్టితో చదవండి.

14.3.1999

## రైతుల నీటిపారుదల వ్యవస్థల యాజమాన్యం చట్టం

- వడ్లమాని వేంకటరమణ, ఎ.వి. నాగేష్‌శర్మ

కౌలుదారీ చట్టం, అర్బన్ ల్యాండ్ సీలింగ్ చట్టం, పంచాయతీరాజ్ చట్టం, హిందూలా, వీలునామా వంటి అనేక న్యాయశాస్త్ర రచనలను తెలుగులో ప్రచురించిన తండ్రీకొడుకులు

ఈ గ్రంథాన్ని కూడా వెలువరించారు. తండ్రి ప్రాక్టీస్ చేస్తున్న న్యాయవాది, తనయుడు న్యాయ కళాశాలలో ఉపన్యాసకుడు. ఆంగ్లభాషా పరిచయం అంతగా లేని తెలుగు పౌరుల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని ఈ రచనలు ప్రచురిస్తున్న వీరు మరో విధంగా తెలుగులో శాస్త్రసాహిత్య సృష్టికి సేవ చేస్తున్నందుకు ప్రశంసనీయులే.

ఈ గ్రంథంలో 1997 ఏప్రిల్ నెలలో అమల్లోకి వచ్చిన చట్టానికి తెలుగు అనువాదముంది. రైతు సంఘాల సభ్యులనూ అధ్యక్షులనూ రహస్య వోటింగు విధానం ద్వారా ఎన్నుకోవటం, ఎన్నికైన వ్యక్తుల పదవీకాలం మూడేళ్లకు పరిమితం కావటం ఒక ఎత్తయితే, ఎన్నికయిన సభ్యులను రీకాల్ పద్ధతి ద్వారా గద్దె దించే అవకాశం మొదటిసారిగా కల్పించటం మరో ఎత్తు. ఇదే విధానం శాసన సభ్యులకూ పార్లమెంటు సభ్యులకూ అనువర్తిస్తే పార్టీ ఫిరాయింపుదార్ల బెడదైనా తగ్గవచ్చు. అయితే అది పార్లమెంటు చేయవలసిన శాసనమేగాని శాసనసభ పరిధిలో ఉన్నది కాదు.

చట్టంలోని ఏడు అధ్యాయాలనూ రూల్సునూ అనువదించిన వారు ఫారమ్సును ఉన్నది ఉన్నట్లు ఇంగ్లీషులోనే ఇచ్చారు. వాటిని కూడా తెలుగు చేసినట్లయితే ఇంగ్లీషుభాషా పరిచయం లేని రైతులకు మరింత ఉపయోగకరంగా ఉండేది. సాగునీటిని శాస్త్రీయ పద్ధతుల్లో వినియోగించటాన్ని నియంత్రిస్తూ రాష్ట్ర ప్రభుత్వం చట్టంచేస్తూ, సదరు చట్టం చేసిన ముఖ్యోద్దేశాన్ని న్యాయస్థానాల్లో సవాలు చేయటానికి వీల్లేదనటం విడ్డూరంగా ఉంది. న్యాయస్థాన పరిశీలన సాధ్యపడని భారత రాజ్యాంగంలోని ఆదేశసూత్రాలను కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేయనందువల్లనే ఉచిత ప్రాథమిక విద్య వంటివి అర్ధశతాబ్ది స్వతంత్ర పరిపాలన తరవాత కూడా అందని మానిపండ్లలాగానే మిగిలిపోయాయి. ఎన్నికయిన వ్యక్తులను వెనక్కు పిలిపించే అధికారం లేనందువల్లనే మన రాజకీయ వాదులు పదవీకాలంలో సర్వతంత్ర స్వతంత్రంగా వ్యవహరించగలుగుతున్నారు. ఆ లోపాన్ని రైతుల విషయంలో సవరించిన ఈచట్టం న్యాయపరిశీలనకు అతీతమనటం దురదృష్టం.

ఈ అనువాదాన్ని జాగ్రత్తగా చదివిన రైతులు నీటిపారుదల వ్యవస్థనూ యాజమాన్యాన్నీ సక్రమంగా నిర్వహించగలరు. భాష సులభంగా సూటిగా ఉంది. ఇంగ్లీషురాని రైతులకిది బాగా ఉపయోగపడే గ్రంథం.

13.6.1999

## వీరతెలంగాణా సాయుధ సమరం

**– కందిమళ్ల ప్రతాపరెడ్డి**

అర్ధశతాబ్దం క్రితం తెలంగాణాలో జరిగిన నిజాం వ్యతిరేక, రజాకార్ వ్యతిరేక సాయుధోద్యమం గురించి లోకానికి కొంతయినా తెలుసు. నాలుగువేల మంది ఆత్మార్పణ చేసిన ఆ ఉద్యమాన్ని గురించి రాష్ట్రప్రభుత్వం రూపొందించిన హైదరాబాద్ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో కేంద్ర ప్రభుత్వం తీసుకున్న పోలీస్ యాక్షన్ ఫలితంగా మతోన్మాదుల పతనం పూర్తయిందనీ, తెలంగాణాలోని ఆంతరంగిక వివాదాలు సమసిపోయాయని, 1948 తరవాత అంతా సుభిక్షంగా ఉందనే కట్టుకథ గ్రంథస్థమయింది! నాటి నుంచి నేటి దాకా ఆరని చిచ్చులా రావణకాష్ఠంలా

రగులుతున్న తెలంగాణా వాస్తవ పరిస్థితులను ప్రభుత్వాలు అర్థం చేసుకున్నట్లే లేదు - కార్యకారణ సంబంధాలు పరిశీలించి.

ఈ నేపథ్యంలో ప్రతాపరెడ్డిగారి చరిత్ర కథనం యథార్థగాథను వివరిస్తున్నది. 1857లో ఉత్తర హిందూ స్థానంలో మొదలైన ప్రథమ స్వాతంత్ర్య యుద్ధం నిజాం రాజ్యంలో 1860 దాకా కొనసాగిన వైనం చాలా మందికి తెలియని వీరగాథ. 1857 జులై 17 మధ్యాహ్నం మౌల్వీ అలావుద్దీన్, తుర్రే బాజ్ ఖానుల నాయకత్వంలో జరిగిన బ్రిటిష్ వ్యతిరేక యుద్ధం (పే. 8,9) ఫిదా అలీ ఆత్మసమర్పణ (పే.11), వెంకటప్పనాయక్ 1858లో చేసిన తిరుగుబాటు (పే.12), భీంరావు వీరగాథ (పే. 13), 1859 మార్చి 15న పఠాన్ జహంగీర్ ఖాన్ చేసిన సాహసం (పే. 14), గోండునాయకుడు రామ్‌జీ 1860 ఏప్రిల్లో చేసిన తిరుగుబాటు (పే.15), బేగంబజారు కుట్ర కేసు (పే. 16) వంటివి ప్రభుత్వ చరిత్రకారుల దృష్టికి రాకపోవటం, వాటికి ఇవ్వదగినంత ప్రాముఖ్యం ఇవ్వకపోవటం క్షంతవ్యం కాదు. నిజాం రాజ్యంలోని కొందరు భూస్వాముల అధీనంలో ఉన్న ఆస్తుల వివరాలు (పే. 19-20), వెట్టిచాకిరి వైనం (పే. 20) వివరించిన తరవాత రచయిత ఆంధ్ర మహాసభ ఆవిర్భావ పూర్వరంగాన్ని, అతివాద మితవాద ధోరణులను వంద పేజీల్లో విపులీకరించారు. నిజాం వ్యతిరేక సాయుధ పోరాటంలో 4000 మంది హతులైనారు. 15000 మంది అరెస్టయ్యారు. 200 మంది స్త్రీలు మానభంగాలకు గురైనారు (పే. 185). ఇన్ని దారుణాలకు కారకుడైన నిజాం నవాబుకు రాజప్రముఖ్ పదవి దక్కింది. ఆదాయప్పన్నులేని అరకోటి రూపాయల సాలుసరి భరణం దొరికింది. మరో 75 లక్షల రూపాయల నష్టపరిహారం లభించింది (పే. 187). కాశీం రజ్వీ 1957లో పాకిస్తానుకు క్షేమంగా చేరగలిగాడు. నాటి ప్రధానమంత్రి లాయఖ్ అలీ 1950లో గృహ నిర్బంధంలో ఉండి తప్పించుకొని పోగలిగాడు (!-పే.19).

ఇంకా అనేక విశేషాలను సచిత్రంగా గ్రంథం సమర్పిస్తుంది. ఏకపక్ష చరిత్ర విద్వాంసులు తప్పనిసరిగా చదివి కళ్లు తెరవవలసిన విషయాలెన్నో ఉన్న ఈ గ్రంథాన్ని రచించిన ప్రతాపరెడ్డి ప్రశంసనీయుడు. తెలంగాణా దీనదుర్భర గాథలు చదివి హృదయమున్న వాళ్లు కన్నీళ్లు వదిలి తమ మానవత్వాన్ని ప్రదర్శించవచ్చు. చదివి తీరవలసిన మంచి రచన ఇది.

4.7.1999

## ధ్వన్యాలోకము

**వ్యాఖ్యాత : డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు**

వేదాల తిరువేంగళాచార్యులవారి ఆంధ్ర ధ్వన్యాలోకం తరవాత అంత విస్తృతమైన ధ్వని సిద్ధాంత ప్రతిపాదక గ్రంథాల్లో బహుశా శ్రీరామచంద్రుడిగారి ఈ గ్రంథమే చెప్పదగ్గది. ఇందులో తెలుగు సాహిత్యం నుంచి ఉదాహరణలు లేవుగాని చక్కని వ్యాఖ్యానముంది - 'బాలానందిని' అనే పేరున. కాశ్మీర విద్వాంసుడు ఆనందవర్ధనాచార్యుడు క్రీస్తుశకం తొమ్మిదో శతాబ్దంలో ధ్వని సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ రాసింది ధ్వన్యాలోకం. అంతకుముందే కొంద రటువంటి ప్రసంగం చేసినా, ఆనందవర్ధనుడివల్లే ఈ ఆలంకారిక సిద్ధాంతానికి ప్రశస్తి వచ్చింది. దానికి కారికలూ వృత్తీ ఆయనే రాశాడని, మరెవరో రాశారనీ రెండు వాదాలు వచ్చాయి. పన్నెండో

శతాబ్దినాటి (పే.vii) అభినవగుప్తుడు లోచనమనే వ్యాఖ్యను వెలయించాడు (అట్టమీద అతడు 11వ శతాబ్దివాడని ఉండటం విశేషం). ఉభయులూ మొత్తంమీద నాలుగు వందలకు పైగా ఉదాహరణల నిచ్చారు. ఈ రెంటికీ కలిపి శ్రీరామచంద్రుడు తెలుగులో బాలానందినీ వ్యాఖ్య రచించారు.

అభినవగుప్తుడు స్వీయ భావాలనూ సిద్ధాంతాలనూ చొప్పించే ప్రయత్నం చేశాడనీ, ఇతర వ్యాఖ్యానాదులవల్ల తనకు మూల రచనాతత్వం బోధపడిందనీ ఈగ్రంథ రచయిత పేర్కొన్నారు (పే.viii). ఇలా స్వకీయాభిప్రాయాలు చేర్చటం ప్రౌఢివాద మన్నారు. ధ్వన్యాలోకం వెలువడ్డ తరవాత దాని వ్యాప్తి మొత్తం భారతదేశాన్ని ముంచెత్తింది. అలంకార శాస్త్రంలో మకుటాయ మాన గ్రంథ మనిపించుకొన్నది. సంస్కృత విద్యాభ్యాసం క్రమక్షీణదశలో ఉన్న ఈ కాలంలో ఈ బాలానందినీ సహిత ధ్వన్యాలోక లోచన గ్రంథం తెలుగులిపిలో, భాషలో రావటం ఎంతో మంచిది. ధ్వని భేదాలు మొత్తం 7,420 అని కొందరూ, కాదు 9,940 అని మరికొందరూ వాదించి ప్రచారం చేశారు. అదంతా "బుద్ధి వ్యామోహజనకమైన, ప్రయోగానుపయుక్తమైన చర్చ మాత్రమే"నని ప్రస్తుత వ్యాఖ్యాత నిర్ధరించారు (పే.905). అయినాసరే, ఈ గణితమే చాలామంది అలంకార శాస్త్ర విద్యార్థులను భయపెట్టి దూరం చేసిన మాట వాస్తవం. ఈ కాకుల లెక్కలు మూల సిద్ధాంతాన్ని మారుమూలకు నెట్టి పఠనపాఠనాలను క్లేశదాయకం చేశాయి.

విమర్శకు భయపడే, దాన్ని సహించలేని ఈనాటి తెలుగు కవులు శ్రద్ధాభక్తులతో ఈ గ్రంథాన్ని చదివితే కాళిదాసాదుల లోపాలను కూడా నాటి ఆలంకారికులు క్షమించలేదనీ, ఆ కారణంవల్ల ప్రాచీన కవులు శాస్త్ర పాండిత్యాన్ని అసహ్యించుకొని శత్రువుగా భావించలేదనీ తెలుస్తుంది. 'శత్రో రపి గుణా వాచ్యా, దోషా వాచ్యా గురో రపి' అనే సూక్తికి సంస్కృత శాస్త్ర గ్రంథాలూ వాటివ్యాఖ్యానాలూ ఉదాహరణప్రాయాలు. శ్రద్ధాసక్తులతో ఇతర వ్యాఖ్యానాదులను కూడా పరిశీలించి ఈ మహాగ్రంథరచన సమర్థంగా నిర్వహించిన వ్యాఖ్యాత ప్రశంస నీయుడు. గ్రంథం చదివితీరవలసిన ఉత్తమ రచన.

3.10.1999

## గురజాడ రచనలు కపిద్ధాకార భూగోళా

– శిష్టా శ్రీనివాస్

గ్రంథ రచయిత తాను చేసింది 'పాదజ్ఞాపికాన్వేషణ' అని మాత్రమే చెప్పుకున్న ఒక విలక్షణ రచన ఇది. గురజాడ రచనలను వ్యాఖ్యానిస్తూ కీర్తిశేషులు కె.వి.రమణారెడ్డి, బంగోరె (బండి గోపాలరెడ్డి) అథస్సూచికల్లో తేల్చిచెప్పని ఒక్కమాట మీద ఆధారపడి ఇంత గ్రంథం రాసిన శ్రీనివాస్‌గారు అభినందనీయులు. వరాహావతార విగ్రహాలనూ చిత్రాలనూ చూసినప్పుడు వచ్చిన చిన్న సందేహం ఉపర్యుక్త పాదజ్ఞాపికలను చూసిన తరవాత పెరిగి పెద్దదై ఈ పరిశోధన గ్రంథరచనకు దారితీసింది. తమ పరిశోధనలను వివరించటంతో సంతృప్తిపడక, తన పరిశోధన మార్గాన్నీ, అందులో తాను తిరిగిన మలుపులన్నిటినీ వివరించటమే ఈగ్రంథంలోని విలక్షణత. పరిశోధక విద్యార్థులకు మార్గదర్శకమైన రచన ఇది.

కన్యాశుల్కంలో గిరీశం 'కపిద్ధాకార భూగోళా అని మనుధర్మ శాస్త్రంలో' ఉన్నట్లు చేసిన

ప్రసంగానికి, ఆయనే రాసిన కొండుభట్టీయంలో ఆ ప్రసంగం 'మనవాళ్ళు' కూడా చేశారనే వివరణ దొరికింది. ఎవరు, ఎందుకు, ఎప్పుడు, ఎక్కడ ఈ మాట అన్నారో తేల్చుకోవటం గ్రంథకర్త తనమీద పెట్టుకొన్న బాధ్యత. భూగోళశబ్దాన్ని మొదటిసారి ప్రయోగించిన తెలుగుకవి శ్రీనాథుడని, సోమసిద్ధాంత వ్యాఖ్యాత మామిడి సింగన ద్వారా ఆయనకీ విశేషం తెలిసి ఉంటుందనీ (పే.225), భూగోళశాస్త్రమని చెప్పిన ప్రథమాంధ్రుడు ఏనుగుల వీరాస్వామయ్య అని (పే.136) రచయిత నిష్కర్ష. కోపర్నికస్ నుంచి గెలీలియోదాకా క్రీ.శ. 16వ శతాబ్దం ప్రాంతాల్లో భూమి ఒక గోళమనే నిరూపణకు వస్తే (పే.131), క్రీ.శ. 499 నాటి ఆర్యభటుడు గుండ్రంగా ఉన్న నక్షత్రపంజరం మధ్య మట్టి, నీరు, అగ్ని, గాలి అనే వాటితో నిండిన భూగోళం ఆకాశంలో ఉందని (పే.158) చెప్పాడు. వరాహమిహిరుడు (క్రీ.శ. 505 ప్రాంతం) సదరుగోళం అయస్కాంతాల మధ్య లోహం (ఇనుము)లా ఉందని వివరించాడు (పే.157). ఈ విషయం లోకదృష్టికి రాలేదుగాని ఇంగ్లీషు వాళ్ళు భూగోళశాస్త్రం పాఠ్యాంశం చేసిన తరవాత సామాన్యులకూ తెలిసివచ్చిందని రచయిత నిర్ధారణ.

గ్రంథంలో ఆరు చిత్రాలున్నాయి. పట్టికలున్నాయి. 'కపిత్థ' అనేది సరైన రూపమైనా గురజాడ రచనల్లో ఉన్నట్లే గ్రంథశీర్షికలో ఉంచానంటాడు రచయిత (పే. XXVII). అచ్చుతప్పులు తక్కువేగాని, 39వ పేజీలో "మారన.... ముడికుదిరింది" అనే వాక్యం పునరుక్తమయింది. 4వ పేజీలో 'విదేశాంధ్ర ప్రచురణ'కు బదులు 'విశాలాంధ్ర ప్రచురణ' అనే తప్పు రూపం కనిపిస్తుంది. గందరగోళం అనే మాట ప్రాచీనాంధ్రంలో లేదని (పే.68), తెలుగు తాళపత్ర గ్రంథాల్లో చిత్రాలుగీసే సంప్రదాయం లేనేలేదని (పే.XXVII) రచయిత అన్నమాటలు పరిశీలనార్హాలు. 225వ పేజీలో "కపిత్థాకార భూగోళ మధ్యగో మేరుపర్వతః' అన్నచోట 'మధ్యగో' అన్నది 'మధ్యగః' అనే పదానికి సంధిగతరూపం. రచయిత పొరపాటుపడి మేరుపర్వతానికి బదులు 'గోమేరు' పర్వతాన్ని సృష్టించాడు. ఇలాంటి ఒకటి రెండు ప్రమాదాలు గ్రంథగౌరవాన్ని తగ్గించవు. కానీ పునర్ముద్రణలో సవరించుకోవలసినవే.

గురజాడ ప్రతిభావ్యుత్పన్నతలను విశదీకరించే ఉత్తమ రచనల్లో ఇదొకటి. సత్పరిశోధన సంప్రదాయం నెలకొల్పే గ్రంథాల్లో ఇదొకటి. సాహితీపరులు అవశ్యపఠనీయంగా భావించదగ్గ ఈగ్రంథం రచయితను అభినందించకతప్పదు.

26.12.1999

## దిద్దుబాటు

– జి.యస్. వరదాచారి

నాలుగున్నర దశాబ్దాలుగా పత్రికారంగంలో భిన్న బాధ్యతలు నిర్వహించి, ప్రస్తుతం జర్నలిజం ఆచార్యులుగా పనిచేస్తున్న గోవర్ధన సుందర వరదాచారిగారి రచన ఇది. 'ఆంధ్ర భూమి' దిన పత్రికలో 70 వారాలపాటు ధారావాహికంగా రాసిన వ్యాసాల కిది గ్రంథ రూపం. గ్రంథ స్వభావాన్ని బట్టి ఇది పత్రికారచయితలనూ పాత్రికేయ వృత్తిలో ఉన్నవారినీ ప్రధానంగా ఉద్దేశించి రాసిన సమీక్షా గ్రంథం. ఏయే పత్రికల్లో ఒకే వార్తను ఎన్ని విధాలుగా మలిచారో, వాటిలోని గుణదోషాలేమిటో, వృత్తిపరంగా, వృత్తి ధర్మపరంగా ఎలారాస్తే మంచిదో ఇందులో గ్రంథకర్త చర్చించారు.

పత్రికారచనలో శబ్దక్రీడలూ శ్లేషచమత్కారాలూ శబ్దాడంబరం, విషయ వక్రీకరణా, అధ్రువ వార్తల ప్రచురణా, వక్రభాష్యాలూ, అన్యభాషాదురభిమానం పనికిరావని సోదాహరణంగా చర్చిస్తూనే పత్రికారచయితలకు వాస్తవ దృష్టి, వివేచన, విశ్వసనీయత, భాషాపాటవం వంటివి అవసరమని కూడా ఇందులో వాదించారు. ప్రగతి వార్తలకు పత్రికల్లో ప్రాముఖ్యం పెరుగుతున్న దనీ, వ్యాపారదృష్టి పెరుగుతున్నదనీ ఆయన నిరూపించారు. పాతకాలంలో పాత్రికేయులకు వృత్తివిద్యకు సంబంధించిన గ్రంథాలు దొరికేవికావు. ఇప్పు డాలోపం చాలా వరకు క్రమంగా తగ్గిపోతున్నందువల్లా విద్యాసంస్థల్లో పఠనపాఠన సౌకర్యాలు పెరుగుతున్నందువల్లా వృత్తి నైపుణ్యాన్నీ భాషా విజ్ఞానాలనూ పెంచుకోవాలని గ్రంథకర్త ఉద్బోధ. వివిధ పత్రికలనుంచి దృష్టాంతాలను పేర్కొని చెప్పినా దాని వెనుక ఉన్న సదుద్దేశాన్ని అందరు మిత్రులూ అర్థం చేసుకున్నారని రచయిత స్వయంగా 'మనసులో మాట'లో చెప్పారు. అందువల్ల అజాతశత్రు ధోరణిలో సాగిన ఈ రచనను విద్యార్థులేగాక బోధకులుగూడా ఆమోదిస్తారని ఆశించవచ్చు.

జర్నలిజాన్ని ఒక శాస్త్రంగా బోధించే అధ్యాపకులు ఆయా సిద్ధాంతాలకు, సూత్రాలకు ఆచరణలో కనిపించే అపవాదాలను దృష్టిలోకి తేవలసి ఉంటుంది. సొంతంగా శ్రమించకుండా సిద్ధాన్న రూపంలో లభిస్తున్న ఈ దిద్దుబాటులోని అంశాలు వారికెంతో ఉపయోగపడి పుష్టినిస్తాయి. దేశకాల పాత్రల్లో వచ్చిన మార్పులవల్ల నేటి పత్రికారంగం ఆధునిక యంత్రాది సౌకర్యాల కారణంగా పెద్దపరిశ్రమగా విస్తరిస్తున్నందువల్ల, సమాజంలోని దౌర్బల్యాలు సామాజికు లయిన పాత్రికేయులక్కూడా సంక్రమిస్తున్నందువల్ల వృత్తికీ లోకానికీ జరుగుతున్న అపచారాలను గ్రంథకర్త సందర్భానుసారంగా ప్రస్తావించారు. ఇందులోని విమర్శల కెవరూ బాధపడ నక్కరలేదు. గుణ దోషాలను గ్రహించి దోషాలను కంఠగతంగా గుణాలను అస్థిగతంగా నిలుపు కోడానికి ఈ గ్రంథం ఉపకరిస్తుంది. ఏ శాస్త్రంలో ఏ గ్రంథం వెలువడి తెలుగు భాషాభివృద్ధికో శాస్త్ర సాహిత్య విస్తరణకో తోడ్పడినా హర్షించవలసిందే. ఇందుకు తమవంతు శ్రమచేసిన వరదాచారి అభినందనీయులే.

13.2.2000

## కవిగారి గజలు సుందరి

– కవిగారు

ఇది పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో అచ్చయిన గ్రంథం. ఇందులో మిర్జా అసదుల్లాఖాన్ గాలిబ్ రచనలేగాక మరి నూటపాతికమంది ఉరుదూ కవుల కవితల అనువాద 'కవిత్వీకరణ'తోబాటు, కవిగారి స్వతంత్ర రచనలు కూడా కనిపిస్తాయి. 51 పేజీల అభిప్రాయాదులూ కవిగారి 7పేజీల స్వీయకవితా ఒక ఎత్తయితే, గాలిబ్ రచనలున్న 52 పేజీలు మరో ఎత్తు. రచయిత తనను, తాను కవిగారని బహువచనంలో పూజ్యావాచకంతో వ్యవహరించటం, 126గురు గజలు కవుల పేర్లకన్నా తన కవిగారనే పేరును పెద్దక్షరాలతో పదేపదే ప్రస్తావించుకోవటం వంటి స్వోత్కర్ష – పదవులూ బిరుదులూ ఉన్న తెలుగుకవు లెవరికీ లేకపోవటం వింతల్లో వింత. పాఠకలోకం రచయిత అసలు పేరు 'కవిగారు' అని గుర్తించి, ఆయన బిరుదం ఆకునూరు గోపాలకిషన్‌రావు అని తెలుసుకోవటం అవశ్యం. ఇంతగా

అహంకరించిన వ్యక్తి స్వీయరచనలో "అనుభవాలు కోకొల్లలుగ అఘోరిస్తున్నానే తప్ప, కవిగా నేనేదో గొప్పగ కవితీకరిస్తున్నానని చెప్ప!" (పే.167) అని విస్తుపోతూనే, గాలిబ్ కవిత్వాన్ని అనువదించటంతోబాటు 'కవితీకరిస్తున్నా' ననటంలోని సంస్కారం దుర్భరమైన దురాగతం, అసహనీయం.

ఈ గ్రంథంలో మరో విశేషముంది. "బ్లాక్ (సంకెల)లలోని కవితలు కవుల పేర్లు తెలియని వారివి" (పే.Viii) అంటూ అజ్ఞాతకవులను శృంఖలాబద్ధులను చేయటం విశేషం కాదనటం కష్టం. అలాంటి ఒక కవితాఖండం (పే.52) "చెల్లని నాణాలే నేడెక్కువ, చలామణీలో నున్నవి, చిక్కనిదే శాంతి ఇక్కడ, చింతలు లోటే లేనివి!" అని ఆశ్చర్యార్థకంతో ముగుస్తుంది. ఆకవితా భావమే రచయిత లక్షణాలను నిజానికి వ్యక్తీకరిస్తున్న దనిపిస్తుంది. తనలోని "అనువాదభూతం ఆకలి" (పే.Xiii) తీర్చటం కోసం 49 సంవత్సరాల కిందటి 4వ తరగతి ఉర్దూ పాండిత్యంతోనే 'తెలుగుకవితలను ఉర్దూ లోనికి అనువదించే 'పట్టుచిక్కడం'తో 'అనువాదాలపై కాస్త 'అధికారం' ఏర్పడ'గా 'ద్విపదాచౌపదలు' సిద్ధింపజేశారట కవిగారు (అదే పేజీ). మూలరచనల నిచ్చివుంటే అనువాదం ఎలా సాగిందో, వాటి కవితీకరణ మరెంత అద్భుతమో తెలిసేది, పాఠకు లందరికీ. వారికా అదృష్టంలేదు. కవిగారు తమలో జూదం, చౌసర్ తప్ప గాలిబ్ గుణగణాలన్నీ కొట్టొచ్చినట్లు కనబడుతూండడం నూరుపాళ్ళు నిజమన్నారు (పే.XV). అంతటివారు మహాకవిగారు కాకుండా కవిగారుమాత్రంగా మిగిలిపోవటం తెలుగుజాతి దురదృష్టం; కవిగారి వినమ్రతకు నిదర్శనం.

గాలిబ్ కవితాశక్తి మీద, తదితరకవుల సామర్థ్యం మీద అభిమానగౌరవా లుండి కూడా, నాలుగో తరగతి ఉర్దూ కూడా రాని నావంటి సామాన్య సాహిత్యపరులందరికీ ఈ మహాకావ్యమే శరణ్యం. కవిగారి అతిశయంవల్ల ఆయాకవుల మీదనున్న సదభిప్రాయం పోగూడదనుకుంటే ఈ గ్రంథం చదవండి. "ప్రతివాడూ కోరేది పనికిరాని ప్రఖ్యాతి, మట్టిబొమ్మ లివన్నీ ఒట్టి ప్రదర్శనలకే!" (పే.66)నని నిస్పృహపడి చదవటం మానవద్దు – గ్రంథపరిచయ కర్తలమీది గౌరవంతో నయినా.

18.6.2000

## కన్యాశుల్కం - నూరేళ్ల సమాలోచనం

**– (సంపా.)ఆచార్య మొదలి నాగభూషణ శర్మ, డా. ఏటుకూరి ప్రసాద్**

ఇదొక అసాధారణ గ్రంథం. 1897లో తొలిప్రచురణ వెలుగు చూసిన 'కన్యాశుల్కం' అంతకు అయిదేళ్ళు ముందుగానే ప్రదర్శితమయింది. రెండో కూర్పు 1909లో వచ్చి సాహితీ ప్రపంచాన్ని మంత్రముగ్ధం చేసింది; గురజాడ వేంకట అప్పారావు గారికి యుగకర్తృత్వం, నవయుగ వైతాళికత్వం సాధించింది. ప్రదర్శనకు 1982లో, ప్రచురణకు 1997లో శతజయంతి మహోత్సవాలు జరిగాయి. గురజాడ జీవితకాలంలోనే కన్యాశుల్కనాటకం మీద విమర్శలూ ప్రతివిమర్శలూ వచ్చాయి. ఆయన మరణానంతరం (1915 తరవాత) రచనను విశ్లేషించి వివేచించటం, గుణదోషాలు చర్చించటం పెద్దయెత్తున జరిగి శతయంతినాటికి అదో మహత్తర రచన అనే నిర్ధారణకు వచ్చింది సాహితీ ప్రపంచం.

గురజాడ అకవి, కుకవి అనే వాదనలే గాక అసలాయనకు తెలుగే రాదని, కన్యాశుల్కం

రచయిత కాదని, కాకపోతే ఇంగ్లీషులో రాస్తే ఎవరో తెలుగు చేశారనే దాకా ఒకమార్గం కృషిచేసింది. అందులో వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి పరోక్ష శ్రమకు పోషితకవిపండితుల శాబ్దికఘోష సాయపడింది. మొదట అలా దుర్వాదాలు చేసినవారే గురజాడ కన్యాశుల్కం పరమాద్భుతమని దరిమిలా కీర్తించి రాశారు! తొలి చర్చ నుంచి 1999 చివరి దాకా వచ్చిన 'సీరియస్ రచనల గురించి' దాదాపు 180 వ్యాసాలను ఎంపికచేసి ఈ బృహత్సంపుటిలో గుదిగుచ్చి ప్రచురించిన సంపాదకద్వయాన్నీ, కేవలం ప్రచురణ వ్యయానికే సాహితీ లోకానికి అందించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారినీ ప్రశంసించక తప్పదు.

ఈగ్రంథాన్ని విషయానుగుణంగా పదమూడు పరిచ్ఛేదాలుగా విభజించి, వాటిలో సాధ్యమయినంతవరకూ కాలక్రమానుసారంగా ఆయా వ్యాసాలను ప్రచురించారు. కన్యాశుల్కం గురజాడ రచనేనా అనే ప్రశ్నతో మొదటి పరిచ్ఛేదం మొదలవుతుంది. కన్యాశుల్కం ప్రదర్శనల సమస్యలను గురించి చివరి పరిచ్ఛేదం వివరిస్తుంది. పూర్వోత్తర ప్రతుల తులనాత్మక పరిశీలన, ఇతివృత్తం, పాత్రచిత్రణ, భాష, రస చర్చ, సమకాలీన సమాజ ప్రభావం మొదలైనవి విపులంగా ఉన్నాయి. కన్యాశుల్కాన్ని పునర్మూల్యాంకనం చేశారు. సంపాదకు లిద్దరూ విడివిడిగా రాసిన పరిచయాలు ప్రశంసనీయాలు. వీలువెంట గురజాడ సాహిత్యం గురించి ఇంగ్లీషులో వచ్చిన వ్యాసాలను కూడా సేకరించి ప్రచురించాలనే సంపాదకుల సంకల్పం నెరవేరాలని ఆశిద్దాం. గ్రంథాంతంలో గురజాడ జీవితరేఖాచిత్రంతోబాటు ఆధారగ్రంథాలను కూడా పరిచయం చేశారు. గురజాడ సాహిత్యాన్ని అనేక విధాల పరిశ్రమించి వెలికితెచ్చిన సెట్టి ఈశ్వరరావు, అవసరాల సూర్యారావు, కె.వి. రమణారెడ్డి, బంగోరేల స్మృతి కీగ్రంథాన్ని అంకితం చేయటం సముచితం.

తెలుగు విమర్శ ఎన్ని రకాలుగా ఎన్ని ధోరణుల్లో ఎలా సాగిందో గమనించటానిక్కూడా ఈగ్రంథ ముపయోగపడుతుంది. వ్యాసాల ప్రమాణం గొప్పది. భాషాభిమానులూ సాహితీపరులూ తప్పక కొని చదివి దాచుకోవలసిన మహాగ్రంథమిది.

27.8.2000

## కౌటిలీయమ్ అర్థశాస్త్రమ్

**– వ్యాఖ్యాత : డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు**

క్రీస్తుపూర్వం 400 నాటికి విష్ణుగుప్తుడు నందసామ్రాజ్యాన్ని ధ్వంసంచేసి మౌర్య సామ్రాజ్యాన్ని స్థాపించిన అనుభవజ్ఞుడైన మహామనీషి. ఆయనకే చాణక్యుడని, కౌటిల్యుడని పేర్లు. ఆయన భారతీయుల్లో చరమ మహర్షి అనిపించుకున్నవాడు. ఆయన దృష్టిలో మానవ జీవన విధానం అర్థం; అంటే మనుష్యులు నివసించే భూమి. ఆ భూమిని సంపాదించి పాలించే విధానాలను వివరించే శాస్త్రం అర్థశాస్త్రం. నేటి ఇకనామిక్స్ అనే పదంతో ఇది సమానార్థకం కాదు. చాణక్యుడి అర్థశాస్త్రం కామందకుడి నీతిసారం వంటి గ్రంథాలకు ఆధారం. ఆయన జీవితాన్నీ, రాజనీతి సామర్థ్యాన్నీ ప్రశంసించే ముద్రారాక్షస మనే సంస్కృత నాటకాన్ని క్రీ.శ. 6వ శతాబ్దంలో విశాఖదత్తుడు వెలయించాడు. చాణక్యుడు అరిస్టాటిలుకు సమకాలికుడు. ఆయన రాసిన మూలగ్రంథాన్ని ప్రచురిస్తూ దానికి ఇంతకుపూర్వం సంస్కృతంలో, ఇంగ్లీషులో వచ్చిన వ్యాఖ్యలనూ అనువాదాలనూ పరిశీలించి తెలుగులో వ్యాఖ్యానించిన పుల్లెల

శ్రీరామచంద్రుడు లబ్ధప్రతిష్ఠులయిన మహోపాధ్యాయులు. గ్రంథారంభంలో 31 పేజీల విపుల మైన 'ప్రస్తావన'లో మూలగ్రంథంలోని ప్రధానాంశాలను వివరించటమేగాక, గ్రంథాంతంలో 60 పుటల శబ్దకోశాన్ని అనుబంధంగా ఇచ్చి అలనాటి శాస్త్ర సాంకేతిక పదాలకు అర్థాలు కూడా చెప్పారు– సందర్భాన్నిబట్టి ఇంగ్లీషుమాటల్లో కూడా.

కౌటిలీయ ప్రశస్తిని గురించి ఎంత చెప్పినా తక్కువే. అందులో రాజ్యపాలనకు సంబంధిం చిన సమస్తాంశాలూ పౌరస్మృతి శిక్షాస్మృతులూ యుద్ధవిద్యలూ గూఢచర్యమూ వాణిజ్య విధానాలూ అవినీతిని అరికట్టే మార్గాలూ శత్రువులను సామదాన భేదోపాయలతో వంచించి జయించే మార్గాలూ రాజోద్యోగుల ఎంపికా వగైరా అనేకానేక విశేషాలున్నాయి. ఈనాటి పాలకులు గ్రహించి ఆచరించదగ్గ అమలుచేయవలసిన అనేకోపాయాలూ పద్ధతులూ ఉన్నాయి గ్రంథంలో. ఉదాహరణకు సకాలంలో నిర్ణయం తీసుకోకపోయినా, విహారాలూ దేశ సంచారాలూ ప్రధానమను కొని ప్రభువులు నిర్లక్ష్యంగా ప్రవర్తించినా వచ్చే నష్టాలను కూడా చాణక్యుడు చర్చించాడు. నేటి పాలకులకు వోటుబలం చాలు గాని విద్యార్హతాదు లక్కరలేదు. వారికి నిర్బంధంగానయినా ఈ అర్థశాస్త్రం బోధించినట్లయితే పరిపాలన సమర్థంగా జరుగుతుందనీ భారతదేశం పురావైభ వాన్ని పునస్సంపాదించుకుంటుందనీ విశ్వసించవచ్చు. లోకజ్ఞానంతోబాటు అనేకవిషయాల్లో పరిజ్ఞానం సంపాదించుకోటానికి ఈగ్రంథ ముపకరిస్తుంది. చదివినవాళ్ళు ధన్యులు. విజ్ఞానానికి కాలదోషం లేదు. గ్రంథరచయిత అనుభవ జ్ఞానం పాఠకులకు ఎంతో ఉపయోగపడుతుంది. కొని చదివి తరించండి.

సెప్టెంబర్ 2000

## భావార్థ చంద్రిక

**– ఆలూరి వాసుదేవశాస్త్రి**

కొన్ని దశాబ్దాల తరవాత వావిళ్ళవారి ప్రచురణను చూడగలగటం ఆనందప్రదం. అయితే ఎప్పటినుంచి పునఃప్రచురణ కార్యక్రమం మొదలయిందో తెలియరాకపోవటం కొరతగానే ఉంటుంది. ప్రస్తుత గ్రంథం సంస్కృత రచన. దానికి ఆలూరు వాసుదేవశాస్త్రి తెలుగులో రాసిన తాత్పర్యాన్ని మూలగ్రంథంతోబాటు ప్రచురించారు– 1999లో వావిళ్ల ట్రస్టు నిర్వాహకులైన అల్లాడి స్వామినాథన్ హైదరాబాద్‌లోని శాఖలో టైప్ సెటింగుచేసి. అట్టమీద తప్ప మరెక్కడా తాత్పర్యరచయిత ప్రస్తావన లేదు. మూలగ్రంథ రచయిత పేరయినా తెలియదని పీఠికాకర్త భూతపురి సుబ్రహ్మణ్యశర్మరాశారు (పే.15). ఆయన కూడా తాత్పర్యకర్త ప్రస్తావన తేలేదు.

ఇదో జ్యోతిశ్శాస్త్ర గ్రంథం. ఆ శాస్త్రంలోని జాతకభాగానికి సంబంధించిన ఈ గ్రంథంలో 319 అనుష్టుప్ శ్లోకా లున్నాయి. వాటి తాత్పర్యం గ్రాంథికాంధ్రంలో ఉంది. ప్రథమ ముద్రణ ఎప్పుడు జరిగిందో ప్రకాశకులు తెలియబరచలేదు. ఇది ఎన్నో ముద్రణో తెలియదు. జ్యోతిశ్శాస్త్రంలో ఈ రచనకున్న ప్రామాణ్యాన్ని గురించిన చర్చ కూడా లేదు. ఇందులో 32 'విచారాలు' – అంటే అంశాలు – ఉన్నాయి. అవసరాన్నిబట్టి రాశిచక్రాలు వేసి వివరించారు. జ్యోతిషంలో అంతో ఇంతో ప్రవేశమున్న వారికి ఈ గ్రంథం ఉపయోగపడవచ్చు. వివరణలు

చాలా సంగ్రహంగా ఉన్నందువల్ల ప్రతి 'విచారం' చివరా దానిపేరు పేర్కొన్నప్పుడు, పేరు తెలిసిన తాత్పర్యకర్తను స్మరించకపోవటం విచారకరంగా ఉంటుంది.

అన్ని విషయాల్లోలాగానే 'వావిళ్ళ' వారి ప్రచురణసందర్భంలో కూడా ప్రమాణాలు దెబ్బతిన్నా యనిపిస్తుంది. మొట్టమొదటి శ్లోకం "ఆదిత్య ప్రమూఖాః ఖేటా స్తథా మేషాది రాశయః" అని మొదలవుతుంది. ప్రముఖ శబ్దంలోని 'ము' దీర్ఘమయినందువల్ల ఛందోభంగం జరిగింది. 57, 58 పేజీలకు చుట్టూ నల్లగీతతో పేటిక లెందుకు కట్టారో తెలియదు. "రెండు లేక మూడు శిశువులు" (పే. 155) వంటి ప్రయోగాలు తెలుగు వ్యాకరణంలోని మహదమహద్భేదం తెలిసిన ఎవరికయినా అపప్రయోగ మనిపిస్తాయి. పూర్వప్రమాణాలు పలచబడ్డా యనటానికి ఇటువంటివి నిదర్శనలు. ఈ గ్రంథం చివరి అట్టమీద వాణిజ్య ప్రకటనలద్వారా 'శ్రీపతి జ్యోతిశ్శాస్త్ర రత్నము', వడ్డాది వీర్రాజుగారి 'వాత్సాయన కామసూత్రములు' వెలతో సహా పేర్కొన్నందువల్ల ఈ గ్రంథానికి ముందే మరికొన్నిటిని ప్రచురించినట్లు తెలుస్తుంది. సాహిత్యాభిలాషులకు కొంత నిరుత్సాహమూ కలుగుతుంది.

జ్యోతిషశాస్త్రాభిమానులకు ఈ గ్రంథ ముపయోగపడవచ్చు.

10.9.2000

## భారతీయ సాక్ష్యాధారముల చట్టము

**అనువాద వ్యాఖ్యానం : పెండ్యాల సత్యనారాయణ**

**1872** నాటి ఇండియన్ ఎవిడెన్స్ యాక్ట్‌కు 2000 నాటి ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ చట్టం ద్వారా చేసిన సవరణలతోసహా ఈ గ్రంథం అనువాదమేగాక, విషయ ప్రాధాన్యాన్నిబట్టి వ్యాఖ్యానం కూడా. ముఖ్యమనిపించిన సందర్భాల్లో ఆయా న్యాయస్థానాల నిర్ణయాలను కూడా రచయిత ప్రస్తావించారు. ఆంగ్లికన్ న్యాయసూత్రాల మీద ఆధారపడి 125 సంవత్సరాల పైబడిన పాతకాలంలో రాసిన చట్టం ఈనాటికీ అమల్లో ఉండటం ఎంత వింతో, నేటి పరిస్థితులకు సంబంధించని విషయాలను తొలగించటానికిగాని సవరించటానికిగాని అర్ధశతా బ్దంగా తీరికా ఓపికాలేని మన దేశవాళీ ప్రభుత్వాల అనిబద్ధతకూ నిర్లక్ష్యానికీ ఇది నిదర్శనంగా నిలిచింది. పదకొండు అధ్యాయాల్లో 167 సెక్షన్లతో న్యాయవిచారణలో అత్యంత ప్రాధాన్య మున్న ఈ చట్టం ఉన్నదన్న గుర్తుకూడా లేని మహానాయకులు మనల్ని పాలిస్తున్నారనటానికి మొదటి నిదర్శనం – లేదా సాక్ష్య మనవచ్చేమో – మొదటి సెక్షనే. అందులో 1872 సెప్టెంబరు 1వ తేదీనుంచి అమల్లోకి వచ్చిన ఈ చట్టం "జమ్మూ కాశ్మీర్ రాష్ట్రము మినహాయించి యావత్ భారతదేశమునకు" వర్తిస్తుందని పేర్కొన్నది! 3వ సెక్షన్ "భారతదేశం అంటే జమ్మూకాశ్మీర్ మినహాయించి మిగిలిన భారతదేశ"మని నిర్వచిస్తున్నది. గత సంవత్సరం సవరిస్తున్నప్పుడు కూడా మనల్ని ఏలుతున్నవారికి ఈ మొదటి అధ్యాయం కూడా దృష్టికి రాలేదంటే, మన రాజకీయ నాయకుల దేశభక్తినీ నిర్లక్ష్యాన్నీ శంకించక తప్పదు.

న్యాయశాస్త్రానికి సంబంధించి ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డ తరవాత రాష్ట్రప్రభుత్వం పరిపాలన న్యాయపదకోశాన్ని ప్రచురించింది. తెలుగును అధికార భాషగా 1966లో ప్రకటిస్తూ చట్టం చేసిన ప్రభుత్వం దరిమిలా చేసింది అల్పాల్పమయినా, కొన్ని సంస్థలూ కొందరు వ్యక్తులూ

న్యాయపదకోశాలనూ చట్టాల తెలుగు అనువాదాలనూ వ్యాఖ్యానాలతో ప్రచురించారు. అవి విషయజ్ఞానం సంపాదించటానికే గాని 'అధికార పాఠాలు' కావు కాబట్టి న్యాయస్థానాల్లో వాదప్రతివాదాలకూ తీర్పులు రాయటానికీ పనికిరావు. అయినా సత్యనారాయణ వంటి వారి పరిశ్రమ ప్రజలకు న్యాయపరిజ్ఞానం కల్పించటంతోపాటు భాషాభివృద్ధికి కూడా ఎంతో తోడ్పడుతున్నాయి. ఇటువంటి శాస్త్రసాహిత్యం ఎంత ఎక్కువగా వస్తే తెలుగుభాష అంత ఎక్కువ ప్రతిష్ఠ సంపాదిస్తుంది. పరిభాష విషయంలో అభిప్రాయ భేదాలూ పాఠాంతర రూపాంతరాలూ ఉన్నా భాషకు కలిగే అపచారమేమీ లేదు. కాలక్రమాన అది ఏకరూపతకు వస్తుంది. ఇటవంటి రచనలను ఆదరించి ప్రోత్సహించటానికి ప్రభువులకు తీరికా కోరికా ఉన్నా లేకపోయినా, భాషాభిమానులైన ప్రజలయినా ముందుకు వస్తారనీ రావాలనీ ఆశిద్దాం.

15.4.2001

## ఆంధ్రప్రదేశ్ రాజకీయ చరిత్ర

– జి. వెంకటరామారావు

ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ 1918లో ఏర్పడినప్పటినుంచీ 20వ శతాబ్దం ముగిసేదాకా మన నేతలు రాజకీయాలు నిర్వహించిన పద్ధతులూ ప్రజలకు కలిగిన లాభనష్టాలూ సాదాసీదా భాషలో నిరభిమాన దురభిమాన సదభిప్రాయాలేవీ లేని తీరున వివరించిన గ్రంథమిది. అస్వతంత్ర భారతదేశంలో పరిమిత ప్రజాస్వామ్య పరిధిలో జస్టిస్ పార్టీ ప్రభుత్వా లేర్పడటంనుంచి అవిభక్త మదరాసు రాష్ట్ర విభజన, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు ఫలితాలను చర్చించారు. ఆంధ్ర నాయకులు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల్లో పదవులు సంపాదించినా, రాష్ట్రపతి, ప్రధాని పదవులు గూడా మనవాళ్ళకు దక్కినా మన రాజకీయచరిత్ర ఎన్ని విధాల కులసమీకరణలమీద వ్యక్తిగతాహంకారాలమీద ఆధారపడి అనైక్యధోరణులతో ప్రజానీకాన్ని కష్టనష్టాల పాలుచేసిందో, ఆయా ముఖ్యమంత్రులు తమ హయాంలో సాధించిన ఘనకార్యాలేమిటో, రాష్ట్రం పోగొట్టుకున్న దేమిటో నిరాసక్తంగానే నిరూపించిన గ్రంథమిది. గ్రంథంలో 33 ప్రకరణాలున్నాయి. పెద్ద మనుషుల ఒప్పందం, తెలంగాణా రక్షణల పత్రం వివరాలూ, ప్రత్యేక తెలంగాణా ఉద్యమం విశేషాలు, ఎన్టీఆర్ ఉత్థాన పతనాలు, అంతఃకలహాలు వగైరాలన్నీ చర్చకు వచ్చాయి. రచయిత భిన్నపత్రికల్లో రాసిన వ్యాసాల సంకలనమిది. ఈ రాణీ ప్రేమపురాణం, ఆ ముట్టడికైన ఖర్చులూ అనే సంప్రదాయధోరణిలోగాక ఏ సమయంలో ఏయే కారణాలవల్ల ఏ వ్యవహారం ఏ రూపంలో పుట్టిపెరిగి తెలుగువాళ్ల రాజకీయాలను ఎన్నిరకాలుగా ప్రభావితం చేసిందో, ఆయా నాయకుల ముఖ్యమంత్రుల వ్యవహారశైలి ఎటువంటిదో, వాటి ఫలితాలేమిటో, ఆయా నేతల బలహీనత లేమో, సామర్థ్యం మెంతటిదో నిష్పాక్షికంగా ప్రదర్శించిన ఈ గ్రంథం రాజకీయ శాస్త్ర విద్యార్థులకూ, రాజకీయ రంగంలో జీవించదలచిన వ్యక్తులకూ, ముఖ్యంగా రాజకీయవార్తలు రాసే ప్రచురించే పత్రికల వారికీ చదవకతప్పని మంచి పుస్తకం. నిరంతరాధ్యయనశీలిగా రచయిత వెంకటరామారావు అడుగడుగునా అభిమానం సంపాదించుకుంటారు. కొని చదవండి. చదివి లోకం పోకడ తెలుసుకోండి.

6.5.2001

# అనుబంధం - 1

## (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో 12 జూన్ 2000న ప్రచురితమైన ఇంటర్వ్యూ పాఠం - పృచ్ఛకులు శ్రీ వల్లూరి రాఘవరావుగారు)

**1. ఇవాళ రాష్ట్రంలో చదువుతున్నదీ, మాట్లాడుతున్నదీ తెలుగేనా?**

చదువుతున్నదీ, మాట్లాడుతున్నదీ కాక రాస్తున్నది కూడా చాలా వరకూ తెలుగే. ఈ తెలుగు ఎన్ని రూపాల్లో ఎన్ని విధాలుగా ఉన్నదన్నది వేరే విషయం. మైనారిటీలు ముఖ్యంగా రాష్ట్ర రాజధానిలో పట్టుదలగా ఉర్దూ మాట్లాడుతున్నారుగానీ, తమిళనాడు, కేరళ రాష్ట్రాల్లోలాగా అధికసంఖ్యాకుల భాషను మాట్లాడటంలేదు ఎంతో కొంత నేర్చుకున్నప్పటికీ. అందుకు వారిని నిందించనక్కరలేదు. తెలుగు మాతృభాషే అయినా, ఇతర భాషల్లో మాట్లాడాలనే ఉబలాటం తెలుగువారిలోనే ఎక్కువగా ఉంది. అది ప్రతిష్ఠకు చిహ్నం. ఇతరులు తెలుగు నేర్చుకోవాలనీ, మాట్లాడాలనీ, తెలుగులో రాయాలనీ తెలుగువారికే ప్రగాఢవాంఛలేదు. సాధారణ ప్రజలకు ఆదర్శమూర్తులైన మన రాజకీయనాయకుల్లో, సినీతారల్లో ఎంతమంది స్వచ్ఛంగా తెలుగు మాటలను ఉచ్చరించగలరో లెక్కించండి!

"యద్య దాచరతి శ్రేష్ఠ స్త త్త దే వేతరే జనాః,
సయత్ ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే!" అన్నది గీతావాక్యం. ప్రామాణికులను అనుకరించే సామాన్యులు తమ పిల్లలను కాన్వెంటు సంస్కృతిలో పెంచాలనీ, ఇంగ్లీషు మాధ్యమంలో చదివించాలనీ పట్టుదల పెంచుకోవటంలో ఆశ్చర్యంలేదు!

**2. తెలుగు భాష వికాసానికి / విధ్వంసానికీ మీడియా (ప్రచారమాధ్యమాలు) పాత్ర ఎంత?**

భాషావికాసానికి ప్రథమకారకులు ఆభాష మాట్లాడే ప్రజలు. స్వస్థాన వేష భాషాభిమానంతో తెలుగులో ఆలోచించి, తెలుగులో చదివి, తెలుగులో రాసే ప్రజ్ఞావంతులు లేనంతకాలం తెలుగు భాషావికాసం దీనస్థితిలోనే ఉంటుంది. అభిప్రాయ ప్రకటనకూ, ప్రచారానికీ ఉపయోగపడే ప్రసారమాధ్యమాలు జాతి సాధారణలక్షణాలనే ప్రతిబింబిస్తున్నాయి. వాటికి వ్యాపారమే ఆదర్శం. ధనసంపాదనే లక్ష్యం. వీటి పోకడలను నియంత్రించవలసిన రాజకీయాధికారులకు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం, ఆంధ్రప్రదేశ్ సాధన అనేవి రాజకీయలక్ష్యాలేగానీ, సాంస్కృతిక లక్ష్యాలు కాలేదు. తద్విరుద్ధంగా సాంస్కృతిక పరిరక్షణ కోసం రాజకీయాధికారం సంపాదించిన తమిళ రాజకీయవాదులు తమ లక్ష్యాన్ని మార్చుకోలేదు. భాషావిధ్వంసం అసాధ్యం - ఎంత బలవంతులైన శత్రువులూ అది సాధించలేదు. వేల సంవత్సరాలు దుర్భరయాతనలకు గురైనా యూదులు హీబ్రూ భాషను పరిరక్షించుకోగలిగారు. తెలుగుజాతి ఆత్మహత్యాప్రయత్నంలో విజయం సాధిస్తే తప్ప, తెలుగుభాష విధ్వంసంకాదు. దేశకాలపరిస్థితులనుబట్టీ, జాతి స్వభావాన్నిబట్టీ భాషలో మార్పులు రావటం సహజం. కొంద రిది అభివృద్ధికి చిహ్నమంటారు. సంప్రదాయవాదులు అది విధ్వంస మనుకుంటారు. వికాస విధ్వంసాలు మార్పులకు మారుపేర్లని గుర్తించాలి. తెలుగు సాహితీపరులూ, కళాకారులూ ప్రసారమాధ్యమాల్లాగానే ఈ మార్పులక్కూడా బాధ్యులే.

3. తెలుగు పత్రికలూ, సినిమాలూ, ఇతర ప్రసార మాధ్యమాలూ - అన్నిటా కృష్ణాగోదావరి జిల్లాల భాషే అధికార భాషగా మారింది. రాయలసీమ, తెలంగాణా మాండలికాలు హాస్యం కోసం వాడుతున్నారు. దీనికి చారిత్రక కారణం ఏమిటి? ఇది దారుణం కాదా?

పత్రికల్లో, సినిమాల్లో, ప్రసార మాధ్యమాల్లోనే గాక భాషాసాహిత్య సంస్కృతుల్లో కోస్తా మాండలికం ఆధిపత్యంలో ఉన్నమాట నిజం. అందుకు చారిత్రకంగా అనేక కారణాలు తోడ్పడ్డాయి. బ్రిటిష్ పరిపాలన కాలంలో అక్కడ రవాణా సదుపాయాలు కలిగాయి. విద్యాసంస్థలు వెలశాయి. ఇంగ్లీషు ప్రభావంతో అనేక సాహితీ ప్రక్రియలు కొత్తగా తెలుగులో మొలకెత్తాయి. వ్యాపార, వాణిజ్యరంగాలు విస్తరించాయి. ఈ పరిస్థితిని ఛార్లెస్ ఫిలిప్‌బ్రౌన్, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావుకూడా స్వయంగా గుర్తించారు. బ్రిటన్‌లో లండన్ మాండలికం, ఫ్రాన్స్‌లో పారిస్ మాండలికం వంటివి ఇలాంటి కారణాల వల్లనే ప్రామాణిక భాషా రూపాలైనాయి. కాకతీయుల పతనం తరువాత తెలంగాణా, విజయనగర సామ్రాజ్య పతనం తరువాత రాయలసీమా పూర్వవైభవాన్ని కోల్పోయినందువల్ల, ఆయామాండలికాలు ప్రస్తుత కాలంలో కోస్తా మాండలికంకన్నా వెనుకబడి ఉన్నమాట వాస్తవం. ఇప్పుడిప్పుడే ఆ ప్రాంతీయ మాండలికాల్లో మంచి సాహిత్యం వస్తున్నది. ఇప్పటికీ రవాణా సదుపాయాల్లో, విద్యాసాంస్కృతిక సంస్థల విస్తరణలో, వ్యాపార, వాణిజ్యరంగాల్లో ఆ రెండు ప్రాంతాలూ సరైన సౌకర్యాలు పొందలేదు. రాజకీయాధికారం కేంద్రీకృతంగా ఉన్న మహానగరభాష ప్రామాణిక మవుతుంది. క్రీడాభిరామంలో వరంగల్లు వైభవం కనిపిస్తుంది. రాయవాచకంలో రాయలసీమ ప్రాభవం తెలుస్తుంది. రాజకీయ పరిణామాల వల్ల తెలంగాణా నవాబుల పాలనలోకి వచ్చింది.

రాజధాని హైదరాబాదులో అన్యభాషా సంస్కృతులకు రాజమర్యాదలు జరిగాయి. అంతేగాక కన్నడ, మరాఠీ భాషలవారిక్కూడా అది కూడలి అయింది. తెలుగువాళ్లు నాగపూరు వైపు దృష్టి సారించారు- సాంస్కృతిక భావాలతో. రాయలసీమ వారికి మదరాసు, బెంగుళూర్లు ఆదర్శనగరా లైనాయి. ఇతర భాషల ప్రభావం అంతగా లేని కోస్తాలో తెలుగు భాషాసంస్కృతు లకు అడ్డంకులు చాలా తక్కువ. 1921 నుంచీ మెట్రిక్యులేషన్ పరీక్షదాకా బ్రిటీషు వారి హయాంలోనే తెలుగుభాష బోధనమాధ్య మైంది. ప్రసిద్ధ సాహితీపరులు కోస్తాప్రాంతంలో పుట్టి పెరగటం యాదృచ్ఛికం. ఇలాంటి అనేకకారణాలవల్ల కోస్తా భాషారూపమే ప్రామాణికమన్న భావం పుట్టింది. శాస్త్ర దృష్టిలో అన్ని భాషారూపాలూ సమానమైనవే. అందరూ సమానులనే ప్రజాస్వామ్యంలో కొందరు అసమానులై అధికారులైనట్లే, భాషా విషయకంగానూ ఒక ప్రాంతీయ మాండలికం ఆధిపత్యంలోకి వచ్చిందని గుర్తించాలి. ఈ స్థితి శాశ్వతం కాదు. ఒకనాడు మహదైశ్వర్యంలో ఉన్న తెలంగాణా, రాయలసీమలు ఇప్పుడు దుర్భిక్షానికి గురైనాయి. ఒకప్పుడు తెలంగాణాతోసహా అనేక పశ్చిమప్రాంతాలకేగాక సముద్రమార్గాన ఇతరదేశాలకు కూడా వలసపోయిన కోస్తావాళ్లు ఇప్పుడు ఆర్థికంగా మంచిస్థితికి వచ్చారు. "నెల మూడు వానలు నిండ గురిసిన" రాయలసీమ ఎడారిగా మారుతుండటానికి భౌగోళిక కారణాలూ ఉన్నాయి. భూస్వామ్య వ్యవస్థలో నిరంకుశపాలనలో మగ్గిన తెలంగాణాలోని ఆర్థికదుఃస్థితికి రాజకీయ పరిస్థితులు కారణం. వీటిని దాటే మార్గా లన్వేషించి చిత్తశుద్ధితో అమలుపరచటం రాజకీయ నాయకుల కర్తవ్యం. కృష్ణా గోదావరులను అనుసంధిస్తే పరిస్థితి తలకిందులుగా మారుతుంది.

ఇక కృష్ణా, గోదావరి మాండలికాలను ప్రామాణికంగా పరిగణించి ఇతర ప్రాంత మాండలికాలను హాస్యస్ఫూర్తికి తెలుగు సినిమావాళ్లు వినియోగించటం వాస్తవమే. ఆ పరిశ్రమ అక్కడి వారి అదుపాజ్ఞలో ఉండటమే అందుకు తోడ్పడింది, తోడ్పడుతున్నది. ఆ పరిశ్రమను నిర్వహిస్తున్న వారి చిత్త సంస్కారానికీ, ధనాతిశయానికీ అది ప్రతీక. ఒకటి రెండు దశాబ్దాల కింద నెల్లూరు, విశాఖ మాండలికాలకయ్యూడా అంతే మర్యాద జరిగిందని, గుంటూరు, గోదావరి మాండలికాలను కూడా అలాగే వాడిన సినిమాలు న్నాయని గుర్తించవచ్చు. హాస్యస్ఫూర్తికి భాషారూపాలతోపాటు అన్వార్థసూచన చేసే హావభావాలను కూడా వాడుతున్నారు. ప్రేక్షకులూ, శ్రోతలూ ఆనందించి ఆహ్వానిస్తున్నారని నిర్మాత లంటారు, అంటున్నారు. అది అబద్ధమని రుజువైతే తప్ప, అటువంటి చిత్రాలకు ప్రేక్షకులు కరవైతే తప్ప, పరిస్థితి మారదు. ఇది దారుణమా, హర్షణీయమా అనే చర్చ మార్చలేదు. ఉన్నవాడికి లేనివాడు లోకువ. వాస్తవాలకన్నా కల్పనలు ఆకర్షణీయాలనే భావన మారనంతకాలం ఇలాగే జరుగుతుంది. ఆ హాస్యపాత్రధారులను ప్రజలే చట్టసభలకు ఎన్నుకున్నారు ప్రతినిధులుగా!

**4. 'అధికార భాషాసంఘం' అంటే ఏమిటి? మన రాష్ట్రంలో ఇలాటి సంఘాలతో పని ఉందా? అదేం చేయాలి? ఏం చేస్తోంది?**

ఆంధ్రప్రదేశ్‌లో తెలుగును అధికారభాషగా అమలుపరచటానికి కావలసిన సమస్త సౌకర్యాలనూ కల్పించటానికి 1974 మార్చి 19వ తేదీన సాధారణ పరిపాలనశాఖకు అనుబంధంగా అధికార భాషాసంఘాన్ని ప్రభుత్వం నెలకొల్పింది (జి.ఓ.ఎం.ఎస్. నం. 199 జి.ఏ.డి., ఓ.ఎల్.). ఆ తరువాత మూడు రోజులకు (జి.ఓ.ఎం.ఎస్.నం. 219 జి.ఏ.డి., ఓ.ఎల్.)– అంటే 22.3.1974న 'రాష్ట్రం మొత్తంలో తాలూకాస్థాయిలోనూ, అంతకు తక్కువ స్థాయిలోనూ అన్ని ప్రభుత్వ శాఖల్లోనూ తెలుగే వాడా'లన్న ఉత్తరువు జారీ అయింది.

ఈ సందర్భంలో గమనించవలసిన పూర్వచరిత్ర కొంత ఉంది. అవిభక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం 1926లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తును నెలకొల్పినప్పుడు తెలుగులోనే విద్యాబోధన జరగాలని చట్టంలోని 43వ సెక్షన్లోనే నిర్దేశించింది. అలా జరగ(టం) లేదు. అదే ప్రభుత్వం 1946–47ల్లో తూర్పుగోదావరి జిల్లాలో అధికారికంగా జరిగే ఉత్తరప్రత్యుత్తరాలన్నీ తెలుగులోనే జరగాలని ఆదేశించింది. తెలంగాణాలోని తూర్పు జిల్లాల్లో అలాగే జరగాలనే ఆజ్ఞలను 1950–52 మధ్యకాలంలో నిజాం ప్రభుత్వం జారీ చేసింది. ఈ ఆదేశాలు అమలైన దాఖలాలు తక్కువ. ఆంధ్రరాష్ట్రం 1953లోనే ఏర్పాటైనా, 1955 సెప్టెంబరు 29వ తేదీదాకా 'తెలుగుభాష క్రమంగా' అధికారభాష కావాలనే తీర్మానాన్ని శాసనసభ చేయలేదు. 1956 నవంబరు 1 వ తేదీన ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది కానీ, తెలుగును అధికారభాషగా నిర్ణయించే శాసనం 1966లో గానీ రాలేదు. 1966 డిసెంబరు 22వ తేదీన జారీ అయిన జి.ఓ.ఎం.ఎస్.నం. 1515 ఇరవై ఏడు ప్రభుత్వశాఖల్లో ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులో జరగాలని ఆదేశించింది. మరో ఉత్తరువు ద్వారా అదే సంవత్సరం ప్రభుత్వ న్యాయశాఖలో అనువాదశాఖ ఏర్పడింది. 1968 ఫిబ్రవరి 23వ తేదీన (జి.ఓ.ఎం.ఎస్. నం. 113) విడుదలచేసి ఆదేశం – ప్రభుత్వం తెలుగునే వాడాలి, ఇంగ్లీషును వాడకూడదని స్పష్టం చేసింది. ఇదంతా అధికార భాషాసంఘం ఏర్పడటానికి

ముందు జరిగిన కథ. హైదరాబాద్ నుంచి 1950లో వచ్చిన ఆదేశమే 1974లో కూడా రావటం ఒక విశేషం! 1970లో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగినప్పుడు మరోసారి తాలూకాస్థాయి వరకూ తెలుగును అధికారభాషగా నిర్ణయిస్తూ ఉత్తర్వులు జారీచేసి, 1977 నుంచి జిల్లాస్థాయి వరకూ అలాగే జరగాలని ఆదేశించిన ప్రభుత్వం, ఇప్పుడే స్థాయిలో ఏంచేస్తున్నదో స్పష్టంగా తెలీదు. రాష్ట్రపతిపాలన విధించిన కాలంలో వరంగల్ జిల్లాలో ఉర్దూను సహాధికారభాషగా నిర్ణయించారు. దరిమిలా అలా ఉండదగ్గ ప్రాంతాన్ని విస్తరించారు.

అధికార భాషాసంఘానికి అధికారంలేదనీ, భాష తెలియదనీ, సంఘలక్షణాలు (సమైక్య భావాలు) లేవనీ తొలి సంఘాధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు చమత్కరిస్తుండే వాళ్లు. ఆయన తరువాత ఆ సంఘానికి అధ్యక్షులైన వైలాల (వందేమాతరం) రామచంద్రరావు గారు హిందీలో గట్టివారు. తెలుగు కష్టంమీద మాట్లాడేవారు. ఆ మీదట హేమాహేమీలైన తెలుగు విద్వాంసులూ, కవులూ అధ్యక్షులైనారు. వావిలాలవారి హయాంలో కొన్ని ప్రభుత్వ శాఖలకు సంబంధించిన పారిభాషికపదపట్టికలు తయారైనాయి. తరువాత ఉపన్యాసాలు జోరైనాయి. కన్నడరాష్ట్రంలో ఇలాంటి సంఘమేర్పడ్డ తరవాత ఒక్క సంవత్సరకాలంలో 'కచేరీ కైపిడి' అని మాన్యువల్ అనువాదం ప్రచురించారు. మనవాళ్లు ఇప్పటి కలాంటి సామాన్యకృతం కూడా చేసినట్లు లేదు. ఇలాంటి సంఘాలు అవసరమా అని ప్రశ్నిస్తున్నారు. పని చేయగలిగితే, చేయనిస్తే అవసరమే! అందుకు రాజకీయపక్షాలవారికి పట్టుదలా, చిత్తశుద్ధీ అవసరం.. ప్రజానీకంలో భాషాభిమానం అంతకన్నా ముఖ్యం. ఇవి కొరవడ్డప్పుడు సంఘా లున్నా, లేకపోయినా గుడ్డికన్ను మూసినా, తెరిచినా ఒకటే అన్నట్లే ప్రయోజనం ఉండదు! సంఘముంటే కొందరికి కొన్ని ప్రయోజనాలు నెరవేరవచ్చు. లేకపోతే ఆపాటి ఆనందం అంత తక్కువ సంఖ్యలోని తెలుగువాళ్లక్కూడా లభించదు. అంతే భేదం.

తాలూకా వ్యవస్థ రద్దయింది కాబట్టి మూలచ్ఛేదమైం దనుకోవాలి. నేటి సంఘాధ్యక్షుడు మండలస్థాయిలో అధికారభాషగా తెలుగును తీర్చిదిద్దుతానని కవితాధోరణిలో చెప్తున్నారు. నిజానికి ఇప్పుడు గృహస్థాయి నుంచి తెలుగుమీద అభిమానం పుట్టించి, పెంచి, పోషించాలి. ఎందుకంటే అమ్మానాన్నల స్థానంలో మమ్మీడాడీలు స్థిరపడిపోతున్నారు. రోజులు గడిచేకొద్దీ ఈస్థానం గట్టిపడిపోతుంది. కదల్చటం అసాధ్య మవుతుంది.

మన ప్రజాస్వామ్య పరిపాలన అత్యధిక సంఖ్యాబలం సంపాదించిన రాజకీయపక్షం చేతికిందికి వస్తుంది. అందరు శాసనసభ్యులున్న అధికారపక్షంలో భాషాభిమానంతోబాటు భాషాపరిజ్ఞానం కూడా ఉన్నవాళ్లు పట్టమని పదిమందైనా ఉండి, వారు అధికార భాషా సంఘ సభ్యులైతే ప్రభుత్వాన్నీ, మహోద్యోగుల్నీ శాసనసభలోనే నిలదీసి తెలుగు వాడుకను అమలుపరచగలుగుతారు. సదరు అధికార పక్షనాయకత్వం వారికి అండగా నిలవటంతోబాటు స్వయంగా తెలుగులో మాట్లాడి, రాసి, స్పష్టంగా ధారాళంగా ప్రసంగించగలిగితే అడ్డంకులు రావు. కార్యదీక్ష ఉండి, పక్షపాతాది దుర్లక్షణాలు లేకపోతే చట్టాలను అనువదించటం, పరిభాష కల్పించటం అసాధ్యమేమీ కాదు. ఇతరరాష్ట్రాల్లో సాధ్యమైనది మనకెందుకు వీలుపడదు? ప్రభుత్వోద్యోగుల 'వ్యతిరేకత, అడ్డంకులు' అనే మాటలు కుంటిసాకులు మాత్రం. హిందీ

రాష్ట్రాల్లో, తమిళాది ఇతర రాష్ట్రాల్లో ఉద్యోగుల ప్రతిఘటన ఎందుకు రాలేదు? ప్రభుత్వ విధానాలన్నింటినీ ఉద్యోగులందరూ హర్షించి, ఆమోదించి, అమలుజరుపు తున్నారా? తమ ఉద్యోగులను నియంత్రణలో ఉంచలేనివారికి రాజ్యాధికార మెందుకు?

క్లుప్తంగా చెప్పాలంటే తెలుగును నిజంగా అధికారభాషను చేయాలన్న దృఢసంకల్పం రాజకీయనాయకులకు లేదు! చేయగల అధికారం, శక్తీ అధికార భాషాసంఘానికీ లేవు- అదో ప్రభుత్వశాఖకు అనుబంధమైన ఉపశాఖ మాత్రం కాబట్టి. అజాగళస్తనం పాలివ్వ(లే)దు. మిగిలిన ప్రసంగాలన్నీ ఆత్మవంచనతో మొదలై లోకవంచనతో ముగిసేవే!

**5. భాష, సంస్కృతుల పరిరక్షణకు ఎలాంటి చర్యలు తీసుకోవాలి?**

ఈనాటి వరకూ ప్రచురితమైన గ్రంథాలన్నింటినీ, శాసనపాఠాలనూ, సాంస్కృతిక వస్తువులనూ సేకరించి భద్రపరచటం మొదటి కర్తవ్యం. ఆ పని ప్రభుత్వ శాఖలు చేయటం లేదు. గ్రంథాలయాల కోసం వసూలు చేస్తున్న సెస్సును ఎవరికి వారు ఆహరిస్తున్నారు. అముద్రితంగా ఉన్న అపూర్వ గ్రంథాలను ప్రచురించటం రెండో పని. భాషా సంస్కృతులను ఉద్ధరించటానికని స్థాపించిన సంస్థలు సక్రమంగా పనిచేసే వాతావరణం కల్పించటం, వాటిని ఆశ్రిత పక్షపాత రాజకీయ ప్రయోజనాదులకు బలిచేయకపోవటం పవిత్ర బాధ్యత. వివరాలు చెప్పాలంటే మహాభారతం కన్నా పెద్ద పుస్తకం రాయవలసి వస్తుంది.

**6. ఇప్పటివరకూ కంప్యూటర్ భాష ఇంగ్లీషే. ప్రాంతీయ భాషా ప్రోగ్రామింగ్‌తో ఇవి అందరికీ అందుబాటులోకి రావడానికి మీవంటి భాషావేత్తలు చేస్తున్నది ఏమిటి? ఇన్‌ఫర్మేషన్ హైవే మీదకు తెలుగును తీసుకెళ్లేది ఎవరు?**

'ఇన్‌ఫర్మేషన్ హైవే' మీదకు తెలుగును తీసుకుపోగలిగేది సాంకేతికనిపుణులు. వారికి తోడ్పడవలసినంది బౌద్ధికంగా భాషాభిమానులూ, ఆర్థికంగా ప్రభుత్వం వంటి మహత్తర సంస్థలు. లాభసాటి పనికాదని వ్యాపారసంస్థలు పట్టించుకోవటంలేదు. నేనేమీ ఈపని చేయటంలేదు. హైదరాబాదులోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఈ పని సాగుతున్నది.

**7. కంప్యూటర్ పదకోశాన్ని రాస్తున్నారని విన్నాం. ఎంతవరకూ వచ్చింది?**

గచ్చీబౌలీలోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో డాక్టర్ ఉమామహేశ్వరరావు ప్రభృతు లీ పని చేస్తున్నామంటున్నారు. వివరాలు తెలియవు.

**8. చదువరితనం ఇటీవలికాలంలో గణనీయంగా పడిపోతున్నదని అంటున్నారు. జనాల్లో చదివే అలవాటు తగ్గిపోవడానికి టీ.వీ.లూ, ఇంటర్‌నెట్లూ కారణం అంటున్నారు. మీరేమంటారు?**

వినోదదృష్టి కలవాళ్లు టీవీ సినిమాల వ్యామోహంలో చదవటం తగ్గించారు. ఇంటర్‌నెట్లు ప్రచారం జరుగుతున్నంత సులభంగా అందరికీ అందుబాటులో లేవు. చదవటం తగ్గలేదు గానీ, గ్రంథాలయాలు ఆర్థిక దుఃస్థితిలో ఉన్నందువల్ల గ్రంథ ప్రచురణ తగ్గిన మాట వాస్తవం. మన దేశస్థితిని అమెరికా పరిస్థితులతో పోల్చుకొని చాలా పెద్ద ఎత్తున దుష్ప్రచారం జరుగుతున్నా చదవటం తగ్గినట్లు లేదు కానీ, చదివే పుస్తకాల, పత్రికల స్వరూపస్వభావాలు మారుతున్నాయి సమాజంతోపాటు.

**9. రచనా వికాసానికి ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలు ఇస్తున్న అవార్డుల తీరు ఎలా ఉంది? వీటివల్ల, మెరుగైన సాహిత్యం ఏ మేరకు వస్తోంది?**

అవార్డులవల్ల సాహిత్యం గుణాత్మకంగా పెరగదు. బిరుదులూ, ప్రచారాలూ, వాణిజ్య ధోరణులూ గుణదోష నిర్ణయాలను నియంత్రించలేవు. దేశకాలపాత్రలదే చరమనిర్ణయం. రచనావికాసం రచయితల శక్తిసామర్థ్యాల మీద ఆధారపడి, సమాజం చూపే ఆదరణవల్ల ప్రశస్త మవుతుంది. అవార్డుల తీరు మన సమాజలక్షణాలకు అనుగుణంగానే ఆదర్శరహితంగా సాగుతున్నది.

**10. ఇవాళ్టి తెలుగు సాహిత్యధోరణులపై మీ అభిప్రాయం ఏమిటి?**

నేడు రచనాప్రక్రియల్లో అనేకకారణాలవల్ల కథానిక అగ్రస్థానానికి చేరుకుంది. కవిత్వం పూర్వౌన్నత్యం పోగొట్టుకుంది ఆ మేరకు. నాటక ప్రక్రియ శ్రీశ్రీ చెప్పినట్లు 'కన్యాశుల్కం' తరవాత స్తంభించింది. నాటకరంగం స్థానం వారన్నట్లు ఉన్నతస్థితిని అందుకోవటంలేదు (ముఖ్యంగా సినిమాల దుష్ప్రభావంవల్లా, వాణిజ్య దృష్టి లేనందువల్లా). పరిశోధనలు ఇటీవల రాశిలో పెరుగుతున్నాయి. నేటి ధోరణుల మంచి చెడ్డలను సమకాలికులు గాక, తరువాతి తరాలవాళ్లు స్పష్టంగా, నిర్మోహంగా పరిశీలించగలరు. గ్రంథ పరిమాణం, ప్రచురణవ్యయం వంటివి నవలారచనను నిరుత్సాహపరుస్తున్నవి.

**11. ఇటీవలి కాలంలో 'కులస్పృహ' విపరీతంగా పెరిగింది. ఇది తెలుగుభాషపై చూపిస్తున్న ప్రభావం ఎలాంటిది? తెలుగునాట కులం – భాష పడుగుపేకల్లా అల్లుకుపోయాయి. దీని ప్రభావం యావత్తు జాతిపై ఎలా ఉంది?**

'కులస్పృహ' అనేకన్నా, 'కులదురభిమాన' మనటం సముచితం. రాజ్యాంగంలోనే కుల ప్రసక్తి స్పష్టంగా ఉంది. పేదరికం కన్నా సంఘంలో కులం కారణంగా వచ్చిన దీనస్థితి ప్రధాన మనుకున్నారు రాజ్యాంగ నిర్మాతలు. ప్రత్యేకసౌకర్యాలు కులప్రాతిపదికమీదనే లభిస్తున్నాయి. సమాజంలో తమది గొప్పకుల మనుకునే, చెప్పుకునే వర్గాలు కూడా ఈ సౌకర్యాల కోసం తమను అగ్రవర్ణాల పట్టికనుంచి తొలగించమంటున్నాయి. మన రాజకీయాలూ, అధికారపదవుల పంపకం, ఎన్నికలూ వగైరా సమస్తం కులప్రాతిపదికమీద నడుస్తున్నప్పుడు, భాషలో కూడా ఆ లక్షణం కనిపించటంలో ఆశ్చర్యం లేదు. కనిపించకపోతేనే విస్తుపోవాలి! ఇది తెలుగువారి ప్రత్యేకత కాదు. మొత్తం భారతదేశంలో కనిపించే సాధారణ పరిస్థితి. కులంకన్నా మతం తక్కువ ప్రమాదకర మైపోయింది. భారతీయ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఇది తొలగించటం అసాధ్యం! ఇప్పట్లో ఇది మారదు!!

**12. వృత్తి పదకోశాల అభివృద్ధిలో మీ పాత్ర ఎంత? మీరేం చేశారు?**

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి గృహనిర్మాణ వాస్తుపదకోశమనే వృత్తి పదకోశాన్నీ, దాని వారసైన తెలుగు విశ్వవిద్యాలయానికి కళలకు సంబంధించిన సంపుటినీ నేను సిద్ధం చేశాను. తెలుగు అకాడెమీలో ఉండగా వాణిజ్య పదకోశ నిర్మాణాల్ని పర్యవేక్షించాను. వృత్తిపదకోశం సంపాదకుల సంఘంలో నేనూ ఒక సభ్యుణ్ని.

# అనుబంధం - 2

## పృచ్ఛకులు : శ్రీ ద్వా.నా. శాస్త్రిగారు

## ఇంటర్వ్యూ ప్రచురితమయింది స్వాతిపత్రికలో...

**1. అభ్యుదయకవిత్వోద్యమం శ్రీశ్రీతో అంతరించిందా? 'అభ్యుదయకవిత్వానంతర ధోరణులు' గ్రంథంపై మీ స్పందన ఏమిటి?**

'అంతరించట' మనే మాటకు మీరుగాని ఇతరులుగాని ఏ అర్థమిస్తున్నారో తెలియదు. నన్నయలేడు కాబట్టి పురాణకవిత అంతరించిందంటారా? ఉద్యమాలు వస్తుంటాయి. కొంతకాలం తీవ్రంగా కొంతకాలం మందకొడిగా సాగుతాయి. అందుకు దేశకాల పరిస్థితులు కారణం. ఉద్యమం చప్పబడినంత మాత్రాన అది నిష్ప్రయోజనకరమై అంతరించిందనటం అజ్ఞానం. శ్రీశ్రీ 1935 నుంచి ప్రచారం చేసిన భావాలనే సినారే వంటి సరసులు కూడా కవిత్వం పేరిట చెలామణీ చేస్తుండగా ఉద్యమం అంతరించిందని ఎలా అంటున్నారో అనుకొంటున్నారో తెలీదు. వరంగల్లులో జనసంఘధోరణీ సంప్రదాయబద్ధతా ప్రధానమనుకొన్న పదిమంది 'ఆచార్యులు' ఏవో ప్రసంగాలుచేసి ఏదో ఒక పుస్తకం అచ్చువేసినంత మాత్రాన ప్రపంచం తలకిందులైపోలేదు. అభ్యుదయ కవితోద్యమం కాకపోయినా కవిత్వమైనా తీవ్ర స్వరూపంలో ప్రజాకవుల రచనల్లో ఉంది కాబట్టే నేటి తీవ్రవాదసాహిత్యం నక్సలిజానికి ప్రోత్సాహకరంగా ఉంది. ఈ విషయాన్ని మన ఆచార్యులు గుర్తించినట్లులేదు. అవే భావాలను అధికారంలో ఉన్న వాళ్లు రాస్తే భజన చేస్తారు మళ్లీ! విలువలెక్కడ?

అభ్యుదయానంతర ధోరణులు చూశాను. స్పందించలేదు. ప్రపంచ విశ్వవిద్యాలయాల చరిత్రలోనే ఉత్తమసాహిత్యంగాని ఉత్తమవిమర్శగాని వాటికి బయటనే పుట్టిపెరిగాయి. చివరకు శాస్త్రపరిశోధనలు కూడా పరిశోధనసంస్థల్లోగాని విశ్వవిద్యా'లయా'ల్లో ఉత్తమస్థాయిలో జరగలేదు. డిగ్రీలూ పదవులూ కావలసినవాళ్లు తప్ప, పరస్పర ప్రశంసాపద్ధతులు నేర్చుకోదలచిన వాళ్లు తప్ప, విశ్వవిద్యాలయాచార్యుల భావాలకూ ప్రసంగాలకూ ప్రచురణలకూ ప్రామాణికాలన్న విలువ నివ్వనక్కరలేదని నా నిశ్చితాభి ప్రాయం. అందుకే నేను స్పందించలేదు. పదికాలాలపాటు బతికుండే ఏ రకమయిన సారస్వత భేదమయినా ఆవాతావరణంలో పుట్టదు. పుట్టే ఆరోగ్యకరంగా పెరగదు. అది నా నమ్మకం.

**2. 1956లో మీరు అభ్యుదయలో రాసినట్టు నేటికీ వచనకవితలో అన్వయక్లేశముంది. ఇది వచనకవితావ్యాప్తికి అవరోధం కాదా? వచన కవితరాసే కవికికూడా శబ్దాధికారం ఉండాలా?**

వచన కవితలోనే కాదు పద్యకవితలోకూడా అన్వయక్లేశముంది. ఉదాహరణకు విశ్వనాథ రచనలు. కవిత అన్నది గద్యపద్యరూపాల్లో దేంట్లో ఉన్నా అది స్పష్టంగా సులభ గ్రాహ్యంగా ఉంటేనే రాణిస్తుంది. నిజంగా శబ్దాధికారమున్న కవిగాని రచయితగాని తన భావాలను సూటిగా స్పష్టంగా వెలిబుచ్చటానికి కావలసిన సరైన మాటలనే ఎన్నుకుంటాడు, కాళిదాసులా, వాల్మీకిలా. కవిభావన స్పష్టంగా ఉంటే రచన కూడా అలాగే వుంటుంది.వచ్చిన చిక్కల్లా చెప్పదలచిన

విషయాన్ని ఎలా చెప్పాలో తేల్చుకోకముందే, ఏ మాటలు వాడితే పాఠకుడి మనస్సుకు హత్తుకుంటాయో అంచనా వేయకముందే రాసిపారేయటంవల్ల, రాసినదాన్ని గురజాడ లాగా మరోసారి సరిదిద్దుకోనందువల్ల వస్తున్నది. వచన కవి తక్కువవాడని పద్యకవి ఎక్కువవాడని నేను నమ్మను. ఉభయులకూ శబ్దాధికారం అవసరమే. అంతకన్నా ముఖ్యం ప్రతిభ. కవిత్వలక్షణం లేని శుద్ధవచనం, శుద్ధ పద్యం విషయంలో శబ్దాధికార ప్రసక్తే అక్కరలేదు.

**3. పూర్వం జరిగిన సాహిత్య వివాదాలకీ – ఈనాటి సాహిత్య వివాదాలకీ తేడా ఏమిటి?**

మీరు 'పూర్వం' అని ఏకాలాన్ని పిలుస్తున్నారో స్పష్టంగా లేదు. తెలుగు సాహిత్యంలో 19వ శతాబ్దారంభం నుంచి 20వ శతాబ్దం దాకా జరిగిన సాహిత్య వివాదాలను పూర్వ వివాదాలను కుంటే నాటి చర్చలకూ నేటి చర్చలకూ స్వభావంలోనే భేదాలున్నాయి. అప్పట్లో శాబ్దికచర్చ ఎక్కువ. చర్చ ఎంత తీవ్రంగా జరిగినా తమవాదం సరికాదనుకున్నప్పుడు అలాగని ఒప్పుకోగల హుందా ఆనాటివారికుండేది. మచ్చుకు మల్లాది, తాపీ వగైరాలు; ఇంకా గొప్పగా వేదంవారు, కందుకూరివారు తమవాదం మార్చుకున్నారు. మీరు ఏ విషయాన్ని మనసులో పెట్టుకొని ఈ ప్రశ్న వేశారో తెలీదు. అందుకే ఇంత క్లుప్తంగా రాస్తున్నాను.

**4. 'తెలుగునకు'న్న విమర్శనాదీపం చిన్నది అంటే మీరు ఏకీభవిస్తారా?**

తెలుగునకున్న విమర్శదీపమే కాదు సాహితీ దీపంకూడా చిన్నదే. ఇది అన్యోన్యాధారితాలు. విమర్శనకు తట్టుకొని, నిలవగలమన్న ధీమాగల రచయిత లిప్పుడు కరువౌతున్నారు. వారిని పొగడటమే విమర్శగా భావించే విద్వాంసు లున్నారు. ఇక పెరిగే దెలా?

**5. తెలుగులో వెలువడుతున్న సిద్ధాంత గ్రంథాల్లో స్థాయిని గురించి ఏమనుకుంటున్నారు?**

సిద్ధాంత గ్రంథ రచనా ప్రచురణలు ఇప్పుడు పెద్దపరిశ్రమ. నచ్చినవారిని మెచ్చటంలో తక్కిన వారిని తూలనాడటం, ఇతరులు చెప్పిన అభిప్రాయాలను ఎత్తి రాయటం, సొంత అభిప్రాయాలేవో తెలుసుకోదలచినవాళ్లకి అవి ఉన్నచోట్లు ఎంతో శ్రమపడితేగాని దొరక్కపోవటం సాధారణ లక్షణాలు. తెలుగు తప్ప మరో భాషగాని సాహిత్యంగాని తెలియకపోయినా మన అభిమానకవి / కావ్యం ప్రపంచ సాహిత్యంలో అద్వితీయ మనటం మరో విశేష లక్షణం. ఒకే విషయంమీద, ఒకే వ్యక్తి మీద, వీలయితే సదరు వ్యక్తి దగ్గరే పరిశోధించి డిగ్రీలు సంపాదించటం మరో విలక్షణత. వీలయినంతగా విషయప్రస్తారం చేసి గ్రంథం పెంచటం ఇంకో విశేషం. ఎక్కడో ఒకటీ రెండు తప్ప తక్కిన సిద్ధాంత గ్రంథాలన్నీ ఒకే మూసలో వస్తున్నాయి.

(తమకు పరిశోధన విషయంలో ప్రాగల్భ్యం లేకున్నా సమస్త శాస్త్రాల్లోనూ పర్యవేక్షకత్వం కావాలనే తపన ఉన్న ఆచార్యులు కోకొల్లలు. వారి అభిమానం కోసం పాకులాడే విద్యార్థులు అసంఖ్యాకులు. ఇప్పటి సిద్ధాంతవ్యాసాల్లో ఎత్తిరాతలే సిద్ధాంతాలు. వాసికన్నా రాశి ప్రధానమనుకొనే కాలంలో ఈ పరిస్థితి మారదు. మీరు బాధపడకుండా వుంటే 'out of the quantitative evolves the qualitative' అనే కార్ల్‌మార్క్స్ మాటను మననం చేసుకొని తృప్తి పడవచ్చు. ఈ మాటలు 'నవ్యసంప్రదాయం'లో చెల్లుబడి కావనుకుంటా.)

గమనిక : బ్రాకెట్ల మధ్య ఉన్న భాగాలను పృచ్ఛకులు ప్రచురణ సమయంలో తొలగించారు. ఎందుకలా చేశారో వారికే తెలియాలి.

**6. తెలుగులో సమగ్రమైన నిఘంటువు లభించకపోవటానికి కారణాలు ఏమిటంటారు?**

'సమగ్ర' మైన నిఘంటు వనేది జీవద్భాషకు రాదు. 'ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః'. సువిస్తృతమైన నిఘంటు నిర్మాణం సాధ్యమే. అందుకు ప్రతిబంధకా లనేకం. వాటిలో ప్రధానమైనవి :

(i) మహా నిఘంటు నిర్మాణం ఒక వ్యక్తికి అసాధ్యం. ఒకరిమీద గురుత్వముంచి వారి నాయకత్వంలో పనిచేయటానికి ఏతెలుగువాడూ ఒప్పుకోడు. వేదం వేంకటరాయ శాస్త్రి అంతటి వాడి నాయకత్వమే అంగీకార్యం కాని దేశంలో తదితరులను గురించి తలచుకోవటం అనవసరం. (సూ.రా.ని. తగలబడిపోవటానికి అది ప్రధానకారణం).

(ii) నిర్మాణం దీర్ఘకాలిక పరిశ్రమ. ఆక్స్‌ఫర్డు నిఘంటు నిర్మాణానికి 300 మంది 69 సంవత్సరాలు కృషిచేశారు. మన వాళ్లు పట్టుమని పదిమంది సహాయకుల నమమతించరు. పదేళ్ల గడు విప్వరు. నిర్మాతలు సుఖంగా బతకదగ్గ జీతభత్యాలు కాని, వసతులుగాని కల్పించరు. ఆ భోగాలున్న ఆచార్యులు ఇలాంటి క్షుద్రవిషయాల జోలికిపోరు. నిఘంటు స్వరూపాన్ని చర్చించడానికి చర్చాగోష్ఠులు, నిర్మాణవిద్య నేర్పటానికి తరగతులు, భోజనభాజనాది సదుపాయాల్తో సహా కల్పించినా వారు నిరుపహతిస్థలాదులకోసం వెంపరలాడుతూ అవిశ్రాంతంగా ఉంటారు.

(iii) భాషా సాహిత్యాల్లో ప్రచురితాప్రచురిత గ్రంథ సంచయాన్ని సమకూర్చే గ్రంథాలయం లేదు. ప్రతి ఆకరానికీ ప్రయోగాదులతో లక్షలసంఖ్యల కార్డులుంటేగాని పని జరగదు. చిత్తుకాగితాల్తోనో మీతలలోని ఆలోచనల్తోనో పనిసాగించమనే పాలకులుంటారు. వారికి అధికారం ఉంటుంది. విషయజ్ఞానం ఉండదు. ఒకరు చెప్పే విషయాన్ని వినే ఓపికా తీరికా ఉండవు. ఉంటే కావలసిన ధనముండదు. అసలు సంకల్పమే పూజ్యం. కాదా అనుమానాస్పదం. (ఇంకా వివరాలు కావాలంటే విశాలాంధ్రవాళ్లు ప్రచురించిన నాభాషాశాస్త్ర వ్యాసాలు చూడగోర్తాను).

**7. భాషాశాస్త్రం వల్ల సాహిత్యానికి కీడుజరిగిందనే అభిప్రాయంతో ఏకీభవిస్తారా?**

ఒక శాస్త్రంవల్ల మరో శాస్త్రానికి 'కీడు' జరగుతుందనుకొనేవాళ్లు సమాజానికే చీడ పురుగులు. తర్క వ్యాకరణ మీమాంసాదులవల్ల పూర్వం కీడు జరగలేదు. నన్నయ శ్రీనాథాది (భట్ట) సుకవులే అందుకు సాక్ష్యం. ఆధునిక సాహిత్యం ఇతర శాస్త్రాలవల్ల వర్ధమాన మవుతున్నదిగాని భ్రష్టంకాలేదు. కొంచెం తీరిక చేసుకొని ప్రపంచ సాహిత్యాల్లోని ఉత్తమ గ్రంథాలను పరిశీలిస్తేనో, కనీసం సంస్కృత సాహిత్యంలోని మహారచనలను అర్థం చేసుకుంటేనో నా మాట నిజమని తేలుతుంది.

మీరు పేర్కొన్న దుర్భావానికి సాహితీవేత్తల మనుకుంటున్నవాళ్లకు భాషాశాస్త్ర పరిచయం లేకపోవటంతోబాటు, భాషా శాస్త్ర జ్ఞానమున్న వాళ్లకు సాహితీ పరిచయం ఉండటం కూడా ప్రధానకారణం. అవ్యుత్పన్నతే పరమార్థ మనుకొనేవాళ్లకు అబ్బూరి పద్యశకలమే సమాధానం: "అజ్ఞాతాజ్ఞేయాలకు అజ్ఞానంతో నేస్తం".

**8. అభ్యుదయకవులు, విప్లవకవులు ప్రేమకవిత్వంకూడా రాయవచ్చని అంటున్నారు. అపుడు మరి 'కమిట్‌మెంట్'కి అర్థం ఏమిటి?**

"Commitment/ నిబద్ధత" సిద్ధాంతానికే గాని కవితావిషయానికి గాదు. విప్లవ కవులూ మానవమాత్రులే. వాళ్లకీ ప్రేమానురాగాలుంటాయి. మీవాదాన్ని సాగదీస్తే భక్తకవులు పోతనలాంటివాళ్లు సంసారం చేయటమే తప్పు; దేవతగా ఆరాధించే శ్రీవాణీ గిరిజల స్తన సౌభాగ్యాన్ని వర్ణించటం అంతకన్నా బూతు; 'చరణరణితమణినూపురయా పరిపూరిత సురత వితాన' మని రాయటం, పాడటం, పైపెచ్చు అది వేదాంతమనటం పరమదుర్మార్గం, లోకవంచన; ఆత్మవుంటే ఆత్మవంచన. సంప్రదాయవాదులందరూ ఝూరీచెంబులు పట్టుకొని పిలకలు పెట్టుకొని శ్రౌతస్మార్త క్రియలూ యజ్ఞ యాగాదులూ పూజా పురస్కారాలూ చేయాలేగాని ఉద్యోగాలు చేయరాదనటం ఎంత అసంగతమో విప్లవకవులు ప్రణయకవిత్వం రాయకూడదనటం అంతే అసంబద్ధం.

**9. అకాడమీల పునరుద్ధరణ అవసరమంటారా?**

సాహిత్య అకాడమీ పునరుద్ధరణ అనేది రాజకీయ విషయం. సాహిత్య సమస్యకాదు. అది లేనప్పుడు సాహిత్యానికి నష్టం కలగలేదు. ఉన్నప్పుడు కొద్దిమంది సాహితీపరుల ఉదరపోషణకో ప్రఖ్యాతి సంపాదనకో ఉపయోగపడ్డది. అభావ ప్రత్యామ్నాయంగా సాహిత్య అకాడమీని పునరుద్ధరిస్తే అందువల్ల ఏ కొందరు సాహితీపరులకో ఏకొంచె మయినా ప్రయోజనం కలిగితే వచ్చే నష్టమేమిటి? లాభం సంగతి అనవసరం. అది దాన్ని నిర్వహించేవాళ్లకు వచ్చేది. ప్రజలకు గాదు.

**10. 'ప్రాచీన సాహిత్యం' మ్యూజియంలో పెట్టవలసినదేనా?**

ప్రాచీన సాహిత్యాన్ని మ్యూజియంలో పెట్టాలని నేనెప్పుడూ కలలో కూడా ఆపేక్షించను. ఆ పని చేయటానికి విశ్వవిద్యాలయాలున్నాయి. ఆముక్తమాల్యద, వసుచరిత్ర వంటివి పఠన పాఠనాల్లో లేవిప్పుడు. అవన్నీ చిన్న తరగతుల్లో చదివి వుంటారని నమ్మకం. ప్రాచీన సాహిత్యం చదవనివాళ్లకు శబ్ద జ్ఞానం కలగదు. పూర్వ సంస్కృతి పట్టువడదు. గతం తెలుసుకోదలచని వాళ్లు వర్తమానం మీద మాత్రం గౌరవం చూపుతారనుకోను. ఎటొచ్చీ పూర్వసాహిత్యధోరణిలో గతానుగతికంగా రాయటం మంచిది కాదని నావాదం. కొత్తదనం కోసం – భాషలో, భావంలో, రచనాపద్ధతిలో కొత్తదనం కోసం – ప్రయత్నించాలని నా కోరిక. "క్షణే క్షణే య న్నవతా ముపైతి, త దేవ రూపం రమణీయతాయాః" అన్నమాట ఉపాదేయం – పాతకాలపు కవి చెప్పినప్పటికీ. పూర్వం ఏముందో తెలియని రచయిత పాతభావాలనే పాత మాటల్లోనే చర్విత చర్వణంగా రాస్తూ ఆత్మతృప్తి పొందవచ్చునేమో గాని నేటి సాహిత్యానికి అతగాడు ఒరగబెట్టేదేమీలేదని నావిశ్వాసం. గతంనుంచి వర్తమానం, వర్తమానంనుంచి భవిష్యత్తూ క్రమపరిణామం పొందుతాయి. ఆధారంలేని ఆధేయం ఆలంకారిక రచనల్లోనేగాని వాస్తవజగత్తులో అసాధ్యం.

# బూదరాజీయం

ప్రకాశం జిల్లా వేటపాలెంలో 1932 మే మూడోతేదీన జన్మించారు. 1965లో హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ ఎర్లీ తెలుగు ఇన్‌స్క్రిప్షన్స్ అనే అంశంపై పరిశోధన చేసి ఆంధ్ర విశ్వ విద్యాలయంనుంచి డాక్టరేట్ పొందారు. చీరాల వి.ఆర్.ఎస్. అండ్ వై.ఆర్.ఎస్. కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు. 1988లో తెలుగు అకాడమీ డిప్యూటీ డైరెక్టర్‌గా పదవీ విరమణ చేశారు. సెంట్రల్ యూనివర్సిటీ విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉండి 1990 నుంచి దశాబ్దకాలంపాటు ఈనాడు జర్నలిజం స్కూల్ ప్రిన్సిపల్‌గా పనిచేశారు. 'ఈనాడు'లో 600 పైచిలుకు పుస్తకాలను సమీక్షించారు. 'ఈనాడు'లో వారం వారం పుణ్య భూమి శీర్షికను 17 సంవత్సరాలు నిర్వహించారు.

వాస్తు పదకోశం, ప్రాచీనాంధ్ర శాసనాలు, వ్యావహారిక భాషా వికాసం, ఈనాడు భాషా స్వరూపం, ఆధునిక వ్యవహార కోశం, సాహితీ వ్యాసాలు, భాషా శాస్త్ర వ్యాసాలు, పురాతన నామకోశం, మాటల మూటలు వంటి పుస్తకాలు వెలయిం చారు. చిన్నయసూరి, శ్రీశ్రీ, కొమర్రాజు లక్ష్మణరావుల గురించిన మోనోగ్రాఫులను కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురించింది.

బూదరాజు రాధాకృష్ణ ఆత్మకథ విన్నంత–కన్నంత, మంచి జర్నలిస్టు కావాలంటే, అనువాద పాఠాలు అనే పుస్తకాలను మీడియాహౌస్ పబ్లికేషన్స్ ప్రచురించింది.

ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న ఈ పుస్తకం జర్నలిస్టులకు, సాహితీ మిత్రులకు అత్యంత ఉపయుక్త ప్రామాణిక గ్రంథం.

ప్రభావంలో కొట్టుకొనిపోయిన" కేతన కన్నడభాషా భూషణం పద్ధతిలో దంత్యచజలను మరిచి పోయాడన్నారు (పే. 61). అవి ప్రత్యేకవర్ణాలు కావని, కేవలం ఉచ్చారణ భేదాలేనని, వాటిని చెప్పకపోవటం తప్పుకాదనీ రామచంద్రగారు గుర్తించలేదు. అదే ధోరణిలో "తద్ధర్మార్థకాలం" (!పే. 65) సంగతి ఆయన మరిచిపోయాడేమోనని ఆశ్చర్యపోయారు. తద్ధర్మార్థకమేగాని కాలమనేది మరే వ్యాకర్తా అంగీకరించిన విషయంకాదు. తత్ (ఆయాకాలపు) ధర్మాన్ని బోధించే తద్ధర్మార్థకం నిర్దిష్ట కాలబోధకం కాదు.

భాషాదృష్టితో నీగ్రోలు రెండు తెగలన్నారు (పే. 197). ఈ రకం విభజనను భాషాశాస్త్రజ్ఞు లెవరూ చేయలేదు. ఇంగ్లీషు, ఫ్రెంచి, అరబ్ భాషల ప్రభావంగల ఖండంగా ఆఫ్రికాను త్రిధా విభజిస్తారు. "మొట్టమొదట మన దేశానికి వచ్చిన ముస్లింలు "తురక్"లు (పే. 73) అని" వారి సామ్రాజ్యం వెయ్యేళ్లకుపైగా సాగిందన్నారు. భారతదేశం మీద మొదట దండెత్తింది అరబ్బులా? తుర్కీవారా? తుర్కీరాజ్యం మనగడ్డమీద సహస్రాబ్దాలు కొనసాగిందనటానికి నిదర్శనాలేమిటి? ఇలా ప్రాకృత ద్రవిడ భాషావ్యుత్పత్తుల విషయంలో కూడా విభేదించవలసి వస్తుంది. ఈజిప్షియన్ చిత్రలిపిని "జంతులిపి" (పే. 176) అనటంకూడా కొంత విడ్డూరమే.

కొన్ని విషయాల్లో ఏకీభవించలేకపోయినా మొత్తంమీద ఈ వ్యాససంపుటి సరళభాషలో సాగి చదివిస్తుంది. పాఠకులను ఆకర్షించే ధోరణిలో బహువిషయ బోధన చేస్తారు రామచంద్ర గారు. ఆయన బహుముఖవిద్వత్తూ లోకానుభవమూ మెచ్చుకోదగ్గవి. భాషాసాహిత్య సంస్కృతు లను అభిమానించేవారు తప్పక కొని చదవదగిన పుస్తకమిది. మూడో కూర్పును ప్రచురించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారు అభివందనీయులు.

12.5.1991

## బాలల శబ్దరత్నాకరం

**కూర్పు : ఆచార్య తూమాటి దొణప్ప**

రమారమి నాలుగువేల పదాలతో 172 పేజీలతో విద్యార్థుల కోసం కూర్చిన తెలుగు నిఘంటువిది. "పదోతరగతి వరకూగల విద్యార్థుల పాఠ్య గ్రంథాలనూ, ముఖ్యంగా పాఠ్యాంశా లుగా నిర్ణయించే ప్రాచీన కావ్యభాగాలనూ పరిశీలించి" ప్రకృతి వికృతుల నిరూపణతో, సులభప్రయోగాలతో, రేఖాచిత్రాలతో ఈ కోశం తయారయింది. అక్కడక్కడ తెలుగు మాటలకు ఇంగ్లీషులో కూడా అర్థాలిచ్చారు. ఉదాహరణకు అంగుళి అంటే finger, అంచనా అంటే estimation.

పెద్దక్షరాలతో ఫొటోటైప్ సెటింగ్ చేసిన కోశంలో చాలా చోట్ల అక్షరాలు అతకలేదు. ప్రధానారోపం, దాని అర్థం, ఉపారోపాలూ, ప్రయోగాలూ సమస్తం ఒకే పరిమాణంలో ఉన్నందు వల్ల ఏది ప్రధానమో, ఏదికాదో, ఏది ప్రయోగమో, ఏది అర్థవివరణో విద్యార్థులకు స్పష్టం కాకుండాపోతుంది. వర్ణక్రమం ఆధునికపద్ధతిలోకాక శబ్దరత్నాకర సంప్రదాయంలో ఉంది. ప్రధానారోపాల్లో గ్రాంథిక రూపాలు వాడారు కొన్ని సందర్భాల్లో. మచ్చుకు త్రెళ్లు, త్రుంచు, ప్రేలు వంటివి. ఉపారోపాల విషయంలో వర్ణక్రమం పాటించలేదు. కొన్ని సమయాల్లో పదాలమధ్య ఖాళీ చాలా ఎక్కువగా ఉంది. కుడి ఎడమల్లో రాతప్రతిలో లాగా ఎలైన్మెంటులేదు

- చాలా చోట్ల ప్రూఫులు సరిగా చూడనందున ప్రధానారోపాల్లోనే కొన్ని చోట్ల అక్షరాలు లోపించాయి. ఉదాహరణకు 'అంగరంగభోగాలు' అనే చోట మొదటి గకారం ఎగిరిపోయింది.

విద్యార్థులకు - అదిన్నీ చిన్న తరగతుల వారికి - ఉద్దేశించిన కోశంలో 'అంతర్వత్ని, నాపసాని' వగైరాలు కనిపిస్తారు. "ఉపశ్లోకించు, ఓహటం, ఖాణం, చషకం, తేరసి, దామెన, పురాణించు, బ్రదిమి, లెప్పం వంటి మారుమూల మాటలు కొల్లలు. 'బుడతకాళీలు, వళంద' వంటివి కూర్పరి కిష్టమైన పదరూపాలు. 'దేవమాతృక, సర్వమాన్యం, సూయాణం, సూసరి, హళది, హురుమంజి, హోరాటం' వంటి ఆరోపాలు విద్యార్థుల ప్రయోజనాల కోసమో కూర్పరి పాండితీప్రకర్షను ప్రదర్శించటంకోసమో చెప్పటం కష్టం. ఆమ్లజని వంటి తాతలనాటి పారిభాషికాలు ఇందులో చోటుచేసుకున్నాయి. 'అగ్నిమాపకయంత్రం' వంటి పదబంధాల్లోని తప్పులను వ్యాఖ్యానించిన వారు 'బుడతకాల్' వంటి వాటిని కూడా వివరిస్తే బాగుండేది. ప్రాచీనకావ్యాల్లో పాదపూరణాదుల కోసం బహుళంగా కనిపించే 'వెస, రహి, రమణ' వంటి పదాలుగాని ఈనాటి పత్రికాభాషలో కూడా దర్శనమిచ్చే 'మిక్కిలి, కరచు, కైకొను, ఇరువురు' వంటి తాతలనాటి మాటలుగాని ఈ నిఘంటువులో చేరలేదు.

నిఘంటు నిర్మాణంలో అంతశ్రద్ధ చూపినట్లు లేదు కూర్పరి. 'నమాజు' మహమ్మదీయుల దైవప్రార్థన అని అర్థం చెప్పారు. అహమ్మదీయుల క్కూడా వర్తించేది కాబట్టి 'ముస్లిముల' అనే పదం ప్రయోగించి ఉండవలసింది. 'పీరు' అంటే 'మొహరం పండగలో పూజించే విగ్రహం' అన్నారు. ముస్లిములు విగ్రహారాధన చేస్తారని విద్యార్థులు భ్రమించే అవకాశం కలిగించా రన్నమాట. 'పలకనిది' అని 'నంగి' శబ్దాన్ని వివరించవలసినచోట 'పలుకునది' అని కేవలం వ్యతిరేకార్థమిచ్చారు. కొన్ని అర్థాలు అబ్బురంగా ఉన్నాయి. 'పొది' అంటే 'బాణాలపొది' అన్నారు. సులభంగా ఉన్నాయి కదూ అర్థాలు? ఉగ్రఉడియంగా' అంటే 'తెకతేరగా' అని అర్థం. 'దస్తూరి' అంటే 'చేవ్రాలు' అన్నారు. 'వ్రాలు' కాదా? చేవ్రాలంటే సంతకం కాదా? 'ఉత్తీర్ణత'కు బదులు 'ఉత్తీర్ణం' అని ఆరోపంగా ఇచ్చి 'పాసవడం' అని ఇంగ్లీషుభాషా మిశ్రితంగా అర్థమిచ్చారు. 'అపోహ' అనే నామవాచక రూపం ఆరోపం. దానికి 'తప్పుగా అర్థం చేసుకొను' అని క్రియారూపంలో అర్థమిచ్చారు. ఇలాంటి దోషాలు కొల్లలు. కూర్పరి జగదేకవిద్వాంసుడు. నిఘంటు నిర్మాణ ధురంధరుడు. అయినా ఇలాంటి అసాధారణలోపాలు కనిపిస్తున్నాయంటే ఇది మనసుపెట్టి చేసినపని కాదనిపిస్తున్నది. కోశనిర్మాణానికి రూపకల్పన చేసుకోకుండా తోచిన మాటలకు తొందరలో అర్థాలు రాసిపారేసినట్లుంది. ఇది విద్యార్థుల, ప్రచురణకర్తల దురదృష్టం. అన్నిటినీ ఎత్తి చూపాలంటే స్థలం చాలదు.

ఈ కోశాన్ని ఉపయోగించిన, పరిశీలించినవాళ్లు తాము గుర్తించిన లోపాలను అభినందన పబ్లిషర్సు వారికీ, కూర్పరికీ తెలియబరిచి పునర్ముద్రణలో వాటిని సవరించుకొనే అవకాశం కల్పిస్తే అటు తమకూ, ఇటు లోకానికీ, ఆ మీదట కోశనిర్మాణశాస్త్రానికీ ఉపకారం చేసినవాళ్ల వుతారు.

11.8.1991

